# రాజకీయ భూగోళం



రచన:

కె. యస్. రెడ్డి



విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

ప్రచురణ నెం. 183

ప్రథమ ముద్రణ, సెప్టెంబరు 1956.

వెల : 2 - 8 - 0 సాదా ప్రతి

ముద్రణ :

[illegible] ఆర్ట్సు ప్రింటర్సు,

# పరిచయం

ఈ పుస్తకాన్ని 1955 ఆగస్టుకే పాఠకలోకానికి అందించవలసింది. కొన్ని ఇబ్బందులవల్ల ఇది సాధ్యంకాలేదు. నేటికయినా మీ కందించ గలుగుతున్నందుకు ఎంతో సంతోషిస్తున్నా. ఇక రచనలో ఎంతవరకు కృతకృత్యుడనయింది నిర్ణయించవలసింది మీరే.

ఈ పుస్తక రచనకు అనేక గ్రంథాలు తోడ్పడ్డాయి. ముఖ్యంగా విలియం ఫాస్టరు వ్రాసిన "హిస్టరీ ఆఫ్ త్రి ఇంటర్ నేషనల్సు", యెఫిమోవ్ వ్రాసిన "మోడరన్ హిస్టరీ", జవహర్ లాల్ నెహ్రూ వ్రాసిన "గ్లింప్సెస్ ఆఫ్ ది వరల్డు హిస్టరీ", దాస్ గుప్త వ్రాసిన "ఎకనామిక్ అండ్ కమర్షియల్ జాగ్రఫీ" విశేషంగా తోడ్పడ్డాయి. ఇవికాక గత ఏడుసంవత్సరాల "న్యూటైమ్సు" పత్రికా సంపుటాలు, "ఇంటర్ నేషనల్ ఎఫైర్సు" పత్రిక సంచికలుకూడా సాయపడ్డాయి. పై గ్రంథాల రచయితలకు, ఈ పత్రికలలో వ్యాసాలు వ్రాసిన పలువురు వ్యాసకర్తలకు నేను కృతజ్ఞుణ్ణి.

రచనకు ప్రోత్సహించిన శ్రీ గోళ్ల రాధాకృష్ణమూర్తిగారికీ, గజిబిజిగా ఉన్న నా వ్రాత ప్రతిని ఓపికతో ఆమూలాగ్రంగా చదివి, విషయ సమగ్రతకూ, విస్పష్టతకూ ఉపకరించే సలహాల నిచ్చిన శ్రీ కంభంపాటి సత్యనారాయణ (సీనియరు) గారికీ నేను సర్వదా కృతజ్ఞుణ్ణి.

విజయవాడ,
29–8–'56.

— రచయిత





★

# విషయ సూచిక

# ప్రపంచ భూగోళం: నైసర్గిక స్థితి

హిరణ్యాక్షుడు భూమిని చాపవలె చుట్టాడని మన పురాణాల్లో వ్రాయబడింది. దీనినిబట్టి భూమి బల్లపరుపుగా వుందని మన పూర్వీకులు నమ్మేవారని తెలుస్తూంది. కాని భూగోళ శాస్త్రజ్ఞులు భూమి బల్లపరుపుగా లేదని, బంతివలె గుండ్రంగా వుందని కనిపెట్టారు.

మన కండ్లయెదుట కనబడుతున్న దాన్నిబట్టి, భూమి బల్లపరుపుగా వున్నదనే భావం కలుగుతుంది. దీనికి కారణం, భూగోళం మన దృష్టి కందనంతటి పెద్ద గ్రహం కావటమే! ఉదాహరణకు ఒక చిన్న బంతిని చేతిలోకి తీసికొని అది గుండ్రంగా ఉందని చెప్పగలం. కాని ఒక పర్వతంపై కెక్కి, దాని ఆకారం వర్ణించగలమా? సాధ్యం కాదు. ఆ పర్వతస్వరూపాన్నంతటినీ మనం ఒక్కసారి చూడలేక పోవటమే దీనికి కారణం. విమానంలో ఎత్తుకు ఎగిరితే, దాని సమగ్ర స్వరూపాన్ని మనం చూడగలం. చిన్న పర్వత స్వరూపాన్ని చూడాలంటేనే ఎంతో ఎత్తుకు ఎగరవలసివుంటే, భూగోళమంతటి పెద్ద గ్రహంయొక్క సమగ్రస్వరూపాన్ని చూడాలంటే ఎన్ని వేల మైళ్ళపైకి ఎగరాలో ఊహించవచ్చు.

1955 అక్టోబరులో, మెక్సికోలో శాస్త్రజ్ఞులు భూమిని రాకెట్ల మీదనుండి ఫోటో తీశారు. దీనిలో 12,50,000 చదరపుమైళ్ళ భూభాగం చిత్రీకరించబడింది. దీనినిబట్టి భూమి గుండ్రముగా ఉన్నదని స్పష్టమవుతున్నది.



మెక్సికోలో రాకెట్లమీదనుండి తీయబడిన భూమి ఫొటో.

మన కంటికి కనిపించే మరికొన్ని సాక్ష్యాధారాలనుబట్టి కూడ భూమి గుండ్రముగా ఉన్నదని నిరూపించవచ్చు. ఉదాహరణకు:

(అ) మనం గన్నవరం విమానాశ్రయంలో విమానమెక్కి ఇటు తూర్పు దిశగాగాని, పడమర దిక్కుగాగాని ప్రయాణంచేసి, అమెరికాఖండంలో ఉన్న న్యూయార్కు నగరాన్ని చేరవచ్చు. భూమి బల్లపరుపుగా ఉన్నట్లయితే, యీ నగరం మనకు ఏ దిక్కున ఉన్నదో ఆ దిక్కుగా ప్రయాణం చేస్తేనేకాని ఆ నగరాన్ని చేరలేం.

(ఆ) దూరదర్శినితో దూరాన్నుండి తీరానికివస్తున్న ఓడను చూస్తే, మొదట మనకు ఆ ఓడ తెరచాప కొయ్యలు, తరువాత కొంతసేపటికి ఓడ పైభాగము, తరువాత మరికొంతసేపటికి ఓడ క్రిందిభాగము వరుసగా కనిపిస్తాయి. భూమి బల్లపరుపుగా ఉన్నట్లయితే, ఓడ మనకు దూరాన ఉన్నందున చిన్నదిగా కనిపించాలి గాని, పైన వర్ణించినట్లు క్రమంగా మన దృష్టిపథంలోకి రాదు.

(ఇ) సూర్యుని కిరణాలు చంద్రునిమీదపడి, మనకు వెన్నెలగా ప్రతిఫలిస్తున్నాయి. చంద్రగ్రహణకాలంలో చంద్రునికి, సూర్యునికి మధ్య భూమి అడ్డురావడంచేత, భూమి నీడ చంద్రునిమీద పడుతుంది.

ఈ నీడ గుండ్రంగా ఉంటుందికనుక, భూమి గుండ్రంగా ఉన్నదని రుజువవుతున్నది.

## భూ మి ప రి మా ణ ం

సుమారు రెండు వేలసంవత్సరాలక్రితం (అమెరికా, ఆస్ట్రేలియా ఖండాలు అనేవి ఉన్నాయని తెలియకపూర్వమే) "ఇరటోస్తనీస్" (Eratosthenes) అనే గ్రీకు శాస్త్రజ్ఞుడు, మొట్టమొదటిసారి భూమి చుట్టుకొలతను 30,000 మైళ్ళుగా అంచనా వేశాడు. భూగోళశాస్త్రం ఎంతో అభివృద్ధయిన తర్వాత, శాస్త్రజ్ఞులు అధునాతన పరికరాలతో తేల్చిన నికరపు కొలత 25,000 మైళ్ళు. గ్రీకు శాస్త్రజ్ఞుని అంచనా కొద్దిగా తప్పినా, ఎవరూ ప్రపంచాన్ని చుట్టిరాకమునుపే, భూగోళ శాస్త్రం అభివృద్ధి చెందకపూర్వమే భూమి చుట్టుకొలతను అంచనా వేయడం ఎంతో గొప్ప విషయం!

తరువాత చాలాకాలానికి భూగోళ శాస్త్రజ్ఞులు ఇతర కొలతలనుకూడా తీశారు. ఉత్తర ధృవంనుండి దక్షిణ ధృవంవరకూ (నిలువు కొలత The Polar Diameter) 7,900 మైళ్ళు; తూర్పు పశ్చిమ వ్యాసం (అడ్డుకొలత) 7,926 మైళ్ళు; భూగోళ వైశాల్యం 19,70,00,000 చదరపు మైళ్లు. ఇందులో మూడింట రెండువంతులు సముద్రం!

## సౌ ర కు టు ం బ ం

సూర్యుడూ, సూర్యునిచుట్టూ తిరుగుతున్న భూమి, చంద్రుడు, బుధుడు, కుజుడు ఇత్యాది గ్రహాలూ, ఉపగ్రహాల నన్నిటినీ కలిపి భౌగోళిక పరిభాషలో "సౌర కుటుంబము" లేక "సూర్య కుటుంబము" అంటారు.

ప్రత్యక్షంగా సూర్యునిచుట్టూ తిరిగే ఖగోళాలకు గ్రహాలని, యీ గ్రహాలచుట్టూ తిరిగేవాటిని ఉపగ్రహాలని పిలుస్తారు. భూమి సూర్యునిచుట్టూ ప్రత్యక్షంగా తిరుగుతున్నది కనుక, అది ఒక గ్రహం. ఈ భూమిచుట్టూ తిరిగే చంద్రుడు ఉపగ్రహం. ఖగోళ శాస్త్రజ్ఞులు యిప్పటికి కనిపెట్టినదానినిబట్టి, యిటువంటి ఉపగ్రహాలు కుజునికి

రెండు, గురునకు పదకొండు, శనికి తొమ్మిది, యురేనస్‌కు ఐదు, నెప్ట్యూన్‌కు రెండు ఉన్నాయి.

భూమి బల్లపరుపుగా ఉన్నట్లు నమ్మిన మన పూర్వీకులు భూమి స్థిరంగా వుందని, సూర్యుడు, ఇతర నక్షత్రాలు తిరుగుతున్నాయని కూడా నమ్మేవారు. గలీలియో (Galileo) అనే ఖగోళ శాస్త్రజ్ఞుడు తిరుగుతున్నది సూర్యుడుకాదనీ; భూమే సూర్యునిచుట్టు తిరుగుతున్నదని పరిశోధనలద్వారా తెలుసుకున్నాడు. "భగవత్ సృష్టికి అపార్థాలు చెబుతున్నా"డని నాటి పాలకులు యీ పరిశోధకునికి ఉరిశిక్ష విధించారు.

భూమి తిరుగుతున్నట్లు మనకంటికి కనుపించదు. మనం రైల్లో గాని, కారులోగాని ప్రయాణం చేసేటపుడు, మనం ప్రయాణంచేస్తున్న వాహనం చలనంలేకుండా స్థిరంగా ఉన్నట్లూ, రోడ్డుప్రక్కనవున్న చెట్లూ, పుట్టలు మనకెదురుగా పరుగెత్తుతూ వస్తున్నట్లు అనిపిస్తుంది. కాని, వాస్తవంగా నడుస్తున్నది మనం ప్రయాణంచేస్తున్న రైలు లేక కారేగాని, రోడ్డుప్రక్కన ఉన్న చెట్లూ, పుట్టలూ కావు. అదే విధంగా తిరుగుతున్న భూమిమీద మనం ఉన్నాం గనుక, ఆకాశంలో కనిపించే సూర్యుడు, నక్షత్రాలు ప్రయాణం చేస్తున్నట్లు మనకు కనబడడం సహజం. భూమి పడమరనుండి తూర్పుకు తిరుగుతున్నది కనుక, సూర్యుడు తూర్పునుండి పడమరకు ప్రయాణం చేసినట్లు కనబడుతున్నాడు.

భూమి సూర్యునికి 9,30,00,000 మైళ్ళ దూరంలో ఉంది. గంటకు 60 మైళ్ళ వేగంతో రేయింబవళ్ళు ప్రయాణంచేస్తే, భూమి నుండి సూర్యుణ్ణి చేరడానికి 176 సంవత్సరాలకుపైగా పడుతుందంటే, భూమి సూర్యునికి ఎంతదూరంలో ఉందో ఊహించవచ్చు. సూర్యుడికి మరీ దగ్గరగావున్న గ్రహాలు బుధుడు, శుక్రుడు.

## సూర్యుడు

సూర్యుడు భగభగ మండుతున్న పెద్ద నిప్పుగోళం. నక్షత్రాలు ఇతర చిన్న నిప్పుగోళాలు. భూగోళమంత పరిమాణంగల 12,95,000

గోళాలను చేర్చి ముద్దగాచేస్తే, అది సూర్యగోళమంత అవుతుంది. సూర్యగోళం వ్యాసం(అడ్డుకొలత)8,64,000 మైళ్ళు. ఇంత పెద్దగోళం భగభగ మండుతూవుండబట్టే ఇంత వేడిమి, వెలుతురు ప్రసార మవుతున్నాయి.

## ఇతర గ్రహాలు

జ్యోతిశ్శాస్త్రజ్ఞులు నవగ్రహాలుగా వ్యవహరిస్తున్న తొమ్మిది గ్రహాలు — సూర్యుడు, చంద్రుడు, బుధుడు, శుక్రుడు, కుజుడు, గురుడు, శని, రాహువు, కేతువు — ఖగోళ శాస్త్రజ్ఞుల నిర్వచనం ప్రకారం గ్రహాలు కావు. వీటిలో సూర్యుడు ఒక పెద్ద నక్షత్రం. చంద్రుడు భూమి చుట్టూ తిరుగుతున్న ఒక ఉపగ్రహం. రాహు కేతువులు కేవలం ఛాయలుమాత్రమే ! ఇవి కాక, బుధుడు, శుక్రుడు, కుజుడు, గురుడు, శని అనేవి ఐదుమాత్రమే, జ్యోతిశ్శాస్త్రజ్ఞులు నవగ్రహాలని వ్యవహరిస్తున్నవాటిలో నిజంగా గ్రహాలు !

భూమికి ఏ విధంగా స్వయం ప్రకాశం లేదో, అదే విధంగా, ఈ గ్రహాలకూ స్వయం ప్రకాశం లేదు. సూర్యకాంతి వీటిమీద పడటంవల్లనే యివి ప్రకాశించ గలుగుతున్నాయి.

ఈ గ్రహాలన్నీ ఎట్టి ఆధారమూ లేకుండా, అయస్కాంతశక్తి వంటి పరస్పరాకర్షణశక్తితో నిలిచి తిరగ గలుగుతున్నాయి. సూర్యుని ఆకర్షణబలం తనకు దగ్గరగావున్న గ్రహాలపై అధికంగాను, దూరం పోయినకొలది తక్కువగాను వుంటుంది. అందుచేత సూర్యునికి దగ్గరగా ఉన్న గ్రహాల పరిభ్రమణవేగం అధికంగాను, దూరంగావున్న గ్రహాల పరిభ్రమణవేగం తక్కువగాను ఉంటుంది. కనుక సూర్యుని చుట్టు తిరిగిరావడానికి, సూర్యునికి దగ్గరగావున్న గ్రహాలకు తక్కువ కాలం పడుతుంది; దూరంగావున్న గ్రహాలకు ఎక్కువకాలంపడుతుంది.

గ్రహాలలోకెల్ల మిక్కిలి ప్రకాశవంతంగా కనిపించేది శుక్రుడు. సూర్యచంద్రుల తర్వాత యింత కాంతివంతంగా కనిపించే గోళం మరొకటి లేదు. ఇదే మనకు కొంతకాలం "సంజతార" "వేగుచుక్క"గా కనిపిస్తుంది.

గ్రహాలన్నిటిలోకి మిక్కిలి పెద్దది గురుడు. దీనికి ఉన్నన్ని ఉపగ్రహాలు మరేగ్రహానికీ లేవు. దీనితర్వాత శనికి ఎక్కువ ఉపగ్రహాలున్నాయి. దీనిచుట్టూ మూడు వలయాకారా లున్నాయి. శనిగ్రహం చుట్టూ తిరుగుతూవున్న ఒక ఉపగ్రహం, శనిగ్రహానికి మరింత దగ్గరకు రావటంవల్ల బ్రద్దలైందనీ, ఆ ముక్కలే వలయాకారంగా ఏర్పడ్డాయనీ శాస్త్రజ్ఞులు ఊహిస్తున్నారు.

## చంద్రుడు

ఇతరగ్రహాలు, ఉపగ్రహాలకంటె చంద్రుడు భూమికి దగ్గరలో ఉన్నాడు. భూమికి, చంద్రునికి మధ్యనున్న దూరం 2,40,000 మైళ్లు. అన్ని ఇతర గ్రహాల, ఉపగ్రహాలవలె చంద్రునికి కూడా స్వయం ప్రకాశం లేదు. సూర్యకిరణాలు చంద్రగోళంమీద పడి, ప్రతిఫలించి మనకు వెన్నెలగా వస్తున్నది.

సూర్యుడు, చంద్రుడు ఒకే పరిమాణంలో వున్నట్లు మనకు కనిపిస్తుంది. కాని వాస్తవంగా చంద్రగోళం సూర్యగోళం కంటె, ఎంతో చిన్నది. సూర్యగోళంకంటె చంద్రగోళం భూమికి ఎంతో చేరువున వుండడంవల్ల, సూర్యుడు కనిపించిన పరిమాణంలో మనకు చంద్రుడు కనిపిస్తున్నాడు.

చంద్రబింబంలో కొన్ని మచ్చలు మనకు కనిపిస్తాయి. వాటిని చూచే "పొన్న చెట్టుకింద ముసలమ్మ రాట్నం వడుకుతున్న"దని, "లేడి మేత మేస్తున్న"దని కథలుగా అమ్మమ్మలు చెబుతూ ఉంటారు. ఖగోళ శాస్త్రజ్ఞుల పరిశోధనలవల్ల, ఆ మచ్చలు కనబడేభాగం అంతా లోయ అని తేలింది. చంద్రగోళ ఉపరితలం, భూగోళంవలె మిట్ట పల్లాలుగా ఉన్నదని, అక్కడా పర్వతాలూ, లోయలూ, విశాల మయిన బయళ్ళూ ఉన్నాయని శాస్త్రజ్ఞులు కనిపెట్టారు.

ఈ ఉపగ్రహం, సూర్యునిచుట్టూ తిరుగుతున్న భూమిచుట్టూ తిరుగుతున్నది. పరోక్షంగా సూర్యునిచుట్టుకూడా తిరుగుతున్నదన్న మాట. చంద్రుడు భూమిని చుట్టిరావటానికి $29\frac{1}{2}$ రోజులు పడుతుంది. ఈ కాలాన్నే చాంద్రమానంలో "నెల" అని వ్యవహరిస్తారు.

## భూ చ ల న ం

భూమికి రెండు రకాల చలనా లున్నాయి. ఒకటి : తనచుట్టూ తాను తిరగటం; యిందువల్ల రేయింబవళ్ళు కలుగుతున్నాయి; రెండు : సూర్యునిచుట్టూ తిరగటం; యిందువల్ల ఋతువులు కలుగు తున్నాయి.

బంతి యిరుసుమీద తిరిగినట్లుగా, భూమి తనచుట్టూ తాను తిరుగుతున్న ది. ("భూమి యిరుసు" అనేది, భూమి తనచుట్టూ తాను యెలా తిరుగుతున్న ది అనేదానిని ఉదహరించడానికి చెప్పబడిందేగాని, నిజంగా భూమి యిరుసుమీద తిరగటంలేదు.) ఈ విధంగా భూమి తనచుట్టూ తాను తిరగటానికి 24 గంటలు లేక ఒకరోజు పడుతుంది.

దీపానికి ఎదురుగా ఒకబంతిని పెడితే, ఆ బంతిమీాద సగ భాగాన్నే దీపపుకాంతి పడుతుంది. బంతి వెనుకభాగం చీకటిగానే ఉంటుంది. అదేవిధంగా, సూర్యునికి ఎదురుగావున్న భూగోళార్ధభాగం మీాద సూర్యకిరణాలు ప్రసరిస్తాయి. వెనుకనున్న అర్ధభాగం చీకటిలో ఉంటుంది. సూర్యకిరణాలు పడేవైపు పగలు, చీకటివైపు రాత్రి అవుతుంది. భూమి తిరుగుతూవుంటుంది కనుక, మనవూరు చీకటిలోంచి వెలుతురులోకి వచ్చేటపుడు "సూర్యోదయం" అవుతుంది. దీనితర్వాత 12 గంటలకు వెలుగులోంచి చీకటిగావుండే అర్ధభాగంలోకి ప్రవేశించే టపుడు "సూర్యాస్తమయం" అవుతుంది; రాత్రి వస్తుంది. ఈవిధంగా మనకు రేయింబవళ్ళు కలుగుతున్నాయి.

భూమి "ఇరుసు" నిటారుగా నిలుచునిలేదు; కొద్దిగా ప్రక్కకు ($23\frac{1}{2}$ డిగ్రీలు) ఒరిగి ఉంది.

## అక్షాంశ రేఖలు - తులాంశ రేఖలు

ప్రపంచ పటంలో ఒక పట్టణాన్నిగాని; వేరొక ప్రదేశాన్ని గాని గుర్తించాలంటే, లేక సముద్రంలో ప్రయాణంచేస్తూ మనం ఏ దేశానికి దాపులోఉన్నామో, ఏ దిక్కుగా ప్రయాణంచేస్తే మన

గమ్యాన్ని చేరగలమో, ఇత్యాది విషయాలు తెలుసుకోవాలంటే భూగోళంమీద అనేక గీతలు ఉన్నట్లుగా ఊహించడం అవసరమయింది. ఈ ఊహారేఖలే మనకు మ్యాపుమీద, గ్లోబ్ మీద కనిపిస్తాయి.

బంతి ఇరుసుమీద తిరుగుతున్నట్లుగా భూమి తిరుగుతున్నదని పైన చెప్పాం. ఈ ఇరుసుయొక్క ఉత్తరకొనను ఉత్తర ధృవమని, దక్షిణపు కొనను దక్షిణ ధృవమని పిలుస్తారు. ఈ రెండు ధృవముల మధ్య (భూగోళాన్ని రెండు సమభాగాలుగా విభజించేట్లు) ఒక గీత గీయబడింది. దీనిని భూమధ్య రేఖ అంటారు. ఈ రెండు అర్థగోళాలలో ఉత్తరపు దానిని ఉత్తరార్థగోళమని, దక్షిణ సగభాగాన్ని దక్షిణార్థగోళమని అంటారు. ఉత్తరార్థ గోళంమీద, ఉత్తర ధృవం నుండి భూమధ్య రేఖవరకు, దక్షిణార్థగోళంమీద దక్షిణధృవంనుండి భూమధ్య రేఖవరకూ, ఒకదాని ప్రక్క ఒకటి సమానమయిన దూరంలో, ఒక్కొక్క అర్థగోళాన్ని 90 సమభాగాలుగా చేసేట్లు, 90 గీతలు గీయబడ్డాయి. వీటిని అక్షాంశ రేఖలు (Latitudes) అంటారు. ఉత్తరపుగీతలను ఉత్తర అక్షాంశ రేఖలని, దక్షిణపు గీతలను దక్షిణ అక్షాంశ రేఖలని అంటారు.

భూమధ్య రేఖను 360 సమభాగాలుగా విభజించి, ఉత్తర, దక్షిణ ధృవాల కలుపుతూ, యీ 360 సమభాగాలగుండా నిలువుగా గీతలు గీయబడ్డాయి. వీటని రేఖాంశవృత్తాలు లేక తులాంశ రేఖలు అంటారు. బ్రిటన్‌లోని గ్రీన్‌విచ్ అనే పట్టణంలో చాలకాలంగా ఖగోళ పరిశోధనా కేంద్రం ఒకటి పనిచేస్తున్నది. ఈ పట్టణంమీదుగా పోయే రేఖాంశవృత్తాన్ని "గ్రీన్‌విచ్ రేఖ" అంటారు. ఈ రేఖకు యిరువైపులనుండి రేఖాంశవృత్తాలకు వరుసగా నంబర్లు వేశారు. కనుక దీనికి తూర్పున ఒకటినుండి 180 వరకూ, పడమర ఒకటినుండి 180 వరకూ రేఖాంశవృత్తాలు ఉంటాయి. గ్రీన్‌విచ్ రేఖకు "0" నంబరు వేశారు.




అక్షాంశ రేఖలు, రేఖాంశ వృత్తాలు

## కాలము

భూమి తనచుట్టూ తాను తిరగటానికి 24 గంటలు పడుతుంది. అంటే యీ 24 గంటల్లో భూమిమీదవున్న 360 (డిగ్రీలు) గీతలు తిరిగివస్తాయి. ఒక గంటకు 15 గీతలమధ్య వున్న భూభాగం తిరుగుతుంది. రెండు గీతలమధ్య వున్న భూభాగం తిరగటానికి 4 నిమిషాలు పడుతుంది.

ఒకే రేఖాంశంమీదవున్న పట్టణాలలో, గ్రామాలలో ఒకే సారి సూర్యోదయం, మధ్యాహ్నం, సూర్యాస్తమయం అవుతుంది.

విభిన్న రేఖాంశ వృత్తాలమీదవున్న పట్టణాల్లో, గ్రామాలలో విభిన్న కాలాలలో యివి వస్తూవుంటాయి. సరిగ్గా సూర్యకిరణాలు తలమీద సూటిగా పడినపుడు స్థానిక కాలమానం ప్రకారం మధ్యాహ్నం 12 గంటలయినట్లు. విజయవాడలో 12 గంటలయినపుడు, బొంబాయిలో సూర్యకిరణాలు సూటిగా నెత్తిమీద పడటానికి మరికొంతకాలం పడుతుంది. వివిధ గ్రామాలు, పట్టణాలలోని ప్రజలు ఆయాప్రాంతాల స్థానిక కాలమానం ప్రకారం గడియారాలకు టైము పెట్టుకుంటే, వారు ఇతర గ్రామాలకో, పట్టణాలకో పోయినపుడు, తిరిగి టైము దిద్దుకుంటూ వుండాలి. అందుచేత, యీ బాధనుండి తప్పించటానికి వివిధదేశాలు వాటి పరిమాణాలనుబట్టి, దేశానికంతటికీ ఒకే కాలమానాన్ని ప్రవేశపెట్టాయి. పెద్ద దేశమయితే, రెండు కాలమానాలను కూడా వాడుకుంటున్నాయి. ఈ కాలమానాన్ని "స్టాండర్డు టైము" (స్థానిక కాలమానము) అంటారు. దేశానికి కేంద్రమయిన పట్టణ స్థానికకాలాన్ని సామాన్యంగా ఆ దేశ స్టాండర్డు టైముగా నిర్ణయిస్తారు. భారతదేశంలో ఒకే స్టాండర్డు టైము (ఇండియన్ స్టాండర్డు టైము) ఉపయోగంలో వుంది. తూర్పు పాకిస్తానుకు ఒక స్టాండర్డు టైము, పశ్చిమ పాకిస్తానుకు మరొక-సాండర్డు టైము వాడబడుతున్నది.

యూరపులోని చాలదేశాలు గ్రీన్‌విచ్ కాలమానాన్నే (గ్రీన్‌విచ్ మీన్ టైమ్) వాడుతున్నాయి.

## వాతావరణం

భూగోళంమీధ సూదిమొన మోపినంత సందుకూడా లేకుండా గాలి ఆవరించివుంది. యాభైమైళ్ల ఎత్తువరకూ గాలి పొరలు పొరలుగా వుంటుంది. పై పొరల వత్తిడివల్ల, నేలవైపుకు వచ్చిన కొలది గాలివత్తిడి అధికంగా వుంటుంది. భూమిమీద (గాలిలో) వుండే ప్రతి వస్తువుయొక్క ప్రతి చదరపు అంగుళంమీద 15 పౌనుల బరువు కలిగించునంతటి వత్తిడి గాలివల్ల కలుగుతుంది. మన శరీరం

మీద కూడా యీ పరిమాణంలో వత్తిడి ఉంటుంది. కాని మనకు శారీరకంగా తెలియదు.

గాలి వత్తిడి అన్ని ప్రదేశాల్లోను ఒకేవిధంగా వుండదు. పైకి పోయినకొలది తగ్గిపోతుంది. అందుచేతే, 29 వేల అడుగుల ఎత్తువున్న ఎవరెస్టు శిఖరంమీద, భూమిమీద వుండే గాలివత్తిడిలో ఐదింట ఒక్కపాలు (1/5) మాత్రమే ఉంటుంది. గాలి వత్తిడి యింత తక్కువగా వుండే ప్రదేశంలో మనిషి జీవించలేడు.

సూర్యకిరణాల వేడికి, భూమిమీద గాలికూడా వేడెక్కుతుంది. సూర్యకిరణాలు నిటారుగా పడే ప్రాంతంలో ఉష్ణోగ్రత అధికంగా వుటుంది కనుక గాలి ఉష్ణోగ్రత కూడా అధికంగా వుంటుంది. సూర్యకిరణాలు ఏటవాలుగా పడేచోట ఉష్ణోగ్రత తక్కువగా వుంటుంది. అందుచేత ప్రపంచమంతటా వాతావరణ ఉష్ణోగ్రత ఒకే విధంగావుండదు.

మనం ఒకపట్టణ ఉష్ణోగ్రత ఎంతలంటే, ఆపట్టణంలో గాలి యొక్క ఉష్ణోగ్రత ఎంత అని విచారిస్తున్నామన్నమాట. గాలి వేడిని ఉష్ణమాపకాల (థర్మామీటర్లు) సాయంతో కొలుస్తాం.

## వర్షపవనాలు

సూర్య కిరణాల వేడిమికి సముద్రంలోని నీరు ఆవిరియై గాలిలో కలిసి పైకెగసిపోయి మేఘరూపం దాల్చుతుంది. దానికి చల్లగాలి తగలగానే వర్షిస్తుంది. మేఘం రెండువిధాలుగా చల్లబడవచ్చు :

1. అది ఆ ప్రదేశంలోనే చల్లగావుండేంత ఎత్తువరకూ పోవచ్చు; లేక

2. దూరంగా చల్లని ప్రదేశాలకు ప్రయాణం చేయవచ్చు.

భూమధ్య రేఖా ప్రాంతంలో ఎండవేడిమి ఎక్కువ కనుక, నీరు ఎక్కువగా ఆవిరై, త్వరగా పైకిపోయి, చల్లబడి కుంభవృష్టి కురుస్తుంది.

ఎత్తయిన పర్వతాలమీద వాతావరణం చల్లగా వుంటుంది. నీటి ఆవిరితో కూడిన మేఘం ప్రయాణం చేస్తున్నపుడు, ఎత్తయిన పర్వతాలచేత అడ్డగించబడి, అక్కడ చల్లబడి వర్షిస్తుంది. హిందూ మహాసముద్రంనుండి నీటి ఆవిరితో వచ్చిన మేఘం భారతదేశంలోని పశ్చిమ కనుమలు, ఖాసీ కొండల (హిమాలయ పర్వతలోయలు) చేత అడ్డగింపబడి వర్షిస్తుంది. అట్లాంటిక్ మహాసముద్రంనుండి వచ్చిన మేఘాలు బ్రిటిష్‌దీవులలోని పర్వతప్రాంతాలలో వర్షం కలిగిస్తున్నాయి.

ఈ వర్షాలను తెచ్చే గాలులు కొన్ని నిర్ణీత ఋతువులలో వస్తాయి. కనుక వీటిని ఋతుపవనాలు అంటారు.

## సముద్రాలు

దక్షిణ ధృవందగ్గర ఉన్న "అంటార్కిటికా" ఖండం ఉన్న సముద్రాన్ని దక్షిణ మహాసముద్రం అంటారు. ఇక్కడనుంచే మిగిలిన నాలుగు మహాసముద్రాలు ఉత్తరానికి వ్యాపించి ఉన్నాయి.

హిందూ మహాసముద్రం: ఈ మహాసముద్రానికి పశ్చిమాన ఆఫ్రికా ఖండం, తూర్పున తూర్పుఇండియా దీవులు, ఆస్ట్రేలియా ఖండం ఉన్నాయి.

పసిఫిక్ మహాసముద్రం: ఇది మహాసముద్రము లన్నిటిలోకి పెద్దది, లోతయినది.

అట్లాంటిక్ మహాసముద్రం: ఇది అమెరికా ఖండాన్ని ఆఫ్రికా యూరప్ ఖండాలనుండి వేరుచేస్తున్నది.

ఆర్కిటిక్ మహాసముద్రం: ఉత్తరధృవాన్ని చుట్టి వుంది. సంవత్సరంలో చాలకాలం దీనిలో నీరు గడ్డకట్టి ఉంటుంది.

మహాసముద్రాల సగటు లోతు 2,080 నిలువులు (ఆరు అడుగులు ఒక "నిలువు"). పసిఫిక్ మహాసముద్రం ఒకచోట 5,500 నిలువులున్నదట ! ప్రపంచంలోకల్లా పెద్దదయిన హిమాలయ పర్వతంకూడా యీ ప్రదేశంలో మునిగిపోతుందన్న మాట !

## ప్ర పం చ వి భా గా లు

భూగోళంమీది భూభాగాన్ని ఆరు ఖండాలుగా విభజించారు: (1) ఆసియా (2) ఐరోపా (3) ఆఫ్రికా (4) ఆస్ట్రేలియా (5) ఉత్తర అమెరికా (6) దక్షిణ అమెరికా.

ఇట్టి విభజనేకాక, వివిధ ఖండాలలోని కొన్ని ప్రాంతీయభాగాలను వివిధ పేర్లతో వ్యవహరిస్తున్నారు. ఉదాహరణకు బర్మా, సయాం, ఇండోచైనా (వియత్నాం, లావోస్, కంబోడియా), మలయా, ఇండొనేషియా, ఫిలిప్పైన్సు ప్రాంతాన్ని ఆగ్నేయాసియా ప్రాంతం అంటారు.

టర్కీ, ఇరాన్, ఇరాక్, సిరియా, జోర్డాన్, ఇస్రాయల్ ప్రాంతాన్ని "మధ్యప్రాచ్యం" అంటారు.

స్పెయిన్, పోర్చుగల్, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, గ్రీస్, బెల్జియం, హాలెండు, డెన్మార్కు, నార్వే, స్వీడన్, ఫిన్లెండ్, బ్రిటిష్ దీవులను పశ్చిమ యూరపుఅనీ, మిగతా యూరప్‌ఖండాన్ని తూర్పు యూరప్ అనీ వ్యవహరిస్తున్నారు.

ఆసియా ఖండము : ఖండాలలోకెల్ల ఆసియా ఖండము పెద్దది. దీని వైశాల్యం 1,70,00,000 చదరపుమైళ్ళు. ప్రపంచ భూభాగపు విస్తీర్ణంలో యిది మూడవవంతు. జనాభా సుమారు 122 కోట్లు. ప్రపంచ జనాభాలో యిది సగం ! ఈ జనాభాలో అత్యధికభాగం ఆగ్నేయ ఆసియాలోనే (భారతదేశం, చైనా, జపాన్ ఇత్యాది దేశాలలో) నివసిస్తున్నారు. ప్రపంచ జనాభాలో ప్రతి ఐదుగురిలో ఒకరు భారతీయుడు, ఒకరు చైనా దేశస్థుడు !

భారతదేశానికి ఉత్తరంగావున్న పామీరు పీఠభూమినుండి వివిధ దిశలకు పర్వతపంక్తులు వ్యాపించివున్నాయి. వీటిలోకెల్లా పెద్దది, ప్రపంచంలోకెల్ల ఎత్తయినది, హిమాలయ పర్వతపంక్తి. ఇది మన దేశానికి ఉత్తర సరిహద్దుగా వ్యాపించి వుంది.

ఈ పర్వత శ్రేణులలోనే ఆసియాఖండంలోని పెద్ద నదులన్నీ పుట్టాయి. ఓబీ, యెనీసీ, లీనా నదులు సైబీరియా మైదానంగుండా ప్రవహించి ఆర్కిటిక్ మహాసముద్రములోను, ఆమూర్, హోయాంగ్‌హో, యాంగ్‌టిసియాంగ్, సికియాంగ్ నదులు చైనాదేశంగుండాను ప్రవహించి పసిఫిక్ మహాసముద్రంలోను, గంగ, బ్రహ్మపుత్రనదులు బంగాళాఖాతంలోను, సింధునది అరేబియా సముద్రములోను కలుస్తున్నాయి. ఇవికాక ఇంకా అనేక చిన్న పెద్దనదులు యీ ఖండంలో ప్రవహిస్తున్నాయి.

వరి, మొక్కజొన్న, నూనెగింజలు, తేయాకు, చెరకు, రబ్బరు, పత్తి, జనుము, పొగాకు, సింకోనా, సిల్కు, సోయాచిక్కుళ్లు — వీటి ఉత్పత్తిలో ఆసియాఖండం ప్రథమస్థాన మాక్రమిస్తున్నది.

ప్రపంచంలో పండే వరిలో నూటికి 95 పాళ్ళు ఒక్క ఆసియా ఖండంలోనే పండుతున్నది. ప్రపంచంలో పండే తేయాకు, జనుము, రబ్బరు, సోయాచిక్కుళ్ళ మొత్తం పంటలో, దాదాపు అంతా ఒక్క ఆసియా ఖండంలోనే పండుతున్నాయి.

<u>ఐరోపాఖండం</u>: దీని వైశాల్యం 37,60,000 చదరపుమైళ్ళు. ఆసియాఖండపు వైశాల్యంలో ఐదవవంతు. భారతదేశం, పాకిస్తాన్ దేశాలకు రెండింతలు ఉంటుంది. జనాభా 52 కోట్లు. ఇంత చిన్న ఖండమయినా, దీని సముద్రతీరం ఇతర ఖండాలకంటె పెద్దది. తీరము చీలి, సముద్రంలోకి చొచ్చుకొని ఉండడంచేత, తీరంవద్ద సముద్రం లోతుగా ఉండడంచేత, అనేక సహజ ఓడరేవులు ఏర్పడడానికి

అవకాశం కలిగింది. ఈ ఖండపు దేశాల వ్యాపారాభివృద్ధికి ఎంతో తోడ్పడింది.

ఇటలీకి ఉత్తరానఉన్న ఆల్ప్సు పర్వతపంక్తినుండి ఒక శాఖ అపినైన్ పర్వతములనే పేరుతో ఇటలీ దక్షిణకొనవరకూ వ్యాపించి ఉన్నది. మరొక పంక్తి యుగోస్లావియా, గ్రీస్ దేశాలలో ఉంది. వేరొకశాఖ హంగేరియన్ మైదానంలో వ్యాపించిఉంది. పిరనీస్ పర్వతాలు స్పెయిన్, ఫ్రాన్సుల మధ్య సరిహద్దుగా వ్యాపించి ఉన్నాయి. నల్లసముద్రాన్నీ, కాస్పియన్ సముద్రాన్నీ కలుపుతూ కాకేషియన్ పర్వతశ్రేణి ఉన్నది. రష్యన్ రిపబ్లిక్‌ను, సైబీరియాను విడదీస్తూ యూరల్ పర్వతపంక్తి ఉన్నది.

యూరప్‌లో ముఖ్యమైననది డాన్యూబ్. ఇది ఆల్ప్సు పర్వతాలలో పుట్టి నల్లసముద్రంలో కలుస్తున్నది. యూరప్‌లోకల్లా పొడవైన నది వోల్గా. ఇది యూరల్ పర్వతాలలో పుట్టి కాస్పియన్ సముద్రంలో పడుతున్నది. రైన్, రోన్, డాన్, నీపర్ ఇత్యాది నదులు అనేకం ఉన్నాయి. కాని, ఇవన్నీ ఇతరదేశాల నదులతో పోల్చి చూస్తే చాల చిన్నవి. కాని, ఇవి అభివృద్ధిచెందిన పారిశ్రామిక దేశాలగుండా ప్రవహిస్తూండడంచేత, సరుకుల రవాణాకు ఎంతో ఉపయోగపడుతున్నాయి.

ప్రపంచంలో లభ్యమవుతున్న ఖనిజ సంపదలో సగభాగం ఒక్క యూరపు ఖండంలోనే తీయబడుతున్నది. వీటిలో ప్రధానమయినవి బొగ్గు, ముడిఇనుము. తుత్తునాగము, ప్లాటినమ్, రాగి, పొటాష్, ముడి అల్యూమినం కూడా పెద్ద ఎత్తున లభ్యమవుతున్నవి.

పెట్రోలు, సీసము, తగరము, మాంగనీసు – ఈ ఖనిజాలు ఖండావసరాలకు సరిపడినంతగా లభించటంలేదు.

గోధుమ, బార్లీ, ఓట్సు, రై ప్రధాన వ్యవసాయ పంటలు. ప్రపంచపు "రై" పంటలో నూటికి 95 పాళ్లు, "ఓట్సు" పంటలో నూటికి 62 పాళ్లు ఈ ఖండంలోనే పండించ బడుతున్నాయి.

నౌకా, విమానయానాల్లో అగ్రస్థానం ఈ ఖండానిదే.

ఆఫ్రికా : వైశాల్యంలో ఆసియా తర్వాత పెద్ద ఖండం ఇదే! దీని వైశాల్యం 1,15,00,000 చదరపుమైళ్లు. భూమధ్యరేఖ ఈ ఖండం మధ్యగా పోతున్నది.

ఈ ఖండంలో చెప్పుకోదగ్గ పర్వతశ్రేణి ఏదీలేదు. నదులన్నీ పీఠభూముల్లో పుట్టి, తీరమైదానాలలోకి వేగంగా ప్రవహిస్తూ, లేక జలపాతాలుగా దూకుతూ, చాలదూరం ప్రవహించి సముద్రంలో కలుస్తున్నాయి. నదులపొడవు అధికమయినా, వేగంగా ప్రవహిస్తూం డటంచేత నౌకాయానానికి అనువుగా లేవు.

సహారా ఎడారికి ఉత్తరంగా ఉన్న జనాభా అరబ్బీలు, ఈజిప్ట్ దేశస్థులు. వీరికి దక్షిణయూరోపియన్లతో సంపర్కం అధికం. ఈ ఎడారికి దక్షిణంగా నివసించే జనాభా నీగ్రోజాతివారు.

పత్తి, బంగారం, వజ్రాలు, తుత్తునాగం, తగరం, ఉన్ని, రబ్బరు, గ్రాఫైట్, కలప ఇత్యాది సహజసంపదలు అపారంగా లభ్యమవుతాయి.

యూరపియన్ సామ్రాజ్యవాదులు ఈ అపారసంపదలను, స్థానికజాతుల ప్రజల శ్రమను దోచుకపోతున్నారు. ఈ వలసప్రజల అభివృద్ధికి ఎట్టి కృషి చేయకపోగా, హేయమైన జాతివిద్వేషవిధా నాన్ని, క్రూరనిర్బంధాలను అమలుపరుచుతున్నారు. ఈ అమానుష దోపిడీకి, హింసకు గురవుతున్న ప్రజలు ప్రపంచ ప్రజలలోకెల్లా రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా ఎంతో వెనుకబడివున్నారు.

ఆస్ట్రేలియా : ఇది అన్ని ఖండాలలోకి చిన్నది. వైశాల్యం (న్యూజిలెండ్, టాస్మేనియా దీవులు వదలి) 30,00,000 చదరపు మైళ్ళు. విస్తీర్ణంలో కెనడా, లేక యునైటెడ్ స్టేట్సు అంత ఉంటుంది.

సుమారు మూడు వందల సంవత్సరాలక్రితం యిది యూరపియన్లచేత కనుగొనబడింది. అప్పటికి, ఈ ఖండంలో రాతి ఆయుధాలను ఉపయోగిస్తున్న కొన్ని వెనుకబడిన జాతులవారు నివ

సిస్తూ ఉండేవారు. ఇప్పటికి టాస్మేనియాలో ఈ జాతి పూర్తిగ నశించిపోయిందని చెబుతారు.

ఈ ఖండపు జనాభా సుమారు 80 లక్షలు. వీరిలో అత్యధిక సంఖ్యాకులు వలసవచ్చిన తెల్లజాతులవారు, వారి సంతతే! ఈ వలసదారులు తెల్లవారినితప్ప నల్లవారి నెవరినీ వలస రానీయక పోవటంచేత, ఇతరజాతుల జనాభా లేదు.

ఖండ విస్తీర్ణంతో పోల్చితే ఉన్న జనాభా చాల తక్కువ! మొత్తం జనాభాలో నూటికి 60 వంతులు సిడ్నీ, మెల్‌బోర్‌న్, బ్రిస్‌బేన్, ఎడిలైడ్, పెర్త్ నగరాలలోనే నివసిస్తున్నారు.

ఉత్తర అమెరికా: అమెరికాఖండాన్ని ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికా అని రెండు భాగాలుగా వ్యవహరిస్తున్నారు.

ఉత్తర అమెరికా వైశాల్యం 90,00,000 చదరపు మైళ్లు. జనాభా 19,80,00,000. దీని ఉనికి ఇటు ఆసియాఖండ భూభాగానికి, అటు యూరపుకు అందుబాటులో ఉంది.

ఈ ఖండాన్ని 1492 లో కొలంబస్ కనిపెట్టాడు. ఈ ఖండ ఆదిమవాసులను "రెడ్ ఇండియన్స్" అంటారు. తెల్లవాళ్లు వలస పోయి, అక్కడ నివసిస్తున్న అనాగరిక జాతులను బానిసలుగా చేసుకుని స్థిరపడిపోయారు. ఈవిధంగా వలసపోయినవారిలో ఇంగ్లీషు వాళ్ళు అధికం. కెనడా, అమెరికా సంయుక్తరాష్ట్రాలలోని తెల్లవారు ఈ సంతతివారే!

గోధుమ, పత్తి, పొగాకు, బీట్‌రూట్, చెరకు, వరి, గోగునార, మొక్కజొన్న మొదలయినవి ప్రధాన వ్యాపారపంటలు.

ఇక్కడ ఖనిజసంపద అపారం. పారిశ్రామికంగా ఈ ఖండం ఎంతో అభివృద్ధిచెందింది.

దాని ఉనికి వ్యాపారాభివృద్ధికి ఎంతో అనుకూలంగా ఉంది.

దక్షిణ అమెరికా: దీని వైశాల్యం 70 లక్షల చదరపుమైళ్ళు. జనాభా సుమారు 10,80,00,000.

యూరోపియన్లు వలస రాకపూర్వం నివసిస్తున్న స్థానిక జాతుల వారు "రెడ్ ఇండియన్లు". వలసదారులు వీరిని బానిసలుగా చేసుకుని, దేశసంపదను దోచుకుంటూ క్రమంగా స్థిరపడిపోయారు.

ఈ ఖండానికి వలసవచ్చినవారిలో పోర్చుగీసు, స్పెయిన్ దేశస్తు లధికులు. ఇటలీ, ఫ్రాన్సు, ఇంగ్లండు, హాలెండు దేశస్తులు కూడా ఉన్నారు.

అంటార్కిటికా: అంటార్కిటికా పసిఫిక్, హిందూ, అట్లాంటిక్ మహాసముద్రాల మధ్యన, దక్షిణధృవ కేంద్రం నాభిగా చేసుకుని వ్యాపించి ఉంది. దీని వైశాల్యం 36,64,000.

ఇదంతా పెద్ద మంచుఎడారి. మానవవాసయోగ్యానికి తగిన వసతిలేదు. అందుచేత అచ్చట ప్రజలెవ్వరూ లేరు.

1956లో సోవియట్, బ్రిటన్, అమెరికా మొదలయిన దేశాల భూగోళ శాస్త్రజ్ఞులు ఈ భూభాగావు పరిస్థితులు పరిశీలించేందుకు వెళ్ళారు. వివిధదేశాల జట్లు వివిధ ప్రాంతాలలో దిగి ఖండంలోకి చొచ్చుకొని పోవడానికి ప్రయత్నిస్తున్నారు.

## వాతావరణం: చెట్లు చేమలు

ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ, ఒక దేశంలోని అన్ని ప్రదేశాలలోను భౌగోళిక పరిస్థితులు ఒకేరకంగా ఉండవు. ఒక ప్రదేశం యొక్క భౌగోళిక పరిస్థితులు అంటే అర్థం ఆ ప్రదేశం ఉనికి ఎక్కడ? వాతావరణ ఉష్ణోగ్రత ఎలాఉంది? వర్షపాతమెంత? అక్కడ పెరిగే చెట్లు చేమలు ఏమిటి? ఇత్యాది విషయాల పరిశీలన. ఇవన్నీ ఒక ప్రదేశపు భౌగోళిక స్థితిని నిర్ణయిస్తాయి. ఈ విషయాన్ని కొన్ని ఉదాహరణలతో పరిశీలిద్దాం.

బెంగాలురాష్ట్రంఅంతా మైదానప్రాంతమే! కొండలు ఎంతో దూరంలోగాని లేవు. ఈ మైదాన ప్రాంతంలో వరి పండుతుంది. తిరువాన్కూరు సంస్థానంలో, కార్డమామ్ పర్వత ప్రాంతంలో, బెంగాలులో సాలుకు పడేంతవర్షం పడుతూనే ఉంది. ఉష్ణోగ్రతలో పెద్ద తేడాలేదు. అయినా ఇక్కడ వరి పండదు. ఇది మైదాన

ప్రాంతం కాకపోవడమే ఇందుకు ప్రధాన కారణం! కనక ఒక ప్రదేశపు ఉనికి (Physical Features) ప్రభావానికి యిది ఉదాహరణ.

ఒక ప్రదేశపు ఉనికి, వాతావరణ స్థితులపై అచ్చట పెరిగే చెట్లు చేమలజాతి ఆధారపడుతుంది. అందుచేతే, కొండప్రాంతంలో వర్షమున్నా వరిపైరు పెరగదు. అదేవిధంగా వర్షం అసలే శూన్యమయిన ఎడారి భూముల్లో అడవులు పెరగవు. అక్కడఉండే జంతుజాలపు అభివృద్ధి అక్కడ పెరిగే చెట్లుచేమలపై ఆధారపడి ఉంటుంది. వరిపైరు పెరిగే మైదానప్రాంతంలో ఒంటెలు ఉండవు. కీకారణ్యాలు పెరిగే ప్రాంతంలో గొర్రెలు, మేకలు ఎదగవు. మానవుని జీవితం వీటన్నిటిపై—ఉనికి, వాతావరణం, వృక్షజాలం, జంతుజాలం—ఆధారపడిఉంటుంది.

అయితే, భౌగోళిక పరిస్థితులు మానవుని బందీగా చేస్తున్నాయా? మానవుని విజ్ఞానం అభివృద్ధి కానంతకాలం అవి బందీగానే ఉంచాయి! కాని మానవ విజ్ఞానం అభివృద్ధి చెందిన కొలదీ, అతడు ప్రకృతి శక్తులతో సాగిస్తున్న పోరాటం పలువిజయాలు సాధించింది! సాధిస్తున్నది! ఉదాహరణకు, పెద్దనదులకు ఆనకట్టలు కట్టి, వర్షం అసలు కురియని ప్రదేశాలకు నీటిని మళ్లించి, ఎడారి భూములను సస్యశ్యామలం చేయగలుగుతున్నాడు. మంచు ప్రదేశాలలో పైర్లు పండిస్తున్నాడు! ఒకప్రాంతంలో పండే చెట్లను, పైర్లను, తద్విరుద్ధమైన వాతావరణంలో పెంచుతున్నాడు.

మానవుడు కొన్ని భౌగోళిక శక్తులను మాత్రమే స్వాధీనం చేసుకోగలిగాడు. కాని, ఇంకా వాటి ప్రభావాన్నుండి పూర్తిగా బైటపడలేదు. మానవ జీవితంపై యీ భౌగోళిక పరిస్థితుల ప్రభావం వివిధ ప్రాంతాలలో ఎలా ఉందో పరిశీలిద్దాం.

## శీ తో ష్ణ స్థి తు లు

ప్రపంచంలో పన్నెండురకాల శీతోష్ణస్థితులున్నాయి:

1. భూమధ్యరేఖాప్రాంతపు శీతోష్ణస్థితి: ఇక్కడ సంవత్సరం పొడుగునా ఎండవేడిమిఅత్యధికం. సంవత్సరం పొడుగునా ఉరుములూ,

మెరుపులతో వర్షాలువిపరీతంగా పడుతూ ఉంటాయి. సాలుకు సగటున 80 అంగుళాలవరకూ వర్షంపడుతుంది.

ఈ ప్రదేశం భూమధ్య రేఖకు ఇరువైపులా ఐదుడిగ్రీలమేర ఉంది. దక్షిణ అమెరికాలోని అమెజాన్-కాంగోనదీమైదానం, తూర్పు ఇండియాదీవులు, పశ్చిమ ఇండియాదీవులు, మలయా ద్వీపకల్పము, న్యూగినీప్రాంతంలో ఇట్టి శీతోష్ణస్థితి ఉన్నది. దక్షిణ బర్మా, అండమాన్దీవులు, ఆఫ్రికాలో గినియా తీరప్రాంతంలోకూడదాదాపు యిలాంటి శీతోష్ణస్థితే ఉంది.

వర్షాలు విరివిగా కురుస్తుంటాయి కనుక ఎత్తయిన, గట్టికర్ర గలిగిన చెట్లు, కీకారణ్యాలు పెరుగుతాయి. వీటిని భూమధ్య రేఖారణ్యాలు అని పిలుస్తారు.

ఈ అడవులలోనే, రబ్బరు చెట్లు, మలేరియా మందు క్వినైన్ చేసేందుకు ఉపయోగపడే సింకోనాచెట్లు ఉన్నాయి.

గాలి, వెలుతురుచూడని యీ కీకారణ్యాలలో చెట్లమీద నివసించగలిగిన కోతులు, చెట్లమీద నివసించే కప్పలు, బల్లులు, ఉడుములు మాత్రమే ఉంటాయి.

ఈ అడవులు అనారోగ్యకరం గాన, వాసయోగ్యం కాదు. అందుచేతే, యీ అరణ్యాలలో వెనుకబడిన కొండ జాతులవారు మాత్రమే అక్కడక్కడా నివసిస్తున్నారు. వీరి జీవనాధారం వేట. ఈ వాతావరణం యీప్రాంతంలో వ్యవసాయం, నాగరికత అభివృద్ధిని పూర్తిగా అరికడుతున్నది.

2. అతిశీతల, అత్యుష్ణమండలం: పగలు ఎండ వేడిమి అత్యధికం, రాత్రులు చలి విపరీతం. వేసవిలో మాత్రమే పగలు వర్షం విపరీతంగా కురుస్తుంది. ఆఫ్రికా ఖండంలోని సూడాన్ శీతోష్ణస్థితి ఇందుకు ఉదాహరణ. అందుచేతే దీన్ని సూడాన్శీతోష్ణస్థితి అని కూడా అంటారు. దక్షిణ అమెరికా ఖండంలోని "ఒరినోకో" మైదానంలోను, బ్రెజిల్ పీఠభూముల్లోను, యీ శీతోష్ణస్థితి ఉంది.

ఈ ప్రాంతంలో చెదురుగా చెట్లు, ఎత్తుగా పెరిగినగడ్డి మైదానాలు కనిపిస్తాయి. ఈ మైదానాలలో వర్షాకాలంలో గడ్డి పెరుగుతుంది. ఎండాకాలంలో పూర్తిగా ఎండిపోతుంది.

ఈ గడ్డి మైదానాలను సామాన్యంగా "సవానా" మైదానాలు అంటారు. దక్షిణాఫ్రికా, రొడీషియాలలోని "బుష్ వెల్డు" మైదానాలు ఇందుకు ఉదాహరణ.

లేళ్లు, దుప్పులు, జిరాఫీలు, ఆవులు మొదలయిన శాకాహార జంతువులు, సింహాలు, పెద్దపులులు మొదలయిన క్రూరజంతువులు యీ మైదానాలలో ఉన్నాయి.

ఈ ప్రాంత ప్రజల ప్రధానవృత్తి పశువుల పెంపకము, వ్యవసాయం. మొక్కజొన్న, ప్రత్తి, పొగాకు, గోధుమ ప్రధాన పంటలు.

3. ఋతుపవన శీతోష్ణస్థితి : ఇచ్చటి శీతోష్ణస్థితి దాదాపు పై మండలంలో ఉన్నట్లే ఉంటుంది. వర్షం కురిసేకాలం మాత్రం వేరు.

నవంబరునుండి ఫిబ్రవరివరకు చలికాలం. కొన్ని ప్రాంతాలలో మాత్రం కొద్దిగా వర్షం పడుతుంది. మార్చినుండి జూన్ – జూలై మాసాలవరకు వేసవికాలం. ఎండలు విపరీతం. ఋతుపవన వర్షాలు జులైలో ప్రారంభమై అక్టోబరువరకూ పడుతూనే ఉంటాయి. ఈ ప్రాంతంలో పడేవర్షంలో 90–95 పాళ్లు యీ కాలంలోనే పడుతుంది.

హిందూ మహాసముద్ర పరిసరప్రాంతం, ఇండియా, బర్మా, వాయువ్య ఆస్ట్రేలియా, ఆఫ్రికా ఖండంలోని అబిసీనియాప్రాంతాలు, యీ ఋతుపవన శీతోష్ణస్థితి మండలంలో ఉన్నాయి.

ఈ మండలంలో పెరిగే చెట్లు చేమలకు ఇండియా చక్కని ఉదాహరణ. ఎత్తయిన టేకు, మద్ది, వెదురు, తాటి, కొబ్బరి, మామిడి ఇత్యాదిచెట్లు, మంచిగడ్డి యీ ప్రాంతపు అడవులలో పెరుగుతుంది. వేసవిలో చెట్లు ఆకులురాల్చి, వర్షాకాలంలో చిగురుస్తాయి. ఈ అడవులు భూమధ్య రేఖాప్రాంతపు అడవులంత దట్టమయినవికావు.

ఈ వాతావరణం మామిడి, అరటి, ఇత్యాది పండ్ల తోటల అభివృద్ధికి; వరి, గోధుమ, జొన్న, మొక్కజొన్న, పప్పుదినుసులు, నూనెగింజలు, ప్రత్తి, టీ, కాఫీ, వంటివి పండించటానికి తోడ్పడుతున్నది.

ప్రజల జీవితానికి కావలసిన అత్యావసర పంటలు పండించటానికి యీ ప్రాంతంలో వీలున్నది. కనుకనే, యీ ప్రాంతమంతటా జనసమ్మర్దం అధికం.

4–5 ఎడారి ప్రాంతాలు: ఈ ప్రాంతం చాల పొడిగా ఉంటుంది. ఆకాశంలో మేఘాలు ఎప్పుడో కాని చెదురుగానయినా కనిపించవు. పగలు ఎండలు భరించరానంతగా ఉంటాయి. రాత్రులు విపరీతంగా చలివేస్తుంది. ఈ ప్రాంతంలో వర్షం అత్యల్పం. చెట్లుచేమలు ఈ వాతావరణంలో ఎదగవు.

భూమధ్య రేఖకు ఇరువైపులా, ఋతుపవనమండలం దాటిన తర్వాత ఇట్టి శీతోష్ణస్థితి ఉన్న ప్రాంతాలు కనిపిస్తాయి.

కర్కాట రేఖ, మకర రేఖల ప్రాంతంలో ఉన్న ఎడారుల్లో ఎండతాపం మరీఎక్కువగా ఉంటుంది. సహారాఎడారి, అరేబియా ఎడారి, ఉత్తరఇండియాలోని ఎడారులు, దక్షిణాఫ్రికాలోని "కలహారి" ఎడారి, దక్షిణఅమెరికాలోని "అటకామా" ఎడారి ఇందుకు ఉదాహరణలు.

కొన్ని ఎడారులలో వేసవిలో ఎండ వేడిమి అధికంగా ఉండడమే కాక, చలికాలంలో మంచుకూడా పడుతుంది. ఇరాన్‌లోని ఎడారులు, మధ్య ఆసియాలోని గోబీఎడారి, ఉత్తర అమెరికాలోని "కొలరాడో" ఎడారులు ఇందుకు ఉదాహరణలు.

ఈ ప్రాంతాలలో కనిపించే ముఖ్యజంతువు ఒంటె. ఇది ఒకసారి నీళ్లు తాగితే, మరికొన్ని రోజులవరకు నీళ్లులేకుండా ఉండగలదు.

ఎడారులలో అక్కడక్కడా "ఒయాసీస్" లనబడే, ఊటలు ఉంటాయి. వీటి పరిసరాలలోమాత్రం వ్యవసాయం చేస్తారు. ఇంతకు

మినహా వ్యవసాయం అనేదిలేదు. ఇంత పెద్ద ఎడారులలో, ఇట్లా వ్యవసాయంచేసే ప్రాంతం నామమాత్రమే !

మిగతా ప్రాంతాల ప్రజలు, ఒంటెలను వెంటబెట్టుకుని, ముఠాలు ముఠాలుగా సంచారం చేస్తుంటారు.

6. మధ్యధరా శీతోష్ణస్థితి : ఈ ప్రాంతంలో చలికాలం చలి తక్కువ; వేసవిలో ఎండలు అధికం. ఇట్టి శీతోష్ణస్థితి మధ్యధరా సముద్రతీర ప్రాంతంలో ఉన్నదికనుక, దానిని "మధ్యధరా శీతోష్ణ స్థితి" అంటారు.

ఈ ప్రాంతంలో చలికాలంలో వర్షాలు కురుస్తాయి.

ఉత్తర, దక్షిణ అమెరికా ఖండాల పశ్చిమభాగాన, దక్షిణా ఫ్రికా, దక్షిణ ఆస్ట్రేలియాలలో కొన్ని ప్రాంతాలలోను ఇట్టి శీతోష్ణ స్థితి కనిపిస్తుంది.

ఈ ప్రాంతపుచెట్లు ఎత్తుతక్కువ, ఆకులు దళసరిగా ఉంటాయి. కొన్నిటిపైన నూగు ఉంటుంది. (ఆకులలోని తేమ త్వరగా ఆవిరై పోకుండా ఇవి రక్షిస్తాయి.)

ద్రాక్ష, నారింజ, నిమ్మ, పీచ్, అత్తి మొదలయిన పండ్లచెట్లు బాగా పెరుగుతాయి.

ఆలివ్, బాదం చెట్లు కూడా ఈ ప్రాంతంలో పెరుగుతాయి. గోధుమ కూడా పండించ బడుతున్నది.

7. వెచ్చగా ఉండే తూర్పుతీర శీతోష్ణ స్థితి : కొన్ని ఖండాల పశ్చిమ తీరంలో మధ్యధరాశీతోష్ణస్థితి ఉన్నదని పైన చూచాం. అలాగే, కొన్ని దేశాల తూర్పుతీరంలో ఈ శీతోష్ణస్థితి ఉంది.

ఈ ప్రాంతాలలో వేసవిలో ఎండవేడిమి తక్కువ, చలి కాలంలో చలి తక్కువగా ఉంటుంది. అంటే, భరించరాని ఎండలు గాని, చలిగాని ఉండవు. చైనా, ఆస్ట్రేలియా తూర్పుతీరం, ఆగ్నేయ అమెరికా సంయుక్త రాష్ట్రాలు, నేటాల్ సముద్రతీర ప్రాంతాలలో ఇట్టి శీతోష్ణస్థితి ఉన్నది. (కాని చైనాలో మాత్రం, కొన్ని ప్రాంతా లలో చలి అధికంగానే ఉంటుంది.)

ఈ ప్రాంతంలోఉన్న మధ్యచైనాలో ప్రధాన పంట వరి. ఉత్తర చైనాలో ప్రధాన పంట జొన్న.

ఆగ్నేయ అమెరికా సంయుక్తరాష్ట్రాల్లో ప్రత్తి ముఖ్యపంట; ముఖ్య ఆహార పంట మొక్కజొన్న.

తూర్పు ఆస్ట్రేలియాలో యూకలిప్టస్ అడవులున్నాయి. ఈ ప్రాంతం, ఖండంలోకెల్ల సారవంతమయిన ప్రాంతాలలో ఒకటి.

దక్షిణాఫ్రికాలోని నేటాల్ ప్రాంతం కూడా సారవంతమైనదే. మొక్కజొన్న, చెరకు ముఖ్యపంటలు.

దక్షిణ బ్రెజిల్‌లో మంచికలప నిచ్చే అడవులున్నాయి.

8. సమశీతోష్ణమండలం: ఈ మండలంలో సంవత్సరం పొడుగునా వర్షాలు పడుతూనే ఉంటాయి. ఋతుపవనమండలంలోపడే వర్షాలకంటే ఇవి చాల తక్కువ. చలికాలంలో చలి తక్కువ. వేసవిలో ఎండలు తక్కువ. అందుచేత సంవత్సరం పొడవునా శీతోష్ణ స్థితిలో విపరీత వ్యత్యాసం ఉండదు.

వాయవ్య యూరప్‌లో, (బ్రిటిష్ దీవులతో సహా) పశ్చిమ కెనడా, దక్షిణ చిలీ, టాస్మేనియా, న్యూజీలెండ్ ప్రాంతాలలో ఈ శీతోష్ణస్థితి ఉంది.

ఈ ప్రాంతాలలోని చెట్లు చలికాలం రాగానే ఆకులు రాల్చుతాయి. ఈప్రాంతపు అడవులలో పెరిగే చెట్లలో ముఖ్యమైన జాతులు ఓక్, ఎల్మ్, బీచ్, బిర్చ్, మాపిల్.

ఈ వాతావరణంలో అనేక రకాల ధాన్యాలు పండుతాయి. వీటిలో గోధుమ, బార్లీ, ఓట్లు, రై పంట ప్రధానమైనవి.

9. గడ్డి మైదానాల ప్రాంతం: ఈ ప్రాంతంలో చలికాలంలో చలి అధికం, వేసవిలో ఎండ వేడిమి అధికం. దాదాపు, ఋతుపవన ప్రాంతంలో ఉన్న శీతోష్ణస్థితిని పోలి ఉంటుంది.

వేసవిలో వర్షం పడుతుంది, కాని, ఋతుపవన మండలంలో అంతమాత్రం పడదు. చలికాలంలో కొద్దిగా మంచుపడుతుంది.

కెనడా, దక్షిణ సోవియట్‌యూనియన్, దక్షిణ సైబీరియా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, దక్షిణఅమెరికాలలో ఈ శీతోష్ణస్థితి ఉన్న గడ్డిమైదానాలున్నాయి.

ఈ మైదానాలను వివిధదేశాలలో వివిధపేర్లతో వ్యవహరిస్తున్నారు. ఉదా : ఆసియా, యూరప్‌లలో "స్టెప్పీలు" అంటారు. దక్షిణఅమెరికాలో "పంపాస్" అంటారు.

గుర్రాలు, గాడిదలు, గొర్రెలు ఈ మైదానాలలో పెరిగే ముఖ్య జంతువులు. పశువుల పెంపకం ప్రజల ముఖ్యవృత్తి.

శాస్త్రవేత్తల పరిశోధనల ఫలితంగా, ఈ గడ్డి మైదానాలను పంటభూములుగా మార్చి, పంటలు పండిస్తున్నారు. ముఖ్యపంట గోధుమ.

10. త్రిభుజాకారపుచెట్ల అడవులు : ఈప్రాంతంలో ఎప్పుడూ మంచు పడుతూనే ఉంటుంది. సూర్యరశ్మి చాల తక్కువ. చెట్లు త్రిభుజాకారంగా, ఎత్తుగా పెరుగుతాయి. వీటి ఆకులు సూదులవలె సన్నగా ఉండటంవల్ల, పడిన మంచు ఆకుమీద నిలువక వెంటనే క్రింద పడిపోతుంది. కనుక, చెట్టు బ్రతకటానికి అత్యావశ్యకమయిన సూర్యరశ్మి లభిస్తుంది.

ఈ అడవులు మంచి కలప నిస్తాయి. రంపపు మిల్లులు, కలప పరిశ్రమకు సంబంధించిన ఇతర పరిశ్రమలు ఈ ప్రాంతాలలో ఉన్నాయి.

మధ్య యూరప్‌లోని పర్వత ప్రాంతాలలోను (జర్మనీ, స్విట్జర్లండ్ దేశాలలోని పర్వతాలమీద), న్యూజీలెండ్, టాస్మేనియా, ఆగ్నేయ ఆస్ట్రేలియాలోని పర్వత ప్రాంతాలలోను ఈ అడవులున్నాయి.

11. మంచుఎడార్లప్రాంతం : ఇచ్చట సంవత్సరంలో చాల కాలం (తొమ్మిదినెలలు) చలి విపరీతంగా ఉంటుంది. నీరు గడ్డకట్టి పోతుంది. వేసవికాలం మూడునెలలూ ఎండలు బాగా ఉంటాయి.

ఇచ్చట విపరీతమైన చలివల్ల చెట్లుచేమలు పెరగవు. ఎండ వేడిమి అధికమవడంవల్ల సహారా ఎడారి అయితే, ఈ ప్రాంతాలు మంచువల్ల ఎడార్లయినాయి.

ఆర్కిటిక్, అంటార్కిటిక్ ప్రాంతాలలో (ఉత్తర, దక్షిణ ధృవ ప్రాంతాలు) ఈ ఎడార్లున్నాయి.

ఇక్కడ కనిపించే ఒకే ఒక జంతువు 'రెయిన్‌డీర్'. దీనివల్ల మాసం, పాలు అచ్చటి ప్రజలకు లభిస్తాయి.

12. ఆల్పైన్ శీతోష్ణస్థితి: భూమధ్యరేఖ నుండి ధృవముల వైపు ప్రయాణం చేస్తూంటే, వాతావరణం మారినట్లే, పర్వతాల మీద ఎత్తుకుపోయిన కొలదీ శీతోష్ణస్థితులు మారిపోతాయి.

చాల ఎత్తుకుపోయిన తర్వాత, మంచు శాశ్వతంగా గడ్డకట్టి ఉంటుంది. దీనికి దిగువన, సరిగా, ఆర్కిటిక్ తీర భూములలో ఉండే శీతోష్ణస్థితికి ఎత్తునఉన్న ప్రదేశం కనుక గాలి వత్తిడి తక్కువగా ఉండి, ఒకరకమయిన వాతావరణం ఉంటుంది. దీనినే "ఆల్పయిన్" వాతావరణం అంటారు.

ఈ ప్రాంతంలో వేసవిలో మంచుకరగి, నేలపచ్చపడుతుంది. అపుడు పశుల కాపరులు మందలను క్రిందినుండి ఈ ప్రాంతానికి తోలుకొచ్చి మేపుకుంటారు. చలికాలంరాగానే, నేలమంచుచే కప్పబడిపోతుంది. అపుడు వీరు మరింత వెచ్చగాఉండే, దిగువ ప్రాంతాలకు దిగిపోతారు. ఒక్కొక్కప్పుడు, ఈ గడ్డిమైదానాలకుపైన, పొట్టి చెట్లు, పూలచెట్లు కూడా పెరగటం కద్దు.

దీని పైభాగంలో, శాశ్వతంగా మంచుచేత కప్పబడిఉండే ప్రాంతాలు కనిపిస్తాయి.

# భారతదేశం

**భా**రతదేశం, భూమధ్య రేఖకు ఉత్తరంగా, 8°–37° అక్షాంశ రేఖల, (latitude), 66°–97° తులాంశరేఖల (longitude) మధ్య ఉంది. ఉత్తర– దక్షిణాల నిడివి 2,000 మైళ్ళు. తూర్పు – పడమరల వెడల్పు 1,400 మైళ్ళు. వైశాల్యం 12,69,640 చదరపుమైళ్ళు.

మన దేశ వైశాల్యం బ్రిటన్‌కు పదమూడురెట్లు, జపాన్‌కు ఎనిమిదిరెట్లు పెద్దది. సోవియట్ యూనియన్ వైశాల్యంలో ఏడవ వంతు, కెనడా వైశాల్యంలో మూడవవంతు వున్నది. ప్రపంచంలోని పెద్దదేశాలలో (వైశాల్యంలో) ఇది ఏడవది!

ఇంత విశాలమైన దేశమయినా సముద్రతీరం పొడవు 3,500 మైళ్ళే! ఆ కొద్దితీరమయినా లోతుగా లేకపోవడంవల్ల, సహజమైన ఓడరేవులు తగినన్ని ఏర్పడ్డానికి అవకాశం లేకపోయింది.

మనకున్న ఓడరేవులు బొంబాయి, గోవా, కొచ్చిన్, మదరాసు, విశాఖపట్నం.

## నైసర్గిక స్వరూపం

నైసర్గికస్వభావాన్నిబట్టి మనదేశాన్ని మూడు భాగాలుగా విభజించవచ్చు: 1. ఉత్తరపర్వతప్రాంతం; 2. గంగ–సింధు మైదానం; 3. దక్కన్ పీఠభూమి.

1. ఉత్తర పర్వత ప్రాంతం: హిమాలయపర్వతాలు మన దేశానికి ఉత్తర సరిహద్దుగా 2000 మైళ్ల పొడవున – తూర్పున అస్సాం వరకూ – వ్యాపించి ఉన్నాయి. వీటి సగటు ఎత్తు 17,000 అడుగులు. ప్రపంచంలో కెల్లా ఎత్తయిన ఎవరెస్టు శిఖరం ఈ పర్వతాల లోనిదే!

ఈ పర్వతాలు నైరుతి ఋతుపవనాల నడ్డి, విశేష వర్షాలకు కారణ భూతమవుతున్నాయి. చలికాలంలో మధ్య ఆసియా నుండి వీచే శీతగాలుల నుండి యీ పర్వతాలు దేశాన్ని రక్షిస్తున్నాయి.

ఉత్తర దేశానికి ప్రాణప్రదమయిన గంగ, యమున, బహ్మపుత్రానదులు ఈ పర్వతాలలోనే పుట్టాయి. అస్సాం, తూర్పు పంజాబులలోని ఈ పర్వత లోయలలోనే ప్రపంచ ప్రఖ్యాతి పొందిన తేయాకు పండించ బడుతున్నది.

2. గంగ-సింధు మైదానం: చరిత్రలో మనం చదివిన ఆర్యుల నాగరికత వర్థిల్లిన ప్రాంతం ఇదే! ఇది గంగ, సింధు, బహ్మపుత్రా నదులు, వీటి వుపనదులు ప్రవహించే సారవంతమైన మైదానం. ఇది 200 మైళ్ళ వెడల్పున, తూర్పు-పడమరలుగా 1500 మైళ్ళ మేర వ్యాపించి వుంది.

నేల చాల సారవంతమైనది. కావలసినంత వర్షంపడుతుంది. వాతావరణం వ్యవసాయాని కనుకూలంగా వుంటుంది. గంగ, బ్రహ్మపుత్రా నదుల నీరు సాగుకు విరివిగా వుపయోగపడుతున్నది. అందు చేత, భారతదేశ జనాభాలో నూటికి 40 మంది ఈ మైదానంలోనే నివసిస్తున్నారు.

3. దక్కను పీఠభూమి: దీనికి మూడువైపులా పర్వతాలున్నాయి - ఉత్తరాన వింధ్య, సాత్పురాపర్వతాలు; పడమర పశ్చిమ కనుమలు; తూర్పున తూర్పు కనుమలు.

తూర్పు కనుమలకూ, సముద్రానికీ మధ్య 30-40 మైళ్ళ వెడల్పున మైదానప్రాంతం తీరం పొడవునా వుంది. దీన్నే "కొరమాండల్ తీరం" అంటారు. ఇలాగే పశ్చిమ కనుమలకూ, సముద్రానికీ మధ్య వున్న మైదానంలో ఉత్తరభాగాన్ని "కొంకణ్ తీర" మని, దక్షిణ భాగాన్ని "మలబార్ తీర" మని అంటారు.

ఈ పీఠభూమి పడమట ఎత్తుగావుండి, తూర్పున పల్లంగా వుండటంచేత, నదులన్నీ - కృష్ణా, గోదావరి, పెన్నా, కావేరి ఇత్యాది

నదులు - పడమటి కనుమలలో పుట్టి తూర్పుగా ప్రవహించి బంగాళా ఖాతంలో కలుస్తున్నాయి.

నదులు : హిమాలయపర్వతాలలో పుట్టిన గంగ, బ్రహ్మపుత్రానదులకు వర్షాకాలంలో వర్షంవల్ల, వేసవిలో హిమాలయ పర్వతాలమీద మంచు కరగటంవల్ల నీరు సమృద్ధిగా లభిస్తుంది. అందుచేత సంవత్సరకాలమూ ప్రవహిస్తూనే ఉంటాయి. ఈ నదుల, వీటి వుపనదుల కాలవలవల్ల తూర్పుపంజాబు, బీహారు, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలభూమి సాగుచేయబడుతున్నది.

దక్కన్ పీఠభూమిలో ప్రవహించే నదులకు వర్షపునీరే ఆధారం. వేసవిలో వాటి నీరు తగ్గిపోయి పూర్తిగా ప్రవహించక, మడుగులుగా మాత్రమే మిగిలిపోతాయి. అందుచేతే, గంగ, బ్రహ్మపుత్రానదులవలె,వీటిలో సంవత్సరంలో అన్ని నెలలూ పడవలు తిరగటానికి వీలుపడదు. పంటభూములకు నీటిని సమృద్ధిగా సప్లయి చేయలేవు.

## వాతావరణం

సువిశాలమైన దేశంలో అన్నిప్రాంతాలలోనూ ఒకే రకమయిన వాతావరణం వుండటం అసంభవం. ఒకచోట సమశీతలంగా వుంటే, మరొకచోట ఉష్ణమధికంగా వుంటుంది.

వాతావరణ పరిస్థితుల పరిశీలనకు దేశాన్ని (1) ఉత్తర హిందూస్థానం; (2) దక్కను దేశం అని రెండుగా విభజించవచ్చు.

ఉత్తర హిందుస్థానం అంతటలోను ఒకేరకమయిన శీతోష్ణస్థితి లేదు. పశ్చిమ ప్రాంతంలో (తూర్పు పంజాబు; రాజపుత్రస్థానం) చలికాలం చలి అధికం; వేసవిలో ఉష్ణ మధికం; గాలిలో తేమ చాల తక్కువగా వుంటుంది.

తూర్పు ప్రాంతంలో (పశ్చిమ బెంగాల్, అస్సాం, బీహార్, ఉత్తరప్రదేశ్) చలికాలంలో చలి అంతగా వుండదు. కాని వేసవిలో ఉష్ణ మధికం. అయితే గాలిలో తేమ ఎక్కువగా వుంటుంది.

ఋతుపవనాలు: మన దేశంలో వర్షాన్నిచ్చేవి నైఋతి ఋతుపవనాలు, ఈశాన్య ఋతుపవనాలు.

నైరుతి ఋతుపవనాలు జూన్, జులై, ఆగస్టు, సెప్టెంబరు మాసాల్లో వర్షాన్నిస్తాయి. దేశంలో పడే వర్షంలో నూటికి 90 పాళ్లు యీ పవనాలవల్లనే కలుగుతున్నది.

నైరుతి ఋతుపవనాలు రెండు దిక్కులుగా వస్తాయి. ఒకటి బంగాళా ఖాతంమీదగా వచ్చి, ఆరకాన్-హిమాలయ పర్వతాలచే అడ్డగింపబడి, అస్సాం, బెంగాల్, బీహార్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలకు వర్షాన్నిస్తున్నాయి.

రెండవది అరేబియా సముద్రం మీదుగా వచ్చి, పశ్చిమ కనుమలుదాటి దక్కను పీఠభూమి, మధ్యప్రదేశ్, అస్సాం, బెంగాలు రాష్ట్రాలకు వర్షాన్నిస్తున్నాయి. రెండుపాయలు అస్సాం, బెంగాలు రాష్ట్రాలలో కలుసుకోవటంచేత, ఇచ్చట అధిక వర్షం పడుతుంది. ప్రపంచంలో కెల్లాఅత్యధిక వర్షంపడే"చిరపుంజి"యీ ప్రాంతంలోనిదే.

ఈశాన్య ఋతుపవనాలు: జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలల్లో వస్తాయి. వీటివల్ల వచ్చేవర్షంలో అధికభాగం తిరువాన్కూరు-కొచ్చిన్, మదరాసు తీర ప్రాంతంలో పడుతుంది.

మన దేశంలో సాలుకు సగటున 42 అంగుళాల వర్షం పడుతుంది. ప్రతి సంవత్సరం ఇంత వర్షం పడుతుందనే నమ్మకంలేదు. 11-12 అంగుళాల తేడాతో పడుతూ వుంటుంది.

దేశమంతటా వర్షపాతం ఒకేరంగాలేదు. శీతోష్ణస్థితులలోని తీవ్రవ్యత్యాసమే ఇందులో కూడా గోచరిస్తుంది. దేశాలలో వ్యవసాయం ముఖ్యంగా వర్షంమీదే ఆధారపడివుండటంవల్ల వర్షం తక్కువపడిన సంవత్సరం పంటలుపోయి కరువురావటం, వర్షం అధికమయిన సంవత్సరం పంట దెబ్బతినటం, వర్షాలు సకాలానికి రాకపోవటంవల్ల, పైర్లు వేసుకొనేకాలం దాటిపోవటం జరుగుతూవుంటుంది.

ఉత్తరప్రదేశ్, రాజపుత్రస్థానంలో పశ్చిమోత్తరభాగం, మధ్యప్రాంతం, బొంబాయిరాష్ట్రంలో చాలభాగం, ఆంధ్ర, మదరాసు,

(తూర్పు కనుమలతీరంతప్ప) హైదరాబాదు, మైసూరు, బీహారు, ఒరిస్సా రాష్ట్రాలు - ఈ ప్రాంతాలలో వర్షం సక్రమంగా, సకాలంలో కురుస్తుందనే నమ్మకంలేదు.

ఇంత విశాలప్రాంతంలో వర్షాలు సక్రమంగా కురియకపోవటం వల్లనే, దేశంలో ఏదో ఒకమూల ప్రతి సంవత్సరం కరువురాకాసి విలయతాండవం చేస్తూనేవుంటుంది.

## ప్రజలు - మతాలు - భాషలు

ప్రపంచంలో చైనా తర్వాత అత్యధిక జనాభాగల దేశం భారతదేశమే! ప్రపంచ జనాభాలో ప్రతి ఐదుగురిలో ఒకరు భారతీయుడు!

1951 జనాభా లెక్కల ప్రకారం, మనదేశ జనాభా (జమ్మూ-కాశ్మీరు, అస్సాంలోని కొండజాతుల ప్రజలు మినహా) 35,68,29,485. జనసమ్మర్దం సగటున చదరపుమైలుకు 312. గంగా-యమునా మైదానంలాంటి సారవంతమైన, పంటలు బాగాపండేప్రాంతాల్లో జనసమ్మర్దం అధికంగాను, ఇతరచోట్ల తక్కువగాను వుంది.

దేశ జనాభాలో 6,20,00,000 మంది నగరవాసులు (నూటికి 17.3) మిగిలిన 29,50,00,000 మంది (నూటికి 82.7) గ్రామీణ జనాభా.

దేశం మొత్తం మీద వ్యవసాయ జనాభా 1000కి 710. వీరిలో పూర్తిగాగాని, ప్రధానంగాగాని భూకామందులుగా వున్నవారు 457; పూర్తిగాగాని, ప్రధానంగాగాని సొంతభూమి లేనివారు 88; వ్యవసాయకూలీలు 149; వ్యవసాయంచేయని భూకామందులు16. అంటే, వ్యవసాయ జనాభాలో వ్యవసాయకూలీలు, నిరుపేద రైతాంగంకలిసి 100 కి 33.3 వరకు వున్నారు.

ఒక ప్రాంతంలో కరువురావడంచేతగాని, నిరుద్యోగసమస్య తీవ్రతరం కావడంచేతగాని, వున్న యకరంకొంౘడను భూస్వామికి కట్టబెట్టవలసిరావడంచేతగాని, అనేకమంది వ్యవసాయకూలీలు, పేద

రైతులు పొట్టచేతబట్టుకుని పట్టణాలకు, యితరప్రాంతాలకు వెళ్ళటం నేటికీ జరుగుతూనేవుంది.

బీహార్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, మదరాసు, నేపాలు రాష్ట్రాలనుండి వలసపోయిన ప్రజలు, డార్జిలింగ్ తేయాకు తోటలలోనూ, కలకత్తాలోని వివిధ కర్మాగారాలలోనూ కూలి చేసు కుంటున్నారు.

40 లక్షల మంది ప్రజలు విదేశాలకు వలస వెళ్ళారు. వీరిలో దాదాపు నూటికి 75 మంది బర్మా, సింహళం, మలయాలకు వెళ్లారు. కొన్ని వేల మైళ్ళ దూరంలోవున్న దక్షిణాఫ్రికాకు కూడా పూర్వం మన ప్రజలు వలస వెళ్ళారు.

భారతదేశంలో 179 భాషలు వాడుకలో ఉన్నాయి. వీటిలో సుమారు 116 భాషలను జనాభాలో నూటికి ఒక్కరు మాత్రమే మాట్లాడతారు.

భారత రాజ్యాంగచట్టం 14 భాషలను గుర్తించింది. అవి: హిందీ, ఉరుదు, బెంగాలీ, ఒరియా, మరాఠీ, గుజరాతీ, కాశ్మీరీ, పంజాబీ, నేపాలీ, అస్సామీ, తెలుగు, కన్నడం, తమిళం, మళయాళం.

హిందీని రాజభాషగా అంగీకరించారు. 1965 వ సంవత్సరం వరకూ ఇంగ్లీషుకూడా రాజభాషగానే గుర్తించబడుతుంది.

ప్రతి పదివేల జనాభాలో హిందువులు 8,499 మంది, సిక్కులు 174 మంది, జైనులు 45 మంది, బౌద్ధులు 6 గురు, జోరాష్ట్రియనులు 3 గ్గురు, క్రిష్టియనులు 230 మంది, ముస్లింలు 993 మంది, ఇతర మతస్థులు 50 మంది వున్నారు.

## ఆర్థిక విధానం

బ్రిటిష్ పాలన భారతదేశ ఆర్థిక వ్యవస్థను కూకటివేళ్ళతో నిర్మూలించి, వ్యవసాయాన్ని అధ్వాన్న మొనర్చింది. కరువు కాటకాలు అంతకు ముందెన్నడూ రానంత ఎక్కువగా వచ్చాయి. బ్రిటిష్ పాలకులు దేశాన్ని విపరీతంగా దోచుకున్నారు. బ్రిటనులో (పారిశ్రామిక విప్లవ కాలంలో) పారిశ్రామికాభివృద్ధికి అవసరమైన సొమ్మును

ఈ రూపంలో వారు సమకూర్చుకున్నారు. ఆదశ పూర్తయిన తర్వాత బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతదేశ పరిశ్రమలను, చేతివృత్తులను క్రమబద్ధంగా నాశనంచేశారు.

మొదట భారతదేశంలో తయారయిన బట్టను యూరపు మార్కెట్లకు రాకుండా చూశారు. తర్వాత తమ బట్టలతో మన మార్కెట్టును ముంచెత్తారు. ఈ పోటీకి తట్టుకోలేక, ఒకప్పుడు జగద్విఖ్యాతి పొందిన భారత వస్త్రపరిశ్రమ నాశన మయింది. లక్షలాది ప్రజలు నిరుద్యోగులై, ఆకలిచావులకు గురైనారు.

బ్రిటను భారతదేశంపై రుద్దిన వలస విధానం, దేశ స్వతంత్ర ఆర్థికాభివృద్ధికి ఆటంకంగా తయారైంది. లక్షలాది ప్రజల్ని దారిద్ర్యానికి, ఆకలిబాధకూ బలిచేసింది.

మొదటి ప్రపంచయుద్ధం జరుగుతున్నకాలంలోను, రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలంలోను భారతదేశంలో యంత్రపరిశ్రమలు కొద్దిగా అభివృద్ధిచెందాయి. మిల్లుబట్టల పరిశ్రమ అభివృద్ధిఅయింది. మరికొన్ని పరిశ్రమలుకూడా వెలిశాయి. కాని, కీలకయంత్రాల ఉత్పత్తికి కావలసిన పరికరాలకు పూర్తిగా విదేశాలమీదనే భారత దేశం ఆధారపడవలసివచ్చింది. వలసదోపిడీ ఫలితంగా పెద్దపరిశ్రమలు చాల నెమ్మదిగానే అభివృద్ధిచెందాయి. బ్రిటిష్ గుత్తవ్యాపారస్తులు, వలసరాజ్యాధిపతులు గతంలోవలె పారిశ్రామికాభివృద్ధిని నిరోధించడమో, కొద్దిమంది విదేశీ గుత్తవ్యాపారస్తులు దేశాన్ని అదుపులో ఉంచుకొనేందుకు దేశీయ పరిశ్రమలను కొన్నిమార్గాలలో మాత్రమే అభివృద్ధిచేయడమో జరిగింది.

రెండవ ప్రపంచయుద్ధం జరుగుతున్నపుడు భారతదేశం ఆగ్నేయ ఆసియా దేశాల్లోని లక్షలాది సైనికులకు ఆహారధాన్యాలు, బట్ట వగైరా సప్లయిచేస్తుండేది. తత్ఫలితంగా దేశీయ పరిశ్రమల ఉత్పత్తి కొంత పెరిగింది. ఇండియాలో మొట్టమొదటిసారిగా ఉక్కు పరికరాలు, రసాయన పదార్థాలు తయారు కా నారంభించాయి.

పారిశ్రామికోత్పత్తిలో యీ పెరుగుదలకు ప్రధాన కారణం కొత్తగా పెద్దఫ్యాక్టరీలు నిర్మించబడటంవల్లకాదు. పాతవే ఉత్పత్తిని అధికంగా కొనసాగించడం, కార్మికుల పనిభారాన్ని, పని గంటలను హెచ్చుచేయడం మొదలయిన పద్ధతులు అవలంబించబడ్డాయి.

పారిశ్రామికోత్పత్తి తాత్కాలికంగా పెరిగినప్పటికీ, వ్యవసాయ పరిస్థితి యథాప్రకారంగానే వెనుకబడివుంది. కోట్లాది ప్రజల జీవితం దుర్భరమైంది.

జాతీయ స్వాతంత్ర్యోద్యమవెల్లువ ఉచ్ఛస్థాయి నందుకున్న ఫలితంగా బ్రిటిష్‌పాలకులు 1947 లో రాజీచేసుకోవలసి వచ్చింది. కాని భారతదేశంపై తమ ఆర్థిక పెత్తనాన్ని యథాప్రకారంగా కొనసాగించుకోవచ్చుననే అంచనాతో వారు యీ రాజీ చేసుకున్నారు. అంతేకాక ఇండియా, పాకిస్తాను అనే రెండు ఖండాలుగా దేశాన్ని విభజించారు. వాటిమధ్య ఆర్థిక ఐక్యత లేకుండాచేశారు. రెండు దేశాల ఆర్థికాభివృద్ధికి ఆటంకాలు కల్పించారు.

భారతదేశం స్వాతంత్ర్యం సంపాదించిన తర్వాత, అనేక క్లిష్టమైన ఆర్థికసమస్యల నెదుర్కోవలసి వచ్చింది. కొద్దిమాసాల్లో పశ్చిమ పాకిస్తాన్‌నుండి 47 లక్షలు, తూర్పు పాకిస్తాన్‌నుంచి 25 లక్షల కాందిశీకులు భారతదేశం చేరుకున్నారు. ఇప్పటికీ వస్తూనేవున్నారు. వీరిరాక దేశంలో నిరుద్యోగాన్ని తీవ్రతరం చేసింది.

దేశవిభజనవల్ల ఆహారధాన్యాల, ముడిపదార్థాల పరిస్థితి మరింత అధ్వాన్న మయింది. అన్నిటికంటె ఎక్కువగా ఆహారధాన్యాలను, ముడిపదార్థాలను సప్లయిచేసే కేంద్రాలు (పంజాబు, సింధు రాష్ట్రాల్లోని ఉత్తమమైన ఇరిగేషన్ స్కీములతోసహా) పాకిస్తానులో చేర్చబడ్డాయి. పత్తి, జనపనార విస్తారంగా పండే ప్రాంతాలుకూడా పాకిస్తానులోకే వెళ్ళాయి. అందుచేత భారత వస్త్రపరిశ్రమ, జనపనారపరిశ్రమ చాల చిక్కులకు లోనయ్యాయి. ప్రధానంగా ఎగుమతులకొరకు ఉత్పత్తిచేసే పరిశ్రమలు, ముడిపదార్థాల సప్లయికి విదేశాలమీద

ఆధారపడవలసివచ్చింది. విదేశవ్యాపారంలో సమతూకంలేక లోటు అధికమవడానికి యిదికూడా ఒక కారణమైంది.

ప్రధానమయిన పారిశ్రామిక శాఖలన్నీ విదేశీ గుత్త వ్యాపారస్తులమీద ఆధారపడ్డంవల్ల భారతదేశం యొక్క ఆర్థిక వ్యవస్థ – ముఖ్యంగా పరిశ్రమలు – స్వతంత్రంగా అభివృద్ధి చెందేటందుకు ఆటంకాలు ఏర్పడ్డాయి. అనేక ప్రధాన పరిశ్రమలు – రబ్బరు, తేయాకు తోటలు, జనపనార, బొగ్గు ఇత్యాదులు – విదేశీ పెట్టుబడిదారుల చేతుల్లో – ముఖ్యంగా బ్రిటిష్ పెట్టుబడిదారుల చేతుల్లో – వున్నాయి. భారత ప్రభుత్వం నియమించిన విచారణకమిటీ అంచనాల ప్రకారం పెట్రోలు పరిశ్రమలో నూటికి 97 వంతులు, రబ్బరు పరిశ్రమలో 93 వంతులు, అగ్గిపెట్టెల పరిశ్రమలో 90 వంతులు, జనపనార పరిశ్రమలో 89 వంతులు, గనులలో 73 వంతులు, బొగ్గు గనుల్లో 62 వంతులు, విద్యుత్ పరిశ్రమలో 43 వంతులు, యంత్ర పరిశ్రమల్లో 33 వంతులు విదేశీ పెట్టుబడిదారుల చేతుల్లో వున్నాయి.

ఈ విధంగా విదేశీ పెట్టుబడులు – ముఖ్యంగా బ్రిటిష్ పెట్టుబడులు – ప్రత్యక్షంగా పెత్తనంచేయడంతోబాటు, భారత పెట్టుబడిదారులు, విదేశీ పెట్టుబడిదారులు కలిసి జాయింటు పారిశ్రామిక సంస్థలను నెలకొల్పిన సందర్భాలుకూడా వున్నాయి.

విదేశీ గుత్తవ్యాపారస్తులు భారతదేశంలో విపరీతమయిన లాభాలు సంపాదిస్తున్నారు. వాటిలో అధికభాగం స్వదేశాలకు తరలించుకపోతున్నారు. భారతదేశ పరిశ్రమలు స్వతంత్రంగా అభివృద్ధికాకుండా ఆటంకాలు పెడుతున్నారు. ముఖ్యంగా యంత్ర పరిశ్రమల అభివృద్ధిని అరికడుతున్నారు. ఇందుకు మోటారు పరిశ్రమ చక్కని ఉదాహరణ. ఫోర్డుకంపెనీ, జనరలుమోటార్సు యజమానులు భారతదేశంలో కార్లను ఉత్పత్తిచేయకుండా, వాటి విడిభాగాలను తమ దేశాలనుండి దిగుమతిచేసి, ఇక్కడ వాటితో కార్లను తయారుచేసే పరిశ్రమను ప్రారంభించారు. భారత ప్రభుత్వం 1952 లో ఆ విడిభాగాలన్నిటినీ క్రమక్రమంగా యీ దేశంలోనే ఉత్పత్తి చేయ

మని కోరింది. కాని, వీరు అంగీకరించలేదు. పైపెచ్చు విడిభాగాలను సమకూర్చే కర్మాగారాలను మూసివేశారు.

పరిశ్రమల్లో కొంత అభివృద్ధి కనిపిస్తున్నప్పటికీ, భారతదేశం ఇప్పటికీ వ్యవసాయ దేశంగానే వుంది. 1951 జనాభా లెక్కల ప్రకారం 35 కోట్ల 67 లక్షల ప్రజల్లో 30 కోట్లమంది – ఆరింట ఐదుగురు – గ్రామాలలోనే నివసిస్తున్నారు. నూటికి 70 మంది ప్రజలకు వ్యవసాయమే జీవనాధారం. వీరిలో పూర్తిగాగాని, ప్రధానంగాగాని స్వంతభూములు లేనివారు, వ్యవసాయ కూలీలు కలిసి 100కి 33.3 వరకు వున్నారు. స్వంత భూములు వున్నవారిలో సహితం అధిక సంఖ్యాకులు అతి చిన్న క్షేత్రాలను కలిగివున్నారు. ఇవి వారి కుటుంబ పోషణకు చాలవు. స్వంత భూమిలో 5 ఎకరాలకన్న తక్కువ భూమి వున్నవారు ఉత్తరప్రదేశ్‌లో నూటికి 88 మంది, పంజాబులో నూటికి64 గురు, బెంగాలులో నూటికి 71 మంది వున్నారు. మదరాసులో (ఆంధ్రరాష్ట్రంకూడా కలిసివున్నప్పుడు) $2\frac{1}{2}$ ఎకరాలకన్న తక్కువభూమి గలవారు నూటికి 74 మంది వున్నారు.

భారతదేశ రైతాంగం మూడురకాల భారాలను మోయవలసి వస్తున్నది. (1) అధిక పన్నులు, (2) భూస్వాములకు విపరీత కౌళ్లు, (3) వడ్డీవ్యాపారస్తులకు అప్పులు. రైతులు భూస్వాములకు, వడ్డీ వ్యాపారస్తులకు పెద్దమొత్తాలలో సొమ్ము చెల్లించవలసి వస్తున్నది. తత్ఫలితంగా రైతాంగంలో ఒకభాగం వ్యవసాయకూలీలుగా మారిపోతున్నారు. వారు ఉత్పత్తిచేసే పంటలో అధికభాగం వడ్డీ వ్యాపారస్తులకు అప్పులు తీర్చడానికే సరిపోతుంది. రిజర్వుబ్యాంకు అధికారులు కొన్నిచోట్ల జరిపిన పరిశీలనవల్ల యీ ఋణభారం చాల అధికంగావున్నట్లు తేలింది. ప్రభుత్వ సహకార బ్యాంకులవల్ల వీరికి అవసరమైన అప్పులు నూటికి 6.3 వంతులే లభిస్తున్నది. మిగతా ఋణం వడ్డీవ్యాపారస్తుల, వర్తకుల, భూస్వాములనుండి అధికవడ్డీ రేటుతో తీసుకోవలసివస్తున్నది. ఈ ఋణభారం రైతాంగాన్ని మరింత క్రుంగదీస్తున్నది.

ఇట్టి పరిస్థితుల్లో రైతాంగంలో అత్యధిక సంఖ్యాకులకు అధునాతన పద్ధతుల్లో వ్యవసాయం చేయడానికి ఉత్సాహం లేదు; చేయదలచినా కావలసిన ఆర్థికస్తోమత లేదు.

వ్యవసాయ పద్ధతుల్లోగాని, పనిముట్లలోగాని వేలకొద్ది సంవత్సరాలుగా ఎట్టి పెద్దమార్పూ లేదు. రైతులు ఇంకా పురాతన వ్యవసాయ పనిముట్లనే ఉపయోగిస్తున్నారు.

నానాటికీ వ్యవసాయంమీద ఆధారపడే జనాభా పెరుగుతున్నది. కోట్లాది ప్రజలకు స్వంతభూములు లేకపోవటంచేత వారు భూస్వాముల క్రిందనో, ధనిక రైతులక్రిందనో వ్యవసాయకూలీలుగాను, కౌలుదార్లుగాను పనిచేయవలసి వస్తున్నది. సంవత్సరంలో అధికభాగం నిరుద్యోగులుగానే వుండవలసి వస్తున్నది.

సకాలంలో వర్షాలు కురవకపోయినా, వరదలు వచ్చినా లక్షలాది ప్రజలు కరువు కాటకాలకు లోనుగావలసిందే.

భూస్వామ్య విధానాన్ని రద్దుచేసి, దున్నేవారికి భూమిని పంచిపెట్టమని భారత రైతాంగం ఆందోళన చేస్తున్నది. భూస్వాములకు నష్టపరిహారం చెల్లించే పద్ధతిమీద కొన్ని భూసంస్కరణలను ప్రభుత్వం పాక్షికంగా అమలు జరిపింది.

భారత ఆర్థిక వ్యవస్థను నిర్మాణయుతంగా అభివృద్ధిచేయాలని భారత ప్రభుత్వం 1950 లో సంకల్పించింది. ప్రభుత్వంచే నియమించబడిన ప్లానింగుకమిషన్ ఒక ప్రణాళికను తయారుచేసింది. ఇదే ప్రథమ పంచవర్ష ప్రణాళిక. 1950–'51, 1955–'56 సంవత్సరాల మధ్య కాలంలో యిది అమలుపరచబడింది. ఈ ప్రణాళిక అంచనాలనుబట్టి వివిధ శాఖలకు యీ క్రింది మొత్తాలు కేటాయించబడ్డాయి.

| | ఖర్చు కోట్ల రూపా యల్లో | మొత్తంలో నూటికి ఎంత ? |
|---|---|---|
| 1. వ్యవసాయం, కమ్యూనిటీ ప్రాజెక్టులు, నీటి పారుదల, జలవిద్యుత్ ప్రాజెక్టులు | 795 | 38.5 |
| 2. విద్యుచ్ఛక్తి | 127 | 6.1 |
| 3. రవాణా | 497 | 24.1 |
| 4. పరిశ్రమలు | 173 | 8.4 |
| 5. సాంఘిక సంక్షేమం | 340 | 16.4 |
| 6. కాందిశీకుల సాయం | 85 | 4.1 |
| 7. ఇతరాలకు | 52 | 2.5 |
| | 2069 | 100.0 |

దీని ప్రకారం యీ ప్రణాళికా కాలంలో పరిశ్రమల క్రింద మొత్తం ఖర్చులో 100 కి 8.4 పాళ్ళు మాత్రమే కేటాయించబడింది. వ్యవసాయం, కమ్యూనిటీ ప్రాజెక్టులు, నీటిపారుదల సౌకర్యాలు కల్పించే ప్రాజెక్టులు, విద్యుదుత్పత్తిని అధికంచేయటానికే ముఖ్యంగా యీ ప్రణాళిక ఉద్దేశించబడింది. భారీపరిశ్రమల అభివృద్ధికి ఇందులో స్థానంలేదు.

ప్లానింగు కమిషన్ అంచనాల ప్రకారం యీ ప్రణాళిక సాధించిన విజయాలు ఇలా వున్నాయి : జాతీయ ఆదాయం నూటికి 18 వంతులు పెరిగింది; ఆహార పంటలు నూటికి 20 పాళ్ళు పెరిగాయి; పత్తి నూటికి 45 పాళ్ళు, నూనె గింజలు నూటికి 8 పాళ్ళు పెరిగాయి. 60 లక్షల ఎకరాలకు మేజరు ప్రాజెక్టుల ద్వారా నీటిపారుదల సౌకర్యాలు కలుగచేయబడ్డాయి; మైనరు ప్రాజెక్టుల ద్వారా కోటి ఎకరాలకు యీ వసతి కల్పించబడ్డది.

పారిశ్రామికోత్పత్తులు కూడా పెరిగాయి. 1951 లో కంటె, 1956 లో పారిశ్రామిక ఉత్పత్తులు నూటికి 22 పాళ్ళు పెరిగాయి.

1950–'51 లో 6,57,50,00,000 యూనిట్ల విద్యుత్ ఉత్పత్తి అయ్యేది. 1955–'56 నాటికి ఇది 1100,00,00,000 యూనిట్లకు పెరిగింది.

సిమెంటు 1950–'51 సంవత్సరంలో 27 లక్షల టన్నులు ఉత్పత్తి అయ్యేది. 1955–'56 కు ఇది 43 లక్షల టన్నులకు పెరిగింది. 462 కోట్ల గజాలనుంచి 685 కోట్ల గజాలకు వస్త్రోత్పత్తి పెరిగింది.

యంత్రపరికరాల పరిశ్రమలోను, విద్యుదుత్పాదక పరిశ్రమ లోను కొన్ని కొత్తరకాల పరికరాలు తయారైనాయి. రసాయన పదార్థాల ఉత్పత్తికూడా పెరిగింది. రోలర్లు, పంపులు, డీసెల్ ఇంజన్లు' బోరింగు పరికరాలు, ట్రాన్సుఫార్మర్లు, ఎలక్ట్రి మోటార్లు, మందులు, అద్దకపు రంగులు కొత్తగా భారతదేశంలో తయారు చేయబడ్డారు.

కాని, జాతీయార్థికవిధానంలో ప్రధానమార్పులు రాకపోవడం వల్ల ప్రజలకు వీటివల్ల అంతగా లాభం చేకూరలేదు. ప్రజల్లో అత్యధికుల జీవనప్రమాణం పెరగలేదు. వెనుకబడ్డ దేశాలకుండే ఆర్థికలక్షణాలు అన్నీ అలాగే ఉన్నాయి. కీలకపరిశ్రమ లేవీ అభి వృద్ధికాలేదు.

ఈ ప్రణాళికాకాలంలో జమీందారీ, జాగీర్దారీ విధానాలు – అంటే చట్టబద్ధ భూస్వామ్యవిధానాలు – అనేక రాష్ట్రాలలో రద్దు చేయబడ్డాయి. తత్ఫలితంగా ఫ్యూడల్ భూస్వామ్యవర్గాల దోపిడీ కొంతవరకు తగ్గింది. అయితే, ధనికరైతులకు తప్ప పేదరైతులకు, వ్యవసాయకూలీలకు లాభం చేకూరలేదు. రైతులమీద అభివృద్ధి పన్నులు, నీటితీరువాలు విపరీతంగా ఉన్నాయి. రైతుల అప్పులభారం క్రమంగా పెరుగుతూనేవుంది. వీటిని తగ్గించడానికి ఎట్టిచర్యలూ తీసుకోబడలేదు.

కార్మికులకుకూడా యీ ప్రణాళికవల్ల గలిగినమేలు ఏమీ లేదు. కార్మికులమీద యిదివరకుకంటె ఎక్కువ పనిభారం పడింది.

(రేషనలై జేషనువల్ల) నిరుద్యోగ సమస్య తీవ్రమవడానికి సాయ పడింది. జీతాలు తగ్గిపోయాయి.

గుత్తపెట్టుబడిదారులు మాత్రం బాగుపడ్డారు. ఈ ప్రణాళికా కాలంలో వారు అధికలాభాలు సంపాదించారు. సామాన్య ప్రజల జీవితం అభివృద్ధికాలేదు.

1955–'56 – 1960–'61 మధ్యకాలంలో అమలుపరచడానికి రెండవ పంచవర్ష ప్రణాళిక తయారుచేయబడింది. వివిధ రంగాలకు ఖర్చు చేసే సొమ్ము యీ విధంగా కేటాయించబడింది.

| | ఖర్చు. చేసే సొమ్ము కోట్ల రూపాయల్లో | మొత్తం ఖర్చులో నూటికి ఎంత ? |
|---|---|---|
| 1. వ్యవసాయం, కమ్యూనిటీ డెవలప్‌మెంటు | 568 | 11.8 |
| 2. ఇరిగేషన్, విద్యుదుత్పత్తి | 913 | 19.0 |
| 3. పరిశ్రమలు, గనులు | 890 | 18.5 |
| 4. రవాణా, రహదార్లు | 1,385 | 28.9 |
| 5. సాంఘిక సంక్షేమం | 945 | 19.7 |
| 6. ఇతర శాఖలకు | 99 | 2.1 |
| | 4,800 | 100.0 |

యీ ప్రణాళికకు కావలసిన ధనాన్ని యీ విధంగా సేకరించ దలచారు :

రాష్ట్ర, కేంద్రప్రభుత్వాల పన్నులవల్ల రు. 800 కోట్లు; ప్రజలనుండి అప్పుగా రు. 1200 కోట్లు; రైల్వేశాఖనుండి, ప్రావిడెంటు ఫండు, భీమా కంపెనీల నిలవలనుండి రు. 400 కోట్లు; విదేశాలనుండి అప్పులద్వారా రు.800కోట్లు; కొత్తగా నోట్లు అచ్చువేయడంవల్ల రు. 1200 కోట్లు, మొత్తం రు. 4,400 కోట్లు. మిగతా 400 కోట్ల రూపాయలు ఎలా సేకరించాల్లో యిదమిద్ధంగా చెప్పలేదు. తర్వాత ఆలోచించాలని చెప్పారు.

రెండవ పంచవర్ష ప్రణాళికయొక్క లక్ష్యాలలో మొదటిది, జాతీయాదాయాన్ని పెంచడం. మొదటి ప్రణాళిక పూర్తి అయేనాటికి మన జాతీయాదాయం సంవత్సరానికి రు. 10,800 కోట్లు. దీన్ని రు. 13,480 కోట్లకు - అంటే 100 కి 25 ఎక్కువ - పెంచడం రెండవ ప్రణాళికయొక్క లక్ష్యం. దీన్ని దేశ శ్రేయోభిలాషు లందరూ ఆహ్వానిస్తారు.

రెండవ లక్ష్యం దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధిచేయడం. దేశరక్షణకు సంబంధించిన పరిశ్రమలు, పరమాణుశక్తి, ఇనుము, ఉక్కు, లోహపరిశ్రమ, ఉక్కుయంత్రాల పోత, ఎలక్ట్రికల్ యంత్రాల నిర్మాణం, బొగ్గు, నూనెగనులు, మాంగనీస్, రైల్వేలు, ఓడల నిర్మాణం మొదలైన కీలక పరిశ్రమలన్నీ యికముందు ప్రభుత్వ యాజమాన్యంక్రిందనే నిర్మింపబడతాయి. భారతదేశంలో వలసవిధాన అవశేషాలు తొలగిపోవడానికి ప్రభుత్వరంగంలో నిర్మింపబడే యీ పరిశ్రమలు తోడ్పడతాయి. యంత్రసామగ్రికొరకు విదేశాలమీద ఆధారపడవలసినగతి తప్పుతుంది.

మూడవ లక్ష్యం ఉద్యోగావకాశాలను ఎక్కువచేయడం. ద్వితీయ ప్రణాళికాకాలంలో కొత్తగా 1 కోటిమందికి వృత్తులు ఏర్పడతాయని ప్లానింగ్ కమిషన్ తెలిపింది. కాని, రాబోయే ఐదేళ్ళలో 1 కోటిమంది యువకులు కొత్తగా రంగంలోకి వస్తారు. అందుచేత నిరుద్యోగసమస్య ప్రస్తుతమున్నట్లే ఉంటుంది.

ఆదాయాలలో ఇప్పుడున్న వ్యత్యాసాలను తగ్గించడం మరొక లక్ష్యం. కాని, కుటుంబాదాయాన్ని ఏడాదికి రు. 20 వేలకు పరిమితం చేయాలన్న సూచనను ప్లానింగ్ కమిషన్ నిరాకరించడంవల్ల, పార్లమెంటులో చర్చకువచ్చిన యిట్టి అనధికార తీర్మానాన్ని ప్రధాని నెహ్రూ తీవ్రంగా వ్యతిరేకించడంవల్ల ప్లానింగ్ కమిషన్ ప్రస్తుత అసమానతలను తగ్గించడానికి కృషిచేస్తుందనే విశ్వాసం ఎవరికీ లేదు.

దేశంలో అన్ని రాష్ట్రాల అభివృద్ధికి కృషిచేయడం మరొక లక్ష్యం. కాని, పారిశ్రామికంగా వెనుకబడిన ఆంధ్ర రాష్ట్రంలో

ఒక్క కొత్త పరిశ్రమనుకూడా స్థాపించే సూచన రెండవ ప్రణాళికలో కనిపించదు. తెలంగాణా విషయంకూడా యింతే.

ప్లానింగ్ కమిషన్, సాగుచేసేవారికీ ప్రభుత్వానికీ మధ్య ఉన్న దళారీలను తొలగించాలనీ, దున్నేవారికి భూమిపై హక్కు ఉండాలనీ అంగీకరించడం హర్షించదగ్గ విషయమే. భూస్వాముల భూమికి గరిష్ట పరిమితిని నిర్ణయించాలనికూడా రాష్ట్ర ప్రభుత్వాలను ఆదేశించింది. కాని, ఏడాదికి రు. 3600 నికరాదాయం వచ్చే భూమికన్న ఎక్కువ ఏ కుటుంబం చేతిలోనూ ఉండరాదని లోగడ ప్రణాళిక ముసాయిదా చేసిన సూచనను ప్రణాళికాసంఘం మార్చివేసింది. మూడు కుటుంబ కమతాలకంటే ఎక్కువభూమి ఉండరాదని మాత్రం అస్పష్టంగా చెప్పి, వాటి పరిమితిని నిర్ణయించే అధికారం రాష్ట్ర ప్రభుత్వాల కిచ్చింది. గత రెండు మూడేండ్లుగా భూస్వాములు చేస్తున్న బినామీ పంప కాలను, అన్యాక్రాంతాలను, అక్రమ ట్రాన్స్‌ఫర్లను పరిశీలించవలసి యుంటుందని ప్లానింగ్ కమిషన్ ఒకవైపు అంగీకరిస్తూనే, అట్టి అక్ర మాలను అరికట్టేందుకు స్పష్టమైన సూచనలేవీ చేయలేదు. కౌలు రేటును పంటలో ఐదో వంతుగా నిర్ణయించాలని ప్రణాళిక ముసాయి దాలో సూచింపబడింది. ఆరవ వంతువరకు ఉండాలని వ్యవసాయ సంస్కరణల ఉపసంఘం తన నివేదికలో సిఫార్సు చేసింది. కాని అంత్యదశలో ప్లానింగ్‌కమిషన్ నాల్గవవంతు లేక అయిదవవంతు ఉండా లని నిర్ణయించింది. లేదా శిస్తుకు ఎన్నిరెట్లుండాలో రాష్ట్రప్రభు త్వాలు నిర్ణయించుకోవచ్చునని చెప్పింది. భూస్వామ్యవర్గాల అభి మానులైన కొన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులు ఒత్తిడి తీసుకురావడం వల్లనే ప్లానింగ్ కమిషన్ ఈ విధంగా తన ముసాయిదాలోని అభి వృద్ధికర సూచనలను విడనాడింది.

ద్వితీయ ప్రణాళికకు కావలసిన ఆదాయాన్ని సేకరించే విష యంలో కూడ ప్రణాళికా సంఘం సంతృప్తికరమైన విధానం చేబట్ట లేదు. ఇప్పటికే పన్నుల భారంతో కృంగిపోతున్న ప్రజాసామాన్యంపై కోట్లాది రూపాయలు అదనపు పన్నులు విధించడానికి నిర్ణయించు

కుంది. రు. 1200 కోట్ల కరెన్సీ నోట్లను అదనంగా ముద్రించడంవల్ల దేశంలో ధరలు పెరిగిపోయే ప్రమాదం వుంది.

ఈ విధంగా ప్రణాళిక యొక్క లక్ష్యాలు ఆహ్వానించ దగ్గవే అయినా, కొత్త పరిశ్రమల స్థాపన (ముఖ్యంగా ప్రభుత్వ రంగంలో) దేశ ఆర్థికాభివృద్ధికి తోడ్పడేమాట వాస్తవమే అయినా, ప్రణాళికకు అవసరమయ్యే ద్రవ్యాన్ని సేకరించే విషయంలో అది ప్రజల సహకారాన్ని పొందలేకపోవచ్చు. వ్యవసాయ సంస్కరణలు కూడా పేద ప్రజల్లో ఉత్సాహం కలిగించేవిగా లేవు.

మన ఆర్థిక వ్యవస్థమీద బలమైనపట్టున్న బ్రిటిష్ పెట్టుబడుల యెడ ప్రణాళికాసంఘపు వైఖరి దేశశ్రేయస్సుకు భంగకరంగావుంది. బ్రిటిష్ పెట్టుబడుల అధీనంలోవున్న పరిశ్రమలను జాతీయం చేయాలని గాని, విదేశీపెట్టుబడులను అదుపులో వుంచడానికిగాని, ప్రణాళికలో ఎటువంటి కార్యక్రమమూ సూచించబడలేదు.

## వ్యవసాయ దినుసులు

దేశ వైశాల్యంలో నూటికి 62 వంతుల భూమి సాగుకు లాయక్కైనది. కాని, 43 వంతుల విస్తీర్ణంమాత్రమే ప్రస్తుతం సాగు చేయబడుతున్నది. 62,34,20,000 ఎకరాల భూమికి ప్రభుత్వ సర్వే లెక్కలు లభిస్తున్నాయి. వీటి ప్రకారం, యీ విస్తీర్ణంలో నూటికి 15 వంతుల భూమి అడవులకింద, 43 వంతులు సాగుకింద, 10 వంతులు పడావులుకింద, 16వంతులు సాగుకు లాయక్కైన బంజర్లకింద, 16 వంతులు కొండలు, గుట్టలకిందవుండి సాగుకు వీలుగాకుండా వుంది.

సాగుకిందవున్న భూమిలో నూటికి 17.8 వంతులకు మాత్రమే నీటి పారుదల సౌకర్యాలున్నాయి. 13.4వంతుల విస్తీర్ణంలో మాత్రం సంవత్సరంలో ఒకసారికిమించి పంటలు పండించబడుతున్నాయి.

వరి, గోధుమ, మొక్కజొన్న, పెసలు, మినుములవంటి ఆహారధాన్యాలు; జనుము, పత్తి, నూనెగింజలవంటి వ్యాపారపంటలు; తేయాకు, సుగంధద్రవ్యాలు పండించబడుతున్నాయి.

మొత్తం సాగవుతున్న భూమిలో నూటికి 82.3 వంతుల విస్తీర్ణంలో ఆహారపంటలు పండించబడుతున్నాయి. నూటికి 22.9 వంతుల విస్తీర్ణంలో వరి, 8 వంతుల విస్తీర్ణంలో గోధుమ, 2.5 వంతుల విస్తీర్ణంలో బార్లీ, 20.5 వంతుల విస్తీర్ణంలో మొక్కజొన్న, జొన్న, సజ్జ యిత్యాదులు, 24 వంతుల విస్తీర్ణంలో యితర పప్పు దినుసులు, యిత్యాదులవంటి అహార పదార్థాలు పండించబడుతున్నాయి.

14 వంతుల విస్తీర్ణంలో వాణిజ్య పంటలు, 3.7 వంతుల విస్తీర్ణంలో పశుగ్రాస సంబంధమైనవి పండించబడుతున్నాయి.

వేరుశనగ, తేయాకు మనదేశంలో పండించబడినంత మరే దేశమూ పండించటంలేదు. బియ్యం, జనుము, పొగాకు, పత్తి పంటల్లో మనదేశానికి ద్వితీయస్థానం.

ఏయేపంటలు, ఎచ్చట పండించబడుతున్నాయి, పంట భూముల విస్తీర్ణం ఇత్యాది వివరాలను పరిశీలించుదాం:

వరి : ఇది మనదేశ ఆహారపంటలో అతిముఖ్యమైనది. మొత్తం సాగుచేయబడుతున్న భూవిస్తీర్ణంలో దాదాపు నూటికి 30 వంతుల విస్తీర్ణంలో వరి పండించబడుతున్నది. 1955 వ సంవత్సరంలో 7,44,24,000 ఎకరాలల్లో 2 42,09 000 టన్నుల బియ్యాన్నిచ్చేంత ధాన్యం పండించబడింది. పంటలో అత్యధికభాగం మద్రాసు, ఆంధ్ర, బీహారు, పశ్చిమబెంగాలు, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, అస్సాం, బొంబాయి రాష్ట్రాలలో పండించబడుతున్నది.

గోధుమ : భారతదేశం ప్రపంచ గోధుమ పంటలో 8 వ వంతు పండిస్తూ, గోధుమ పండించే దేశాలలో మూడవదిగా ఎన్నికవుతూంది. 1954 వ సంవత్సరంలో 2,60,98,000 ఎకరాలలో 77,92,000 టన్నుల పంట పండించబడింది. బీహారు, బొంబాయి, మధ్యప్రదేశ్, పంజాబ్, ఉత్తరప్రదేశ్, మధ్యభారత్, రాజస్థాన్ రాష్ట్రాలు యీ పంటను పండించే రాష్ట్రాలలో ఎన్నదగినవి.

జొన్న: ఇది ముఖ్యంగా దక్కన్‌లో పండించబడుతున్నది. బొంబాయి, మద్రాసు, ఆంధ్ర, మధ్య ప్రదేశ్, హైద్రాబాదు-యీ పంటను పండించే రాష్ట్రాలలో ముఖ్యమైనవి.

మొక్క-జొన్న: ఈ పంట దేశమంతటా పండించబడుతున్నా, అత్యధికభాగం దేశ ఉత్తరభాగంలో పండించబడుతున్నది. బీహారు, పంజాబ్, ఉత్తర ప్రదేశ్, రాజస్థాన్, హిమాచల ప్రదేశ్ - ఇవి యీ పంటను పండించే ముఖ్యరాష్ట్రాలు.

పప్పు దినుసులు: పెసలు, మినుములు, ఉలవలు, శనగలు - ఇవి 1954 వ సంవత్సరంలో 1,88 93,000 ఎకరాలలో 35,51,000 టన్నులు పండించబడ్డాయి.

పప్పు దినుసులు పండించే రాష్ట్రాల్లో ముఖ్యమైనది ఉత్తర ప్రదేశ్. వీటినిపండించే ఇతర రాష్ట్రాలు: బీహారు, పంజాబు, మధ్య ప్రదేశ్, బొంబాయి, హైద్రాబాదు, మైసూరు, ఆంధ్ర.

పొగాకు: ప్రపంచపు మొత్తంపంటలో నూటికి 35 పాళ్లు పండిస్తూ, మనదేశం పొగాకు పండించే దేశాలలో ద్వితీయ స్థానాన్ని ఆక్రమిస్తున్నది. 1954వ సంవత్సరంలో 8,90,000 ఎకరాలలో 2,56,000 టన్నులు పండించబడింది.

దేశంలో పండే పొగాకులో నూటికి 50 పాళ్ళు వర్జీనియా పొగాకు. ఈపంటలో నూటికి 95 పాళ్లు ఒక్క-ఆంధ్రరాష్ట్రంలోని కృష్ణ, గుంటూరు, ఉభయగోదావరి జిల్లాలు నాలుగుమాత్రమే పండిస్తున్నాయి. బీహారు, ఉత్తరప్రదేశ్, పశ్చిమబెంగాలు, మదరాసు, మైసూరు, బొంబాయి రాష్ట్రాల్లోకూడ యీపంటపండించబడుతున్నది.

వర్జీనియా పొగాకు ఎక్కువగా ఇంగ్లండు, సోవియట్ యూనియన్, హాంకాంగ్, నెదర్లండ్సు, పాకిస్తాన్, చైనా దేశాలకు ఎగుమతి చేయబడుతున్నది.

చెరకు: 1954 వ సంవత్సరంలో 35,98,000 ఎకరాలలో 46,14,000 టన్నుల చెరకు పండించబడింది. దేశంలో పండేమొత్తం

చెరకుపంటలో నూటికి 50 పాళ్ళు ఒక్క ఉత్తరప్రదేశ్ లోనే పండించ బడుతున్నది. దక్షిణదేశంలో సగటున ఎకరానికి పండేపంట, ఉత్తర దేశంలో పండేపంటకు సుమారు నాలుగురెట్లు అధికంగా వుంటుంది.

బీహారు, బెంగాలు, తూర్పుపంజాబు, బొంబాయి, ఆంధ్ర, మదరాసు రాష్ట్రాల్లో చెరకు పెద్దఎత్తున పండించబడుతున్నది.

దేశంలో పండేపంటలో సుమారు నూటికి 25 పాళ్ళు పంచ దార చేయడానికి వినియోగించబడుతున్నది. మిగతాది బెల్లం చేయ డానికి వినియోగించబడుతున్నది.

జనుము: దేశ విభజనకు పూర్వం, భారతదేశం జనపనార విస్తారంగా ఎగుమతిచేస్తూ వుండేది. బెంగాలులో జనుము అధికంగా పండేప్రాంతం పాకిస్తానుకిందకు పోవటంచేత నేడు తానే దిగుమతి చేసు కుంటున్నది.

గంగ, బ్రహ్మపుత్రానదుల డెల్టాప్రాంతంలో (బెంగాలు, అస్సాం, బీహారు, ఒరిస్సా) యీ పంటపండుతున్నది.

ప్రత్తి: మన దేశంలో ఎక్కువగా పండించబడుతున్న ప్రత్తి "పొట్టిపింజ" ప్రత్తి – నాసిరకం. ఇది సన్నని బట్టలు నేసేందుకు పనికి రాదు.

1954 వ సంవత్సరంలో 1,70,27,000 ఎకరాలలో 39,35,000 బేళ్ళ ప్రత్తి పండించబడింది. బొంబాయి, మధ్యప్రదేశ్, బీరారు, మదరాసు, ఆంధ్ర, ఉత్తర ప్రదేశ్, హైదరాబాదు, మధ్యభారత్, రాజస్థాన్, మైసూరురాష్ట్రాలలో పండించబడుతున్నది.

నూనె గింజలు: ప్రపంచంలో నూనె గింజలు పండించే ముఖ్య దేశాలలో భారతదేశంకూడా ఒకటి. విదేశాలకు యివి ప్రతియేటా పెద్ద ఎత్తున యెగుమతి చేయబడుతున్నాయి.

మన దేశంలో పైరుచేయబడే నూనె గింజల్లో ప్రధానమైనవి అవిశ గింజలు (Linseed), వేరుశనగ, నువ్వులు, ఆముదాలు. 1954 వ సంవత్సరంలో 2,71,11,000 ఎకరాలలో 53,97,000 టన్నుల నూనె గింజలు పండించబడ్డాయి.

ప్రపంచపు అవిశ గింజల పంటలో భారత దేశానిది ద్వితీయ స్థానం !

మధ్యప్రదేశ్, బీహారు, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్, బొంబాయి, పశ్చిమ బెంగాలు రాష్ట్రాలలో యివి పైరుచేయ బడుతున్నాయి.

వేరుశనగ : భారతదేశం పండించినంత వేరుశనగ పంటను, ప్రపంచంలో మరే దేశమూ పండించటంలేదు !

1955 వ సంవత్సరంలో 1,26,47,000 ఎకరాల్లో 38,23,000 టన్నుల పంట పండింది.

ఆంధ్ర, మదరాసు, బొంబాయి, హైదరాబాదు రాష్ట్రాలలో యీపంట ఎక్కువగా పండించబడుతున్నది.

నువ్వులు : ఈ పంటలో కూడా భారతదేశానిదే ప్రథమ స్థానం ! ఉత్తర ప్రదేశ్ లో విరివిగా పండించబడుతున్నది.

ఆముదాలు : ప్రపంచ పంటలో దాదాపు నూటికి 80 పాళ్ళు ఒక్క భారతదేశమే పండిస్తున్నది. మద్రాసు, బొంబాయి, హైదరాబాదు, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో పెద్ద ఎత్తున పండించబడుతున్నది.

తేయాకు : మనదేశం పండించినంత తేయాకును ప్రపంచంలో మరే దేశమూ పండించటంలేదు. ఈ పంట అస్సాం, పశ్చిమబెంగాలు, బీహారు, మదరాసు, తూర్పు పంజాబు, తిరువాన్కూర్ - కొచ్చిన్ రాష్ట్రాలలో పండించబడుతున్నది.

దేశం మొత్తం పంటలో నూటికి 50 వంతులు ఒక్క అస్సాం రాష్ట్రంలోనే పండించబడుతున్నది. తర్వాత చెప్పదగిన రాష్ట్రం పశ్చిమ బెంగాలు.

1950 లో 7,77,000 ఎకరాల్లో 60,70,00,000 పౌన్ల తేయాకు పండించబడింది.

మన తేయాకు పంటమీద బ్రిటిష్ పెట్టుబడిదారుల పెత్తనం చాల అధికం. 1948 నాటికి ప్రభుత్వ అంచనాలప్రకారం మొత్తం దేశంలో వున్న తోటలలో నూటికి 60 తోటలు బ్రిటిష్ పెట్టుబడిదారులచేత నిర్వహించబడుతున్నాయి.

తేయాకు ఎగుమతిలో మనదేశానిదే అగ్రతాంబూలం! మన ఎగుమతుల్లో నూటికి 60 పాళ్ళు బ్రిటన్‌కి పోతున్నాయి. 1949 వ సంవత్సరంలో ఎగుమతయిన తేయాకు 42,55,18,000 పౌన్లలో ఒక్క బ్రిటన్‌కి 28,78,24,000 పౌనులు పంపబడింది!

కాఫీ: దక్షిణ భారతదేశంలో కాఫీ ఎక్కువగా పండించబడుతున్నది. ఈ ప్రాంతంలోని ఏడువేల కాఫీ తోటలలో, ఒక్క మైసూరులోనే 4,600 ఉన్నాయి. మొత్తం భారతదేశ ఉత్పత్తిలో నూటికి 50 పాళ్ళు యీ రాష్ట్రంలోనే పండించబడుతున్నది.

ఉత్తర ఆర్కాటు, తిరునల్వేలి, కూర్గు ప్రాంతంలో పెద్దఎత్తున కాఫీ పండించబడుతున్నది.

మన కాఫీ ఎగుమతులలో చాలభాగం బ్రిటన్, ఫ్రాన్సు, ఆస్ట్రేలియా దేశాలకు పోతూంది.

రబ్బరు: మన దేశంలో సాలుకు సుమారు 35,000 టన్నుల రబ్బరు ఉత్పత్తి చేయబడుతున్నది. ఇందులో దాదాపు సగం నాసిరకం సరుకు!

ముఖ్యంగా మద్రాసు, కూర్గు, మైసూరు, తిరువాన్కూరు-కొచ్చిన్ రాష్ట్రాలలో రబ్బరుతోటలు పెంచబడుతున్నాయి.

ఈ తోటలలో 30 వేలమంది కార్మికులు పనిచేస్తున్నారు.

మన రబ్బరు ఎగుమతుల్లో దాదాపు నూటికి 30–35 పాళ్లు బ్రిటన్‌కే పంపబడుతున్నాయి.

లక్క: ప్రపంచ ఉత్పత్తిలో నూటికి 90 పాళ్ళు ఒక్క భారతదేశమే ఉత్పత్తి చేస్తూంది.

ఛోటానాగపూరు, ఒరిస్సా, మధ్యప్రదేశ్‌లు ముఖ్య ఉత్పత్తి కేంద్రాలు. సాలుకు 50,000 టన్నులు ఉత్పత్తి చేయబడుతున్నది.

ఇది అమెరికా, బ్రిటన్, జర్మనీ, హాలెండు, జపాన్ దేశాలకు ఎగుమతి చేయబడుతున్నది. మొత్తం ఎగుమతులలో, ఒక్క అమెరికాయే నూటికి 30 పాళ్ళు తీసుకుంటున్నది.

## ఖ ని జా లు

భారతదేశంలో మాంగనీసు, బాక్సైట్, మాగ్నసైట్, స్టీటైట్, సిలికా, మోనజైట్, రాక్షసిబొగ్గు, ఇనుము, సున్నపురాయి, బంగారం, అల్యూమినియం, రాగి, ఆంటిమొనీ, జిప్సం, పైరైటిస్, బైరైటిస్ మొదలైన ఖనిజాలు లభ్యమవుతాయి. లిగ్నైట్, మైకా, జిర్కాన్ (Zircon) ఖనిజాలు మన దేశంలో లభించినంత మరే దేశంలోనూ దొరకవు.

నికిల్, తగరం, తుత్తునాగం ఖనిజాలుమాత్రం మన దేశంలో ఇంతవరకూ దొరకటంలేదు. ఈ గనులకొరకు పరిశోధనలు జరుగుతున్నాయి. సోవియట్ నిపుణుల సహాయంతో వజ్రాలు, పెట్రోలు గనులు కనుక్కొనేందుకు భారత ప్రభుత్వం కృషిచేస్తున్నది.

దేశంలోని వివిధగనులలో సుమారు 4,60,000 మంది కార్మికులు పనిచేస్తున్నారు. వీరిలో ఒక్క బొగ్గుగనులలోనే 3,50,000 మంది పనిచేస్తున్నారు.

దేశంలో విరివిగా లభించే అనేక ఖనిజాలను వినియోగించుకోగలిగిన పరిశ్రమలు మనకు లేకపోవటంచేత, కారుచౌకగా, విదేశాలకు ఎగుమతి చేయవలసి వస్తున్నది.

దేశంలో లభించే కొన్ని ముఖ్య ఖనిజాలు ఎచ్చట లభించేదీ చూద్దాం:

మాంగనీసు: ఈ ఖనిజోత్పత్తిలో భారతదేశానిది మూడవ స్థానం. మొదటి స్థానం సోవియట్ యూనియన్‌ది. మధ్యప్రదేశ్ (దేశంలో లభించే ఖనిజ సంపదలో అత్యధికభాగం యీ రాష్ట్రంలోనే లభిస్తుంది), ఆంధ్ర, ఒరిస్సా, బొంబాయి, మైసూరు రాష్ట్రాలలో మాంగనీసు లభిస్తుంది.

తీయబడిన ఖనిజమంతా బ్రిటన్, బెల్జియం, ఫ్రాన్సు, అమెరికా దేశాలకు, ప్రధానంగా ఎగుమతి చేయబడుతూంది.

రాగి: ఇది సింగ్‌భమ్, నెల్లూరు గనులలో ప్రస్తుతం తీయబడుతున్నది. దేశంలోని పలుప్రాంతాలలో యీ ఖనిజమున్నట్లు

భూగర్భ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ప్రస్తుతపు టుత్పత్తి చాలక మన దేశం అమెరికా, కెనడా, జపాన్ దేశాలనుండి రాగిని దిగుమతి చేసుకుంటున్నది.

బంగారం: దేశంలో దొరికే ఖనిజంలో నూటికి 90 పాళ్ళు మైసూరులోని కోలారుగనుల్లో లభిస్తుంది. హైదరాబాదు, మద్రాసు, పంజాబు, ఉత్తరప్రదేశ్, బీహారు, ఒరిస్సా రాష్ట్రాలలోకూడా లభిస్తుంది.

మైకా: భారతదేశం మైకా ఉత్పత్తిలో ప్రముఖస్థానం వహిస్తున్నది. ప్రపంచపు టుత్పత్తిలో మూడవ భాగాన్ని ఉత్పత్తి చేస్తుంది.

దేశంలో లభించే ఖనిజంలో అత్యధికభాగం బీహారు, ఆంధ్ర రాష్ట్రాలలో ఉంది.

దొరికిన ఖనిజమంతా విదేశాలకు ఎగుమతిచేయబడుతున్నది. ఒక్క అమెరికా మన ఉత్పత్తిలో నూటికి 50 పాళ్ళు కొంటున్నది. బ్రిటన్, పశ్చిమ జర్మనీ, ఫ్రాన్సు దేశాలకుకూడా ఎగుమతిచేయబడుతూంది.

క్రోమైట్: మైసూరు, బీహారు రాష్ట్రాలలో యిది లభిస్తుంది. ఒక్క మైసూరులోనే దేశంలో లభించే ఖనిజంలో నూటికి 35 పాళ్లు ఉంది.

ఉత్పత్తి మొత్తం బ్రిటన్, నార్వే, స్వీడన్, జర్మనీ, అమెరికా దేశాలకు ఎగుమతిచేయబడుతూంది.

ఇనుము: బీహారు, ఒరిస్సా, మధ్య భారత్, మైసూరు, మద్రాసు రాష్ట్రాలలో లభిస్తుంది.

రాక్షసిబొగ్గు: మన దేశంలో పెద్దమెత్తున త్రవ్వబడుతున్న ఖనిజాలలో మొదట చెప్పదగింది రాక్షసిబొగ్గు.

పశ్చిమబెంగాలు, బీహారు, ఒరిస్సా, మధ్యప్రదేశ్, హైదరాబాదు రాష్ట్రాలలో యిది విరివిగా దొరుకుతుంది.

దేశంలోని బొగ్గు కంపెనీలలో, మూడింట రెండువంతులు బ్రిటిష్ పెట్టుబడిదారుల చేతుల్లో ఉన్నాయి.

పెట్రోలు: ఇదిఅస్సాంరాష్ట్రంలోదొరుకుతుంది. ఇచ్చటదొరికే పెట్రోలు దేశావసరాలకు చాలకపోవటంవల్ల ఇరాన్, సౌదీ అరేబియా, అమెరికా, సుమత్రా, సింగపూరులనుండి దిగుమతి చేయబడుతున్నది.

## ప రి శ్ర మ లు

బ్రిటిషు సామ్రాజ్యవాద పెట్టుబడులు భారతీయ పరిశ్రమల నభివృద్ధి కానీయలేదని పైన చూశాం. తత్ఫలితంగా బట్టలు, పంచదార, సబ్బులు, అగ్గిపెట్టెలు, ఉప్పు ఇత్యాది నిత్యావసర వస్తువులను మాత్రం దేశానికి సరిపడే పరిమాణంలో మన పరిశ్రమలు సప్లయి చేయగలుగుతున్నాయి. కాని పారిశ్రామికాభివృద్ధికి అత్యావశ్యకమయిన ఉక్కు ప్రస్తుతం కావలసినదానిలో కొంతమాత్రమే సప్లయి అవుతూంది. భారీ యంత్ర పరికరాల ఉత్పత్తి నామమాత్రంగానే ఉండి, దేశ అవసరాలను ఏ విధంగానూ తీర్చలేకుండా ఉంది.

ఉన్న పరిశ్రమలలో జనుము, తేయాకు తోటలు, బంగారం, బొగ్గు గనులు, ఇంజనీరింగు, ఉన్ని పరిశ్రమ, కాన్పూరు తోళ్ళపరిశ్రమ ఇవి ప్రధానంగా బ్రిటిష్ పెట్టుబడిదారుల చేతుల్లో ఉన్నాయి.

మన పరిశ్రమలలో అభివృద్ధిచెందిన పరిశ్రమలుగా చెప్పదగినవి జౌళి, పంచదార, జనపనార, సిమెంటు పరిశ్రమలు మాత్రమే.

1948 వ సంవత్సరానికి దేశంలో సంవత్సరకాలమూ పనిచేసే ఫ్యాక్టరీలు 13,120; కొన్ని నెలలు మాత్రమే (సీజనల్) పనిచేసే ఫ్యాక్టరీలు 2,786 ఉన్నాయి. ఈ ఫ్యాక్టరీల్లో సుమారు 25 లక్షల మంది కార్మికులు పనిచేస్తున్నారు. జాతీయాదాయంలో పారిశ్రామిక ఆదాయం నూటికి 6.6 పాళ్ళుమాత్రమేనంటే పారిశ్రామికంగా మన దేశం ఎంత వెనకబడివుందో వ్యక్తమవుతుంది.

బట్టల పరిశ్రమ: ఇది భారత దేశంలో మొట్టమొదట ప్రారంభించబడిన పరిశ్రమ. మొట్టమొదటి మిల్లు 1818 సంవత్సరంలో

కలకత్తాలో స్థాపించబడింది. 1950 కల్లా మిల్లులసంఖ్య 425 కు పెరిగింది. ఇప్పటికి భారతదేశం బట్టల నుత్పత్తిచేసే దేశాలలో ఒక గణనీయమైన దేశంగా అభివృద్ధిచెందింది.

బట్టల పరిశ్రమకు బొంబాయి ప్రధాన కేంద్రం. తర్వాత చెప్పదగినవి అహమ్మదాబాద్, షోలాపూరు, కాన్పూరు, నాగపూరు, ఇండోరు, మధుర, కోయంబత్తూరు.

1954-'55 సంవత్సరంలో 158 కోట్ల పౌనుల నూలు, 504 కోట్ల గజాల వస్త్రాలు తయారయినాయి. మన దేశంలో తయారైన బట్టలకు (ముతకరకం) ఇంగ్లండు, ఏడెన్, పాకిస్తాన్, సింగపూరు, తూర్పు ఆఫ్రికాలలో మంచి డిమాండు వుంది.

జనపనార పరిశ్రమ: బట్టల పరిశ్రమ తర్వాత చెప్పదగిన పరిశ్రమ ఇదే! ఈ పరిశ్రమ ప్రధానంగా, బ్రిటిష్ పెట్టుబడిదారుల చేతుల్లో ఉంది. బెంగాలు యీ పరిశ్రమకు కేంద్రం.

మొట్టమొదటి ఫ్యాక్టరీ 1828 లో బ్రిటిష్ పెట్టుబడితో ప్రారంభించబడింది.

ఈ మిల్లులో తయారయిన గోనెసంచులు, పట్టాలు అమెరికా, ఇంగ్లండు, జర్మనీ, ఫ్రాన్సు, అర్జెంటైనా, క్యూబా, చైనా దేశాలకు ఎగుమతి అవుతున్నాయి.

పంచదార పరిశ్రమ: భారతదేశం ఉత్పత్తి చేస్తున్నంత పంచదారను మరే దేశమూ ఉత్పత్తి చేయటంలేదు.

1953 లో 170 పంచదార మిల్లులున్నాయి. నూటికి 90 మిల్లులు ఉత్తరప్రదేశ్, బీహారు, ఆంధ్ర, బొంబాయి రాష్ట్రాలలో ఉన్నాయి. 1954 లో 10,08 వేల టన్నుల పంచదార ఉత్పత్తి చేయబడింది.

పట్టుపరిశ్రమ: 16 వ శతాబ్దంలో పట్టుపరిశ్రమలో భారత దేశానికి పెట్టింది పేరు. ఇటలీ, జపానులనుండి దిగుమతయిన బట్టలతో పోటీచేయలేక క్రమంగా మన పరిశ్రమ నీరసించిపోయింది.

మైసూరు, మద్రాసురాష్ట్రంలోని కోయంబత్తూరుజిల్లా, పశ్చిమ బెంగాలు, జమ్ము-కాశ్మీర్, తూర్పు పంజాబు రాష్ట్రాలలో ముడిపట్టు ఉత్పత్తి అవుతున్నది.

తూర్పు పంజాబు, ఉత్తర ప్రదేశ్, పశ్చిమ బెంగాలు, మధ్య ప్రదేశ్, బొంబాయి, మైసూరు, మదరాసు, కాశ్మీరు రాష్ట్రాలలోని కొన్ని ముఖ్య పట్టణాలలో పట్టుబట్టల నేత కొనసాగుతున్నది. మైసూరులోని బెంగుళూరు ఒక ముఖ్య కేంద్రం.

ఉన్ని పరిశ్రమ: మనదేశంలో దొరికే ఉన్ని యూరప్, ఆస్ట్రేలియాల ఉన్ని కంటె నాసిరకం. ఉత్తరభారతదేశమే ఉన్ని ఉత్పత్తికి ప్రధాన కేంద్రం.

మన దేశంలో తయారైన కంబళ్ళు, తివాచీలు, శాలువలు బ్రిటన్, అమెరికా, కెనడా దేశాలకు ఎగుమతి చేయబడుతున్నాయి.

ఉక్కు పరిశ్రమ: దేశంలో ప్రస్తుతం రెండు ఉక్కు కర్మాగారాలు పని చేస్తున్నాయి. ఒకటి జెంషెడ్‌పూరులో (టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ), రెండవది బరనుపూరు (ఇండియన్ ఐరన్ అండ్ స్టీల్ కార్పొరేషన్).

భారత ప్రభుత్వం మరిమూడు కొత్త ఉక్కు కర్మాగారాలను నిర్మించబూనుకున్నది.

ఒరిస్సాలోని రూర్కెలాలో ఫ్యాక్టరీ నిర్మించడానికి ఒక జర్మను కంపెనీతో ప్రభుత్వం ఒడంబడిక చేసుకున్నది.

మధ్యప్రదేశ్ లోని భిలాయ్‌లో ఫ్యాక్టరీ నిర్మించడానికి సోవియట్‌తో ఒప్పందం చేసుకున్నది.

పశ్చిమ బెంగాలులోని దుర్గాపూరులో ఫ్యాక్టరీ నిర్మించడానికి ఒక బ్రిటిష్ కంపెనీతో ఒప్పందం చేసుకున్నది.

1954–'55 లో భారత ఇనుము–ఉక్కు పరిశ్రమ 1733 వేల టన్నుల ఇనుము, 1243 వేల టన్నుల ఉక్కు తయారుచేసింది. ఇపుడు దేశంలో ఉత్పత్తి అవుతున్న ఉక్కు దేశావసరాలకు చాలకపోవడం చేత ఇతర దేశాల నుండి దిగుమతి చేసుకోవలసి వస్తున్నది.

కాగితం పరిశ్రమ: మొదటి కాగితపుమిల్లు 1867 లో హుగ్లీ నది ఒడ్డున ప్రారంభించబడింది. 1952 లో దేశంలో 18 కాగితపు మిల్లు లున్నాయి. వీటిలో 16,000 మంది కార్మికులు పనిచేస్తున్నారు.

బెంగాలు మిల్లులు దేశంలోని మిల్లు లన్నింటిలోకి చాల పెద్దవి.

1954 లో భారతదేశంలో మొట్టమొదటి న్యూస్ ప్రింట్ (పత్రికలకు ఉపయోగించేది) కాగితం తయారుచేసే పేపరుమిల్లు పని చేయడం ప్రారంభించింది. ఇది మధ్య ప్రదేశ్ లో వుంది. పేరు నేపా పేపరు మిల్లు.

1954 లో 169 వేల టన్నుల కాగితాల అట్టలు ఉత్పత్తిచేయ బడ్డాయి.

వీటి ఉత్పత్తి దేశావసరాలకు చాలక, ఇంగ్లండు, నార్వే, స్వీడన్, జర్మనీ, సోవియట్ దేశాలనుండి పలురకాల కాగితం దిగుమతి చేయబడుతున్నది.

రసాయన పరిశ్రమ: దేశంలో 35 రసాయన పారిశ్రామిక కేంద్రా లున్నాయి.

వీటి ఉత్పత్తి దేశావసరాలకు చాలక, బ్రిటన్, జర్మనీ, అమెరికా, ఇటలీ, ఫ్రాన్సు, జపాన్ దేశాలనుండి పలురకాల రసాయన పదార్థాలు దిగుమతి చేయబడుతున్నాయి.

గాజు పరిశ్రమ: ప్రస్తుతం దేశంలో 131 గాజు ఫ్యాక్టరీలు వున్నాయి. ఇవిగాక స్త్రీలు చేతులకు తొడిగే గాజులు తయారుచేసే ఫ్యాక్టరీలు 93 వున్నాయి.

ఈ ఫ్యాక్టరీలలో అధికభాగం ఉత్తరప్రదేశ్ (24), పశ్చిమ బెంగాలు (34), బొంబాయి (32), బీహారు (8), తూర్పు పంజాబు (7), మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో వున్నాయి.

గాజు సామానులు తయారుచేసే ఫ్యాక్టరీలు ముఖ్యంగా బొంబాయి, ఉత్తరప్రదేశ్, పశ్చిమబెంగాలు రాష్ట్రాలలో వున్నాయి.

అద్దాలను (Glass-sheets) తయారుచేసే ఫ్యాక్టరీ ఒకటి మొరాదాబాదుజిల్లా (ఉత్తరప్రదేశ్) బాహ్‌జాయిలో వుంది.

1954–'55 లో 1,89,80,000 టన్నుల అద్దాలు (Glass-sheets) తయారు చేయబడ్డాయి.

అల్యూమినియం పరిశ్రమ: ఈ లోహం తయారీకి కావలసిన బాక్సైటు – మేలురకం – మన దేశంలో విరివిగా దొరుకుతుంది.

తిరువాన్కూరులోని అల్వాయి, పశ్చిమ బెంగాలులోని బేలూరు, అసన్‌సోల్, బీహారులోని మురీలు యీ పరిశ్రమకు కేంద్రాలు.

కాని మన దేశం యింకా అల్యూమినియంను దిగుమతి చేసుకో వలసివస్తున్నది.

నౌకా నిర్మాణం: దేశంలో ఒక్క నౌకా నిర్మాణకేంద్రం మాత్రమే ఆంధ్రలోని విశాఖపట్టణంలో వుంది. కలకత్తాలో చిన్నరకం ఓడల నిర్మాణానికి అవకాశం వుంది. బొంబాయిరాష్ట్రం లోని భట్‌కల్‌లో ఒక నౌకానిర్మాణ కేంద్రం నిర్మించబడ నున్నది.

నౌకా నిర్మాణానికి అవసరమయిన ముఖ్య యంత్రభాగాలు, విదేశాలనుండి దిగుమతి చేయబడుతున్నాయి. వీటిని ఉత్పత్తి చేయ గలిగిన పరిశ్రమ మనకు లేదు.

విమాన నిర్మాణం: బెంగుళూరులో హిందుస్థాన్ ఎయిర్ క్రాఫ్టు ఫ్యాక్టరీ అని ఒకటి వుంది. ఇది ప్రభుత్వ యాజమాన్యాన నడుపబడుతోంది.

విమాన నిర్మాణానికి కావలసిన యంత్రభాగాలన్నిటినీ బ్రిటిష్ కంపెనీలనుండి దిగుమతిచేసి, వాటితో విమానాలను తయారు చేస్తున్నారు. సాంకేతిక నిపుణులంతా ఇంగ్లీషువారే!

మోటారుకార్ల నిర్మాణం: ఇది పై పరిశ్రమవలె యంత్ర భాగాలను విదేశాలనుండి తెప్పించి, వాటిని సమకూర్చి (Assemble) కార్లను తయారుచేస్తున్నారు. కొన్ని భాగాలుమాత్రం మన దేశంలో తయారు చేయబడుతున్నాయి. ఈ పరిశ్రమ విదేశీయ పెట్టుబడిదారుల

దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి వుండటంవల్ల, అభివృద్ధి గొర్రె తోకలాగ వుంది.

చిత్తరంజన్ రైల్లు ఇంజన్ల కర్మాగారం: ఇది బెంగాలులో వున్నది. 1950 నుండి పనిచేస్తున్నది. రైలు ఇంజన్లు చేయడాని కవసరమయినభాగాలలో నూటికి 70 యిక్కడే తయారవుతున్నాయి. మిగతా భాగాలను విదేశాల నుండి దిగుమతిచేసి, వాటితో యిక్కడ ఇంజన్లను నిర్మిస్తారు. ఈ కార్మాగారంలో 1954-'55వ సంవత్సరంలో 98 రైలింజన్లు తయారుచేయబడ్డాయి. ఈ సంస్థ ప్రభుత్వ యాజమాన్యాన నడుస్తున్నది.

ఇదికాక తాతా ఇంజనీరింగు అండ్ లోకోమోటివ్ లిమిటెడ్ అని మరొక కర్మాగారం వున్నది. దీనిలో మీటరుగేజి రైలింజన్లు తయారవుతాయి.

పెరంబూరు రైలు పెట్టెల కర్మాగారం: ఇది మదరాసు ప్రక్కనున్న పెరంబూరులో వుంది. ఈ కార్మాగారం ఆసియాలోకెల్ల పెద్దది. ఇది సాలుకు 300-350 రైలుపెట్టెలను తయారుచేయగలదు. ఇదీ ప్రభుత్వంచేత నిర్వహించబడుతున్న సంస్థే. ఉక్కుతో రైలుపెట్టెలు తయారు చేస్తారు.

యంత్ర పరికరాలను తయారుచేసే హిందుస్తాన్ మెషిన్‌టూల్ ఫ్యాక్టరీ బెంగుళూరులో వున్నది. 1955, అక్టోబరునుండి ఉత్పత్తి చేస్తున్నది.

రూప్‌నరికపూరులోని హిందుస్థాన్ కేబుల్సుఫ్యాక్టరీలో టెలిగ్రాఫ్‌తీగలు తయారు చేయబడుతున్నాయి. బెంగుళూరు దగ్గరనున్న దుర్వానీనగరులో టెలిఫోన్లు తయారు చేసే కర్మాగారం ఒకటి 1950 లో స్థాపించబడింది.

సింద్రీలో ఎరువులు తయారుచేసే కర్మాగారం వుంది. ఇది 1955 లో 3,21,364 టన్నుల ఎరువును (అమోనియం సల్ఫేట్) ఉత్పత్తిచేసింది. ఇవన్నీ ప్రభుత్వంచేత నడుపబడుతున్న పారిశ్రామిక సంస్థలే!

సిమెంటు : 1950-'51 సంవత్సరానికి దేశంలో 19 సిమెంటు ఫ్యాక్టరీలు పనిచేస్తున్నాయి. వీటిలో బీహారులో 5, మధ్యప్రదేశ్‌లో 3, ఆంధ్రలో 2, మదరాసులో 2, తూర్పు పంజాబు, పశ్చిమ బెంగాలు, మైసూరు, హైద్రాబాదు, సౌరాష్ట్ర, గ్వాలియర్, తిరువాన్కూరు-కొచ్చిన్ రాష్ట్రాలలో ఒక్కొక్కటి చొప్పున వున్నాయి. 1954 వ సంవత్సరంలో వుత్పత్తి 44,14,000 టన్నులు. దేశ వుత్పత్తి దాదాపు అంతా దేశీయ అవసరాలకే వినియోగించబడుతూంది. ఇదిచాలక విదేశాలనుండి దిగుమతిచేయ బడుతున్నది.

అగ్గిపెట్టెల పరిశ్రమ : ప్రస్తుతం దేశంలో 107 అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ లున్నాయి. వీటిలో 16,000 మంది కార్మికులు పని చేస్తున్నారు.

హైదరాబాదు, గ్వాలియర్, అస్సాం, మధ్యప్రదేశ్, మైసూరు, మద్రాసు, బెంగాలు, తిరువాన్కూరు-కొచ్చిన్ రాష్ట్రాల్లో యీ పరిశ్రమ వుంది.

1954-'55 వ సంవత్సరంలో 3,11,00,000 టన్నుల సిమెంటు తయారుచేయబడింది.

## ర హ దా ర్లు

దేశంలోవున్న రహదారీ సౌకర్యాలను నాలుగు భాగాలుగా చెప్పవచ్చు : (1) రైలుమార్గాలు, (2) రోడ్లు, (3) నదులు, కాల్వలు; (4) విమానమార్గాలు.

రైలుమార్గాలు : దేశంలో 34 వేల మైళ్ళ రైలుమార్గా లున్నాయి. దేశ విస్తీర్ణంతో పోల్చిచూస్తే, యీ రైలుమార్గం పొడవు అల్పం. కొన్ని విదేశాలతో పోల్చిచూస్తే మనం ఎంత వెనుకబడి వుందీ అర్థమవుతుంది !

అమెరికాలో ప్రతి నూరు చదరపుమైళ్ళకూ 8.42 మైళ్ళు, బ్రిటన్‌లో 21.8 మైళ్లు రైలుమార్గం వుంటే, మన దేశంలో 2.2 మైళ్లు మాత్రమే ఉంది.

1951-'52 వ సంవత్సరంలో 123,20,73,000 మంది ప్రయాణీకులు రైళ్ళలో ప్రయాణంచేశారు. 9,80,25,000 టన్నుల సరుకు రవాణా చేయబడింది,

రైల్వేలన్నీ ప్రభుత్వ యాజమాన్యంలో వున్నాయి.

పరిపాలనా సౌలభ్యం కోసం ఈ రైలు మార్గాలను 6 ప్రాంతాలుగా విభజించారు: 1. ఉత్తర రైల్వే; 2. ఈశాన్య రైల్వే; 3. తూర్పు రైల్వే; 4. పశ్చిమ రైల్వే; 5. మధ్య రైల్వే; 6. దక్షిణ రైల్వే.

మన రాష్ట్రంలోని రైలుమార్గాలు దక్షిణ రైల్వేలో చేరి ఉన్నాయి.

రోడ్లు: దేశంలో మొత్తం 2,50,000 మైళ్ళ రోడ్లున్నాయి. ఇందులో 67,000 మైళ్లు మాత్రమే కంకర, తారు, సిమెంటు రోడ్లు. మిగతావి మట్టిరోడ్లు.

జలమార్గాలు: మన దేశంలోని నదులు మొత్తం నాలుగువేల మైళ్ళమేర నౌకాయానానికి ఉపయోగపడుతున్నాయి (చిన్న పడవలు తిరగడానికి మాత్రమే). వివిధ నదుల కాల్వలు, గంగ, కృష్ణ, గోదావరీ ఇత్యాదినదుల కాల్వలు కూడా ఇందుకు ఉపకరిస్తున్నాయి.

ఇప్పటికున్న ఈ రవాణా సౌకర్యం దేశావసరాలకు సరిపడినంతగా లేదు.

విమాన మార్గాలు: ఇవి మనదేశంలో తగినంత అభివృద్ధి చెందలేదు. ప్రస్తుతం నడుపబడుతున్న సర్వీసులన్నీ నష్టంమీదే నడుస్తున్నాయి.

కలకత్తా, ఢిల్లీ, బొంబాయి - ఈ మూడు విమాన కేంద్రాలు చాలపెద్దవి, విశిష్టమైనవి.

ఇవికాక 75 విమానాశ్రయాలున్నాయి (1952-53).

1952 వ సంవత్సరంలో 4,30,000 మంది విమానాలలో ప్రయాణం చేశారు.

1953 ఆగస్టు మొదటితేదీన దేశంలోని విమాన సర్వీసు జాతీయం చేయబడింది. (ప్రభుత్వ అధీనంలోకి తీసుకోబడింది).

# విదేశవ్యాపారం

1954–'55 సంవత్సరంలో భారతదేశం మొత్తం 63,399 లక్షల రూపాయలు విలువజేసే సరుకులను ఎగుమతిచేసింది. 58,349 లక్షల రూపాయలు విలువచేసే సరుకులను దిగుమతి చేసుకుంది. ఆ సంవత్సరం విదేశీవ్యాపారంలో రు. 5,050 లక్షల రూపాయలు లోటు వచ్చింది (Trade deficit).

1955–'56 వ సంవత్సరంలో ఎగుమతులు రు. 67,592 లక్షలు, దిగుమతులు రు. 59,791 లక్షలు అని అంచనా వేయబడింది. ఈ సంవత్సరం రు. 7,801 లక్షల లోటు వస్తుందని అంచనావేస్తున్నారు.

1954–'55 వ సంవత్సరంలో మొత్తం విదేశవ్యాపారంలో (సరుకుల విలువలో) నూటికి 28.20 వంతుల వ్యాపారం ఒక్క బ్రిటనుతోనే జరిగింది.

తరువాత అమెరికాది ద్వితీయస్థానం. ఈ సంవత్సరంలో నూటికి 14.32 వంతుల వ్యాపారం అమెరికాతో జరిగింది.

సోవియట్ యూనియన్, తూర్పు యూరపు ప్రజాస్వామిక రాజ్యాలు, ప్రజాచైనాలతో మన వ్యాపారం క్రమంగా పెరుగుతున్నది.

1954 లో భారతదేశం రష్యా, చైనా, తూర్పుయూరపు దేశాలతో, అంతకు పూర్వంకంటె ఎక్కువ వ్యాపారంచేసింది. 1953 లో ఈ దేశాలకు మనం $1\frac{1}{2}$ కోట్ల డాలర్ల విలువగలిగిన సరుకులు ఎగుమతిచేసి, 1954 లో దాదాపు రెండుకోట్ల డాలర్ల విలువగల సరుకులు దిగుమతిచేశాం. ఈ దేశాలనుండి మనం 1953 లో 79 లక్షల డాలర్ల విలువగల సరుకులు దిగుమతి చేసుకుంటే, 1954 లో 112 లక్షల డాలర్ల విలువగల సరుకులను దిగుమతి చేసుకున్నాం.

1954–'55వ సంవత్సరంలో భారత ప్రభుత్వం బల్గేరియా, జకోస్లోవేకియా, తూర్పుజర్మనీ, హంగరీ, పోలెండు దేశాలతో వ్యాపారపు టొడంబడికలు చేసుకున్నది.

మన ఎగుమతుల్లో తేయాకు, పొగాకు, మిరియాలు, నూనె గింజలు, జనపనార, గోనెసంచులు, బట్టలు, ముడిఇనుము, మైకా, మాంగనీసు, లక్క, చర్మాలు, వస్త్రాలు, కొబ్బరినార, ఉన్ని యిత్యాదులు ముఖ్యమైనవి.

యంత్రాలు, యంత్రభాగాలు, కాగితం, పత్తి, మందులు, పలురసాయన పదార్థాలు యిత్యాదులు ముఖ్య దిగుమతులు.

ఇంతవరకూ, భారీయంత్రాల దిగుమతికి మన దేశం ఇంగ్లండు, అమెరికాలమీద ఆధారపడవలసివచ్చేది. కాని, నేడు సోవియట్ యూనియన్, జకోస్లోవేకియాలు భారీయంత్రాలు భారతదేశానికి ఎగుమతిచేయడంలో బ్రిటన్, అమెరికాలతో తీవ్రంగా పోటీచేయగలుగుతున్నాయి.

## రాష్ట్రాలు

ప్రస్తుతం భారతదేశం 29 రాష్ట్రాలుగా విభజింపబడి ఉంది.

ఆంధ్ర: హైదరాబాదు, ఒరిస్సా, మైసూరు, మదరాసు రాష్ట్రాల మధ్యనున్నదే ఆంధ్రరాష్ట్రం. 1953 కు పూర్వం, ఆంధ్ర రాష్ట్రం మదరాసు రాష్ట్రంలో భాగంగా ఉండేది. ఆంధ్రులు ప్రత్యేక రాష్ట్రంకొరకు చేస్తూవచ్చిన ఆందోళన 1953లో ఫలించింది. ప్రజాభిప్రాయానుసారం, 1953 అక్టోబరు ఒకటవ తేదీన కేంద్ర ప్రభుత్వం ప్రత్యేక ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పరచింది.

దీని వైశాల్యం 67 వేల చదరపు మైళ్ళు: జనాభా రెండుకోట్ల పన్నెండు లక్షలు. సాలుకు 20-50 అంగుళాలమధ్య వర్షం పడుతుంది. కోస్తా ప్రాంతంలో వర్షం అధికంగాను, రాయలసీమ ప్రాంతంలో తక్కువగాను పడుతుంది:

ఈ రాష్ట్రంలో ఖనిజసంపద అపారంగా ఉంది. శాస్త్రజ్ఞుల పరిశోధనలవల్ల మాంగనీసు, మైకా, బెరైటీస్, సున్నపురాయి, జిప్సం దొరికే అవకాశాలున్నాయి. ప్రస్తుతం మైకా (నెల్లూరు జిల్లా), మాంగనీసు ఖనిజాలు మాత్రమే తవ్వబడుతున్నాయి.

కృష్ణ, గోదావరి, పెన్న, తుంగభద్ర నదుల నీటివల్ల రాష్ట్రంలో భూములకు నీటిపారుదల వసతులు కల్పించబడ్డాయి.

మొత్తం సాగవుతున్న భూమిలో నూటికి 80 వంతుల విస్తీర్ణంలో ఆహారపంటలు పండించబడుతున్నాయి. వరి, జొన్న, సజ్జ యిత్యాదులు, చెరకు, పప్పుదినుసులు ముఖ్య ఆహారపంటలు. దేశంలోపండే పొగాకులో నూటికి 40 వంతులు, వర్జీనియా పొగాకులో నూటికి 95 వంతులు ఆంధ్రలో పండించబడుతున్నది. పత్తి, వేరుశనగ, మిరప, నూనెగింజలు ప్రధాన వ్యాపారపంటలు.

పారిశ్రామికంగా ఆంధ్రరాష్ట్రం చాల వెనుకబడి ఉంది. పంచదార, జూట్, సిమెంటు, నూనెమిల్లులు, నూలుమిల్లులు, బియ్యం మిల్లులు – ఇవి ఆంధ్రలో వున్న ముఖ్య పరిశ్రమలు. విశాఖ పట్టణంలో నౌకా నిర్మాణ కేంద్రం ఉన్నది. రాజమండ్రిలో ఒక పేపరుమిల్లు, నెల్లూరుజిల్లా గుడూరులో పింగాణీ ఫ్యాక్టరీ ఉన్నాయి.

కర్నూలు రాష్ట్ర రాజధాని.

అస్సాం: దేశానికి తూర్పుచివర ఉన్న రాష్ట్రమే అస్సాం. దీని వైశాల్యం 85,012 చదరపుమైళ్ళు. జనాభా 90,43,000. దేశంలో ఉన్న అటవీజాతి ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులు (నూటికి 32 మంది) ఈ రాష్ట్రంలోనే ఉన్నారు. వీరిలో "నాగ"జాతివారు అధికులు.

రాష్ట్రంలో సాలుకు నూరు అంగుళాలవరకూ వర్షంపడుతుంది. ఈ రాష్ట్రంలోనే ఉన్న చిరపుంజిలో ప్రపంచంలో ఎక్కడా పడనంత వర్షంపడుతుంది.

రాష్ట్రంలో విరివిగా తేయాకు తోటలు పెంచబడుతున్నాయి. దేశంలోని తేయాకు తోటలలో (విస్తీర్ణంలో) దాదాపు సగం ఈ రాష్ట్రంలోనే ఉన్నాయి.

వరి, చెరకు, పత్తి, జనపనార, పొగాకు, నూనె గింజలు ముఖ్య వ్యవసాయ పంటలు.

పెట్రోలు, కిరసనాయిలు యిక్కడ దొరికే ముఖ్య ఖనిజాలు. డిగ్‌బాయ్, నహర్‌కటియాలనూనె తీయబడుతున్నది.

నూనె పరిశ్రమకు సంబంధించిన పరిశ్రమలు తప్ప మరే పరిశ్రమలు రాష్ట్రంలో అభివృద్ధికాలేదు.

పశ్చిమ బెంగాలు: ఇది బీహారు, ఒరిస్సా, తూర్పు పాకిస్తాన్ల మధ్య ఉన్నది. 1947లో భారత స్వాతంత్ర్యప్రదానం సందర్భంలో విభజించబడింది. తూర్పుభాగం పాకిస్తానులో చేర్చబడింది.

రాష్ట్ర వైశాల్యం 30,775 చదరపుమైళ్లు; జనాభా 2,48,00,000. బీహారునుండి సుమారు రెండువేల చదరపు మైళ్ళ విస్తీర్ణంగల ప్రాంతాన్ని బెంగాలులో కలపడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

వరి ముఖ్య వ్యవసాయపంట. దేశంలో వరి ఎక్కువగా పండించే రాష్ట్రాలలో బెంగాలు ఒకటి. జనపనార, తేయాకు కూడా అధికంగా పండించ బడుతున్నాయి. పప్పుదినుసులు, నూనె గింజలు, చెరకు, పత్తి, పొగాకు యిత్యాదులు ముఖ్య ఆహార వ్యాపారపంటలు.

పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన రాష్ట్రాల్లో బెంగాలు ఒకటి. బొంబాయిలో బట్టలమిల్లుల మాదిరిగా, కలకత్తాలో జనపనార మిల్లులు అధికంగా ఉన్నాయి. దేశంలో జనపనార పరిశ్రమ అంతా ఇక్కడే ఉందని చెప్పవచ్చు. బట్టలమిల్లులు, ఇంజనీరింగు కర్మాగారాలు ఈ రాష్ట్రంలో ఉన్నాయి. చిత్తరంజన్ రైలింజన్ల కర్మాగారం ఈ రాష్ట్రంలోనే ఉంది.

రాజధాని కలకత్తా. ఇది పెద్ద ఓడరేవు. సముద్రంమీదుగా మనదేశం ఎగుమతిచేసే సరుకుల్లో నూటికి 40 పాళ్లు ఈ రేవుగుండానే రవాణా అవుతున్నది.

బీహారు: ఈరాష్ట్రం నేపాలుదేశం, బెంగాలు, ఒరిస్సా, ఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాల నడుమ ఉన్నది. వైశాల్యం 70,330 చదరపుమైళ్ళు. జనాభా 4,02,00,000

ఈ రాష్ట్రం చాల సారవంతమయింది. దేశంలో పండే అన్ని రకాలపంటలు ఈ రాష్ట్రంలో పండుతాయి. వరి, చెరకు, మొక్క-

జొన్న, గోధుమ, బార్లీ, జనుము, పొగాకు, మిరప, బంగాళాదుంపలు, నూనెగింజలు - ఇవి ముఖ్య వ్యవసాయ పంటలు.

రాక్షసిబొగ్గు, ఇనుము, మైకా, బాక్సైటు, రాగి, పింగాణి మట్టి, కినైట్, పిరైట్ ఖనిజాలు విరివిగా దొరుకుతాయి. రాక్షసి బొగ్గు, మైకా విరివిగా తవ్వబడుతున్నాయి.

తాతా ఉక్కు కర్మాగారం ఈ రాష్ట్రంలోనే (జెంషడ్‌పూరు) ఉన్నది. దేశంలో ఉన్న పెద్ద ఎరువుల ఫ్యాక్టరీ, (సింద్రీ ఎరువుల ఫ్యాక్టరీ) ఈ రాష్ట్రంలోనే ఉంది.

ఇవికాక సిమెంటు, గాజు, కాగితం, జనపనార, పంచదార ఫ్యాక్టరీలుకూడా ఉన్నాయి.

రాజధానీ నగరం పాట్నా.

బొంబాయి : సౌరాష్ట్ర, మధ్యభారత్, మధ్యప్రదేశ్, హైదరాబాదు, మైసూరురాష్ట్రాల నడుమ, అరేబియా సముద్రతీరాన్ని ఆనుకుని బొంబాయిరాష్ట్రమున్నది. ఈ రాష్ట్రవైశాల్యం 1,11,434 చదరపుమైళ్లు; జనాభా 3,59,56,150.

రాష్ట్ర ఉత్తరప్రాంతంలో సాలుకు 30 అంగుళాలు, దక్షిణ ప్రాంతంలో సాలుకు 60 అంగుళాలు వర్షంపడుతుంది. జొన్నలు, సజ్జలు, ప్రత్తి, పొగాకు, వేరుశనగ, వరి, గోధుమ ముఖ్యవ్యవసాయ పంటలు.

దేశ వస్త్ర పరిశ్రమకు ఈ రాష్ట్ర రాజధాని బొంబాయి నగరం ముఖ్య కేంద్రం. దేశంలోని బట్టలమిల్లుల్లో దాదాపు సగం ఇక్కడే వున్నాయి. ఇంజనీరింగు వర్కుషాపులు, నూనె శుద్ధి కర్మాగారాలు ఈ రాష్ట్రంలో ఉన్నాయి.

ఎగుమతి, దిగుమతి వ్యాపారంలో నూటికి 50 వంతులు ఈ రాష్ట్రంగుండానే జరుగుతున్నది.

పోర్చుగీసు వలస ప్రాంతంగా ఉన్న గోవా ఈ రాష్ట్రంలోనే ఉన్నది.

దేశ రేవుపట్టణాలలో ముఖ్యమైన బొంబాయి ఈ రాష్ట్రం లోనే ఉన్నది.

మధ్యప్రదేశ్ : దేశంలోకల్లా పెద్దరాష్ట్రం యిది. వైశాల్యం 1,30,272 చదరపుమైళ్లు. జనాభా 2,12,47,533.

సాలుకు 50-60 అంగుళాలమధ్య వర్షం పడుతుంది. వరి, గోధుమ, నువ్వులు, చెరకు, మొక్కజొన్న, పొగాకు, వేరుశనగ ముఖ్య వ్యవసాయపంటలు.

బొగ్గు, ముడి ఇనుము, బాక్సైటు, డోలమైట్, సున్నపురాయి, మాంగనీసు విరివిగా లభిస్తాయి. దేశంలో లభించే మాంగనీసు ఖనిజంలో చాలభాగం యిచ్చటే లభిస్తున్నది.

మాంగనీసు, రాక్షసి బొగ్గుకు సంబంధించిన గని పరిశ్రమలు, బట్టల మిల్లులు, కాగితం, సిమెంటు, పింగాణి పరిశ్రమకు సంబంధించిన ఫ్యాక్టరీలు ఈ రాష్ట్రంలో అభివృద్ధి అయినాయి.

నాగపూరు రాష్ట్ర రాజధాని.

మదరాసు : మైసూరు, ఆంధ్ర, తిరువాన్కూరు-కొచ్చిను రాష్ట్రాల నడుమ, బంగాళాఖాతాన్ని ఆనుకుని ఉన్న రాష్ట్రమే మదరాసు. దీని వైశాల్యం 60,790 చదరపుమైళ్ళు. జనాభా 3,57,34,002.

ఈ రాష్ట్రంలోని అడవుల్లో మంచిగంధపు చెక్క, టేకు విరివిగా లభిస్తుంది. దేశంలో దొరికే గంధపుచెక్కలో నూటికి 50 పాళ్ళు ఈ రాష్ట్రంలోని అడవుల్లో లభిస్తున్నది.

వరి, జొన్న, సజ్జ, వేరుశనగ, పత్తి, చెరకు, కొబ్బరి, ముఖ్య వ్యవసాయపంటలు.

లిగ్నైట్, మైకా, సున్నపురాయి, బెరైటీస్, పింగాణిమట్టి, జిప్సం, మాంగనీసు, బాక్సైట్ ఖనిజాలు ఈ రాష్ట్రంలో లభిస్తాయి.

వస్త్రాలు, పంచదార, అగ్గిపెట్టెలు, సిమెంటు, ఇంజినీరింగు-ఇవి రాష్ట్రంలోని ముఖ్యపరిశ్రమలు.

మదరాసు, రాష్ట్రరాజధాని. ఇది రేవు పట్టణం.

ఒరిస్సా: ఆంధ్రరాష్ట్రపు ఉత్తర చివరనానుకుని ఉన్నది. వైశాల్యం 60,136; జనాభా 1,46,45,946.

సాలుకు సుమారు 57 అంగుళాల వర్షం పడుతుంది. వరి, చెరకు, రాగి, పసుపు, పలురకాల నూనెగింజలు, జొన్న, పప్పుదినుసులు - ఇవి ముఖ్య వ్యవసాయ పంటలు.

ఉత్తమ తరగతికి చెందిన ముడి ఇనుము ఈ రాష్ట్రంలో విరివిగా లభిస్తుంది. రాక్షసిబొగ్గు, మాంగనీసు, మైకా, సున్నపురాయి- ఈ ఖనిజాలు విరివిగా లభిస్తాయి.

ఈ రాష్ట్రం పారిశ్రామికంగా చాల వెనుకబడి ఉన్నది. కాగితాల మిల్లు, చెరకు ఫ్యాక్టరీలు తప్ప ఇతర పరిశ్రమలేవీ లేవు.

భువనేశ్వర్ రాష్ట్ర రాజధాని.

పంజాబు: 1947 లో దేశ విభజనా సందర్భంలో ఈ రాష్ట్రంలోని పశ్చిమ ప్రాంతాన్ని పాకిస్తానులో కలిపివేశారు. రాష్ట్ర వైశాల్యం 37,378 చదరపుమైళ్ళు; జనాభా 1,26,41,205.

సాలుకు 23 అంగుళాల వర్షం పడుతుంది, సట్లెజ్, రావీనదుల కాలువలకింద సాగుజరుగుతున్నది. గోధుమ, పప్పుదినుసులు విరివిగా పండుతాయి. మొక్కజొన్న, చెరకు, ప్రత్తి, వరి, వేరుశనగ, ఇతర ముఖ్య వ్యవసాయపంటలు.

చెప్పదగిన ఖనిజాల నిధులేవీ ఉన్నట్లు ఇంతవరకూ కనిపెట్టబడలేదు.

దేశంలో ఉన్న ఉన్ని వస్త్రపరిశ్రమకు సంబంధించిన ఫ్యాక్టరీలలో నూటికి 66 ఈ రాష్ట్రంలో ఉన్నాయి.

రాష్ట్ర రాజధాని చండీఘుర్.

ఉత్తరప్రదేశ్: ఈ రాష్ట్రం హిమాలయ పర్వతాల నానుకుని ఉన్నది. రాష్ట్ర వైశాల్యం 1,13,409 చదరపుమైళ్లు; జనాభా 6,32,15,742.

గోధుమ, మొక్కజొన్న, బార్లీ, పప్పుదినుసులు, చెరకు, పలురకాలనూనె గింజలు, వరి, పత్తి, పొగాకు, తేయాకు ముఖ్య వ్యవసాయ పంటలు.

మనదేశంలో నల్లమందు ఈ రాష్ట్రంలో మాత్రమే తయారు చేయబడుతున్నది.

రాగి, పలకలు, గాజుపరిశ్రమకు పనికివచ్చే ఇసుక, స్టీటైట్ లభిస్తాయి.

కొద్దో గొప్పో పరిశ్రమలు అభివృద్ధి చెందిన రాష్ట్రాలలో ఇదొకటి. దేశంలో తయారయ్యే పంచదారలో నూటికి 60 వంతులు ఇచ్చటే తయారవుతున్నది. తర్వాత చెప్పదగింది తోళ్ళపరిశ్రమ. ఉన్ని, నూలు, వస్త్రపరిశ్రమ, కాగితం, రసాయన పరిశ్రమలు ఈ రాష్ట్రంలో ఉన్నాయి.

రాష్ట్ర రాజధాని లక్నో.

మధ్యభారత్ : 24 స్వదేశ సంస్థానాలను కలిపి ఈ రాష్ట్రం 1948 లో ఏర్పాటుచేయబడింది. దీని వైశాల్యం 46,478 చదరపు మైళ్ళు. జనాభా 79,54,154.

గోధుమ, ప్రత్తి, పప్పుదినుసులు, నూనెగింజలు ప్రధాన వ్యవసాయ పంటలు.

మాంగనీసు, ఆస్‌బెస్టాస్, సబ్బురాయి, పింగాణీమట్టి ఇక్కడ లభించే ఖనిజాలు.

రాష్ట్ర పరిశ్రమల్లో చెప్పదగింది వస్త్రపరిశ్రమ.

రాష్ట్ర రాజధాని గ్వాలియర్.

రాజస్థాన్ : పంజాబు, మధ్యభారత్, సౌరాష్ట్రలకు మధ్య, పశ్చిమ పాకిస్తాను సరిహద్దు నానుకుని ఉన్నరాష్ట్రమే రాజస్థాన్. కొన్ని స్వదేశ సంస్థానాల కలయికవల్ల ఈ రాష్ట్రం 1948 లో ఇప్పటి స్వరూపాన్ని పొందింది. రాష్ట్రవైశాల్యం 1,30,207 చదరపుమైళ్లు; జనాభా 1,52,90,797.

సాలుకు సగటున 13 అంగుళాల వర్షం పడుతుంది. ఇది వ్యవసాయానికి చాలదు. గోధుమ, మొక్కజొన్న, బార్లీ, పప్పుదినుసులు, పత్తి ముఖ్య వ్యవసాయ పంటలు.

కట్టడాలకు పనికివచ్చే రాయి విరివిగా ఈ రాష్ట్రంలో లభిస్తుంది. సీసము, తుత్తునాగము, వెండి, మాంగనీసు, జిప్సం ఇచ్చట లభించే ముఖ్య ఖనిజాలు.

చెప్పదగిన పరిశ్రమలేవీ ఈ రాష్ట్రంలో అభివృద్ధికాలేదు.

రాష్ట్ర రాజధాని జైపూరు.

సౌరాష్ట్ర: బొంబాయిరాష్ట్రాన్ని ఆనుకుని అరేబియా సముద్రంలోకి చొచ్చుకునిఉన్న భూభాగమే సౌరాష్ట్రం. దీని వైశాల్యం 21,451 చదరపుమైళ్ళు; జనాభా 41,37,359.

జొన్న, సజ్జ, ప్రత్తి, గోధుమ, నూనెగింజలు ముఖ్య వ్యవసాయ పంటలు.

సిమెంటు, గాజు, వస్త్ర, రసాయన పరిశ్రమలకు సంబంధించిన కొన్ని ఫ్యాక్టరీలు ఈ రాష్ట్రంలో ఉన్నాయి.

రాష్ట్ర రాజధాని రాజకోట.

పెప్సూ: 1948 లో అవతరించిన రాష్ట్రాలలో పెప్సూ ఒకటి (పూర్తిపేరు పాటియాల తూర్పు పంజాబు స్టేట్సు యూనియన్).

గోధుమ, మొక్కజొన్న, పప్పుదినుసులు, చెరకు, ప్రత్తి ముఖ్య వ్యవసాయ పంటలు.

రాష్ట్రంలో రెండు పంచదార ఫ్యాక్టరీలు, రెండు సిమెంటు ఫ్యాక్టరీలు ఉన్నాయి.

రాష్ట్ర రాజధాని పాటియాలా.

హైదరాబాదు: ఈ రాష్ట్రం బొంబాయి, మధ్యప్రదేశ్, ఆంధ్రరాష్ట్రాల మధ్య ఉంది. దీని వైశాల్యం 82,168 చదరపుమైళ్లు. జనాభా 1,86,55,108.

వరి, గోధుమ, జొన్న, సజ్జ, వేరుశనగ, చెరకు, ప్రత్తి ముఖ్య వ్యవసాయ పంటలు.

ఈ రాష్ట్రంలో బొగ్గు విస్తారంగా లభిస్తుంది. బంగారం, సున్నపురాయి, ఖనిజాలు కూడా లభిస్తాయి.

కాగితం, సిమెంటు, చెరకు, సారాయి, సిగరెట్లు, గాజు సామాన్ల పరిశ్రమలు రాష్ట్రంలో అభివృద్ధిచెందాయి.

హైదరాబాదు రాజధానీనగరం.

మైసూరు : బొంబాయి, ఆంధ్ర, మదరాసు రాష్ట్రాల మధ్య ఈ రాష్ట్ర మున్నది. దీని వైశాల్యం 29,489 చదరపుమైళ్ళు; జనాభా 90,74,972.

వరి, రాగి, మొక్కజొన్న ముఖ్య ఆహారపంటలు. చెరకు, పండ్లు, కాఫీ, కొబ్బరి, ప్రత్తి, నూనెగింజలు, పొగాకు, తేయాకు ముఖ్య వ్యాపారపంటలు.

కోలారు గనులలో బంగారం తీయబడుతున్నది. ఆస్‌బెస్టోసు, క్రోమైట్, మాంగనీసు ఖనిజాలుకూడా ఇచ్చట లభిస్తాయి.

పారిశ్రామికాభివృద్ధికి ఈ రాష్ట్రంలో అవకాశాలు విరివిగా ఉన్నాయి. ఇనుము – ఉక్కు, సిమెంటు, కాగితం, నూలు – పట్టు వస్త్రాలు, సబ్బులు, రసాయన పదార్థాలు, ఎరువులు, గంధపునూనె, వీటికి సంబంధించిన పరిశ్రమలు ఈ రాష్ట్రంలో ఉన్నాయి. దేశంలో ఉన్న విమానకర్మాగారం ఒక్కటీ ఈ రాష్ట్రంలోనే ఉన్నది.

హాయిగా ఉండే వాతావరణం, సుందరమయిన ప్రకృతి దృశ్యాలు అనేకమంది విహారయాత్రీకుల నాకర్షిస్తున్నాయి.

రాష్ట్ర రాజధాని బెంగుళూరు.

తిరువాన్కూరు – కొచ్చిన్ : ఈ రాష్ట్రం మదరాసు రాష్ట్రానికి పశ్చిమంగా, అరేబియా సముద్రతీరాన్ని ఆనుకుని ఉన్నది. దీని వైశాల్యం 9.144 చదరపుమైళ్లు. దేశంలోకెల్ల ఈ రాష్ట్రంలో అక్షరాస్యులసంఖ్య అధికం.

వరి, కర్ర పెండలం ముఖ్య ఆహారపంటలు. కొబ్బరి, లవంగం, దాచినచెక్క, రబ్బరు, మిరియాలు, అల్లం, నువ్వులు, వేరుశనగ, పసుపు ఇతర ముఖ్య వ్యవసాయ పంటలు.

ఖనిజ పరిశ్రమలు, పింగాణి, రసాయన, వస్త్ర, కాగితం, అల్యూమినియం, పంచదార పరిశ్రమలు ఈ రాష్ట్రంలో ఉన్నాయి.

కొబ్బరినార పరిశ్రమ 5-6 లక్షల మందికి వృత్తి కల్పిస్తున్నది. తిరువేంద్రం రాష్ట్ర రాజధాని.

ఢిల్లీ : ఈ రాష్ట్రవైశాల్యం 578 చదరపుమైళ్లు ; జనాభా 17,44,072.

పప్పుదినుసులు, గోధుమ, బార్లీ ముఖ్య వ్యవసాయ పంటలు. ఈ రాష్ట్రంలో చెప్పదగిన పరిశ్రమలేవీ అభివృద్ధికాలేదు. ఢిల్లీ ఈ రాష్ట్రానికి రాజధాని.

అజ్మీరు : దీని వైశాల్యం 417 చదరపుమైళ్లు; జనాభా 6,93,372.

కూర్గు : మదరాసు, మైసూరురాష్ట్రాల మధ్యనున్నది. దీని వైశాల్యం 1,586 చదరపుమైళ్లు; జనాభా 2,29,405.

భోపాల్ : దీని వైశాల్యం 6,378 చదరపుమైళ్ళు; జనాభా 8,36,474.

హిమాచలప్రదేశ్ : 1948 లో ఏర్పరచబడ్డ కొత్త రాష్ట్రాలలో యిదొకటి. దీని వైశాల్యం 10,904 చదరపుమైళ్ళు; జనాభా 11,09,466.

గోధుమ, మొక్కజొన్న, వరి, రాగి, చెరకు, బంగాళదుంపలు ముఖ్య వ్యవసాయ పంటలు. బంగాళదుంపలు ముఖ్య వ్యాపారపంట.

కచ్ : పశ్చిమ పాకిస్తాను, సౌరాష్ట్రలమధ్య అరేబియా సముద్రతీరంలో ఉంది. దీని వైశాల్యం 16,724 చదరపుమైళ్ళు; జనాభా 5,67,606.

మణిపూరు : అస్సాం, బర్మాలమధ్య ఉన్న చిన్న ప్రాంతమే మణిపూరు. దీని వైశాల్యం 8,628 చదరపుమైళ్లు; జనాభా 5,77,635.

త్రిపుర : తూర్పుబెంగాలు, అస్సాంలమధ్యనున్న రాష్ట్రమే త్రిపుర. దీని వైశాల్యం 4,032 చదరపుమైళ్ళు; జనాభా 6,39,029.

వింధ్యప్రదేశ్ : ఈ రాష్ట్రం ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్‌ల మధ్యన ఉన్నది. దీని వైశాల్యం 23,603 చదరపుమైళ్ళు; జనాభా 35,74,690.

ఈ రాష్ట్రంలోని అడవుల్లో కాగితం పరిశ్రమకు పనికివచ్చే వెదురు విస్తారంగా దొరుకుతుంది.

రాష్ట్రంలో 22 రకాల ఖనిజాలు లభ్యమవుతాయి. వీటిలో రాక్షసిబొగ్గు, వజ్రాలు, సున్నపురాయి, బెరైటిస్ ఖనిజాలు ప్రస్తుతం తవ్వబడుతున్నాయి.

జమ్మూ-కాశ్మీర్ : దేశానికి ఉత్తరసరిహద్దున ఉన్నది. రాష్ట్ర వైశాల్యం 92,780; జనాభా 44,10,000.

1947 అక్టోబరులో ఈసంస్థానం భారత రిపబ్లిక్‌లో చేర్చబడింది.

చెప్పదగిన పరిశ్రమలేవీ ఈ రాష్ట్రంలో అభివృద్ధికాలేదు. పట్టువస్త్రాలు, కర్రచెక్కడాలు, కంబళ్లు వీటికి సంబంధించిన చేతిపరిశ్రమలు అభివృద్ధిచెందాయి.

రాష్ట్ర ప్రకృతి దృశ్యాలు సుందరంగా ఉంటాయి. ప్రపంచం నలుమూలలనుండీ విహారార్థం యాత్రీకులు వస్తూవుంటారు.

శ్రీనగర్ రాష్ట్ర రాజధాని.

## రాష్ట్రాల పునర్విభజన

ఆంధ్రరాష్ట్ర నిర్మాణం ఇంతవరకూ నిద్రాణమై ఉన్న భాషా రాష్ట్రాల ఉద్యమాన్ని మేల్కొలిపింది. ప్రజాభీష్టాన్ని వ్యతిరేకించలేక భారతప్రభుత్వం రాష్ట్ర పునర్విభజన సమస్యను పరిశీలించడానికి ఒక కమిషన్‌ను 1953 డిశంబరులో నియమించింది.

దానికి ఫజుల్‌అలీ అధ్యక్షుడు. అందుచేత, దీన్ని ఫజుల్ అలీ కమిషన్ అనికూడా అంటారు.

వీరు దేశం అంతా తిరిగి విచారించి, తమ రిపోర్టును 1955 సెప్టెంబరులో భారత ప్రభుత్వానికి సమర్పించారు.

భాషా ప్రాతిపదికమీద మాత్రమే రాష్ట్రాల పునర్విభజన జరగరాదని, దేశ భద్రతా, దేశ ఐక్యత మొదలైన విషయాలను కూడా దృష్టిలో ఉంచుకొని రాష్ట్రాల పునర్విభజన జరగాలనీ వీరు చెప్పారు. ప్రస్తుత రాష్ట్రాలస్థానే మదరాసు, కేరళ, కర్నాటక, హైదరాబాదు, ఆంధ్ర, బొంబాయి, విదర్భ, మధ్యప్రదేశ్, రాజస్తాన్, పంజాబు,

ఉత్తరప్రదేశ్, బీహారు, పశ్చిమ బెంగాలు, అస్సాం, ఒరిస్సా, జమ్ము-కాశ్మీరు, ఢిల్లీ, మణిపూరు, అండమాన్-నికోబారు రాష్ట్రాలు ఏర్పర చాలనీ సూచించారు. చివరి మూడూ కేంద్ర పాలిత రాష్ట్రాలుగా ఉంటాయి. ఇప్పటివలె "ఎ", "బి" రాష్ట్రాల పద్ధతిని రద్దుచేసి, రాష్ట్రాలన్నిటికి సమానహోదా ఉండాలన్నారు.

వీరు సూచించిన రాష్ట్రాల పునర్విభజన కొన్ని రాష్ట్రాల మధ్య తగాదాలకు దారితీసింది. ఉదాహరణకు తెలంగాణా ప్రాంతాన్ని అంటే తెలుగు ప్రాంతాలతో కలుపకుండా కొన్నాళ్ళ పాటు ప్రత్యేకరాష్ట్రంగా ఉంచాలన్నారు. అదేవిధంగా మహారాష్ట్ర భూభాగంలో ఉన్న బొంబాయి నగరం రాజధానిగా సంయుక్త మహారాష్ట్రను ఏర్పరచటానికి బదులు, బొంబాయినగరం రాజధానిగా ద్విభాషారాష్ట్రాన్ని నిర్మించటం శ్రేయస్కరమన్నారు.

భారతప్రభుత్వం ఈ రిపోర్టును ఆధారంచేసుకుని, కొన్ని సవరణలతో 1956 మార్చి 18 వ తేదీన రాష్ట్రాల పునర్విభజన బిల్లును పార్లమెంటుకు సమర్పించింది.

ఆంధ్ర - తెలంగాణా (ఈ పేరును తర్వాత ఆంధ్రప్రదేశ్ గా మార్చారు), అస్సాం, బీహారు, గుజరాత్, కేరళ, మధ్యప్రదేశ్, మద్రాసు, మహారాష్ట్ర, మైసూరు, ఒరిస్సా, పంజాబు, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, పశ్చిమ బెంగాలు, జమ్ము-కాశ్మీరు రాష్ట్రాలు ఏర్పర చాలనీ, బొంబాయినగరం, ఢిల్లీ, హిమాచలప్రదేశ్, మణిపూరు, త్రిపుర, అండమాన్-నికోబారు ద్వీపాలు, లక్ష - మనికాయద్వీపాలు, అమిందలి ద్వీపాలు కేంద్రప్రాంతరాష్ట్రాలుగా ఉండాలని సూచించబడింది. ఈ రాష్ట్రాలను ఐదుజోన్లుగా విభజించాలనీ, వీటికి సలహా సంఘాలు ఏర్పరచాలనీ పేర్కొనబడింది.

ఈ బిల్లులోకూడా మహారాష్ట్ర ప్రజలవాంఛ నెరవేరలేదు.

మహారాష్ట్ర ప్రాంతంలో ఉన్న బొంబాయి నగరాన్ని, ఆ రాష్ట్రంలో ఉంచకుండా విడదీసి కేంద్రపాలిత రాష్ట్రంగా చేయాలన్నారు.

మహారాష్ట్ర ప్రజల్లో యిది తీరని అసంతృప్తికి కారణమైంది. బొంబాయితోసహా సంయుక్త మహారాష్ట్ర నిర్మించాలని మహారాష్ట్రులు తీవ్రమైన ఆందోళన చేశారు. ప్రభుత్వం లాఠీచార్జీలు, బాష్పవాయు ప్రయోగాలు, తుపాకి కాల్పులు జరిపి 80 మందిని పొట్టనపెట్టుకుంది. ఈ సమస్యపై ఆర్థికమంత్రి శ్రీ దేశముఖ్ మంత్రి వర్గంనుంచి రాజీనామా కూడా యిచ్చారు.

ఆగస్టుమాసంలో (1956) పార్లమెంటు సమావేశ మవుతూండగా, 180 మంది పార్లమెంటు సభ్యులు బొంబాయిని ద్విభాషా రాష్ట్రంగా (మహారాష్ట్ర, గుజరాత్, కచ్, విదర్భ) చేసినట్లయితే రాజధాని సమస్య పరిష్కార మవుతుందంటూ ప్రధానికి ఒక జాబు వ్రాశారు. దాన్ని ప్రభుత్వం అంగీకరించింది. వెంటనే గుజరాత్ ప్రజల్లో అసంతృప్తి చెలరేగింది. అహమ్మదాబాద్ మొదలైనచోట్ల ప్రజలు వీధుల్లోకివచ్చి, గుజరాతీలకు ప్రత్యేకరాష్ట్రం కావాలని డిమాండు చేశారు. ప్రజాందోళనను అణచడానికి పోలీసులు తుపాకులు కాల్చారు. అహమ్మదాబాద్ మొదలైనచోట్ల దాదాపు 20 మంది చనిపోయారు. అయినా ప్రభుత్వం లక్ష్యపెట్టక పార్లమెంటులో ద్విభాషారాష్ట్ర ప్రతిపాదనను నెగ్గించుకొంది. కొత్త రాష్ట్రాలు నవంబరులో ఏర్పడుతాయి.

# పాకిస్తాన్

మౌంటుబాటన్ అవార్డు ప్రకారం బ్రిటిష్ సామ్రాజ్యవాదులు 1947 వ సంవత్సరం ఆగస్టు 15 వ తేదీన అవిభాజ్య భారత దేశంలోని పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రం, సింధు, బెలూచిస్తాన్ రాష్ట్రాలను, పంజాబులోని పశ్చిమభాగం, బెంగాలులోని తూర్పు భాగం, అస్సాం రాష్ట్రంలోని సిల్హెట్ జిల్లాలనుచేర్చి పాకిస్తాను దేశంగా రూపొందించారు.

ఇందులో ఒక్క తూర్పు బెంగాలు తప్ప మిగతా ప్రాంతం అంతా ఒక్కచోటే వుంది. దీన్ని పశ్చిమ పాకిస్తాను అని వ్యవహరిస్తున్నారు. తూర్పు బెంగాల్‌కి తూర్పు పాకిస్తాన్ అని పేరు పెట్టబడింది.

దేశ వైశాల్యం (తూర్పు పాకిస్తానుతో సహా) 3,60,780 చదరపుమైళ్ళు; భారత దేశ వైశాల్యంలో ఇది మూడవ వంతు. బర్మాకంటె కొంచెం చిన్నది.

1951 వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం, దేశజనాభా 7 కోట్ల 57 లక్షలు. ఇందులో ఒక్క తూర్పు పాకిస్తాన్ జనాభాయే 4 కోట్ల 20 లక్షలు; పశ్చిమ పాకిస్తాన్ జనాభాలో యిది సగంకంటె అధికమే !

చదరపు మైలుకు సగటున 195 మంది యీ దేశంలో నివసిస్తున్నారు. సారవంతమైన బెంగాలురాష్ట్రంలో మాత్రం చదరపు మైలుకు 792 మంది నివసిస్తున్నారు. నిస్సారమైన బెలూచిస్తాన్ రాష్ట్రంలో చదరపు మైలుకు ఆరుగురు మాత్రమే నివసిస్తున్నారు.

జనాభాలో నూటికి 80 మంది ముస్లింలు. మిగతావారు హిందువులు, క్రైస్తవులు.

తూర్పుబెంగాలు ప్రజల మాతృభాష "బెంగాలీ"; సింధు ప్రజల భాష "సింధీ"; పంజాబు ప్రజల భాష "పంజాబీ"; సరిహద్దు ప్రజల భాష "పుస్తు". ఉరుదు మాట్లాడేవారు నామమాత్రమే!

జనాభాలో నూటికి 60 మంది ప్రజలభాషఅయిన బెంగాలీ భాషను తోసిరాజని, అల్పసంఖ్యాకులు మాట్లాడే ఉరుదూను రాజ భాషగా ప్రభుత్వం గుర్తించింది. దానికి వ్యతిరేకంగా బెంగాలులో పెద్ద అసమ్మతి ప్రదర్శనాలు జరిగాయి. వీటిని ప్రభుత్వం క్రూరంగా అణచివేసింది.

నూటికి 90 మంది ప్రజలు గ్రామీణవాసులు. మిగతా పది మంది నగరవాసులు.

నైసర్గిక పరిస్థితులు దేశమంతటా ఒకే రకంగాకాక, పలు ప్రాంతాల్లో పలువిధాలుగా వున్నాయి.

బెలూచిస్తాన్ రాష్ట్రమంతా పీఠభూమి. ఇచ్చట వేసవిలో ఎండ అధికంగాను, చలికాలంలో చలి అధికంగాను వుంటుంది. వర్షం పడటం అరుదు. అందుచేత పంటలు పండవు. వర్షాకాలంలో నీరు చేరినకొద్దీ, నీటి వనరుల ఆధారంతో ద్రాక్ష, అత్తి, ఆపిల్సు మొద లయిన పండ్లతోటలు పెంచబడుతున్నాయి.

పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రంలోను, దాన్ని ఆనుకొనివున్న పశ్చిమ పంజాబులోని కొంత ప్రాంతంలోను వర్షం సంవత్సరంలో సగటున 20 అంగుళాలుమాత్రం పడుతుంది. వాతావరణం చెట్లు, చేమలు పెరగటానికి తగినట్లుగా లేదు.

ద్రాక్ష, అత్తి, పుచ్చకాయలు, ఇత్యాది పండ్లు విరివిగా పండించబడుతున్నాయి. ఈ ప్రాంతంనుండి మన దేశానికి పండ్లు విరివిగా దిగుమతి అవుతున్నాయి.

పశ్చిమ పాకిస్తాన్‌లోని సింధునది, దాని ఉపనదులు ప్రవహిస్తున్న మైదానంలో వర్షం సగటున సంవత్సరంలో 10-20 అంగుళాలవరకు పడుతుంది. అందుచేతవ్యవసాయమంతానదీజలంపైనే ఆధారపడివుంది.

సట్లెజ్ నదికి దక్షిణంగా వున్న ప్రాంతం సింధురాష్ట్రం. తూర్పు భాగం – ఈ ప్రాంతం అంతా ఎడారి. సంవత్సర సగటు వర్షపాతం ఐదు అంగుళాలకు మించదు.

తూర్పు బెంగాలంతా నదీడెల్టాప్రాంతం; పైగా వర్షం సమృద్ధిగా పడుతుంది. (సంవత్సర సగటు వర్షపాతం 75 అం॥).

## వ్యవసాయం

నూటికి 90 మంది ప్రజల వృత్తి వ్యవసాయం. కాని సాగు అవుతున్న భూమిలో నూటికి 70వంతులు జమీందార్ల, జాగీర్దార్ల క్రిందే వుంది. దున్నే రైతుకు భూమే లేదు. ఈ జమీందార్ల, మహారాజాల విపరీత దోపిడీవల్ల గ్రామీణ జనాభాలో నూటికి 90 మంది ప్రజలస్థితి నికృష్టంగా వుంది.

మొత్తం సాగవుతున్న భూమిలో నూటికి 34 వంతుల భూమికి మాత్రం గ్యారంటీ నీటిపారుదల సౌకర్యాలున్నాయి. వరి, జనుము, చెరకు విరివిగా పండించబడుతున్నాయి. (మన దేశంలో నూటికి 18 వంతుల భూమికి మాత్రమే నీటి పారుదల సౌకర్యం వుంది.)

వరి, గోధుమ, చెరకు, జనుము, తేయాకు, పొగాకు, మొక్క-జొన్న, పలురకాల పండ్లు ముఖ్యమైన వ్యవసాయ పంటలు.

మొత్తం పైరు వేయబడుతున్న భూవిస్తీర్ణంలో, నూటికి 80 వంతుల విస్తీర్ణంలో ఆహారపంటలు పండించబడుతున్నాయి. ఇందులో దాదాపు సగం తూర్పు బెంగాల్లోనే వుంది.

మొత్తం ఆహార పంటలు పండించబడుతున్న 3 కోట్ల 50 లక్షల ఎకరాల్లో, 1 కోటి 20 లక్షల టన్నుల ఆహారపంటలు పండించబడుతున్నాయి. ఇందులో 2 కోట్ల 30 లక్షల ఎకరాల్లో, 80 లక్షల టన్నుల బియ్యం, కోటి ఎకరాల్లో 30 లక్షల టన్నుల గోధుమ పండించబడుతున్నాయి. మిగిలిన 20 లక్షల ఎకరాలలో మాత్రం జొన్న, మొక్క-జొన్న, తదితర ఆహారపంటలు పండించబడుతున్నాయి.

తూర్పు పాకిస్తానులోని సిల్హెట్, చిటగాంగ్‌లలోని పర్వత ప్రాంతంలో తేయాకు తోటలున్నాయి. వీటిలో నూటికి 95 బ్రిటిష్ పెట్టుబడిదారుల అధీనంలో వున్నాయి.

సుమారు 4 కోట్ల 50 లక్షల పౌనుల తేయాకు పండించబడుతున్నది. పండిన పంటలో నూటికి 90 వంతులు ఇంగ్లండుకే ఎగుమతి చేయబడుతున్నది.

1950-'51 సంవత్సరంలో 30,11,000 ఎకరాలలో 19,20,000 బేళ్ళ పత్తి పండించబడింది. దేశం మొత్తంలో పండే పంటలో నూటికి 97 వంతులు పశ్చిమ పాకిస్తాన్‌లో పండించబడుతున్నది.

ప్రపంచ జనుముపంటలో నూటికి 80 పాళ్ళు ఒక్క తూర్పు బెంగాలులోనే పండించబడుతున్నది. దేశంలో సాలుకు సుమారు కోటిన్నర ఎకరాల్లో జనుము పండించబడుతున్నది.

పత్తి, జనుము పంటలను వినియోగించుకోగలిగిన పరిశ్రమలు దేశంలో అభివృద్ధి చెందకపోవటంచేత, దాదాపు జనుముపంటనంతా, పత్తిపంటలో అధికభాగం ముఖ్యంగా అమెరికా, ఇంగ్లండు, కెనడా, భారతదేశాలకు ఎగుమతి చేయబడుతున్నది.

వ్యవసాయముడిసరుకుల ఎగుమతులన్నిటినీ వాల్ కాట్ బ్రదర్సు, ర్యాలీబ్రదర్సులాంటి బ్రిటిష్ గుత్తవ్యాపారసంస్థలు కంట్రోలు చేస్తున్నాయి. ఉదాహరణకు, తేయాకు ఎగుమతుల్లో నూటికి 85 వంతులు, పత్తి ఎగుమతుల్లో 60 వంతులు, జనపనార ఎగుమతుల్లో నూటికి 75 వంతులు యీ సంస్థలద్వారానే పంపబడుతున్నాయి. పాకిస్తాన్ రైతులవద్ద వీటిని చౌకగాకొని, విదేశాలకు అధిక ధరలకు ఎగుమతిచేస్తూ, దేశసంపదనంతా వీరు దోచేస్తున్నారు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి కానీయకుండా, తమ పరిశ్రమలకు ముడిపదార్థాలను సప్లయి చేసే దేశంగానే అట్టిపెట్టారు.

దేశంలో సాలుకు సుమారు 2,50,000 టన్నుల పత్తి పండుతుంది. దాన్ని వినియోగించుకోగలిగిన బట్టలమిల్లులు లేకపోవడంచేత

దాన్ని ఎగుమతిచేసి, 50 కోట్ల గజాల గుడ్డను దిగుమతి చేసుకుంటున్నది. సాలుకు పది లక్షల టన్నుల జనపనారను ఉత్పత్తిచేస్తే దాన్ని వినియోగించుకోగలిగిన పరిశ్రమలు లేకపోవడంచేత దాన్ని అంతనూ ఎగుమతిచేస్తూంది. సాలుకు ఐదు లక్షల టన్నుల లోహం (3,50,000 టన్నుల ఉక్కుతోసహా), 30 లక్షల టన్నుల రాక్షసిబొగ్గు, రెండు లక్షల టన్నుల పంచదార, ప్రజల నిత్యావసర వస్తువులనేకం దిగుమతి చేసుకుంటూంది. దిగుమతులకు కావలసినంత డబ్బు లేకపోవడంచేత తన అవసరాలలో నూటికి 70-80 వంతులు మాత్రమే దిగుమతి చేసుకుంటూంది. అందుచేత సరకులకు డిమాండు ఎక్కువై, ధరలు చుక్కల నంటుతున్నాయి. సామాన్య ప్రజలస్థితి కష్టతరంగా తయారైంది.

దేశంలో వున్న ఖనిజాలగనులే తక్కువ. ఉన్న రాగి, బాక్సైటు, మాంగనీసు ఖనిజాల గనులన్నీ బ్రిటిష్ గుత్త వ్యాపార సంస్థల చేతుల్లోనే వున్నాయి.

దేశంలోని వివిధ పరిశ్రమల్లో సుమారు రెండు లక్షలమంది కార్మికులు పనిచేస్తున్నారు. ఇందులో నూటికి 25 మందికి సంవత్సరంలో 6-7 నెలలు మాత్రమే పని దొరుకుతుంది. ట్రేడ్ యూనియన్ హక్కులకు గ్యారంటీ నిచ్చే చట్టాలను ప్రభుత్వం చేయలేదు.

బట్టల మిల్లులు: 1947 వ సంవత్సరానికి దేశంలో 14 చిన్న బట్టల మిల్లులున్నాయి. ఇందులో 19,000 మంది కార్మికులు పని చేస్తూండేవారు. వీటి ఉత్పత్తి దేశావసరాలకు చాలక 50 కోట్ల గజాల బట్ట విదేశాలనుండి దిగుమతి చేయబడుతూంది.

పంచదార మిల్లులు: దేశంలో 1947 కు వున్న 11 మిల్లులు 25,000-30,000 టన్నుల పంచదారను ఉత్పత్తి చేస్తున్నాయి. దేశావసరాలకు 2 లక్షల టన్నులు కావలసిరావడంచేత, దేశీయ ఉత్పత్తి చాలక, పెద్ద ఎత్తున దిగుమతి చేసుకొంటున్నది. దాదాపు పంచదార పరిశ్రమ అంతా బ్రిటిష్ పెట్టుబడిదారుల చేతుల్లో వుంది.

ఇవికాక, దేశంలో ఆరు అగ్గిపుల్లల ఫ్యాక్టరీలు, ఐదు సిమెంటు ఫ్యాక్టరీలు వున్నాయి. గాజుపరిశ్రమ చాల బాల్యదశలో వుంది.

రైళ్ళు, రోడ్లు, నదులు, కాలువలు ముఖ్య రవాణా సాధనాలుగా ఉపయోగపడుతున్నాయి. ఇవయినా తగినంతగా అభివృద్ధికా లేదు.

6,994 మైళ్ళ రైలుమార్గం, 58 వేల మైళ్ళ రోడ్లు వున్నాయి. రోడ్లలో ఎనిమిదివేల మైళ్ళు మాత్రమే సిమెంటు - కంకర రోడ్లు, మిగతాదంతా మట్టిరోడ్లు. దేశంలోని నదులు - వీటి కాలువలలో సుమారు ఐదువేలమైళ్ళమేర పడవలుతిరుగుతాయి. ఈ జలమార్గాల్లో ఒక్క తూర్పు బెంగాలు లోనే 4,500 మైళ్ళవరకూ వున్నాయి.

తూర్పు బెంగాలులో చిటగాంగ్, పశ్చిమ పాకిస్తాన్‌లో కరాచీ ముఖ్య రేవుపట్టణాలు. సముద్ర వ్యాపారమంతా యీ రెండు రేవుల ద్వారానే జరుగుతున్నది.

దేశం పారిశ్రామికంగా వెనుకబడివుండటంచేత, పెద్ద పెద్ద యంత్రసామానులేకాక, ప్రజల నిత్య జీవితావసరవస్తువులు అనేకం పెద్ద ఎత్తున దిగుమతిచేసుకోవలసి వస్తున్నది.

బట్టలు, నూలు, యంత్రాలు, యంత్రభాగాలు (కార్లు, వాటి భాగాలు), ఇనుము, ఉక్కు, ఇతర లోహాలు, మందులు, ఇతర రసాయన పదార్థాలు, కాగితం, ఆహారపదార్థాలు ఇత్యాదులు ముఖ్య దిగుమతులు. వీటిలో చాలభాగం బ్రిటన్, అమెరికా, భారత దేశాలనుండి వస్తున్నాయి.

ప్రత్తి, జనుము, ఉన్ని, తోళ్లు, జిప్సం ఇత్యాదులు ముఖ్య ఎగుమతులు. వీటిలో అధికభాగం బ్రిటన్, అమెరికా, భారతదేశాలకు వెళ్తున్నాయి.

మొత్తం దిగుమతులలో ఒక్క బ్రిటన్‌నుండే నూటికి 30 వంతులు వస్తున్నాయి. ఎగుమతులలో నూటికి 25 వంతులు బ్రిటనుకే పోతున్నాయి. దీన్నిబట్టి, ఎగుమతి దిగుమతి వ్యాపారంలో బ్రిటన్ ప్రాబల్యం అవగాహన మవుతుంది.

ఈ స్థానాన్ని ఆక్రమించడానికి అమెరికా విశ్వప్రయత్నం చేస్తున్నది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఆసియాలోని ఇతర వలస దేశాలలోవలె భారతదేశంలోకూడా బ్రహ్మాండమైన ప్రజా వెల్లువ పొంగి పొరలింది.

ఇండియన్ నేషనల్ ఆర్మీ సైనికుల్ని కొందరిని దేశద్రోహ నేరానికి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు వేసిన శిక్షలకు వ్యతిరేకంగా కలకత్తాలో బ్రహ్మాండమైన ప్రదర్శనాలు జరిగాయి. బొంబాయి రేవులో సమ్మెచేసిన నావికులు తమను అణచటానికి పంపబడిన సైన్యాలపై సాయుధ ప్రతిఘటనకు పూనుకుని వీరోచితంగా పోరాడారు. వీరికి సానుభూతిసూచకంగా, కని విని ఎరుగనంతటి ప్రదర్శనాలు అనేక నగరాలలో జరిగాయి. అనేక చోట్ల సైనికులు, కొన్ని వైమానిక కేంద్రాలలో వైమానికులు సానుభూతి సమ్మెలుకూడా చేశారు.

దేశవ్యాపిత సమ్మెలు, సాయుధ తిరుగుబాట్లు వచ్చే "ప్రమాద భరిత" పరిస్థితు లేర్పడ్డాయి. స్వాతంత్ర్యోద్యమ నాయకత్వం అతి వాదుల చేతిలోకి పోయే "ప్రమాదం" ఏర్పడింది. వీరి నాయకత్వం క్రింద స్వాతంత్ర్యోద్యమం సాగితే, తన్ను సమూలంగా పెరికివేస్తారని బ్రిటిష్ సామ్రాజ్యవాదం గ్రహించింది.

ఇక కాలయాపనవల్ల లాభంలేదని, అనేక ముఖ్యవిషయాలలో తనతో ఏకీభవిస్తారనీ, దేశంలోని తమ పెట్టుబడులకు, ఆస్తి పాస్తులకు ఎట్టి నష్టం కలగకుండా చూస్తారనీ తాను నమ్మిన కాంగ్రెసు, ముస్లిం లీగుల మితవాద నాయకత్వంతో రాజీపడి, దేశాన్ని రెండుగావిభజించి, 1947 వ సంవత్సరం ఆగస్టు 15 వ తేదీన హిందూస్తాన్‌ను కాంగ్రెసు నాయకత్వానికి, పాకిస్తాన్‌ను ముస్లింలీగునాయకత్వానికి అప్పగించటం ద్వారా రెండు దేశాలకూ రాజకీయ స్వాతంత్ర్య ప్రదానం చేసింది. ఈ విధంగా పాకిస్తాన్ దేశం అవతరించింది.

కనీసం భౌగోళిక, ఆర్థిక పరిస్థితులనయినా పరిగణించకుండా, కేవలం మతప్రాతిపదికపైన విభజనచేయడం రెండు దేశాలకూ ఎనలేని అనర్థకాలు కలిగాయి.

మొత్తం పాకిస్తాను జనాభా $7\frac{1}{2}$ కోట్లు. ఇందులో హిందువులు సుమారు కోటిమంది ఉంటారు. మిగిలిన $6\frac{1}{2}$ కోట్లమంది ముస్లింలు. భారతదేశంలో ఇప్పటికి దాదాపు $2\frac{1}{2}$ కోట్లమంది – పాకిస్తాన్‌లోని ముస్లింజనాభాలో నూటికి 39 మంది – భారతదేశంలోనే నివసిస్తున్నారు. మత ప్రాతిపదికమీద చూచినప్పటికీ యీ సమస్య పరిష్కారంకాలేదు.

ఇక భౌగోళికంగా తీసుకుంటే దేశం రెండు ఖండాలుగా వుండటమేకాక, పశ్చిమ పాకిస్తానుకు కొన్నివందలమైళ్లు దూరంగా మొత్తం పాకిస్తాను జనాభాలో నూటికి 70మంది నివసించే తూర్పుపాకిస్తానుఉంది. దీనివల్ల పరిపాలనా వ్యవహారాల్లోకూడా అనేక యిబ్బందులు కలుగుతాయి.

జాతుల ప్రాతిపదికపై చూస్తే యీ విభజనవల్ల బెంగాలీ, పంజాబీ జాతులు రెండుగా విభజించబడ్డాయి. ఇదివరకు లేని వైషమ్యాలు ఇపుడు ఒకేజాతి ప్రజలమధ్య ఉద్భవించాయి. ఈ విధంగా జాతీయైక్యతకు యీ విభజన విఘాతం కలిగించింది.

దేశంలోని పెద్ద పారిశ్రామిక కేంద్రాలు, ప్రధాన నగరాలు – కలకత్తా, బొంబాయి, అహమదాబాదు, మదరాసు, కాన్పూరు ఇత్యాదులు – అన్నీ భారతదేశంలోకి వచ్చాయి. ఖనిజాలు అపారంగా దొరికే అనేక ప్రాంతాలు – ఛోటా నాగపూరు, ఒరిస్సా, మధ్యభారతదేశం – భారతదేశంలోకి వచ్చాయి. అందుచేత దేశంలో దొరికే వివిధ ఖనిజాలలో నూటికి 90 పాళ్ళ ఖనిజసంపద భారతదేశంలోకి వచ్చింది.

పాకిస్తాన్‌లో పారిశ్రామిక కేంద్రమని చెప్పదగిన పట్టణం ఒక్కటీ లేదు. ఖనిజాలు లేవు. వారికి ఉన్న ముఖ్య రేవుపట్టణం కరాచీ (ఇప్పటి పాకిస్తాన్ రాజధాని). పెద్ద పట్టణం లాహోరు.

ఎక్కువ ఆహారపదార్థాలు పండించే పంజాబు, సింధురాష్ట్రాలు పాకిస్తానులోకి వెళ్ళడం వల్ల, మన దేశంలో ఆహారసమస్య తీవ్ర తరమైంది.

బెంగాలురాష్ట్రంలో జనుము పండించే ప్రాంతం పాకిస్తానుకు పోతే, జనపమిల్లులున్న ప్రాంతం మన దేశంలోకి వచ్చింది.

ఇవన్నీ దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తే, దేశవిభజన ఏ ఒక్క సాంఘిక, రాజకీయ సమస్యను పరిష్కరించకపోగా, రెండు దేశాల, రెండు మతాల ప్రజలు, పోట్లాడుకునేట్లుగా అనేక సమస్యలను, వివాదాలను సృష్టించింది. ఈ సమస్యలను, వివాదాలను బ్రిటిష్ సామ్రాజ్య వాదులు తమ రాజకీయ ప్రయోజనాలకు వినియోగిచుకొంటూ రెండు దేశాలమీద పెత్తనం చెలాయించ చూస్తున్నారు. అందుకే తగాదా తీవ్రతతగ్గితే, ఇంకొంచెం ఆజ్యం పోసో, మరొక పుల్ల వేసో అది పరిష్కారంకాకుండా చూస్తున్నారు. దానికి కాశ్మీరుసమస్య ఉదాహరణ.

బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ప్రోద్బలంతో పాకిస్తాన్, కాశ్మీరు మీద దాడిచేసింది. వెంటనే భారతప్రభుత్వం కలుగచేసుకుని, ఈ దురాక్రమణను అడ్డింది. ఈ సమస్యను ఇంతటితో ఆరనీయకుండా బ్రిటిష్ గవర్నర్ భారతదేశాన్ని ప్రోత్సహించి, సమస్యను భద్రతా సమితికి తీసికెళ్ళేట్లుచేశారు. దీన్ని అదనుగా తీసుకుని, అమెరికన్ సామ్రాజ్యవాదం భద్రతాసమితి తరఫున అనేక "గ్రహాల"ను పంపి సోవియట్‌యూనియన్, చైనా, భారదేశాలకు సరిహద్దున ఉన్న గిల్గిట్‌ను తమ మిలిటరీ స్థావరంగా చేసుకొనేందుకు ప్రయత్నిస్తూంది. బ్రిటన్ దానికి తాళంవేస్తూ కూర్చుంది.

ఈవిధంగా సామ్రాజ్యవాదులు రెండు దేశాలమధ్య తగాదాలను వినియోగించుకొని, కోతితీర్పు చెబుతూనే, ప్రభుత్వంపైనా, దేశియ ఆర్థిక వ్యవస్థపైనా ఉన్న తమ పిడికిలిని ఏ మాత్రమూ సడలనివ్వలేదు. ప్రభుత్వ ప్రధాన శాఖల్లోను, మిలిటరీలోను పెద్ద పదవులన్నీ బ్రిటిష్‌వారే నిర్వహిస్తున్నారు. బ్రిటిష్ పెట్టుబడులు దేశీయ పరి

శ్రమలను, బ్యాంకులను, ఇన్సూరెన్సు కంపెనీలను తమ గుప్పెట్లో పెట్టుకుని దేశపరిశ్రమలను అభివృద్ధి కానీయకుండా అరికట్టి, దేశ సంపదనంతా కొల్లగొడుతున్నారు.

క్రమంగా అమెరికా సామ్రాజ్యవాదం, అమెరికా పెట్టుబడులు దేశంలో ప్రవేశించటం ప్రారంభించాయి. రెండవ ప్రపంచ యుద్ధాంతానికి అనేక ముఖ్య విషయాలలో బ్రిటన్ అమెరికాపై ఆధారపడి ఉండటంవల్ల, పాకిస్తాన్‌లో తన స్థానాన్ని అట్టిపెట్టుకొనేందుకు విశ్వ ప్రయత్నాలు చేస్తున్నా, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, అమెరికా సామ్రాజ్యవాదుల్ని (తమకు పోటీ వస్తున్నారని గుర్తించికూడా) దేశంలో అడుగుపెట్టనీయక తప్పలేదు.

ఈ అమెరికా "అతిథి" క్రమంగా పాకిస్తాను ప్రభుత్వంలో పలుకుబడి సంపాదించసాగాడు. ప్రభుత్వం తమ కనుకూలంగా వ్యవహరించేట్లు చేయసాగాడు.

రెండువందల సంవత్సరాలు నిరాఘాటంగా పెత్తనం చెలాయించిన బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు ఇది కన్నెఱ్ఱఅయింది. తమసాయంతో ప్రధాన మంత్రయిన లియాఖత్ ఆలీఖాన్, అమెరికాకు అనుకూలంగా వర్తించుతూండటంచేత, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు కుట్రపన్ని అతనిని రావల్పిండిలో, ఒక బహిరంగసభలో ఉపన్యసిస్తుండగా చంపించారు.

కాని, అమెరికన్ సామ్రాజ్యవాదులు తరువాత వచ్చిన మహమ్మదాలీ మంత్రివర్గాన్నికూడా తమకు అనుకూలంగా చేసుకోగలగటమే కాక, అనేక పరిశ్రమలలో బ్రిటనుకు తీవ్రపోటీదారుగా తయారయ్యారు. ఉదాహరణకు పాకిస్తాన్ పెట్రోలు పరిశ్రమను అదుపులో పెట్టుకున్న బర్మాషెల్ ఆయిల్ కంపెనీకి పోటీగా స్టాండర్డు వాక్యూమ్‌ఆయిల్ కంపెనీ అనే అమెరికా కంపెనీ రంగంలోకి వచ్చింది. అలాగే, గని పరిశ్రమలలోను, రసాయన పరిశ్రమల్లోను అమెరికా పోటీరావడం ప్రారంభించటంచేత,

బ్రిటన్ ఏకాధిపత్యం పోవటమేగాక, తన స్థితికే దెబ్బ తగిలే పరిస్థితులు ఏర్పడ్డాయి.

దేశ ఆర్థిక వ్యవస్థలో ఇంతటిపాత్ర నిర్వహించగలిగిన అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రభుత్వంమీదకూడా విశేష ప్రాభవాన్ని సంపాదించారు.

1945 వ సంవత్సరం మే 19 వ తేదీన, పాకిస్తాన్ అమెరికాతో ఒక మిలిటరీ ఒడంబడిక చేసుకుంది. దీనిఫలితంగా దేశ సైన్యాలమీద అమెరికా పెత్తనం చెలాయించడానికి వీలుకలిగింది. అమెరికా బ్రిటన్ తోడ్పాటుతో నిర్మించిన మధ్యప్రాచ్య సైనిక కూటమి (బాగ్దాద్ కూటమి) ని పాకిస్తాన్ బలపరచేట్లు చేయగలిగింది. తన తొత్తులా వ్యవహరిస్తున్న టర్కీతో ఒక సైనిక ఒడంబడిక చేయించింది. ఆగ్నేయాసియా సైనికకూటమిని బలపరచేట్లు చేయగలిగింది.

ఈమధ్యే పాకిస్తాన్ అమెరికాతో ఒక "వ్యాపార మిత్రత్వ సంధి" చేసుకుంది. దాని ప్రకారం, అమెరికా పెట్టుబడులకు అనేక గ్యారంటీలను పాకిస్తాన్ ప్రభుత్వం ఇచ్చింది.

ఈ విధంగా పాకిస్తాన్ ప్రభుత్వం, పూర్తిగా అమెరికా యుద్ధోన్మాదుల పాలసీలకు బాహాటంగా తాళం వేసేంతవరకూ వెళ్లింది. అమెరికన్ సామ్రాజ్యవాదులకు మిలిటరీ కేంద్రాల నిర్మాణానికి అవకాశమిచ్చింది. తమ సైన్యాలపై వీరికి పెత్తనాన్నిచ్చి, ఆగ్నేయాసియాలో యుద్ధోన్మాదులైన అమెరికన్ సామ్రాజ్యవాదులకు బంటుగా తయారైంది.

భూస్వాముల, ఆంగ్లో-అమెరికన్ పెట్టుబడిదార్ల దోపిడీకి నలిగిపోతున్న పాకిస్తాన్ ప్రజల ఆక్రందనాల నాలకించే దిక్కే లేకపోగా, తమకష్టాలను చెప్పవచ్చిన అనేకమంది ప్రజలపైన, ప్రజాసేవకులపైన, ప్రజాసంఘాలపైనా తీవ్ర నిర్బంధ విధానం అమలుపరచింది పాకిస్తాన్ ప్రభుత్వం. అనేక సందర్భాలలో తుపాకులుకూడా పేల్చి ప్రజలప్రాణాలు తీసింది.

13

1951 వ సంవత్సరంనాటికి కమ్యూనిస్టుపార్టీ, కార్మిక, రైతు, రచయితల సంఘాల నాయకుల్ని అరెస్టుచేసి డిటెయిన్ చేసింది. అనేక మంది ప్రజానాయకుల్ని - కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి అయిన సజ్జద్ జహీర్ తో సహా - "రావల్పిండి కుట్ర కేసు"లో ఇరికించి దీర్ఘ కాల శిక్షలు విధించింది.

జాతీయ క్షేమాన్ని కాలదన్ని, ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్య వాదుల ఆజ్ఞలను పాలిస్తున్న ముస్లింలీగ్ ప్రభుత్వంమీద పెరిగిన ప్రజల ద్వేషం 1954 వ సంవత్సరం జనవరి - ఫిబ్రవరిలో తూర్పు పాకిస్తాన్‌లో జరిగిన ఎన్నికల్లో ప్రస్ఫుటమైంది. ప్రజలు ముస్లింలీగ్‌ను చిత్తుచేశారు.

ఎన్నికల అనంతరం ఏర్పడిన యునైటెడ్ ఫ్రంటు ప్రభుత్వం కేంద్రప్రభుత్వంయొక్క అమెరికా అనుకూల విధానాన్ని నిరసించటం ప్రారంభించింది. అమెరికన్ సామ్రాజ్యవాదులకు ఇది గిట్టలేదు. 1954 మే 30 వ తేదీన (అమెరికాతో మిలిటరీసంధిపై సంతకాలు చేసిన పదిరోజుల తర్వాత) అమెరికన్ సామ్రాజ్యవాదుల ఆజ్ఞల ననుసరించి, పాకిస్తాన్ ప్రభుత్వం మంత్రివర్గాన్ని రద్దుచేసి, గవర్నరు పరిపాలనను ప్రవేశపెట్టింది. కమ్యూనిస్టుపార్టీని నిషేధించింది. అనేక మంది "ఫ్రంటు" నాయకులను, కార్యకర్తలను జైళ్లలోపెట్టి, తీవ్ర నిర్బంధవిధానాన్ని అమలుపరిచింది.

1955 జూలై - ఆగస్టులో బాగ్దాద్ యుద్ధకూటమిలో చేరింది.

* * * *

1893 లో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఆఫ్ఘనిస్తానులో పఠాను ప్రజలు నివసించే ప్రాంతాన్ని (నార్త్ వెస్టు ఫ్రాంటియరు ప్రావిన్స్ అని పిలువబడే రాష్ట్రం), భారత భూ భాగంలో చేర్చారు.

1947 ఆగస్టులో భారతదేశవిభజన జరిగినప్పుడు అది పాకిస్తాన్ లోకి పోయింది. పఠానుప్రజలు తమ ప్రాంతాన్ని ప్రత్యేక స్వతంత్ర దేశంగా ఉండనివ్వాలని కోరారు. పాకిస్తాన్ ప్రభుత్వం దాన్ని వ్యతి

రేకిస్తూ, స్వతంత్ర ఉద్యమాన్ని క్రూరంగా అణచడం ప్రారంభించింది. ఆఖరికి విమానాలమీదనుండి ప్రజలపై బాంబులు కూడా వేసింది.

తమ జాతి ప్రజలైన పఠాన్ల స్వాతంత్ర్యోద్యమాన్ని ఆఫ్ఘనిస్తాన్ బలపరచటంతో పాకిస్తాన్ ఆఫ్ఘనిస్తానుమీద శత్రుత్వంవహించి సాధింపులకు దిగింది. 1955 మేలో సరిహద్దులను మూసివేసి, ఆ దేశ ఎగుమతి దిగుమతి వ్యాపారాన్ని స్తంభింపచేసింది. తనతో పాటు ఆఫ్ఘనిస్తాన్ బాగ్దాద్ కూటమిలో చేరలేదని మరింత శత్రుత్వాన్ని మరింత గట్టిగా సాధించ ప్రయత్నిస్తున్నది.

ముస్లింలీగ్‌లో కలతలు అధికంకావటం ప్రారంభించాయి. పాకిస్తాన్ గవర్నరు జనరల్‌కు తనకు ఇష్టంలేకపోతే మంత్రివర్గాన్ని రద్దుచేసే అధికారంఉంది. గవర్నరుజనరల్ రాజధానిలో లేనిసమయం చూచి, మంత్రివర్గాన్ని రద్దుచేయటానికి యీాయనకున్న అధికారాన్ని రద్దుచేస్తూ (1954 సెప్టెంబరులో) ప్రధాని మహమ్మదలీ రాజ్యాంగ సభలో ఒక బిల్లును ప్రవేశపెట్టాడు.

దీనికి ప్రతిక్రియగా, గవర్నరుజనరల్ అక్టోబరు 24 న రాజ్యాంగ సభను రద్దుచేశాడు. ప్రధాని మహమ్మదలీనిపిలిచి, మంత్రి వర్గాన్ని పునర్నిర్మించమని ఆదేశించాడు. ఇస్కందర్ మీర్జాలాంటి మిలిటరీ నాయకులు, ఖాన్‌సాహెబ్, సుహ్రావర్దీలతో మంత్రివర్గం పునర్నిర్మించబడింది.

గవర్నరుజనరల్ గులాం మహమద్ తన స్థానాన్ని బలపరచుకోడానికి ప్రయత్నాలు విరమించలేదు. 1955 మార్చిలో దేశంలో "విపత్కర" పరిస్థితులున్నాయని ప్రకటించాడు. పశ్చిమ పాకిస్తాన్ రాష్ట్రాలన్నీ కలిపి పశ్చిమపాకిస్తాన్‌యూనియన్ నిర్మించటానికీ, రాజ్యాంగచట్ట ముసాయిదాను తానే తయారుచేయటానికీ అధికారం సంపాదించాడు. దాదాపు 34 నిర్బంధచట్టాల జీవితాన్ని పొడిగించాడు.

పాత రాజ్యాంగసభ ఏడుసంవత్సరాలు కూర్చుని చేసిన రాజ్యాంగం, అటు భూస్వామ్యవర్గాలకుగాని, ఇటు ప్రజాస్వామిక

వాదులకుగాని సంతృప్తి గలిగించలేదు. అందుచేత, గవర్నరుజనరల్ చర్యకు దేశమంతా హర్షించింది.

ఎన్నికలుజరిపి,తిరిగి రాజ్యాంగసభను ఏర్పరచడానికి ప్రభుత్వం నిశ్చయించింది. లోగడ తూర్పుబెంగాలులో తగిలిన గట్టి దెబ్బను ముస్లింలీగ్ యింకామరచిపోలేదు.అందుచేత యీసారివయోజన ఓటింగుతో ఎన్నికలు జరపకుండా అప్పటికున్న వివిధరాష్ట్రాల ఎసెంబ్లీ మెంబర్లు, ఒక దామాషాన ప్రతినిధులనెన్నుకోవాలని నిర్ణయించింది.

ఎన్నికలు దగ్గరకు వచ్చినకొలదీ ముస్లింలీగ్‌లో గుద్దులాటలు తీవ్రస్వరూపం దాల్చాయి. ఎవరిమతాలను వారు బలపరచుకోడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. తూర్పుబెంగాలు ఐక్యసంఘటనలో కూడా చీలికలు వచ్చాయి. తన స్థితి బలహీనమవుతున్నదని తెలుసుకున్న మహమ్మదలీ నెమ్మదిగా ఫజ్లుల్‌హక్‌ను (తూర్పుబెంగాల్) దువ్వటం ప్రారంభించాడు. ఎరగానేమో తూర్పు బెంగాలులో మంత్రుల నియామకాధికారాన్ని కూడా ఈయనకే అప్పగించాడు.

జూన్‌లో ఎన్నికలు జరిగాయి. ఎంత ప్రయత్నించినా, ముస్లింలీగ్‌కు పరాజయం తప్పలేదు. 80 సీట్లలో లీగ్‌కు 32 మాత్రమే వచ్చాయి (పాత రాజ్యాంగ సభలో లీగుకు 64 స్థానాలుండేవి). తూర్పు బెంగాలు ఐక్య సంఘటనకు 16, అవామీలీగ్‌కు 12 సీట్లు వచ్చాయి.

ముస్లింలీగ్ పార్లమెంటరీపార్టీ సమావేశం ఆగస్టులో జరిగింది. మహమ్మదలీని తోసిరాజని, చౌదరీ మహమ్మదలీని (మంత్రివర్గంలో అంతవరకూ ఆర్థికమంత్రిగా పనిచేశాడు) నాయకునిగా ఎన్నుకున్నారు.

ఈ మధ్యకాలంలో గులాం మహమద్ సెలవు పెట్టడంవల్ల, ఇస్కందర్ మీర్జా తాత్కాలిక గవర్నరు జనరల్‌గా నియమించబడ్డాడు. (గులాం మహమద్ రిటైరు కావడంవల్ల ఈయనే శాశ్వత గవర్నరుజనరలైనాడు) ఈయన చౌదరీ మహమ్మదలీని మంత్రివర్గాన్ని నిర్మించవలసిందిగా కోరాడు. చౌదరీ మహమ్మదలీ తూర్పు బెంగాలు ఐక్య సంఘటనతో (ఫజ్లుల్‌హక్ ముఠా) మిశ్రమమంత్రి

వర్గాన్ని ఏర్పరచాడు. రెండు పార్టీలూ సమంగా మంత్రిపదవులను పంచుకొన్నాయి.

గవర్నరు జనరల్ తయారుచేసిన రాజ్యాంగ చట్ట ముసాయిదాను రాజ్యాంగసభ చర్చించి ఆమోదించింది. 1956, మార్చి 23 వ తేదీన యీరాజ్యాంగచట్టం అమలులోకివచ్చింది. పాకిస్తాన్ 'ఇస్లామిక్ రిపబ్లిక్'గా ప్రకటించబడింది. ఇస్కందర్ మీర్జా రిపబ్లిక్ అధ్యక్షుడయినాడు.

పశ్చిమ పాకిస్తాన్‌లోని రాష్ట్రాలన్నిటినీ కలిపి పశ్చిమపాకిస్తాన్ యూనియన్‌గాఏర్పరచబడింది. ఖాన్‌సాహెబ్ ప్రధానమంత్రిగా మంత్రివర్గం నిర్మించబడింది. ముస్లింలీగ్‌లో వచ్చిన ముఠా తగాదాలు ఖాన్‌సాహెబ్ తన బలాన్ని పెంపొందించుకోడానికి అవకాశం యిచ్చాయి. 1956మే లో ఖాన్‌సాహెబ్ 'రిపబ్లికన్‌పార్టీ'ని ఏర్పరచాడు. మే లో జరిగిన పశ్చిమ పాకిస్తాన్ యూనియన్ ఎసెంబ్లీ సమావేశంలో రిపబ్లికన్‌పార్టీ మెజారిటీ పార్టీగా తేలిపోయింది. చాలమంది ముస్లింలీగ్ సభ్యులు యిందులో చేరారు. ఇంకా చేరుతున్నారు. ఖాన్‌సాహెబ్ మంత్రివర్గంలో ముస్లింలీగ్ సభ్యులు రాజీనామాయివ్వాలని లీగ్ యిచ్చిన ఆదేశాన్నికూడా వీరు ఖాతరుచెయ్యలేదు. ఆఖరుకు చౌదరీ మహమ్మదలీ కూడా ముస్లింలీగ్‌ను వ్యతిరేకించే స్థితికి వచ్చాడు.

మహమ్మదాలీ ప్రభుత్వానికీ, చౌదరీమహమ్మదలీ ప్రభుత్వానికీ ఆచరణలో తేడా ఏమీలేదు. చౌదరీ మహమ్మదలీ ప్రభుత్వం కూడా అమెరికన్ సామ్రాజ్యవాదుల బంటుగానే వ్యవహరిస్తున్నది.

కొలదికాలంగా భారతవ్యతిరేక విధానాల్ని మరింత ఉధృతంగా కొనసాగిస్తున్నది. 1956 మార్చిలో కరాచీలో జరిగిన 'ఆగ్నేయాసియా యుద్ధకూటమి' సమావేశంలో కాశ్మీరు సమస్యను లేవనెత్తి, యీ సమస్యమీద వారి జోక్యాన్ని కోరింది. సరిహద్దుల నతిక్రమించి భారతభూభాగంమీద కాల్పులుకూడా జరుపుతోంది.

అమెరికా ఆర్థిక "సాయం" దేశ ఆర్థికవ్యవస్థను కృంగదీస్తున్నది. పశ్చిమ యూరపు, జపానులకు పాకిస్తాన్ ప్రత్తి యెగుమతి చేస్తున్నది. అమెరికా ఆర్థికసహాయంలో కొంత భాగాన్ని ప్రత్తి రూపంలో యీ ప్రాంతాలకు యిస్తున్నది. తక్కువ ధరకు ప్రత్తిని ఎగుమతి చేస్తుండడంవల్ల పాకిస్తాన్ అమెరికాఎగుమతులతో పోటీ చేయలేకపోతున్నది. అందుచేత ప్రత్తి ఎగుమతులు బాగా తగ్గిపోయాయి. 1950-'51 లో ప్రత్తి ఎగుమతివల్ల 98 కోట్ల రూపాయల విదేశమారకం వస్తే, 1954-'55 కు అది 33 కోట్లకు పడిపోయింది. అదేవిధంగా జనపనార ఎగుమతులుకూడా తగ్గిపోయాయి.

ఒక్క జనపనార, ప్రత్తి ఎగుమతులే మొత్తం దేశయెగుమతుల్లో నూటికి 80 పాళ్ళు ఉంటాయి. 1951 లో అమెరికా ఆర్థిక "సాయాన్ని" పాకిస్తాన్ అంగీకరించిన నాటినుండీ విదేశీ వ్యాపారం బాగా తగ్గిపోయింది.

1950-'51 లో దేశపు మొత్తం ఎగుమతులు 250 కోట్ల రూపాయలకు మించి ఉండేది. కాని, 1954-'55 లో 110 కోట్ల రూపాయలకు (నూటికి 54 వంతులు) తగ్గిపోయాయి.

విదేశీ వ్యాపారంలో విపరీతనష్టం, నోట్ల ముమ్మరం, ఆకాశానికి అంటే ధరలు జాతీయ ఆర్థిక విధానాన్ని కృంగదీస్తున్నాయి.

ప్రజల జీవనప్రమాణం క్రమంగా తగ్గిపోతూంది. ఆకాశానికంటే ధరలతో నిత్యజీవితావసరవస్తువులుకూడా కొనలేని స్థితిలో ప్రజలు ఉన్నారు. వారిని ఉద్ధరించడానికి ప్రభుత్వం ప్రయత్నించకపోగా వారిమీద నిరంకుశచట్టాలతో దాడిచేస్తున్నది. దేశాన్ని అమెరికా సామ్రాజ్యవాదుల యుద్ధరథానికి కట్టి ప్రజాభీష్టానికి, దేశశ్రేయస్సుకు వ్యతిరేకంగా వ్యవహరిస్తున్నది.

# నేపాల్

భారతదేశానికి ఉత్తరంగా, హిమాలయ పర్వతాల దిగువనా ఉన్న దేశమే నేపాల్. దాని ఉత్తర సరిహద్దున చైనాదేశం ఉన్నది.

దేశ వైశాల్యం 54,000 చదరపుమైళ్ళు. జనాభా 85,96,000 (1954). గూర్ఖాల మాతృదేశ మిదే!

మే – జూన్ నెలలో ఎండవేడిమి అధికంగా ఉంటుంది. జూన్ – అక్టోబరు మధ్యకాలంలో వర్షాలు పడతాయి. సాలుసగటు వర్షపాతం 60 అంగుళాలు.

దేశ వైశాల్యంలో నూటికి 75 వంతులు అరణ్యాలక్రిందే ఉంది. ఈ అడవుల్లో మంచి కలప లభ్యమవుతుంది. దేశంయొక్క ఎగుమతుల్లో యిది చాల ప్రధానమైనది.

సాగుకింద ఉన్న భూమిలో నూటికి 90 వంతులు రాజు, రాణా కుటుంబాలక్రింద, యితర భూస్వాములక్రింద ఉంది. దున్నే రైతుకు స్వంతభూములు లేక కౌలుదార్లుగాను, వ్యవసాయకూలీలుగాను బ్రతుకుతున్నారు. భూస్వామ్యదోపిడీక్రింద వీరి జీవితం నికృష్టంగాఉంది.

వరి, జనుము, గోధుమ, చెరకు ముఖ్య వ్యవసాయ పంటలు. సాగయ్యేభూమిలో దాదాపు సగభాగంలో వరి పండించబడుతున్నది.

నేపాల్‌లో మైకా, రాక్షసిబొగ్గు, రాగి దొరికే అవకాశం వుంది. వీటికొరకు అమెరికా "నిపుణులు" పరిశోధనలు సాగిస్తూ వచ్చారు.

చెప్పుకోదగిన పరిశ్రమ లేవీ అభివృద్ధికాలేదు. ఉన్నవల్లా బియ్యం, పిండి, నూనెమిల్లులు మాత్రం! 1953 నుండి ఒక జనపనార మిల్లు, ఒక పంచదార ఫ్యాక్టరీ, ఒక బట్టల మిల్లు, ఒక సిగరెట్ ఫ్యాక్టరీ, ఒక అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ పనిచేస్తున్నాయి.

కలప, బియ్యం, జనపనార, ముఖ్య ఎగుమతులు. ప్రజల నిత్యావసర వస్తువులన్నీ (బట్టలు, ఉప్పు, పంచదార, కిరసనాయిలు

ఇత్యాదులు), లోహాలు, యంత్రాలు - వాటి విడిభాగాలు ముఖ్య దిగుమతులు.

నేపాల్ వ్యాపారంలో అత్యధికభాగం మన దేశంతోనే జరుగుతున్నది.

1816 వ సంవత్సరంనుండీ, ఇది బ్రిటిష్ సామ్రాజ్యవాదుల వలస దేశంగా ఉండేది. ఆర్థికంగా, రాజకీయంగా నేపాల్ ఎంతో వెనుకబడి ఉంది. 1926 వ సంవత్సరంవరకూ బానిస విధానం ఉండేది. 1926 లో చట్టరీత్యా నిషేధించబడినా నేటికీ యీ వాసనలు చావలేదు. ప్రజలు భూస్వామ్య దోపిడీకి నలిగిపోయి, నికృష్ట జీవితం గడుపుతున్నారు. వీరి దారిద్ర్యాన్ని అవకాశంగా తీసుకుని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు నామమాత్రపు జీతాలిచ్చి గూర్ఖాలను తమ సైన్యాలలోకి తీసుకుంటున్నారు.

ఈ దేశంలో రాజరికం, ప్రధాన మంత్రిత్వం వంశ పారపర్యంగా వస్తున్నాయి. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు యీ రెండు కుటుంబాలవారి మధ్య తగాదాలు పెట్టి, తాము పైన కర్రపెత్తనం చేస్తూ తమ దోపిడీని కొనసాగిస్తూ వచ్చారు. నేపాల్ రాజ్యాంగ చట్టం, విదేశీయులు (బ్రిటిష్‌వారు తప్ప) ఎవరూ రావటానికి సమ్మతించదు. అందుచేత బ్రిటనే దేశంమీద ఏకచ్ఛత్రాధిపత్యం నిర్వహిస్తూ వచ్చింది.

కాని రెండవ ప్రపంచయుద్ధానంతరం ఇక్కడకూడా అమెరికన్ సామ్రాజ్యవాదులు పోటీ వచ్చారు. దేశంలో అవసరమైనపుడు చైనామీద దాడిచేయడానికి ఉపకరించే యుద్ధస్థావరాలను నిర్మించడం వీరి ప్రధానాశయం.

రాణా ప్రభుత్వంతో 1948 లో పరస్పర మిత్రత్వ సంధి నొకదాన్ని చేసుకొన్నారు. రాయబార కార్యాలయాలుకూడా ఏర్పరచబడ్డాయి. 1951 లో ట్రూమన్ చతుస్సూత్ర ప్రణాళికకింద "ఆర్థిక సహాయ ఒడంబడిక" కూడా జరిగింది. రాణా ప్రభుత్వం అమెరికా పెట్టుబడిదారులకు, దేశ ఖనిజసంపదను దోచుకపోవటానికి అనేక

సదుపాయాలుకూడా చేసింది. ఈ విధంగా అమెరికా, స్వల్పకాలంలోనే రాణా ప్రభుత్వంమీద విశేష పలుకుబడిని సాధించి, క్రమంగా తమ అనుకూలురను ప్రభుత్వంలోకి తేవాలని కుట్రలు ప్రారంభించింది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఆసియా వలసదేశాలలో ప్రజ్వలించిన విమోచనోద్యమాన్ని చూచి ఉత్తేజితులైన నేపాలు ప్రజలు, తామూ భూస్వామ్య దోపిడీనుండి, విదేశీ సామ్రాజ్యవాదుల బానిసత్వంనుండి విముక్తిపొందటానికి, కమ్యూనిస్టుపార్టీ, రైతు, కూలీ, విద్యార్థి ఉద్యమాలక్రింద సంఘటితపడటం ప్రారంభించారు. ప్రజా ఉద్యమం దినదిన ప్రవర్థమానమవుతూ వచ్చింది.

1950 నవంబర్లో విదేశీ సామ్రాజ్యవాదుల కుట్రలవల్ల రాణాకు, రాజుకు మధ్య కుమ్ములాట వచ్చింది. ఈ కుమ్ములాటను ప్రజలు ప్రజా విప్లవంగా మార్చివేశారు. రాజు, రాణా, వీరి పరిరక్షకులయిన ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు - అంతా కొట్టుకొనిపోయే పరిస్థితులు ఏర్పడ్డాయి. ప్రజలు సాయుధులై ప్రభుత్వ సైన్యాల నెదిరిస్తూ, అనేకచోట్ల విమోచనోద్యమ స్థావరాలను ఏర్పరచుకొన్నారు.

"భూస్వామ్య విధానం రద్దు", "భూ సంస్కరణలు"లాంటి ప్రజాస్వామిక నినాదాలతో, నేపాలీ కాంగ్రెసు, (మన కాంగ్రెసు వంటిదే) అత్యధిక ప్రజలను తన వైపు తిప్పుకో గలిగింది. ప్రజా ఉద్యమం తమ చేతిలోంచి దాటిపోతున్నదని, భూస్వామ్య విధానమే తుడిచిపెట్టుకపోయే "ప్రమాదం" ఏర్పడిందని ఎప్పుడయితే యీ నాయకులు గుర్తించారో, వెంటనే ఉద్యమాన్ని ఆపుచేయవలసిందిగా పిలుపునిచ్చి ప్రజా ఉద్యమానికి ద్రోహం చేశారు. 1951 జనవరిలో రాణాతో రాజీచేసుకుని, మంత్రివర్గంలో సగం స్థానాలు సంపాదించారు.

కాని వీరు ఎంతోకాలం ప్రజలను మోసం చేయలేకపోయారు. ప్రజా ఉద్యమం తిరిగి ఉన్నతస్థాయికి పోయింది. దీనితో రాణా రాజీనామా చేయక తప్పలేదు.

యం. పి. కోయిరాలా ప్రధానమంత్రిగా, కాంగ్రెసుమంత్రివర్గం ఏర్పాటయింది. ఈ మంత్రివర్గం భూసంస్కరణలను అమలుజరపలేదు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు గూర్ఖాలను సైన్యంలోకి చేర్చుకోడాన్ని ఆపలేదు. ప్రజాతంత్ర హక్కులకు ఎటువంటి రక్షణా కల్పించలేదు. కమ్యూనిస్టుపార్టీ, ఇతర ప్రజాసంఘాలపైన తీవ్ర నిర్బంధ విధానాన్ని ప్రయోగించింది. ప్రజాఉద్యమాన్ని అణచడమే ఆశయంగా పెట్టుకుని పనిచేసింది.

ఈ విద్రోహచర్యవల్ల కాంగ్రెసు అనుయాయులు అనేకమంది ఆ సంస్థ నుండి బైటికివచ్చి పోరాటాన్ని కొనసాగిస్తున్న ప్రజాశక్తులతో చేరిపోయారు. అనేకచోట్ల సాయుధ తిరుగుబాట్లు, సమ్మెలు, ప్రదర్శనాలు జరిగాయి. 1952 జూన్ నెలలో రాజధానీ నగరమైన ఖట్మండూలోనే పెద్ద తిరుగుబాటు జరిగింది.

కోయిరాలా ప్రభుత్వం సైన్యాల సహాయంతో యీ తిరుగుబాట్లను క్రూరంగా అణచివేస్తూ వచ్చింది. కమ్యూనిస్టుపార్టీని నిషేధించింది. తిరుగుబాటుకు నాయకత్వం వహించిన కె. ఐ. సింగ్ దేశంవిడిచి పోవలసివచ్చింది.

ఇంతలో, నేపాలీ కాంగ్రెసును హస్తగతం చేసుకున్న కోయిరాలా అన్నదమ్ముల్లో పదవులకొరకు కుమ్ములాట ప్రారంభమైంది. దీన్ని అవకాశంగా తీసుకుని, రాజు "త్రిభువన" మంత్రివర్గాన్ని 1952 ఆగస్టులో రద్దుచేసి, సలహాదారులతో పరిపాలన కొనసాగించటం ప్రారంభించాడు.

రాజుగారు ఏవో తీవ్ర సంస్కరణలు అమలుజరుపబోతున్నారనే ఆశను కల్పించి, ప్రజా ఉద్యమాన్ని ఉపశమింపచేయ ప్రయత్నించాడు. ఈ యెత్తులోభాగమే, "రైతుల స్థితిగతులను విచారించడానికి" కమిషన్ నియమించడం, 1954 మార్చిలో ఎన్నికలు జరుపుతానని ప్రకటించడం. (1953, ఫిబ్రవరి)

1953 జూన్‌లో తిరిగి యం.పి. కోయిరాలా ప్రధానమంత్రిగా, వచ్చాడు. పదవుల కొరకు నేపాలీ ప్రజా పరిషత్, నేపాలీకాంగ్రెస్,

రాష్ట్రీయ ప్రజాపార్టీ, నేపాలీ నేషనల్ కాంగ్రెసులాంటి జేబీసంస్థల నేర్పరచుకున్న భూస్వామ్యవర్గాలు పేచీ పెట్టటంవల్ల, వీరితో రాజీ పడి, వీరి ప్రతినిధులతో కోయిరాలా మంత్రివర్గాన్ని 1954 ఫిబ్రవరిలో పునర్నిర్మించాడు.

కోయిరాలా పార్టీలో ముఠా తగాదాలు మరొకసారి ప్రజ్వలించటంవల్ల అది సరిగా పనిచేయలేక పోయింది. ఈ స్థితిలో రాజు మంత్రివర్గాన్నీ, సలహా యిచ్చే ఎసెంబ్లీనీ రద్దుచేశాడు. (ఈ ఎసెంబ్లీ సభ్యులు ప్రజలచేత ఎన్నుకోబడినవారు కాదు. నామినేటు చేయబడినవారు).

ఈ మధ్యకాలంలో అటు ప్రజాచైనా, యిటు భారతదేశాలు అనుసరిస్తున్న విధానాలు నేపాలు రాజకీయాలలో పెద్ద మార్పులకు కారణమయినాయి. నేపాలు ప్రభుత్వం ఏ అగ్రరాజ్య కూటమితో చేరకుండా తటస్థ విధానాన్ని అనుసరించ ప్రారంభించింది. భారతదేశంతో సన్నిహిత స్నేహాన్ని పెంపొందించుకున్నది.

1955 జులై 26 న చైనా, నేపాలు ప్రభుత్వాల ప్రతినిధులు సంప్రదింపులు జరిపి, ఉభయదేశాలు దౌత్యసంబంధాల నేర్పరచుకోడానికి నిశ్చయించారు; పంచశీలాల ప్రాతిపదికమీద మిత్రత్వాన్ని నెరపటానికి అంగీకరించారు.

1956 లో రాజు తిరిగి మంత్రివర్గాన్ని ఏర్పరచాడు. తనకా ప్రసాద్ ఆచార్య యీ కొత్త మంత్రివర్గానికి ప్రధాని. కొత్త మంత్రివర్గం, యే రాజ్యకూటమిలోను చేరదని, తటస్థవిధానాన్ని అవలంబిస్తూ, శాంతికి కృషిచేస్తుందని ప్రకటించింది.

1956 మేలో కమ్యూనిస్టుపార్టీమీద ఉన్న నిషేధాన్ని తొలగించింది.

మే మొదటివారంలో రాజు పట్టాభిషేక మహోత్సవం జరిగింది. దానికి చైనా, సోవియట్ దేశాల ప్రతినిధులుకూడా హాజరయినారు.

# సింహళం

దీన్నే "సిలోన్" అని కూడా అంటారు. ఇది గత రెండువందల సంవత్సరాలు బ్రిటిషు వలసదేశంగా వుంది. 1948 లో అధినివేశ స్వాతంత్ర్యం పొందింది.

ఈ ద్వీపం మనదేశానికి దక్షిణాన ఉన్నది. వైశాల్యం 25,332 చదరపు మైళ్లు. జనాభా 80,98,637 (1953). వీరిలో మూడింట రెండు వంతులు సింఘలీలు; 20 లక్షల మంది తమిళులు. యూరోపియను జనాభా సుమారు 12,000 మాత్రమే; కాని దేశ సంపద అంతా వీరి చేతుల్లోనే వుంది.

జనాభాలో సగంకంటె కొంచెం అధికభాగం బౌద్ధమతస్థులు; ఐదవ వంతు జనాభా హిందూమతస్థులు.

వాతావరణం మనదేశంలోవలె వుంటుంది. సాలుసగటు వర్షపాతం 40 అంగుళాలు. దక్షిణానవున్న కొన్ని పర్వత ప్రాంతాల్లో 200 అంగుళాలవరకు వర్షం పడుతుంది.

నూటికి 85 మంది ప్రజల వృత్తి వ్యవసాయమే.

సాగవుతున్న భూమిలో అత్యధికభాగం విదేశీ తేయాకు, రబ్బరుతోటల యజమానులకిందే ఉంది. రైతుల్లో నూటికి 90 మందికి స్వంత భూములే లేవు. కౌలు రేట్లుకూడా అధికం. పండినపంట కౌలు చెల్లించేందుకే చాలదు. వ్యవసాయ కూలీలకు నామమాత్రపు వేతనాలిచ్చి, విదేశీ, స్వదేశీతోటల యజమానులు వీరి శ్రమశక్తిని కారుచౌకగా దోచేసుకొంటున్నారు. అందుచేత రైతుకూలీల బ్రతుకు నికృష్టంగా ఉంది.

రబ్బరు, తేయాకు, కొబ్బరి, వరి ముఖ్య వ్యవసాయ పంటలు. తేయాకు పెద్ద ఎత్తున పండించే దేశాల్లో భారతదేశం తర్వాత చెప్ప దగింది సింహళమే! ప్రపంచ రబ్బరు ఉత్పత్తిలో మలయా, ఇండో నీషియాల తర్వాత ఎక్కువ ఉత్పత్తిచేసేది యీ దేశమే!

దేశ ఆర్థికవ్యవస్థకు వెన్నెముకైన యీ రెండు పరిశ్రమలు బ్రిటిష్ పెట్టుబడిదార్ల చేతుల్లోనే ఉన్నాయి.

గ్రాఫైట్, థోరియం, యురేనియం, లిమ్మెనైట్, మోనొజైట్, మొదలైన ఖనిజాలు యిక్కడ లభిస్తాయి. వీటిలో గ్రాఫైట్ మాత్రం తవ్వబడుతూంది. ఈ పరిశ్రమకూడా బ్రిటిష్ పెట్టుబడిదార్ల చేతుల్లోనే ఉంది. థోరియం, యురేనియం ఖనిజాలకోసం అమెరికా పెట్టుబడిదార్లు ప్రయత్నాలు ప్రారంభించారు.

తేయాకు, రబ్బరు శుభ్రపరిచే ఫాక్టరీలు, యీ తోటల్లో ఉపయోగపడే పనిముట్లను చేసే పరిశ్రమలు తప్ప ఇతర పరిశ్రమలేవీ అభివృద్ధి కాలేదు. వలసదేశాల్లోని ముడిపదార్థాలను దోచుకపోవటమే ముఖ్య లక్ష్యంగా గలిగిన సామ్రాజ్యవాదులు దేశ పారిశ్రామికాభివృద్ధిని అరికట్టడం జగమెరిగిన సంగతే!

తేయాకు, రబ్బరు, కొబ్బరి, కొబ్బరినూనె, గ్రాఫైటు ముఖ్య ఎగుమతులు.

మొత్తం ఎగుమతులవల్ల దేశానికివచ్చే రాబడిలో నూటికి 55పాళ్ళు ఒక్క తేయాకువల్లే వస్తున్నది. తేయాకు ఎగుమతుల్లో మన దేశానికి, సింహళం ప్రధాన పోటీదారు.

ఆహారపదార్థాలు, వస్త్రాలు, పెట్రోలు, యంత్రాలు, యంత్రభాగాలు, బొగ్గు, లోహాలు ముఖ్య దిగుమతులు.

ఎగుమతి వ్యాపారంలో నూటికి 60 పాళ్ళు, దిగుమతి వ్యాపారంలో నూటికి 55పాళ్లు బ్రిటన్‌తోనే జరుగుతున్నది. బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు రబ్బరు, తేయాకు, కొబ్బరి, గ్రాఫైటు మొదలయిన ముడిసరుకులనుకారుచౌకగా దోచుకుపోయి,తమదేశంలో తయారయిన పారిశ్రామిక సరుకునంతా సింహళానికి ఎగుమతిచేస్తున్నారు.

యుద్ధానంతరం, సింహళ వ్యాపారంలో అమెరికా కూడా ప్రధాన భాగస్వామినిగా తయారైంది.

అమెరికాయే రబ్బరు, గ్రాఫైట్ దిగుమతి చేసుకుంటున్నది.

అమెరికా పెట్టుబడిదార్లు కృత్రిమ రబ్బరును ఉత్పత్తిచేస్తూ, రబ్బరు ధరలను తగ్గించడంవల్ల, ప్రపంచంలో రబ్బరు ఉత్పత్తి చేసే దేశాలన్నింటిలోను ఉత్పత్తులు నిల్వవుండిపోయి, పెద్ద ప్రతిష్టంభన ఏర్పడింది.

ఈ స్థితిలో న్యాయమయిన ధర యిచ్చి ప్రజా చైనా తాను రబ్బరు కొంటాననిని, సింహాళానికి అత్యవసరమైన బియ్యం చౌకగా సప్లయిచేస్తానని ప్రతిపాదనలు చేసింది. దీనికి అంగీకరించి, సింహాళ ప్రభుత్వం చైనాతో 1952 డిసెంబరులో వ్యాపార ఒడంబడిక చేసుకుంది.

ఈ నాలుగు సంవత్సరాల నుండి సింహాళ దేశ రబ్బరులో అధిక భాగాన్ని చైనాయే కొంటున్నది. సింహాళం కోరినంత బియ్యాన్ని సప్లయిచేస్తున్నది. ఈ వ్యాపార ఒడంబడికను రద్దుచేయించటానికి అమెరికా సామ్రాజ్యవాదులు సింహాళ ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చారు. కాని, సింహాళ ప్రభుత్వం లొంగలేదు.

సింహాళం మనదేశానికి కొబ్బరి, కొబ్బరినూనె, రబ్బరు, సుగంధ ద్రవ్యాలు ఎగుమతిచేసి, వస్త్రాలు, జనపనార సంచులు, పట్టు, బియ్యం ఇత్యాదుల దిగుమతి చేసుకొంటున్నది.

కొలంబో దేశరాజధాని, ముఖ్య ఓడరేవు. యూరపు నుండి ఆసియా ఖండపు తూర్పుదేశాలకు వెళ్ళే ఓడలన్నీ కొలంబో మీదుగానే వెళ్తాయి.

ఈస్టిండియా కంపెనీ పేరుతో వ్యాపారానికని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మన దేశానికివచ్చి, చివరకు దేశాన్నే దిగమింగినట్లుగా, 19 వ శతాబ్ద ప్రారంభానికల్లా సింహాళాన్నికూడా తమ వలసదేశంగా చేసుకున్నారు.

వీరు తాము సాగుచేసుకుంటున్న సారవంతమైన భూములనుండి దేశీయ ప్రజలను తరిమేసి, ఆ భూముల్లో కాఫీ, తేయాకు, రబ్బరు, సింకోనా తోటలు పెంచటం ప్రారంభించారు. ఇదీ చాలదన్నట్లు విపరీతంగా పన్నులు గుంజటం ప్రారంభించారు.

ఈ ఘోరకృత్యాలను చేస్తున్న సామ్రాజ్యవాదుల తేయాకు, కాఫీ, రబ్బరు తోటల్లో పనిచేయటానికి సింహాళ ప్రజలు నిరాకరిస్తే, దక్షిణ భారతదేశాన్నుండి తమిళ కూలీలను "దిగుమతి" చేసి, స్వల్ప కూలిచ్చి వారితో పనిచేయించటం ప్రారంభించారు.

తేయాకు, కాఫీ, రబ్బరు తోటలను పెంచి, వీటి ఉత్పత్తుల అమ్మకంమీద విపరీత లాభాలు గడించ నేర్చిన బ్రిటిష్ పెట్టుబడి దార్లు క్రమంగా వ్యవసాయ భూములన్నింటిని ఆక్రమించి, తోటలు వెయ్యటం ప్రారంభించారు. దీనితో దేశంలో ఆహార పంటలు పండించే భూమి కొరతబడి, దేశంలో తీవ్ర ఆహారకొరత ఏర్పడింది.

ఈ విధంగా బ్రిటిషు సామ్రాజ్యవాదులు దేశ సంపదను కారు చౌకగా దోచుకపోవటమేకాక, ఆహారకొరతను తెచ్చిపెట్టారు. నామ మాత్రపు కూలినిచ్చి, ప్రజల శ్రమను కారుచౌకగా దోచుకొంటూ, పన్నుల భారంతో క్రుంగదీశారు. తత్ఫలితంగా ప్రజల జీవితం మరింత కృశించిపోయింది.

20 వ శతాబ్ద పూర్వార్థభాగంలో ప్రజల అసంతృప్తి నిర్మాణ రూపం ధరించ నారంభించింది. జాతీయోద్యమం ఫలితంగా 1909 వ సంవత్సరంలో సామ్రాజ్యవాదులు నేతిబీరకాయ లెజిస్లేటివ్ కౌన్సి లును ఏర్పాటుచేయక తప్పిందికాదు.

1919 లో దేశంలోని భూస్వామ్య, పెట్టుబడిదారీవర్గాలు కలిసి మన కాంగ్రెసు సంస్థవంటి "సింహాళ కాంగ్రెసు" అనే సంస్థను ఏర్పాటుచేశారు. ఇది దేశంలో ఏర్పడ్డ మొట్టమొదటి జాతీయ సంస్థ. వెంటనే సామ్రాజ్యవాదులు, యీ సంస్థ ప్రతినిధులలో ముగ్గురుని లెజిస్లేటివ్ కౌన్సిల్లోకి తీసుకున్నారు.

1931 లో బ్రిటన్ ఒక బానిసరాజ్యాంగాన్ని తయారుచేసి, ఎన్నికలద్వారా బూర్జువావర్గ ప్రతినిధులు స్టేట్సు కౌన్సిలుకు ఎన్ని కయ్యేట్లు చేసింది. సివిల్, మిలిటరీ అధికారా లన్నిటినీ తమ ప్రతినిధి అయిన గవర్నరు జనరల్ చేతిలోనే ఉంచింది.

ఈవిధంగా జాతీయోద్యమ బలం, ప్రజాందోళన పెరిగి తమ ఉనికికి ప్రమాదంవస్తుందని గ్రహించినపుడల్లా, బ్రిటిష్ పాలకులు యిటువంటి ఎరలనువేసి ప్రజల్ని మోసంచేస్తూ, తమ దోపిడీని నిశ్చింతగా కొనసాగిస్తూవచ్చారు.

కాని రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఆసియా ఖండంలోని అన్ని వలస దేశాల్లోవలె సింహళంలోకూడా జాతీయోద్యమం ఉరకలు వేస్తూ బ్రిటిషు సామ్రాజ్యవాదుల ఉనికికే "ప్రమాదం" తెచ్చి పెట్టింది.

యుద్ధకాలంలో కూలిరేట్లు పెరక్కపోగా, కొనే వస్తువుల ధరలు పెరిగిపోయాయి. తిండి కరువు తీవ్రమయింది. ప్రజల జీవన స్థాయి పడిపోయి, జీవితం మరింత నికృష్టమై పోయింది.

ప్రజల్లో ప్రబలిన తీవ్రఅసంతృప్తి దేశవ్యాపిత సమ్మెగా ప్రదర్శిత మైంది. తేయాకు, రబ్బరు, కాఫీ తోటల్లోను, నౌకా కేంద్రం లోను పనిచేసే కూలీలు సమ్మెకట్టారు. ఆఫీసుల్లో పనిచేసే మధ్యతర గతి ఉద్యోగస్తులుకూడ సమ్మెచేశారు. సామ్రాజ్యవాద ప్రభుత్వం తుడిచిపెట్టుకపోయేస్థితి ఏర్పడింది. ఈ ప్రజా వెల్లువనుచూచి హడ లెత్తిన బూర్జువావర్గం కనీసం అధినివేశ ప్రతిపత్తి నయినా ఇవ్వ మని 1945వ సంవత్సరం మార్చి నెలలో బ్రిటిషుప్రభుత్వాన్ని కోరింది.

బ్రిటిషు సామ్రాజ్యవాదులు కూడా, ఈ "ప్రమాదం"నుండి బయటపడ్డానికి దేశీయ పెట్టుబడిదారీ వర్గంతో రాజీపడడం మంచిదని ఆలోచించారు.

తేయాకు, రబ్బరు తోటలయజమానులైన దేశీయ పెట్టుబడి దార్లు "యునైటెడ్ నేషనల్ పార్టీ" అని ఒక పార్టీని స్థాపించారు. ఇది దేశీయపెట్టుబడిదార్ల ప్రతినిధిసంస్థ. వీరిలో చాలమందికి బ్రిటిషు పెట్టుబడిదార్లతో వ్యాపార సంబంధాలున్నాయి.

1947 వ సంవత్సరం, సెప్టెంబరు 26 వ తేదీన, సామ్రాజ్య వాదులు ఈ సంస్థనాయకుడు, బ్రిటిషు పెట్టుబడిదార్లతో సన్నిహిత సంబంధం ఉన్నవ్యక్తి అయిన స్టీఫెన్ సేనానాయకేతో ఒక "జాతీయ"

ప్రభుత్వాన్ని ఏర్పాటుచేశారు. 1948 ఫిబ్రవరి నాల్గవ తేదీన దేశానికి అధినివేశ స్వాతంత్ర్యంకూడా ఇవ్వబడింది.

ఇంతమాత్రాన దేశంమీద బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పెత్తనం తొలగిపోలేదు. దేశ పరిపాలనను అజమాయిషీ చేసే గవర్నరుజనరల్‌ను బ్రిటిష్ ప్రభుత్వమే నియమిస్తుంది. దేశంలో సైనిక, వైమానిక, నౌకా కేంద్రాలను నిర్మించుకొనే హక్కు వీరి కుంది. దేశ ఆర్థికవ్యవస్థమీద బ్రిటిష్ పెట్టుబడులపట్టు యథాతథం గానే ఉంది. దేశీయ, విదేశీయ వ్యవహారాలన్నీ సామ్రాజ్యవాదులే చక్కబెడతారు. బ్రిటిష్ సైన్యాలు దేశంలో ఉంటాయి. నౌకా, వైమానిక యుద్ధకేంద్రాలను నిర్మించుకొనే హక్కు వీరికుంది.

ఈవిధంగా అధినివేశ స్వాతంత్ర్యంవల్ల దేశానికి ఒరిగినదేమీ లేదు. పాలించే వ్యక్తులు మాత్రమే మారారు.

యుద్ధకాలంలో అమెరికా పెట్టుబడిదార్లు దేశంలో దొరికే రబ్బరు, గ్రాఫైట్‌లు కొనడానికి రా నారంభించారు. అప్పటినుంచీ, ఇంత ముఖ్య యుద్ధపు ముడిసరుకులను సప్లయిచేసే సింహళాన్ని తమచేతికిందకు తెచ్చుకొనేందుకు ప్రయత్నిస్తూనే వచ్చారు. తమ పెట్టుబడులను అనేక పేర్లతో దిగుమతి చేస్తున్నారు; క్రమంగా ప్రభుత్వంలో పలుకుబడికూడా సంపాదించారు.

నేషనల్‌పార్టీ ప్రభుత్వం అమెరికా సామ్రాజ్యవాదుల సలహా ప్రకారం పనిచేస్తూ, కమ్యూనిస్టు వ్యతిరేకవైఖరి నవలంబిస్తూ, చైనా, సోవియట్ యూనియన్లతో దౌత్యసంబంధాలు పెట్టుకోడానికి నిరాకరించింది. ఆఖరుకు సోవియట్ ఆటగాండ్రనుకూడా దేశంలో కాలుపెట్టనీయలేదు.

సింహళప్రభుత్వం నెగొంబాలో ఒక విమానస్థావరాన్ని, ట్రింకోమలీలో ఒక నౌకాకేంద్రాన్ని బ్రిటనుకు అప్పగించింది. అమెరికన్ సామ్రాజ్యవాదుల ప్రచారానికి తమ రేడియోస్టేషనును ఉపయోగించుకోనిచ్చింది. ఆఖరికి బాండుంగ్‌సభలో అమెరికా తైనాతీగా వ్యవహరించింది. సింహళభారతీయుల సమస్యను

సౌమ్యంగా పరిష్కరించడానికి బదులు, జాతివిద్వేషాన్ని రెచ్చ గొట్టింది. సామ్రాజ్యవాదుల దోపిడీని రక్షిస్తూ, ప్రజల జీవన ప్రమాణాలను పెంచడానికి పూనుకోలేదు. ప్రజలప్రయోజనాలను సామ్రాజ్యవాదులకు బలిపెట్టింది. ఈ పాపం పండి, 1956 ఏప్రిల్ ఎన్నికల్లో చిత్తుగా ఓడిపోయింది.

బండారునాయకే నాయకత్వాన ఏర్పడిన ఐక్యసంఘటన ప్రజా స్వామిక కార్యక్రమం మీద ఎన్నికల్లో పాల్గొన్నది. బ్రిటిష్ సామ్రా జ్యంలో భాగం కాకుండా సింహాళం రిపబ్లిక్ కావాలని, విదేశీయుల సైనిక స్థావరాలను రద్దుచేస్తామని, విదేశీయుల చేతుల్లో ఉన్న తేయాకు, కాఫీతోటలను, బ్యాంకులను జాతీయం చేస్తామని వీరు చెప్పారు.

ఇట్టి సామ్రాజ్యవ్యతిరేక కార్యక్రమం కొరకు ఉవ్విళ్లూరుతున్న సింహాళ ప్రజలు, ఐక్యసంఘటనను ఎన్నికలలో గెలిపించారు. మొత్తం 95 సీట్లలో 51 సీట్లు ఐక్యసంఘటనకు వచ్చాయి. నేషనల్ పార్టీ మంత్రులలో దాదాపు అంతా ఓడిపోయారు. 8 సీట్లు మాత్రం వీరికి వచ్చాయి. కమ్యూనిస్టుపార్టీకి మూడుసీట్లు వచ్చాయి.

బండారునాయకే ప్రధానిగా మంత్రివర్గం ఏర్పడింది. తన ప్రభుత్వం నెహ్రూ అనుసరిస్తున్న విదేశాంగ విధానంవంటి దాన్నే అనుసరిస్తుందని అతడు ప్రకటించాడు.

ఏ కూటమితోనూ చేరక తటస్థంగా ఉంటామని అన్నాడు. రక్షణ, సాంస్కృతిక వ్యవహారాల్లో తనప్రభుత్వం ఆసియాదేశాలతో సన్నిహిత సహకారం నెరపుతుందనీ, చైనా, సోవియట్ దేశాలతో దౌత్యసంబంధాలను పెట్టుకుంటుందనీ కూడా చెప్పాడు.

ప్రజాశ్రేయస్సుకు అవసరమయిన అనేక సంస్కరణలు చేస్తా మని అన్నాడు.

ఈ కార్యక్రమం బ్రిటిషు, అమెరికన్ సామ్రాజ్యవాదులకు దక్షిణ ఆసియాలో గట్టి దెబ్బతీయగల్గుతుంది. ఈ ప్రాంతంలో శాంతి రక్షణకు దోహదం చేస్తుంది.

# బర్మా

భారతదేశం, చైనా, వియత్‌నామ్ దేశాలమధ్య బర్మా ఉన్నది. దీని వైశాల్యం 26 లక్షల చదరపుమైళ్ళు; జనాభా సుమారు 1,70,00,000. వీరిలో అరవై లక్షలమంది షాన్, కరెన్, కచిన్, ఆరకాన్ కొండజాతుల ప్రజలు.

సగటు జనసమ్మర్దం చదరపుమైలుకు 72. సారవంతమైన డెల్టా ప్రాంతాలలో మాత్రం – పెగూ, ఐరావతి, మాండలే ప్రాంతాలలో– చదరపుమైలుకు 215 నుండి 153 వరకు ప్రజలు నివసిస్తున్నారు.

ఉత్తరదేశమంతా పర్వతమయం. ఈ పర్వతాలలోనే ఐరావతి, సాల్వోయిన్ నదులుపుట్టి, దక్షిణంగా ప్రవహించి, బంగాళాఖాతంలో కలుస్తున్నాయి. ఐరావతినది ముఖద్వారంమీదే దేశ రాజధానీ, ముఖ్య రేవుపట్టణమూ అయిన రంగూన్ పట్టణం ఉన్నది.

బర్మా భూమధ్యరేఖ ప్రాంతంలో ఉండడంవల్ల, సంవత్సరంలో అన్ని నెలలూ ఉష్ణం అధికంగానే ఉంటుంది. వర్షాలు మే నెలలో ప్రారంభమై, సెప్టెంబరువరకూ ఎడతెగకుండా కురుస్తుంటాయి. దేశ సగటు వర్షపాతం నూరు అంగుళాలు.

దేశ వైశాల్యంలో నూటికి 60 వంతుల ప్రాంతంలో పెద్ద అడవులున్నాయి. వీటిలో టేకు విస్తారంగా దొరుకుతుంది. తర్వాత చెప్పదగింది వెదురు. ప్రపంచంలో లభ్యమవుతున్న టేకు కలపలో, ఒక్క బర్మాలోనే నూటికి 75 వంతులు లభిస్తున్నది.

నూటికి 80 మంది ప్రజలకు వ్యవసాయమే జీవనాధారం.

దేశంలో పండే పంటలలో వరి ముఖ్యమైనది. సాగుక్రింద ఉన్న మొత్తంభూమిలో, నూటికి 60 వంతుల విస్తీర్ణంలో వరి పండించబడుతున్నది. బియ్యం ఎగుమతిచేసేదేశాల్లో బర్మా ఒక ముఖ్య దేశంగా పరిగణించబడుతూంది. తర్వాత చెప్పదగినవి నువ్వులు, వేరుశనగ, పత్తి మొదలయినవి.

పెట్రోలు, సీసము, తుత్తునాగము, తగరం, వెండి ఇచ్చట దొరికే ఖనిజాలలో ముఖ్యమైనవి. ఆగ్నేయ ఆసియాలో పెట్రోలు ఉత్పత్తిచేసే ముఖ్య దేశాలలో బర్మా ఒకటి. వీటి నుపయోగించు కోగలిగిన పరిశ్రమలు లేకపోవడంచేత దాదాపు ఉత్పత్తి అంతా ఎగుమతిచేయబడుతోంది.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు దేశీయపరిశ్రమలను అభివృద్ధి కానీయ లేదు. వివిధ గనిపరిశ్రమలు, పెట్రోలు, కలప కోతపరిశ్రమలు, రైల్వేలు, నదీరవాణా యావత్తూ తమ చేతిలో పెట్టుకుని వీరు దేశాన్ని కొల్లగొట్టుతున్నారు. కొన్ని పరిశ్రమలలో మన నాటుకోటి చెట్టియార్లుకూడా పెట్టుబడు పెట్టి— చాలచోట్ల బ్రిటిష్ కంపెనీలతో కలసి—ఈ దోపిడీలో భాగం పంచుకుంటున్నారు.

బ్రిటిషు స్టీల్ బ్రదర్సు అనే కంపెనీక్రింద కొన్ని తగరం, సీసం, తుత్తునాగం ఇత్యాదిగనులు, పవర్ స్టేషన్లు, రంగూన్ - మాండలే రైల్వే ఉన్నాయి. ఈ కంపెనీ యుద్ధానికిపూర్వం పెట్టిన పెట్టుబడికి 4½ రెట్లు లాభంతీసిందంటే, వీరిదోపిడీయొక్క స్థాయి అర్థమవుతుంది.

దేశంలో నదీరవాణా ముఖ్యమైనది. ఐరావతినదిలో వెయ్యి మైళ్ళవరకూ పడవలు వెళ్ళవచ్చు. మధ్యబర్మానుండి వివిధసరుకులను రేవుపట్టణానికి చేరవేయటంలో, ముఖ్య రవాణా సాధనంగా ఉపయోగ పడుతున్నది. సాల్వేయిన్‌నదిలో 80 మైళ్ళవరకూ పడవలు వెళ్ళడానికి వీలున్నది.

తర్వాత చెప్పదగిన రవాణా సాధనం రైల్వేలు. బర్మాలోని అన్ని రైలుమార్గాలూ మీటరుగేజివే! 1940 వ సంవత్సరానికి 2,060 మైళ్ళ రైలుమార్గం ఉంది. రోడ్లు తగినంతగా అభివృద్ధి చెందలేదు.

బర్మా మొత్తం ఎగుమతులలో నూటికి 70 పాళ్లు బియ్యం, పెట్రోలు ఉంటున్నాయి. మొత్తం ఎగుమతుల్లో నూటికి 75 పాళ్లు భారతదేశానికి వెళ్తాయి. మిగిలినదానిలో అత్యధికభాగం బ్రిటన్‌కు పంపబడుతున్నాయి.

పెట్రోలు, సీసము, తుత్తునాగం, తగరం, టంగ్‌స్టన్ మొద లయిన ఖనిజాలు, కలప, బియ్యం ముఖ్య ఎగుమతులు.

దిగుమతులలో, యంత్రాలు, యంత్రసామానులు, ప్రజల నిత్యావసరవస్తువులు, ఇనుము, ఉక్కు, ముఖ్యమైనవి. దిగుమతుల్లో నూటికి 50 పాళ్లు భారతదేశాన్నుండి, 20 పాళ్ళు బ్రిటన్‌నుండి వస్తాయి. బ్రిటన్‌నుండి యంత్రాలు, యంత్రభాగాలు, ఇనుము, ఉక్కు, రసాయన పదార్థాలు దిగుమతి చేయబడేవి.

వంద సంవత్సరాల బ్రిటిషు సామ్రాజ్యవాదుల పాలనకు వ్యతిరేకంగా బర్మా ప్రజల జాతీయోద్యమం క్రమంగా అభివృద్ధవుతూ వచ్చింది. 1939 లో దేశ స్వాతంత్ర్యాన్ని గుర్తించ వలసినదిగా కోరిన జాతీయోద్యమ నాయకులకు జవాబుగా, "యుద్ధానంతరం" ఆలోచిస్తాం అని సామ్రాజ్యవాదులు సమాధానం చెప్పారు.

1942 లో జపాన్ సైన్యాల దాడినుండి, బర్మా ప్రజలను రక్షించలేక, బ్రిటిషు సామ్రాజ్యవాదులసేనలు దేశాన్ని జపాను సామ్రాజ్యవాదులకు వదలి పారిపోయాయి. ప్రజలే సాయుధులై, జపాను సైన్యాలను ఎదిరిస్తూ వచ్చారు. ఈ ప్రతిఘటనోద్యమాన్ని ఐక్యపరచేటందుకు, కమ్యూనిస్టుపార్టీ, సోషలిస్ట్‌పార్టీ, మ్యాఛిట్ పార్టీ, బర్మా బర్మాదేశీయులకే అనే నేషనలిస్టు గ్రూపు, బర్మా ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు, తదితర రైతు, యువజన, మహిళా, బౌద్ధమత సంఘాలతో "ఫాసిస్టు వ్యతిరేక ప్రజల స్వాతంత్ర్య సంఘటన" (Anti- Fascist Peoples' Freedom league) ఏర్పరచబడింది. కమ్యూనిస్టుల, అతివాద సోషలిస్టుల నాయకత్వాన, సాయుధులైన రైతు కూలీ ప్రజలతో, ప్రజా వలంటీరు దళం ఒకటి ఏర్పరచబడి. "స్వాతంత్ర్య సంఘటన"కు, సైనిక దళంగా పనిచేస్తూ వచ్చింది. ఈ రెండు సంస్థల్లోను కమ్యూనిస్టులు ప్రధానపాత్ర నిర్వహిస్తూవచ్చారు. ఈ రెండు సంస్థలూ బర్మా విముక్తికి, బ్రిటిషు, అమెరికన్ సైన్యాలకు విశేషంగా తోడ్పడ్డాయి.

దేశస్వాతంత్ర్యంకొరకు ఎనలేని త్యాగాలుచేసిన బర్మాప్రజలు తిరిగి బ్రిటిష్ సామ్రాజ్యవాదుల బానిసలుగా ఉండడానికి అంగీకరించ లేదు. వెంటనే స్వాతంత్ర్యం ప్రకటించాలనీ, తమ సైన్యాలను వెంటనే ఉపసంహరిస్తూ స్వతంత్ర రాజ్యాంగచట్టరచనకు రాజ్యాంగ సభ ఎన్నికలకు తగు ఏర్పాట్లుచేయాలనీ కోరారు.

కాని బ్రిటిష్ప్రభుత్వం "క్రమంగా అధినివేశ స్వాతంత్ర్యం (Dominion Status) ఇవ్వబడుతుం"దని 1945 వ సంవత్సరం మే నెలలో ప్రకటన చేసింది. కాని, గవర్నరుజనరల్ మాత్రం దేశాన్ని వలసదేశంగా అట్టిపెట్టుకోడానికి కావలసిన అన్నిపనులూ చేస్తూవచ్చాడు.

దీనితో దేశం కుమిలిపోయింది; సర్వవ్యాపితసమ్మె వచ్చింది; అనేకచోట్ల తిరుగుబాట్లు జరిగాయి. దేశవ్యాపితంగా సాయుధ విప్లవంవచ్చే పరిస్థితి ఏర్పడింది. తమ జిత్తులమారితనానికి పేరుమోసిన బ్రిటిష్ సామ్రాజ్యవాదులు "స్వాతంత్ర్యసంఘటన" నాయకులను కొనివేయడానికి "ఇదిగో గవర్నరు ఎక్జిక్యూటివు కౌన్సిలులో మీ ప్రతినిధులకు స్థానమిస్తాం" రమ్మని ఒక ఎర వేశారు. (ఈ కౌన్సిలుకు బ్రిటిష్ గవర్నరుజనరల్ అధ్యక్షుడుగా ఉంటాడు.)

ఆంగ్‌సాన్ నాయకత్వాన, స్వాతంత్ర్య సంఘటనయొక్క మితవాదనాయకత్వం ఇందుకు అంగీకరించి, ఐక్యసంఘటనలో చీలిక తెచ్చింది. కమ్యూనిస్టుపార్టీ దీనిని వ్యతిరేకిస్తూ, సర్వవ్యాపిత సమ్మెలు, సాయుధపోరాటమే దేశస్వాతంత్ర్యానికి మార్గమని మిత వాద నాయకత్వాన్ని గట్టిగా ఎదిర్చింది. తత్ఫలితంగా, 1947 లో స్వాతంత్ర్య సంఘటననుండి కమ్యూనిస్టుపార్టీ—ప్రజలలో విశేష పలుకుబడి కలిగినపార్టీ — బహిష్కరించబడింది. అప్పటినుండి స్వాతంత్ర్యసంఘటన ఒక మితవాదపార్టీల ముఠాగా తయారైంది.

ప్రస్తుతపు వైస్రాయి ఎక్జిక్యూటివు కౌన్సిల్‌ని స్వతంత్ర ప్రభుత్వంగా గుర్తించవలసినదిగా ఆంగ్‌సాన్ బ్రిటిషు ప్రభుత్వాన్ని కోరుతూ వచ్చాడు. ఈవర్గం దేశంలోని ప్రజాతంత్రశక్తుల

బలాన్ని వెనకేసుకుని సామ్రాజ్యవాదులతో బేరమాడడం ప్రారంభించారు.

1947 వ సంవత్సరం మే నెలలో రెండుదేశాలమధ్య ఒక ఆర్థిక ఒడంబడిక జరిగింది. దీని ఫలితంగా, బర్మా ఆర్థిక పరిస్థితులపై బ్రిటిషు బ్యాంకుల పిడికిలి మరింత బిగిసింది. ఈవిధంగా దేశ ఆర్థిక వ్యవస్థపై నానాటికీ పటిష్ఠమవుతున్న బ్రిటిషు ఆర్థిక పెత్తనాన్ని ఆంగ్‌సాన్ ఎదిరించలేకపోయాడు. ఒకవంక బ్రిటిషు సామ్రాజ్యవాదుల మెప్పువడసేందుకు కమ్యూనిస్టులమీద విపరీత నిర్బంధ విధానాన్ని అమలుజరుపుతూ, మరొకవంక దేశప్రజల మన్ననలు పొందటానికి జాతీయ శ్రేయస్సుకు సంబంధించిన అనేక విషయాలలో బ్రిటన్‌తో గట్టిగా పోట్లాడ్డం ప్రారంభించాడు.

ఆంగ్‌సాన్‌ను దారిలోంచి తొలగించకపోతే తమ నాటకం సాగదని బ్రిటిషు సామ్రాజ్యవాదులు కొందరు బర్మా మితవాద నాయకుల సాయంతో ఆంగ్‌సాన్‌ను, వీరి అనుచరులయిన మరినలుగురు మంత్రులను, కొందరు కౌన్సిలు మెంబర్లను 1947 వ సంవత్సరం జులైలో చంపించారు. దీనితో స్వాతంత్ర్య సంఘటన మరింత బలహీనపడిపోయింది. ప్రజా వలంటీరుదళంలోను, దీనికితోడు, ఇంతవరకూ (కమ్యూనిస్టుపార్టీ బహిష్కరించబడిన తర్వాత) ప్రధాన శక్తిగా వ్యవహరించిన సోషలిస్టు పార్టీలోను తీవ్ర అసంతృప్తి రేగింది.

తర్వాత థాకిన్ – నూ ప్రధానమంత్రిగా మంత్రివర్గం పునర్నిర్మించ బడింది. తర్వాత ఆరునెలల్లో బర్మాను అన్నివిధాలా బంధించి ఉంచడానికి కావలసిన అనేక ఒడంబడికలపై "నూ" ప్రభుత్వం చేత బ్రిటన్ సంతకాలు పెట్టించింది.

ఇందులో ఒకటి "దేశరక్షణ ఒడంబడిక". 1947 వ సంవత్సరం ఆగస్టు 29 న సంతకాలు జరిగాయి. దీనిప్రకారం, దేశం బ్రిటిషు సైన్యాధిపత్యం కిందకు వస్తుంది. రెండవ ఒడంబడికపైన అక్టోబరు 17 వ తేదీన (1947) సంతకాలు జరిగాయి. దీనిప్రకారం, బ్రిటిషు పెట్టుబడిదార్లకు, బ్రిటిషు ఆసఫీసర్లకు రావలసిన సొమ్ము చెల్లించ

బడేట్లుగా చూస్తానని బర్మాప్రభుత్వం హామీయిచ్చింది; బర్మా పరిపాలనకు బ్రిటన్ ఖర్చుపెట్టిన సొమ్ముకు ప్రతిఫలంగా, ఏడుకోట్ల పౌనులధనాన్ని 1952 వ సంవత్సరం ఏప్రిల్‌మాసంనుండి ఇరవై సంవత్సరవాయిదాలలో బర్మాప్రభుత్వం చెల్లించాలి. బ్రిటిషు పెట్టుబడిదార్ల కంపెనీలు దేశసంపదనంతా కొల్లగొట్టుకపోవటానికి చేసుకున్న కంట్రాక్టులు, బర్మావ్యాపారస్తులు బ్రిటిషు పెట్టుబడిదార్లతో చేసుకున్న కాంట్రాక్టులు - ఇవన్నీ, ఆయా కాంట్రాక్టులలో ఉదహరించబడిన నియమిత కాలంవరకూ అమలు జరగనివ్వాల్సిందే! అంటే, దేశసంపద దోపిడీని బర్మాప్రభుత్వం అడ్డగించరాదన్నమాట.

ఈ విధంగా బర్మాను పద్మవ్యూహంలోపెట్టి, బ్రిటిషుసామ్రాజ్యవాదులు (లేబరుపార్టీ ప్రభుత్వం) 1948 వ సంవత్సరం జనవరి నాల్గవ తేదీన దేశానికి "స్వాతంత్ర్య ప్రదానం" చేస్తూ ఒక ప్రకటనచేశారు.

కాని, ఈ "స్వాతంత్ర్య ప్రదానం" బర్మా ప్రజలను మోసం చెయ్యలేక పోయింది. కమ్యూనిస్టుపార్టీని నిషేధించిన "నూ" ప్రభుత్వం యితర ప్రజాస్వామిక శక్తులపైన కూడా నిర్బంధ విధానం అమలు జరప జొచ్చింది. తత్ఫలితంగా, ఇంతవరకూ ఉత్తరబర్మాలోనే జరుగుతున్న ప్రజల సాయుధ ప్రతిఘటన మధ్యబర్మా వరకూ వ్యాపించింది.

ఉత్తర బర్మా, మధ్యబర్మాలలో ప్రజారిపబ్లిక్ ఏర్పరచబడింది. ప్రభుత్వం భూస్వామ్య విధానంరద్దు, తదితర వ్యవసాయ సంస్కరణలు తెచ్చింది. విదేశీ పెట్టుబడులను స్వాధీనం చేసుకుంది. ఇంకా ప్రజాశ్రేయస్సు కుపయోగపడే అనేక చట్టాలను చేసింది.

ప్రక్కనే నూతన చైనా ఒక బలవత్తరమయిన ప్రజాతంత్ర శక్తిగా అభివృద్ధి కావటం, ఇటుభారతదేశం ఏ కూటమిలోనూ చేరక స్వతంత్ర విధానం అవలంబించడం బర్మా ప్రభుత్వ పాలసీలో విశేషమయిన మార్పులకు కారణమయింది.

తానూ సామ్రాజ్యవాదుల పట్టులను సడలించుకోడానికి ప్రయత్నిస్తూ, జాతీయ ఆర్థిక వ్యవస్థను ఉద్ధరించడానికి కృషిప్రారంభించింది.

ఎనిమిది సంవత్సరాల ఆర్థికాభివృద్ధిప్రణాళికను రూపొందించి అమలు జరుపుతున్నది. 1959 – '60 సంవత్సరానికి పారిశ్రామికోత్పత్తి నూటికి 80 పాళ్లు పెంచాలని నిర్ణయించబడింది.

భారతదేశం, నూతన చైనా, సోవియట్‌యూనియన్‌లతో వ్యాపార సంబంధాల నేర్పరుచుకొన్నది. అమ్మకాలు లేక నిల్వ ఉండిపోతున్న బియ్యపు నిలువలను సోవియట్ తీసుకుని, బర్మాకు యంత్ర సామాగ్రిని సప్లయిచేస్తున్నది. భారతదేశం బర్మాకు ఆర్థిక సహాయాన్ని కూడా చేస్తున్నది.

తాను ఏ కూటమిలోనూ చేరనని బర్మా ప్రభుత్వం స్పష్టంగా ప్రకటించింది. 1954లో జరిగిన కొలంబో సమావేశంలో ఇతర దేశాలలో సామ్రాజ్యవాదుల జోక్యాన్ని నిరసించింది. ఆటం-హైడ్రోజన్ మారణాయుధాల నిషేధాన్ని కోరింది. చైనాకు ఐక్యరాజ్యసమితిలో స్థానమీయాలని స్పష్టంచేసింది.

1954 లో చౌ-ఎన్-లైని తన దేశానికాహ్వానించింది. పంచశీలాల ప్రాతిపదికపై రెండుదేశాలమధ్య మిత్రత్వం అభివృద్ధి కావాలని ప్రకటించింది. బాండుంగ్ సమావేశకర్తలలో ఒకటిగా పని చేసింది. ప్రపంచశాంతికీ, అంతర్జాతీయ ఉద్రిక్తత సడలింపుకూ జరుగుతున్న ప్రయత్నాలన్నిటినీ బర్మా ప్రభుత్వం బలపరచుతున్నది.

ఈమధ్య బర్మా కమ్యూనిస్టుపార్టీకూడా దేశంలో శాంతిని నెలకొల్పేందుకు రాయబారాలకు తాను సంసిద్ధమని తెలియచేసింది.

1956 జూన్ మొదటివారంలో "నూ" ప్రధానమంత్రి పదవికి రాజీనామా నిచ్చాడు. ఇంతవరకూ దేశ రక్షణ మంత్రిగా పనిచేసిన 'యు బాస్వే" ప్రధానిగా నియమించబడ్డాడు.

# మలయా

ఇది బ్రిటన్ వలసదేశం. ఆగ్నేయ ఆసియాలో మిలిటరీ వ్యూహరీత్యా కీలకప్రదేశం. హిందూ మహాసముద్రంనుండి, పసిఫిక్ సముద్రంలో ప్రవేశించే ఓడలన్నీ, ఈ దేశపు ముఖ్య రేవుపట్నమైన సింగపూరుమీదుగానే పోవాలి. ఇది ఇంతటి కీలకప్రాంతం కాబట్టే ఆగ్నేయ ఆసియాదేశాలను వలసదేశాలుగా చేసుకో ప్రయత్నించిన ఐరోపా సామ్రాజ్యవాదులంతా తగాదాపడ్డారు. నేటికీ బ్రిటిషు, అమెరికన్ సామ్రాజ్యవాదులు తగాదా పడుతున్నారు.

ప్రస్తుతం చట్టరీత్యా, సింగపూరుద్వీప మొక్కటే బ్రిటిషు కాలనీ. తొమ్మిదిరాష్ట్రాలను కలిపి, "ఫెడరేటెడ్ స్టేట్సు ఆఫ్ మలయా" అనే వ్యవస్థను ఏర్పాటుచేశారు. పెనాంగ్, మలక్కాలు "బ్రిటిషు సెటిల్‌మెంట్సు"గా వ్యవహరించబడుతున్నాయి. పేర్ల ఆడంబరమే కాని దేశమంతా బ్రిటిషు వలసదేశమే!

దేశవైశాల్యం 53,000 చదరపుమైళ్ళు. భూమధ్యరేఖా ప్రాంతంలో ఉండటంచేత వర్షమధికం. దేశవైశాల్యంలో ఐదింట మూడువంతులు దట్టమైన అరణ్యాలే!

1951 వ సంవత్సర లెక్కలప్రకారం దేశజనాభా 54,20,738. వీరిలో నూటికి 50 మంది మలేజాతివారు; 38 మంది చైనాజాతి. మిగిలినవారు, భారతీయులు యూరపుదేశీయులు. మలయా జాతివారంతా ముస్లింలు.

దేశముఖ్యపట్టణం కౌలాలంపూర్.

జనాభాలో అత్యధికభాగం దేశపశ్చిమతీరం పొడవునా 40 మైళ్ళ వెడల్పున ఉన్న ప్రాంతంలో మాత్రమే నివసిస్తున్నారు. దేశంలో ఉన్న తగరంగనులు, రబ్బరుతోటలు ఈ ప్రాంతంలోనే ఉన్నాయి. తూర్పు ప్రాంతమంతా అడవులు, కొండలు.

అచ్చటచ్చట ఉన్న మైదానాలలోమాత్రం వరి పండుతుంది. సాలుకు పండినపంట దేశప్రజల అవసరాలకు సరిపోదు.

రబ్బరు, కొబ్బరిచెట్లు, అనాసతోటలు విరివిగా పెంచబడుతున్నాయి. మొత్తం సాగుకింద ఉన్న భూమిలో నూటికి 65 వంతుల భూమిలో రబ్బరుచెట్లు పెంచబడుతున్నాయి. ప్రపంచ ఉత్పత్తిలో దాదాపుసగం మలయా ఒక్కటే ఉత్పత్తిచేస్తుంది. దేశంలోని రబ్బరు, కొబ్బరితోటలన్నీ బ్రిటిషు పెట్టుబడిదారుల చేతిలోనే ఉన్నాయి.

ఈ తోటల్లో పనిచేసే కార్మికులకు నామమాత్రపు కూలిరేట్లు ఇస్తారు. వీరిస్థితి బానిసలకన్నా హీనం. మనదేశంనుండి వలసపోయిన వేలాది కార్మికులు, ఇచ్చటకూడా బ్రిటిషు సామ్రాజ్యవాదుల దోపిడీకి గురై బానిసల్లా బ్రతుకుతున్నారు.

కాఫీ, టీ, అరటి, పొగాకు పంటలుకూడా నామమాత్రంగా పండించబడుతున్నాయి.

దేశంలో దొరికే ఖనిజాల్లో ముఖ్యమైనవి తగరం, వుల్ఫ్రామ్.

ప్రపంచంలోని మరేదేశంలోనూ మలయాలో దొరికినంత తగరం దొరకడంలేదు. ప్రపంచంలో దొరికే తగరంలో మూడవ వంతు ఇచ్చట లభిస్తున్నది.

తగరం గనులన్నీ ఇతర ఖనిజాల గనులతోపాటు, బ్రిటిషు పెట్టుబడిదార్ల చేతుల్లోనే ఉన్నాయి. ఖనిజాన్నంతటినీ బ్రిటన్ ఎగుమతిచేసి విపరీత లాభాలు గడిస్తున్నా కార్మికులకు కనీస వేతనాలు కూడా ఇవ్వటంలేదు.

మాంగనీసు, ముడిఇనుము, బాక్సైట్ గనులు జపాను పెట్టుబడిదార్ల చేతుల్లో ఉన్నాయి. తీయబడిన ఖనిజమంతా జపానుకే ఎగుమతి చేయబడుతుంది.

బ్రిటిషు సామ్రాజ్యవాదులు దేశ ముడిసరుకులను కారుచౌకగా దోచుకపోయి దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి కానీయలేదు.

దేశ ఎగుమతుల్లో రబ్బరు, తగరం, కొబ్బరి, కొబ్బరినూనె ముఖ్యమైనవి.

మొత్తం ఎగుమతుల్లో నూటికి 60 వంతులు రబ్బరు, తగరం. ఎగుమతుల్లో నూటికి 70 వంతులు అమెరికాకే పోతున్నాయి.

దిగుమతుల్లో ముఖ్యమైనవి బియ్యం, వస్త్రాలు, పెట్రోలు, యంత్రాలు.

దేశంలో పెద్ద వ్యాపార కేంద్రం సింగపూరు. ఇచ్చట వివిధ దేశాల వ్యాపారవస్తువుల మధ్య కొనుగోలు అమ్మకాలు విరివిగా జరుగుతూ ఉంటాయి. మలయా ఎగుమతి, దిగుమతి వ్యాపారమంతా ఈ రేవు ద్వారానే జరుగుతుంది.

చాలకాలంగా బ్రిటన్, మలయాలో లభించే రబ్బరు, తుత్తు నాగాన్ని చేతిలోపెట్టుకుని, ఈ ప్రాంతంలో ఏకఛత్రాధిపతిగా వ్యవహరిస్తూవచ్చింది. కాని రెండు ప్రపంచ సంగ్రామాల మధ్యకాలంలో జపాన్, అమెరికన్ సామ్రాజ్యవాదులు వీరికి పోటీవచ్చారు.

బ్రిటిషువారు ఎన్ని అడ్డంకులు కల్పించినా, జపాన్ పెట్టుబడిదారులు మాంగనీసు, ముడిఇనుము, బాక్సైట్, ఫాస్ఫేట్ గనులను చేజిక్కించుకోగలిగారు.

మలయానుండి బ్రిటన్ ఎగుమతిచేసే తగరంలో నూటికి 50 వంతులు, రబ్బరులో 70 వంతులు అమెరికా కొంటుండేది. ఈ ముడి సరుకులపై వీరే గుత్తవ్యాపారస్తులు కనుక అధికధరకు అమ్ముతూ వచ్చారు.

రెండవ ప్రపంచయుద్ధంలో బ్రిటన్ బలహీనపడటం, అమెరికా పెద్ద పెట్టుబడిదారుగా పైకిరావటం జరిగింది. బ్రిటన్‌కు డాలర్ల కొరత ఏర్పడింది. ఇది తీరటంకొరకు తన తగరం, రబ్బరు సరుకుని మరింత ఎక్కువ కొనేట్టు అమెరికాను ప్రోత్సహించాలని ఇదివరకున్న అనేక వ్యాపార కట్టుబాట్లను సడలించారు.

దీన్ని అవకాశంగా తీసుకుని అమెరికా, తన పెట్టుబడులను గుప్పించి, అనేక తగరం గనులను, రబ్బరుతోటలను కొనివేసింది.

దానికితోడు తాను కృత్రిమరబ్బరు ఉత్పత్తిని ప్రారంభించింది, బొలీవియా, సయాం, ఇండొనేషియాల తగరం తెప్పించటం ప్రారంభించింది. దానితో మలయాలో రబ్బరు, తగరం ధరలు పడిపోయాయి.

దీనితో బ్రిటను దిగివచ్చి అమెరికా కోరిన ధరకు తన తగరం, రబ్బరు, ముడిసరుకులను అమ్ముకోక తప్పటంలేదు.

అమెరికా ఈ విధంగా తగరం, రబ్బరు వ్యాపారంపై బ్రిటన్ గుత్తహక్కును దెబ్బకొట్టడమేకాక, టూత్ పేస్టులనుండి మోటారు కార్ల వరకూ సప్లయిచేస్తూ, దేశీయమార్కెట్లనే కంట్రోలు చేసే స్థితికి వచ్చింది.

1941 లో జపాన్ సైన్యాలు దాడిచేసినపుడు మలయాప్రజలను దురాక్రమణదారులనుండి రక్షించటానికి బదులు, బ్రిటిషు సామ్రాజ్యవాదులు పారిపోయారు.

జపానువారు స్వాతంత్ర్యం ఇస్తారనే భ్రమతో ఉన్న ప్రజలు మొదట్లో దురాక్రమణదారును ఎదిరించక ఊరుకున్నారు. కాలం గడచినకొలదీ సామ్రాజ్యవాదులు ఏ జాతివారైనా ఒకటేనని ప్రజలు తెలుసుకున్నారు. దురాక్రమణదారుకు వ్యతిరేకంగా సాయుధ పోరాటం ప్రారంభించారు. 1945 లో మలయావిముక్తికి మలయా ప్రతిఘటనోద్యమం విశేషంగా సాయపడింది. ఈ ఉద్యమానికి కమ్యూనిస్టుపార్టీ వెన్నెముక.

యుద్ధానికిపూర్వం మలయాలో చట్టసమ్మతమైన రాజకీయ పార్టీ లేనేలేదు. కాని యుద్ధం అయిపోయేసరికి జపాన్ వ్యతిరేక ప్రజాసైన్యం (జపానును సాయుధంగా ప్రతిఘటించిన వారితో ఏర్పరచ బడింది), యువజనసంఘం, పాన్ మలయన్ ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ లాంటి ప్రజాసంఘాలు అవతరించాయి. కమ్యూనిస్టుపార్టీపై నిషేధం ఉన్నప్పటికీ, మలయా కమ్యూనిస్టుపార్టీ దాని చరిత్రలో ప్రథమ పర్యాయం బహిరంగంగా వ్యవహరించటం మొదలుపెట్టింది.

1945 లో తిరిగి మలయాను ఆక్రమించిన బ్రిటిషు సామ్రాజ్యవాదులు ఈ ప్రజాస్వామికశక్తుల విజృంభణనుచూచి హడలి

పోయారు. తీవ్ర నిర్బంధ విధానాన్ని ప్రయోగించి అణచ ప్రయత్నించారు.

1948 సంవత్సరంలో మేడే ప్రదర్శకులపై సామ్రాజ్యవాదులు ప్రయోగించిన హింసాకాండతో ప్రజాస్వామిక శక్తులను నాశనం చేయటానికి ప్రభుత్వం ఇంతకాలంగా సాగిస్తూవచ్చిన నిర్బంధవిధానం పరాకాష్ట నొందింది. గత్యంతరంలేక, మలయా జపాన్ వ్యతిరేక సైన్యం, ఆయుధాలతో ఆత్మరక్షణకు పూనుకోవలసి వచ్చింది. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం వహించి, ఈ సైన్యాలను నడుపుతున్నది. అనేకచోట్ల విముక్తి ప్రాంతాలను నెలకొల్పుకొని మలయా గెరిల్లాలు సామ్రాజ్యవాదుల నెదిరిస్తున్నారు.

మామూలు సైన్యాలతో అణచటం అసాధ్యమై, సామ్రాజ్యవాదులు ఈప్రాంతాలపై టాంకులు, విమానాలతో దాడులుచేయటం; గెరిల్లాలకు అన్నం పెడుతున్నారనీ, ఇతరత్రా సాయపడుతున్నారనీ గ్రామాలకు గ్రామాలనే కాల్చివేయటం చేస్తున్నారు. అనేక కాన్సెన్ట్రేషన్ క్యాంపులు పెట్టి అమాయక ప్రజలను చిత్రహింసలు పెడుతున్నారు.

అమెరికా, ఆస్ట్రేలియా ప్రభుత్వాలు ఆయుధాలను పంపి, బ్రిటన్‌కు ఈ కార్యక్రమంలో సాయపడుతున్నాయి. బ్రిటన్ గూర్ఖా సైన్యాలను కూడా ఈ దాడుల్లో ఉపయోగిస్తున్నది.

[1953 వరకూ భారతభూభాగంపై గూర్ఖాలను రిక్రూటు చేసుకొనేందుకు బ్రిటన్‌కు మన ప్రభుత్వం అవకాశమిచ్చింది. ప్రజల ఆందోళన ఫలితంగా మన ప్రభుత్వం, ఈ కేంద్రాలను ఎత్తివేయించింది.]

దాదాపు మూడు లక్షలమంది సైనికులు, పోలీసులు అధునాతన ఆయుధాలతో, వైమానిక టాంకుదళాల సాయంతో ఈ వేట సాగిస్తున్నారు. లండన్ టైమ్సు అంచనాలప్రకారం ప్రతి గెరిల్లా సైనికునికీ 65 మంది బ్రిటిషు సైనికులు నేడు మలయా మారణహోమంలో పాల్గొంటున్నారు.

గ్రామాలలోని ప్రజలు విమోచనోద్యమ సైన్యానికి తోడ్పడుతున్నారు. గ్రామాలలోని ప్రజలను తరలించి, సెటిల్ మెంట్సు ఏర్పరచి, పశువులదొడ్డిలో పెట్టినట్లు వీరిని ఈ కాన్సెన్ట్రేషన్ క్యాంపుల్లో పెట్టి కాపలా కాస్తున్నారు. పోలీసుల అనుమతిలేనిదే వీరు బైటకు వెళ్ళకూడదు. ఇందులో నిలువనీడలేక, తిన తిండిలేక ప్రజలు మాడిపోతున్నారు. దాదాపు మలయా జనాభాలో పదవవంతు ప్రజల్ని ఈ విధంగా కాన్సెన్ట్రేషన్ క్యాంపులకు తరలించారు.

పోరాటాన్ని అణచడానికి బ్రిటిషు సామ్రాజ్యవాదులు ధారావాహికంగా సొమ్మును ఖర్చుచేస్తున్నారు. 1953 లో 3 కోట్ల పౌనులు, 1954 లో నాలుగుకోట్ల పౌనులు ఖర్చుచేశారు. అయినా సామ్రాజ్యవాదులు ప్రజాపోరాటాన్ని అణచలేకపోయారు.

1955 లో జరిగిన బాండుంగ్ సమావేశంతర్వాత మలయాలో శాంతిని ఏర్పరచడానికి సంప్రదింపులు సాగించడానికి తన సంసిద్ధతను తెలియచేస్తూ, మే నెల ఒకటవతేదీన మలయా కమ్యూనిస్టుపార్టీ మలయాప్రభుత్వానికి తెలియచేసింది. కాని మలయా ప్రభుత్వం ఎట్టి షరతులూ లేకుండా లొంగిపోవాలని చెబుతూ, సంప్రదింపులు సాగించనిరాకరించింది.

1955 ఉత్తరార్ధభాగంలో బ్రిటిషు ప్రభుత్వం వయోజన ఓటింగు పద్ధతిపై శాసనసభకు ఎన్నికలు జరిపింది. టెంకూ అబ్దుర్రహిమాన్ నాయకత్వాన ఏర్పడ్డ త్రిపక్షసంఘటన కమ్యూనిస్టులతో రాజీచేసుకోవాలనీ, సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకు కృషి చేయాలనీ సంకల్పించుకొని ఎన్నికల్లో పోటీచేసింది. శాంతిని, స్వాతంత్ర్యాన్ని కోరే మలయా ప్రజలు ఈ పార్టీనే అభిమానించడంవల్ల అత్యధిక మెజారిటీతో నెగ్గింది. అబ్దుర్రహిమాన్ నాయకత్వాన కొత్తమంత్రివర్గం ఏర్పడింది.

డిసెంబరు మాసాంతంలో, మలయా ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీతో సంప్రదింపులకు అంగీకరించింది.

1955 డిశంబరు 28, 29 తేదీలలో కమ్యూనిస్టుపార్టీ పక్షాన, కార్యదర్శి చిన్ పెంగ్ నాయకత్వాన ముగ్గురు ప్రతినిధులు; మలయా, సింగపూర్ల ప్రధానమంత్రులు, బాలింగ్‌లో సంప్రదింపులు జరిపారు.

"మలయాలో శాంతిని స్థాపించాలనే సదుద్దేశ్యంతో సంప్రదింపులకు వచ్చాంగాని, పోరాటపటిమ నీరసించి కాదని" కమ్యూనిస్టు ప్రతినిధులు స్పష్టంచేశారు. తమ పార్టీని, ఇతర పార్టీలవలె చట్టబద్ధ సంస్థగా గుర్తించి, ఎటువంటి నిర్బంధాలు లేకుండా పనిచేయ నివ్వాలని వీరు కోరారు.

కాని ప్రభుత్వ ప్రతినిధులు తాము కమ్యూనిస్టుపార్టీని చట్టబద్ధ సంస్థగా గుర్తించబోమనీ, కమ్యూనిస్టులమీద ఎటువంటి నిర్బంధ విధానం అమలుజరపబడదనే హామీ నివ్వబోమనీ, ముందు ఎట్టి షరతులు లేకుండా లొంగిపోవాలనీ పట్టుబట్టారు. అందుచేత సంప్రదింపులు విఫలమైనాయి.

మలయాలో శాంతి వాతావరణం నెలకొనాలని తాము గాఢంగా కోరుతున్నామనీ, కనుక తాము సంప్రదింపులకు ఎప్పుడూ సిద్ధమేననీ కమ్యూనిస్టు ప్రతినిధులు ప్రకటించారు.

బాలింగ్ సంప్రదింపులకు ముందే కమ్యూనిస్టుపార్టీ తన కార్యక్రమాన్ని ప్రకటించింది.

మలయాకు సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలనీ, కామన్ వెల్తుతో సంబంధాలు తెంచుకోవాలనీ, ప్రజలచేత ఎన్నుకొనబడిన రాజ్యాంగసభ ప్రజాస్వామిక రాజ్యాంగచట్టాన్ని తయారుచేయాలనీ, ప్రజల జీవితాన్ని బాగుపరచాలనీ మలయాలో నివసిస్తున్న అన్ని జాతుల ప్రజలకు సమానప్రతిపత్తి ఉండాలనీ అందులో స్పష్టం చేశారు.

సంప్రదింపులు విఫలమయ్యాక సామ్రాజ్యవాదుల సేనలు, తిరిగి గెరిల్లా స్థావరాలమీద పెద్ద ఎత్తున దాడిప్రారంభించాయి.

మలయా స్వాతంత్ర్యం విషయమై బ్రిటన్‌తో సంప్రదింపులు జరపడానికి మలయా ప్రధాని టెంగ్‌కూ అబ్దుల్ రహమాన్ నాయ

కత్వాన ఒక ప్రతినిధివర్గం జనవరిలో లండన్ వెళ్ళింది. 1956 జనవరి 18 నుండి సంప్రదింపులు జరిగాయి. కాని నేతిబీరకాయ స్వాతంత్ర్యం ఇచ్చి, ప్రజలను మభ్యపెట్టడం బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ఆశయం.

1957 ఆగస్టులో మలయాకు స్వాతంత్ర్యం ఇస్తామన్నారు. స్వాతంత్ర్యం యిచ్చిన తర్వాత కూడా బ్రిటిష్ సేనలు మలయాలోనే ఉంటాయి. మలయా కామన్ వెల్తులోనే వుండాలి.

దీనివల్ల మలయాకు లభించేది నామమాత్రపు స్వాతంత్ర్యమే! బ్రిటిష్ దోపిడీ యథాతథంగా సాగుతూనే వుంటుంది.

ఈ మధ్య – గత మార్చిలో – మలయా ప్రధాని సయాం పర్యటించి వచ్చి, రెండు దేశాలకూ సన్నిహిత సంబంధాలున్నాయి కనుక, మలయాకూడా ఆగ్నేయ ఆసియా సైనిక కూటమిలో చేర దలచుకొన్నదని ప్రకటించాడు.

సింగపూరు ప్రభుత్వం తరఫునకూడా కొందరు ప్రతినిధులు స్వాతంత్ర్యం విషయమై బ్రిటిష్ ప్రభుత్వంతో సంప్రదింపులు జరపడానికి యీమధ్య లండన్ వెళ్లారు. కాని బ్రిటిష్ ప్రభుత్వం అంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకొనే హక్కు-వుండాలని పట్టుపట్టడంవల్ల సంప్రదింపులు విఫలమయాయి. ఇందుకు నిరసన సూచకంగా సింగపూరు ప్రధాని 1956 జూన్ 7 వ తేదీన రాజీనామా యిచ్చాడు. వీరిస్థానే, మార్షల్ మంత్రివర్గంలో కార్మిక శాఖా మంత్రిగా పనిచేసిన లిమ్ యూ హక్, జూన్ 8 వ తేదీన ప్రధాన మంత్రిగా పదవి స్వీకరించారు.

# ఇండొనేషియా

భూమధ్య రేఖ ప్రాంతంలో ఉన్న రెండువేల చిన్న - పెద్ద ద్వీపాలు కలిపి ఇండొనేషియా అంటారు. ఇంతకుపూర్వం 'డచ్చి తూర్పు ఇండియా దీవులు' అని పిలిచేవారు. వీటిలో సుమత్రా, జావా, బోర్నియో, సెలిబిస్ ద్వీపాలు పెద్దవి.

ఈ దేశ వైశాల్యం 7,35,268 చదరపుమైళ్ళు. జనాభా 7,79,87,000.

ఇందులో ఒక్క జావాద్వీపంలోనే నూటికి 70 వంతులు నివసిస్తున్నారు.

ఈ ద్వీపాలు ఆసియా, ఆస్ట్రేలియా ఖండాలమధ్య, హిందూ మహాసముద్రం, పసిఫిక్ మహాసముద్రాలు కలిసేచోట వున్నాయి.

యూరపునుండి దూరప్రాచ్యానికి వెళ్ళే సముద్రమార్గాలు, విమానమార్గాలు అన్నీ ఈ దేశంగుండానే పోతాయి. అందుచేత ఇది మిలిటరీ వ్యూహరీత్యా ముఖ్య కీలక ప్రాంతం. అందుకే అమెరికా సామ్రాజ్యవాదులు ఈ దేశంలో మిలిటరీ స్థావరాలను ఏర్పాటు చేయటానికి ఎన్నో కుట్రలు చేశారు.

దేశం భూమధ్య రేఖ ప్రాంతంలో ఉండటంవల్ల సంవత్సరం పొడవునా వర్షాలు పడతాయి.

వ్యవసాయపంటల్లో ముఖ్యమైనవి వరి, మొక్కజొన్న.

చెరకు, కొబ్బరి, తేయాకు, పొగాకు, కాఫీ, మనీలానార విస్తారంగా పండించబడతాయి. రబ్బరు తోటలు పెద్దయెత్తున పెంచబడుతున్నాయి.

ప్రపంచంలో విరివిగా రబ్బరు ఉత్పత్తిచేసే దేశాల్లో ఇండొనేషియా మొదటిది. ప్రపంచ రబ్బరు ఉత్పత్తిలో నూటికి 38 పాళ్ళు ఇక్కడే ఉత్పత్తి అవుతున్నది.

తేయాకు, రబ్బరుతోటలన్నీ విదేశ పెట్టుబడిదార్ల చేతిలో వున్నాయి.

దేశంలో అనేకరకాల ఖనిజాలు లభ్యమవుతాయి. వీటిలో తగరం, పెట్రోలు ముఖ్యమైనవి. ప్రపంచ నూనె ఉత్పత్తిలో నూటికి ఆరుపాళ్లు, తగరం ఉత్పత్తిలో 23 పాళ్లు యీ దేశంలోనే లభ్యమవు తున్నాయి.

ఈ గనులన్నీ డచ్చి, అమెరికా గుత్తపెట్టుబడిదార్ల చేతుల్లో వున్నాయి.

దేశంలో ఒక్క పంచదార పరిశ్రమతప్ప మరేమీ లేవు. ఇది డచ్చి పెట్టుబడిదార్ల చేతిలో వుంది.

రబ్బరు, తగరం, పెట్రోలు, పంచదార, తేయాకు, కొబ్బరి ముఖ్య ఎగుమతులు.

ఎగుమతులవల్ల వచ్చే మొత్తం రాబడిలో నూటికి 5 పాళ్ళు రబ్బరు ఎగుమతివల్లనే లభిస్తున్నది.

జకార్తా, (పూర్వం బటేవియా అని పిలువబడేది) దేశ రాజధాని. ఇది మంచి నౌకాకేంద్రం కూడా.

350 సంవత్సరాలుగా ఇండోనేషియాను వలసదేశంగా అట్టి పెట్టుకుని, దోపిడీచేసిన డచ్చిసామ్రాజ్యవాదులు 1942 వ సంవత్స రంలో జపాన్ సామ్రాజ్యవాదులు దండెత్తినపుడు, ప్రజలను దురా క్రమణ దారులకు అప్పగించి పారిపోయారు. ప్రజలే సాయుధులై దురాక్రమణదారుల్ని ఎదిరించి, జపాన్ సైన్యాలను తరిమేసి 1945 వ సంవత్సరం ఆగస్టు 17 వ తేదీన స్వాతంత్ర్యాన్ని ప్రకటించారు. తాత్కాలిక పార్లమెంటు యేర్పరచబడింది. నేషనలిస్టుపార్టీ నాయ కుడు (మితవాది) సోకర్నో రిపబ్లిక్ అధ్యక్షుడుగా నియమించ బడ్డాడు.

దురదృష్టవశాత్తు నేషనలిస్టుపార్టీ, సోషలిస్టుపార్టీల మిత వాద నాయకులైన సోకర్నో, హట్టా, షారీర్‌ల చేతిలో ప్రభుత్వం చిక్కిపోయింది. వీరు తమ వర్గప్రయోజనాల రక్షణకోసం ప్రజా

ఉద్యమాల నణచడానికి ఆఖరుకు సామ్రాజ్యవాదుల సహాయం పొందడానికికూడా వెనుదీయలేదు. 1946 వ సంవత్సరంలో డచ్చి సామ్రాజ్యవాదులు తమ సైన్యాలనుదించి, రిపబ్లిక్‌ను ఆక్రమించ టానికి ప్రయత్నించారు. కాని, విముక్తిఉద్యమ శక్తిముందు వీరి కది సాధ్యం కాలేదు. అందుచేత రాజీబేరాలకు దిగారు.

సోకర్నో, హట్టా, షారీర్‌ల నాయకత్వం దేశాన్ని తిరిగి సామ్రాజ్యవాదుల రథచక్రాలకు కట్టే "లింగజతి" ఒడంబడికపై సంత కాలు చేశారు. (1947, మార్చి 25 వ తేదీ). దీన్ని అమలుపరచ డానికి ప్రజలు అంగీకరించకపోవటంచేత, కాగితంమీద మాత్రమే ఒడంబడిక ఉండిపోయింది.

చివరకు డచ్చి సామ్రాజ్యవాదులు దేశాన్ని తమకు కట్టబెట్ట వలసిందిగా ఒక హెచ్చరిక చేశారు. దానికి మితవాద నాయకత్వం అంగీకరించింది.

ఈ జాతీయ విద్రోహాన్ని సహించలేని ఇండొనేషియా ప్రజలు మితవాద సోషలిస్టు నాయకుడూ, అమెరికా తొత్తూ అయిన షారీర్‌ను ప్రధానమంత్రి పదవినుండి తొలగించి విమోచనోద్యమ నాయకు లలో ఒకరైన అమీర్ షరీఫుద్దీన్ ప్రధానమంత్రిగా మంత్రివర్గం పునర్నిర్మించబడింది.

ఈ మధ్యకాలంలో డచ్చి సామ్రాజ్యవాదులు బ్రిటన్, అమెరి కాలు సప్లయిచేసిన విమానాలు, టాంకులు, యుద్ధనావలు, ఇతర మందుగుండు సామాన్లతో తమ సైన్యాలను దాదాపు 1,25,000 మందిని దింపి రిపబ్లిక్‌ను ఆక్రమించ ప్రారంభించారు.

కాని ప్రజాసైన్యాల వీరోచిత ప్రతిఘటనవల్ల సామ్రాజ్య వాదులు దేశాన్నంతా ఆక్రమించలేక పోయారు.

భద్రతాసమితి వెంటనే యుద్ధాన్ని ఆపవలసిందిగా డచ్చి సామ్రాజ్యవాదులను కోరి, రాజీచేయటానికి అమెరికా సూచనల ప్రకారం ఒక కమిటీని (గుడ్ ఆఫీసెస్ కమిటీ)- అమెరికా, బెల్జియం, ఆస్ట్రేలియా దేశాల ప్రతినిధులతో నియమించింది. దీన్ని అమెరికా

అవకాశంగా తీసుకొని, డచ్ సామ్రాజ్యవాదులను వెనుకకు నెట్టి తాను దేశంలో కాలూనడానికి అన్నిప్రయత్నాలూ చేస్తూవచ్చింది.

సామ్రాజ్యవాదులు జాతీయ ప్రభుత్వాన్ని అనేకవిధాల లొంగదీయటానికి ప్రయత్నించారు. ప్రత్యక్షంగా యుద్ధచర్యలు జరపటమేగాక, యితర దేశాలతో ఇండొనేషియాకు ఎట్టి సంబంధం లేకుండా దిగ్బంధనం చేశారు. గత్యంతరంలేక, షరీఫుద్దీన్ ప్రభుత్వం "రెనివిల్లి" ఒడంబడికకు అంగీకరించింది (1948, జనవరి 17).

దీని ప్రకారం అప్పటికి డచ్చివారు ఆక్రమించిన ప్రాంతమే గాక, మరికొన్ని ప్రాంతాలుకూడా వారి కిందకువచ్చాయి.

దీన్ని అవకాశంగా తీసుకుని, సామ్రాజ్యవాదులకు లొంగిపోయాడనే నిందాప్రచారంతో షరీఫుద్దీన్ ప్రభుత్వాన్ని తొలగించి, జాతీయ మితవాద నాయకుడు హట్టా ప్రధాన మంత్రిగా అమెరికా తొత్తులయిన వారితో మంత్రివర్గాన్ని పునర్నిర్మించాడు. ఇదంతా అమెరికా సామ్రాజ్యవాదుల ప్రోత్సాహంతోనే జరిగింది.

వీరి జాతీయ విద్రోహాన్ని గుర్తించిన ప్రజలు, దేశ స్వాతంత్ర్యము కొరకు పోరాడిన ప్రజా ఐక్యసంఘటనను మరింత విస్తృతపరచి, బలపరచుకోవటం ప్రారంభించారు. (ఈ సంఘటనలో కమ్యూనిస్టుపార్టీ, నేషనలిస్టుపార్టీ, సోషలిస్టుపార్టీ, సోషలిస్టు యువజన సంఘం, ఇండొనేషియా ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు, ఇతర ప్రజా సంస్థలు, ప్రజాస్వామిక శక్తులు ఉన్నాయి).

నేషనలిస్టుపార్టీ నాయకుడైన హట్టా, జాతీయ సంఘటన అభిమతం ప్రకారం, మిశ్రమ మంత్రివర్గాన్ని యేర్పరచడానికి ఒప్పుకోలేదు. కాని, జాతీయ సంఘటన ప్రణాళికను అమలుపరచుతానని దొంగ వాగ్దానాలు చేస్తూవచ్చాడు.

జాతీయ సంఘటన బలాన్ని గమనించిన హట్టా 1948 జూలైలో అమెరికా సామ్రాజ్యవాదులతో మంతనాలు జరిపి, జాతీయ శక్తులను నాశనం చేయడానికి ప్లాను వేశాడు. దీని ప్రకారం జావా ద్వీపంలోని "మాడియన్"లో ఒక తిరుగుబాటు లేవదీయించి,

ఈ మిషతో జాతీయ సంఘటనలోని వివిధ పార్టీలపైన దాడి ప్రారంభించాడు. దీనితో అమెరికా సామ్రాజ్యవాదుల మెప్పు బడయవచ్చని ఆశించాడు.

అనేకవేలమంది దేశభక్తులను జైళ్ళలో కుక్కాడు; కాల్చి చంపాడు. హట్టా ఆజ్ఞల ప్రకారం కమ్యూనిస్టుపార్టీ నాయకులైన మూసో, సురిపనో, ఛార్జనో, దారుస్మాన్‌లను కాల్పించాడు. మాజీ ప్రధానమంత్రిగా పనిచేసిన షరీఫుద్దీన్‌ను పసిబట్టి మరీ చంపించాడు హట్టా. ఈ దాడివల్ల జాతీయ సంఘటన గట్టిదెబ్బతిన్నది.

ఇకనుండి, దేశక్షేమాన్ని గాలికివదలి సామ్రాజ్యవాదుల తొత్తుగా బహిరంగంగానే సోకర్నో, హట్టాలు పనిచేయటం ప్రారంభించారు. జాతీయోద్యమాన్ని అణచలేకపోయిన హట్టా సామ్రాజ్యవాదుల సైనిక సహకారాన్ని కోరాడు. దాని ప్రకారం 1948సంవత్సరం, డిసెంబరు 18 వ తేదీన డచ్చి సామ్రాజ్యవాదులు మరొకసారి సైనిక దాడి ప్రారంభించారు. ఈసారి రాజధానీనగరమైన "జకార్తాను" ఆక్రమించారు.

దీన్నంతటినీ అవకాశంగా తీసుకుని అమెరికన్ సామ్రాజ్యవాదులు నెమ్మదిగా దేశంలోని రబ్బరుతోటలమీద, నూనె, తగరం, నికెల్, సీసం గనులమీద పెత్తనం సంపాదించటం ప్రారంభించారు. అనేక డచ్చి కంపెనీలను కొనటం ప్రారంభించారు.

ప్రజల ప్రతిఘటనముందు సామ్రాజ్యవాదుల ఆటలు సాగలేదు. డచ్చిసేనలు ఎన్ని అకృత్యాలు చేసినా, ప్రజలను లొంగదీయ లేకపోయాయి. అందుచేత, తిరిగి సోకర్నో, హట్టాలను రంగం మీదకు తెచ్చి వారికి పట్టంగట్టారు.

పదవికి వచ్చినవెంటనే కృతజ్ఞతాసూచకంగానేమో, అమెరికా సామ్రాజ్యవాదులకు అనేక తగరం, నూనెగనులపైన, అనేక రబ్బరు తోటలపైన అధికారమిచ్చే ఒడంబడికలపై హట్టా సంతకాలు చేశాడు. వారి సూచనలప్రకారం హేగ్‌లో జరిగిన రౌండుటేబుల్ కాన్ఫరెన్సుకు వెళ్ళి, డచ్చి సామ్రాజ్యంలో భాగంగా ఇండోనేషియా

ఉండటానికి (ఆచరణలో కాలనీగా ఉండడానికి) ఒప్పుకొని 1949 వ సంవత్సరం, డిసెంబరు 21 వ తేదీన ఒడంబడికమీద సంతకంచేసి వచ్చారు.

విదేశీ సామ్రాజ్యవాదులు, వారి తొత్తులయిన మితవాద నాయకుల ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజల్ను సాగిస్తూవచ్చిన సాయుధపోరాటంవల్ల, ప్రపంచ ప్రజల ఒత్తిడివల్ల డచ్చి సామ్రాజ్య వాదులు 1954 వ సంవత్సరం ఆగస్టు 10 వ తేదీన యీ ఒడంబడిక రద్దుచేసి దేశ స్వాతంత్ర్యాన్ని గుర్తించారు.

దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం సిద్ధించినా, దేశీయ ఆర్థిక వ్యవస్థపై విదేశీ సామ్రాజ్యవాదుల పట్టు సడలలేదు. ఇండొనేషియా ప్రభుత్వాన్ని తమ చెప్పుచేతల్లో ఉంచుకొనేందుకు చేసే వీరి ప్రయత్నాలు ఆగలేదు.

దేశంలోని గనులన్నీ, తేయాకు, రబ్బరు తోటలు, డచ్చి, అమెరికా పెట్టుబడిదార్ల చేతుల్లో ఉన్నాయి. ఇంకా అమెరికా పెట్టుబడులు డచ్చి పెట్టుబడులను మించలేదు. డచ్చి పెట్టుబడిదారుల అనేక కంపెనీలను అమెరికా పెట్టుబడిదార్లు కొనటంగాని, కంట్రోలు చేయటంగాని జరుగుతోంది. తమ ప్రాబల్యంకోరకు అమెరికా పెట్టుబడిదార్లు విశేషంగా ప్రయత్నిస్తున్నారు.

అమెరికన్ సామ్రాజ్యవాదులు ఇండొనేషియాలో ఒక్క యుద్ధ కేంద్రాన్ని కూడా నిర్మించలేకపోయారు. అందుచేత ఇపుడు ఇండొనేషియాలో భాగంగా వుంటూ, ఇంకా డచ్చి సామ్రాజ్యవాదుల చేతిలోవున్న పశ్చిమ ఇరియన్‌ను యుద్ధకేంద్రంగా అభివృద్ధి చేస్తున్నారు. పశ్చిమ ఇరియన్‌ను తక్షణం ఇండొనేషియా ప్రభుత్వానికి అప్పగించాలని ప్రజలు ఆందోళన చేస్తున్నారు. కాని, సామ్రాజ్య వాదులు మాత్రం యిందుకు అంగీకరించక దాన్ని యుద్ధ కేంద్రంగా తయారుచేస్తూనే వున్నారు. అవసరమయితే, యీ కేంద్రం నుండే ఇండొనేషియాపై దాడిచేయటానికికూడ సామ్రాజ్యవాదులు ప్లాన్లు వేస్తున్నారు.

శాస్త్రో అమిజోజో ప్రధాన మంత్రిగా పనిచేస్తున్న మంత్రివర్గం అభ్యుదయమార్గాన్ని అనుసరిస్తున్నది.

అమెరికన్ సామ్రాజ్యవాదులు యేర్పరచిన ఆగ్నేయ - ఆసియా యుద్ధకూటమిలో చేరటానికి యిది అంగీకరించలేదు. శాంతి యుత సహజీవనాన్నికీ, ప్రపంచ శాంతికీ దోహదంచేసే నెహ్రూ - చౌ ఎన్-లై పంచసూత్ర ప్రణాళికను అంగీకరించింది.

అమెరికా గుత్తవ్యాపారస్తుల ప్రాబల్యంనుండి బైటబడి, ప్రజా చైనా, జకొస్లవేకియా, తూర్పు జర్మనీ, హంగరీ మొదలయిన నూతన ప్రజాస్వామ్య దేశాలతో వ్యాపార ఒడంబడికలు చేసుకున్నది.

ఈ మంత్రివర్గం తమకు అనుకూలంగా వ్యవహరించడంలేదని అమెరికా సామ్రాజ్యవాదులు అనేక రకాలైన ఒత్తిడి తెస్తున్నారు. చతుస్సూత్ర ప్రణాళిక క్రింద ఇండోనీసియాకు చేస్తున్న ఆర్థిక "సాయాన్ని" ఆపివేస్తామని బెదిరిస్తున్నారు.

చివరకు, దేశంలో అశాంతిని రేపి, ప్రభుత్వాన్ని కూలదోయా లని ప్రయత్నిస్తున్నారు. దారుల్-ఇస్లాం అనే మత దురహంకార సంస్థకు ఆయుధాలు, డబ్బు ఇచ్చి, అమెరికా సలహాదార్లను పంపి, వారిచేత గ్రామాలపై దాడులుచేయించి, దేశంలో అరాచకం రేపాలని కుట్రలు పన్నుతున్నారు.

అయినా, ఇండోనేషియా ప్రభుత్వం జాతీయ సంఘటనయొక్క సంపూర్ణ సహకారంతో శాంతివిధానాలననుసరిస్తూ, దారుల్ - ఇస్లాం గూండాల దాడిని ప్రతిఘటిస్తూనేవుంది.

శాస్త్రో అమిజోజో ప్రభుత్వం అవలంబిస్తున్న సామ్రాజ్యవాద వ్యతిరేక అభ్యుదయ విధానాలు గిట్టక, సామ్రాజ్యవాదులు - ముఖ్యంగా అమెరికన్ సామ్రాజ్యవాదులు - యీ ప్రభుత్వాన్ని పడ గొట్టాలని అనేక కుట్రలుచేశారు; పలుమార్లు ప్రభుత్వంలో తమ కీలుబొమ్మలచేత రాజీనామాల నిప్పించి, ప్రతిష్టంభన కలుగచేశారు. కాని ప్రజలు వీరి కుట్రలను చాలవరకు భగ్నం చేయగలిగారు. కమ్యూనిస్టుపార్టీ శాస్త్రోఅమిజోజో ప్రభుత్వాన్ని బలపరుస్తూ వచ్చింది.

శాస్త్రో అమిజోజో చొరవదీసుకుని 1955 ఏప్రిల్‌లో ఆసియా - ఆఫ్రికా దేశాల మహాసభను (బాండుంగ్ సభ) జరపడం సామ్రాజ్య వాదులకు మరింత కన్నెర్ర అయింది. ప్రభుత్వాన్ని పడగొట్టడానికి ప్రయత్నాలు తీవ్రతరం చేశారు.

1955 జూలైలో విముక్తి పోరాటంలో ప్రముఖపాత్ర నిర్వ హించిన జాతీయయోధుడు మేజర్-జనరల్ బంబాంగ్ ఓటోజోను సర్వసేనానిగా ప్రభుత్వం నియమించింది. సైన్యంలో చీలికలు తేవడానికి సామ్రాజ్యవాదులు చేస్తున్న ప్రయత్నాలను విఫలం చేయడానికీ, ఈయనను సర్వసేనానిగా నియమించడానికీ ప్రభుత్వం నిర్ణయించింది. ఇదిగిట్టని సామ్రాజ్యవాదులు, దీనిని అవకాశంగా తీసుకుని, ప్రభుత్వంలో ప్రతిష్టంభన తెచ్చారు. చివరకు శాస్త్రో అమిజోజో ప్రభుత్వం రాజీనామా నివ్వవలసి వచ్చింది.

తరువాత జూలైలో మస్జుమీ పార్టీ నాయకుడు హరాహప్ (Harahap) మంత్రివర్గాన్ని ఏర్పరచాడు. మస్జుమీపార్టీ భూస్వాముల పార్టీ; సామ్రాజ్యవాదులకు అనుకూలమైన పార్టీ.

వీరు ప్రభుత్వానికి వచ్చిన తర్వాత సామ్రాజ్యవాదుల దోపిడీకి అనేక అవకాశాలు కలుగచేశారు. విదేశపెట్టుబడుల దిగుమతి మీద ఇంతవరకూవున్న అనేక ప్రతిబంధకాలను తొలగించారు. వారాశించని చిన్న చిన్న పరిశ్రమలలోను, కుటీర పరిశ్రమలలోను మాత్రం విదేశ పెట్టుబడులను నిషేధించారు. విదేశ పెట్టుబడిదార్లు లాభాల నెగుమతి చేసుకోడానికి అనుమతి నిచ్చారు.

దీన్ని అవకాశంగాతీసుకుని,డచ్-ఇండోనేషియా యూనియన్, పశ్చిమ ఇరియన్, ఇతర ఆర్థిక ఒడంబడికల విషయంలో తమ కనుకూలమైన పద్ధతులలో ఒడంబడికలు చేసుకొనేందుకు డచ్చి సామ్రాజ్య వాదులు ప్రయత్నించారు. హరాహప్ ప్రభుత్వం యీ సంప్రదింపులల్లో నీళ్ళు నములుతూ సామ్రాజ్యవాదుల కోరికలను వ్యతిరేకించ లేదు.

ఈ సామ్రాజ్యవాద అనుకూలపాలసీని ప్రజాస్వామిక పార్టీలు వ్యతిరేకించాయి. నేషనల్ పీపుల్సపార్టీ, నహదతుల్ ఉలేమా, ముస్లిం ఫెడరేషన్ పార్టీలు నిరసన సూచకంగా తమపార్టీలకు చెందిన మంత్రిమండలి సభ్యుల్ని వెనుకకు రప్పించారు. దీనితో హారాహప్ ప్రభుత్వం పడిపోయేస్థితికి వచ్చింది. తనస్థానాన్ని కాపాడు కోడానికి హారాహప్ ప్రభుత్వం చివరకు ఫిబ్రవరిలో డచ్-ఇండొనేషియా యూనియన్‌ను రద్దుచేసింది. ఫిబ్రవరి 24 వ తేదీన ఈ విషయాన్ని ఐక్యరాజ్యసమితికి తెలియజేసింది. అయినా ప్రజలు ఈ అభివృద్ధి నిరోధక ముఠాను క్షమించలేదు. గత్యంతరంలేక హారాహప్ ప్రభుత్వం మార్చి 3 వ తేదీన రాజీనామా నివ్వవలసి వచ్చింది.

1955 వ సంవత్సరాంతంలో ఇండొనేషియాలో మొట్టమొదటి సారిగా వయోజన ఓటింగుతో యెన్నికలు జరిగాయి. దామాషా ప్రాతినిధ్యపద్ధతిని యెన్నికలు జరిగాయి.

ఇందులో నేషనలిస్టు పార్టీకి (శాస్త్రో అమిజోజో పార్టీ) 84,35,000 ఓట్లు, పార్లమెంటులో 57 సీట్లు వచ్చాయి. మస్జూమీ పార్టీకి 79,04,000 ఓట్లు, 57 సీట్లు; నహదతుల్ పార్టీకి 69,55,000 ఓట్లు, 45 సీట్లు; కమ్యూనిస్టుపార్టీకి 61,77,000 ఓట్లు, 39 సీట్లు వచ్చాయి. మితవాద సోషలిస్టు పార్టీ నామరూపాలు లేకుండా పోయింది.

పార్లమెంటులో మొత్తం సీట్లు 257.

నేషనలిస్ట్‌పార్టీ, నహదతుల్ ఉలేమా పార్టీలు రెండూ సామ్రాజ్యవాద వ్యతిరేక పార్టీలు. రెండవ పార్టీ శాస్త్రో అమిజోజో ప్రభుత్వాన్ని బలపరుస్తూ వచ్చింది. సామ్రాజ్యవాదుల పిడికిలి నుండి దేశాన్ని పూర్తిగా విముక్తిచేయటం, వారి మిలిటరీ కూటములలో పాల్గొనకపోవటం అనే కార్యక్రమంమీద రెండు పార్టీలూ పోటీ చేశాయి.

నేషనలిస్ట్‌పార్టీ, మస్జుమీపార్టీ, నహదతుల్ ఉలేమాపార్టీలతో మిశ్రమ మంత్రివర్గం 1956 మార్చిలో ఏర్పరచబడింది. దానికి నేషనలిస్ట్‌పార్టీ నాయకుడు శాస్త్రో అమిజోజో ప్రధాని.

నేషనలిస్ట్‌పార్టీ ప్రతిపాదించిన కార్యక్రమాన్ని కమ్యూనిస్టు పార్టీ అంగీకరించింది. కాని, సామ్రాజ్యవాద అనుకూలపార్టీ అయిన మస్జుమీపార్టీకూడా మంత్రివర్గంలోకి రావాలని నేషనలిస్ట్‌పార్టీ కోరడం వల్ల వీరు మంత్రివర్గంలో చేరడానికి ఒప్పుకోలేదు.

కమ్యూనిస్టుపార్టీని మంత్రివర్గంలోకి తీసుకోకూడదని మస్జుమీ పార్టీ పట్టుపట్టింది. ఈ పార్టీ శాస్త్రో అమిజోజో తయారుచేసిన కార్యక్రమాన్ని అంగీకరించటం స్వార్థపూరితమైన ఎత్తుగడతప్ప, హృదయ పూర్వకమైన అంగీకారంమాత్రం కాదు; ఏ క్షణాన్నయినా అది దాన్ని ఉల్లంఘించే అవకాశం ఉంది. తిరిగి యీ అభివృద్ధినిరోధకపార్టీ అధికారంలోకి రావటం ప్రజలకు యిష్టంలేదు.

కొత్త ప్రభుత్వం మొదటివలె తమదేశం ఏ యుద్ధకూటమి లోనూ చేరదని, పంచశీలాలను బలపరచుతుందని ప్రకటించింది. డచ్చి పెట్టుబడులను స్వాధీనం చేసుకోడానికి నిశ్చయించింది.

# ఫిలిపైన్సు

**భూ**మధ్య రేఖ ప్రాంతంలో, పసిఫిక్ మహాసముద్రంలోవున్న 7,100 ద్వీపాలను కలిపి "ఫిలిపైన్సు దీవులు" అంటారు. ఇవి యుద్ధ వ్యూహరీత్యా చాల ప్రాముఖ్యత వహిస్తాయి.

వీటి మొత్తం వైశాల్యం 1,15,600 చదరపు మైళ్ళు. జనాభా (1948 లో) 1,92,34,182. రాజధానీ నగరం మనిలా.

దేశ వైశాల్యంలో నూటికి 60 వంతుల ప్రాంతం పెద్ద అడవులతో నిండివుంది. వీటిలో కలప విరివిగా లభిస్తుంది.

ఈ దేశంలో సామ్రాజ్యవాదుల ''చలవ'' వల్ల పరిశ్రమలు అభివృద్ధికాలేదు. జనాభాలో నూటికి 80 మంది వృత్తి వ్యవసాయమే.

సాగవుతున్న భూమిలో నూటికి 70 వంతులు జమీందార్ల, భూస్వాముల చేతుల్లోనే ఉంది. దున్నే రైతుకు భూమిలేనందున జమీందారీ దోపిడీతో వ్యావసాయిక జనాభా నలిగిపోతున్నది.

ఆహారపంటలో వరి ప్రధానమైనది. ఇచ్చట పండేపంట దేశావసరాలకు చాలక పోవటంచేత, ఇతరదేశాలనుండి ఆహార ధాన్యాలు దిగుమతి చేయబడతాయి.

చెరకు, కొబ్బరి, మనీలానార (Manila Hemp), పొగాకు, పెద్ద యెత్తున పండించబడుతున్నాయి. పంటలో దాదాపు అంతా ఎగుమతి చేయబడుతున్నది. వీటిలో నూటికి 80 పాళ్ళు అమెరికాకు ఎగుమతి చేయబడుతున్నాయి.

బంగారం, క్రోమైట్, రాగి, ముడిఇనుము, సీసం ఖనిజాలు విరివిగా లభిస్తాయి. ఈ గనులన్నీ అమెరికన్ పెట్టుబడిదార్ల చేతుల్లోనే ఉన్నాయి. తీయబడిన ఖనిజమంతా అమెరికాకే ఎగుమతి చేయబడు తున్నది.

దేశంలో ఉత్పత్తయ్యే వ్యావసాయిక, పారిశ్రామిక ముడి సరుకుల్లో నూటికి 70 పాళ్లు అమెరికాకు ఎగుమతవుతున్నాయి. దిగు మతుల్లో నూటికి 75 పాళ్లు అమెరికానుండి వస్తున్నాయి. వస్త్రాలు, ఉక్కు సామాగ్రి, యంత్రాలు, సిగరెట్లు, మందులు, ఆహార పదార్థాలు దిగుమతుల్లో ముఖ్యమైనవి.

ఫిలిప్పైన్సు దీవులు అమెరికా వలసదేశం. రెండవ ప్రపంచ యుద్ధానంతరం 1946 వ సంవత్సరం, జులై 4 వ తేదీన అమెరికా సామ్రాజ్యవాదులు యీ దేశానికి "స్వాతంత్ర్యప్రదానం" చేశారు. కాని, దేశ ఆర్థిక, రాజకీయ వ్యవస్థలపైన అమెరికా సామ్రాజ్య వాదులకున్న ప్రాబల్యం ఏమాత్రం తగ్గలేదు. పైగా, వారి యినుప పిడికిలి నానాటికీ బిగుస్తున్నది.

దేశంలోని గనులన్నీ అమెరికన్ పెట్టుబడిదార్ల చేతుల్లోనే ఉన్నాయి. వ్యావసాయిక ముడిసరుకులన్నిటినీ రైతు, అమెరికా గుత్త వ్యాపారస్తులు విధించే నామమాత్రపు ధరకు అమ్ముకోవలసిందే!

దేశంనుండి ఎగుమతయ్యే ముడిసరుకుల్లో నూటికి 75 వంతులు అమెరికాకే పోతున్నాయంటే, వీరు దేశాన్ని ఎంతగా దోపిడీచేస్తున్నారో అవగతమవుతుంది. దానికితోడు, దేశసింహాసన మధిష్ఠించిన "జాతీయ" ప్రభుత్వం అమెరికానుండి దిగుమతయ్యే సరుకులపై దిగుమతి పన్నునుకూడా తొలగించి, వీరి దోపిడీకి మరింత సాయపడుతున్నది.

నిన్నటివరకూ, జపాన్ సామ్రాజ్యవాదుల అడుగులకు మడుగులొత్తిన యీ ప్రభుత్వ నాయకులు నేడు అమెరికా సామ్రాజ్యవాదులకు వూడిగంచేస్తూ, సామ్రాజ్యవాద దోపిడీకీ, వారి యుద్ధ పథకాలకూ తోడ్పడుతున్నారు. అమెరికా సామ్రాజ్యవాదులు ఆగ్నేయ ఆసియా యుద్ధకూటమిని నిర్మించడానికి యీ ప్రభుత్వం విశేషంగా తోడ్పడింది. దేశంలో అమెరికా యుద్ధకేంద్రాల నిర్మాణానికి, అమెరికా సైనిక దళాలను ఉంచటానికి అనుమతించింది.

విదేశీ సామ్రాజ్యవాదుల పాదసేవ చేయనేర్చిన యీ ప్రభుత్వానికి ప్రజలక్షేమం తృణప్రాయం. విదేశీ సామ్రాజ్యవాదుల, దేశీయ జమీందార్ల, భూస్వాముల దోపిడీకి గురవుతున్న ప్రజల జీవితం నానాటికీ దుర్భరమవుతున్నది. ప్రజాస్వామిక హక్కులకొరకు విదేశీ సామ్రాజ్యవాదుల, దేశీయ భూస్వాముల పాలననుండి విముక్తి సాధించడానికి ఆందోళనచేస్తున్న కమ్యూనిస్టుపార్టీపైన, ఇతర ప్రజా సంఘాలపైన ప్రభుత్వం క్రూర నిర్బంధ విధానం అమలుజరిపింది.

జపాన్ సామ్రాజ్యవాదుల ఆక్రమణకు వ్యతిరేకంగా దేశ విముక్తికొరకు పోరాడిన ప్రజలు గత్యంతరంలేక తిరిగి సాయుధులై అమెరికా సామ్రాజ్యవాదానికి, వారికి కీలుబొమ్మగా వ్యవహరిస్తున్న "జాతీయ" ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్నారు. ఈ గెరిల్లా సైన్యమే "హుక్ బాంగ్".

ఈ విమోచన సైన్యాన్నీ, ప్రజల ప్రతిఘటననూ నాశనం చేయడానికి తమ సైన్యాలు, విమానాలు, టాంకులు, యితర ఆయుధాలను అమెరికా సామ్రాజ్యవాదులు వినియోగిస్తున్నారు. కాని, ప్రజల ప్రతిఘటనోద్యమం చావలేదు! ఇంకా సాగుతూనే వుంది.

# తాయ్‌లాండ్ (సయాం)

తాయ్‌లాండ్ మన దేశానికి తూర్పుగా, బర్మా, ఇండో చైనా, మలయా దేశాలకు మధ్యన ఉన్నది. ఆసియాలో యుద్ధవ్యూహ రీత్యా యిది మంచి కీలకస్థానం.

తాయ్‌లాండ్ వైశాల్యం రెండు లక్షల చదరపు మైళ్లు. బర్మా దేశం కంటె కొంచెం చిన్నది.

దేశ ఉత్తర భాగం, దక్షిణ భాగం అంతా పర్వతమయం. మధ్యభాగం మాత్రం సారవంతమైన నదీ మైదానం.

దేశ వైశాల్యంలో నూటికి 70 వంతుల ప్రాంతం అడవులు! ఈ అడవుల్లో నాణ్యమైన టేకు లభిస్తుంది. కలప పరిశ్రమలో నూటికి 50 పాళ్ళు బ్రిటిష్ పెట్టుబడిదార్ల చేతుల్లో వుంది.

దేశ జనాభా సుమారు 1,50 లక్షలు. వీరిలో అధికభాగం బాగా పంటలు పండే మైదానాలలో నివసిస్తున్నారు. మొత్తం జనాభాలో అధికభాగం బౌద్ధులు. నాగరికతలో, మతంలో బర్మా దేశీయులకూ, వీరికీ చాల పోలికలున్నాయి.

నూటికి 83 మంది ప్రజలు వ్యవసాయంమీద జీవిస్తారు. సాగవుతున్న భూమిలో నూటికి 90 వంతులు రాజవంశీకులయిన జమీందార్ల, ఇతర భూస్వాముల చేతుల్లోవుంది. వీరు కౌలుదార్ల చేత వ్యవసాయం చేయిస్తారు. కౌలుదారు పండిన పంటలో నూటికి 60 పాళ్ల వరకూ భూస్వాములకు ఇచ్చుకోవలసి వుంటుంది.

వ్యవసాయ పంటల్లో ముఖ్యమైనది వరి. మొత్తం పైర్లు వేసే భూమిలో నూటికి 94 వంతుల వైశాల్యంలో వరి పండిస్తారు. ఎగుమతుల్లో బియ్యం ప్రథమస్థాన మాక్రమిస్తున్నది. దేశ మధ్య భాగంలోని నదీ మైదానాలలో వరిపైరు వేయబడుతున్నది.

ఆంగ్లో-అమెరికన్ వ్యాపారస్తులు, కొంతమంది దేశీయ పెట్టుబడిదార్లు రైతుకు ఉత్పత్తి ఖర్చుల్లో నాలుగోవంతు మాత్రమే యిచ్చి

కారుచౌకగా కొని, విపరీత లాభాలు గడిస్తున్నారు. పండించిన రైతు అణగారిపోతున్నాడు.

తర్వాత చెప్పదగినది రబ్బరు తోటల పెంపకం. ఉత్పత్తయిన సరుకులో నూటికి 70 పాళ్లు అమెరికా గుత్తవ్యాపారస్తులు కొని, తమ దేశానికి ఎగుమతి చేస్తున్నారు.

ఈ విధంగా ఆంగ్లో - అమెరికన్ గుత్తవ్యాపారస్తులు, వ్యవసాయ సరుకులను నామమాత్రపు ధరలకు కొని, తమ దేశానికి తరలించుక పోతున్నారు.

దేశంలో పరిశ్రమలేవీ అభివృద్ధికాలేదు. దొరికే ఖనిజాల్లో ముఖ్యమైనది తగరం. దాని త్రవ్వకం, ఎగుమతి అంతా బ్రిటిష్ పెట్టుబడిదార్ల చేతుల్లో వుంది. క్రమంగా అమెరికన్ పెట్టుబడిదార్లు ఈ పరిశ్రమను చేజిక్కించుకొనేందుకు ప్రయత్నం చేస్తున్నారు. ఎగుమతుల్లో తగరం రెండవ స్థానాన్ని ఆక్రమిస్తున్నది.

దేశంలోవున్న పరిశ్రమలల్లా ఒక సిమెంటు ఫ్యాక్టరీ, ఒక అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ, పేపరు మిల్లులు, బట్టలు మిల్లులు మాత్రమే!

బియ్యం, తగరం, రబ్బరు, టేకు ప్రధాన ఎగుమతులు. వీటిలో తగరం, రబ్బరు ఇంగ్లండు, అమెరికా దేశాలకు ఎగుమతి చేయబడుతున్నాయి. బియ్యంలో కొంత మనదేశానికి దిగుమతి అయేది.

యంత్రాలు, వీటి విడిభాగాలు, బట్టలు, లోహ పనిముట్లు ముఖ్య దిగుమతులు.

దిగుమతి అవుతున్న బట్టల్లో అత్యధికభాగం జపాన్‌నుండే వస్తున్నాయి. యంత్రాలు అమెరికా, ఇంగ్లండు దేశాలనుండి దిగుమతి అవుతున్నాయి.

రాజధానీనగరం ఏకైక రేవు పట్టణం బాంకాక్. ఇది "చావోఫాయా" నదిమీద ఉంది. రాజధానీనగరంనుండి, ఉత్తర ప్రాంతానికి, ఆగ్నేయ ప్రాంతానికి దక్షిణాన సింగపూరును కలుపుతూ రైలుమార్గాలున్నాయి.

1930 వ సంవత్సరంనాటికి తాయ్‌లాండు దేశంపై బ్రిటిష్ సామ్రాజ్యవాదులు రాజకీయ, ఆర్థిక పెత్తనాన్ని చేపట్టారు. ప్రభుత్వం ఒక కీలుబొమ్మగా మాత్రమే మిగిలిపోయింది.

1931- ఆ ప్రాంతంలో జపాన్, అమెరికా సామ్రాజ్య వాదులు నెమ్మదిగా దేశంలో ప్రవేశించారు. జపాన్ సామ్రాజ్య వాదులు కుట్రచేసి, తమ తాబేదారయిన సంగ్రామ్ ప్రధాన మంత్రిగా ఒక మంత్రివర్గాన్నేర్పరచి తమ దోపిడీ ప్రారంభించారు. ఇంతలో రెండవ ప్రపంచ సంగ్రామం వచ్చింది; బ్రిటన్, అమెరి కాలపై జపాన్ యుద్ధం ప్రకటించింది. తాయ్‌లాండ్ ప్రభుత్వం జపాను సామ్రాజ్యవాదుల ఆజ్ఞప్రకారం, వారితో రక్షణ ఒడంబడిక నొకదాన్ని చేసుకొని, బ్రిటన్, అమెరికాలపై యుద్ధం ప్రకటించింది.

దీని తర్వాత బ్రిటన్, తాయ్‌లాండును శత్రుదేశంగా పరిగణిం చినా, అమెరికా మాత్రం తన పెట్టుబడులను, ఇతరత్రా సంపాదిం చిన ప్రయోజనాలను కాపాడుకొనేందుకు బ్రిటన్ లేని సమయం చూసి, తాను ఆ స్థానాన్ని ఆక్రమించేందుకు ఆర్థిక సహాయం చేస్తూ "మిత్రత్వ" సంబంధాలను కొనసాగించుతూ వచ్చింది.

1945 వ సంవత్సరంలో - యుద్ధం ముగిసేముందు - బ్రిటిష్ సామ్రాజ్యవాదులు 21 డిమాండ్లతో ఒక పత్రాన్ని తాయ్ ప్రభు త్వానికి (ఆగ్నేయ ఆసియాలో మిత్రమండలి సర్వసైన్యాధ్యక్షుడుగా అపుడు పనిచేస్తున్న లార్డు మౌంటుబాటన్ ద్వారా) అందచేశారు.

వీటిలో ముఖ్యమైనవి: (1) దేశంలోని తగరం, రబ్బరు, టేకు, నూనె - వీటిమీద పూర్వం బ్రిటన్‌కున్న గుత్తవ్యాపార హక్కులను, తాయ్ ప్రభుత్వం గుర్తించాలి.

(2) కీలక ప్రదేశాలలో బ్రిటన్ సైన్యాల నుంచుకోనివ్వాలి.

(3) నౌకా కేంద్ర నిర్మాణానికి బ్రిటనుకు అనుమతినీయాలి.

(4) సముద్రవ్యాపారంపై బ్రిటన్ అజమాయిషీ చేయాలి.

ఈ డిమాండ్లను తాయ్ ప్రభుత్వం యెట్టి మినహాయింపులు లేకుండా అంగీకరించాలని బ్రిటన్ ఆజ్ఞాపించింది. తాయ్ ప్రభుత్వం

ఇందుకంగీకరించలేదు. వెంటనే అమెరికన్ సామ్రాజ్యవాదులు మధ్యవర్తిత్వం నెరపడానికి వచ్చారు. వీరు చేసిన రాజీ ప్రకారం తాయ్ ప్రభుత్వం బ్రిటన్ కోరికలను అంగీకరించింది. కాని, దేశం నుండి ఎగుమతయ్యే బియ్యం, తగరం, టేకు, రబ్బరు వీటి ఎగుమతులపై రెండు దేశాలూ పరస్పరాంగీకారంపై అజమాయిషీ చేయటానికి బ్రిటన్ అంగీకరించింది. యుద్ధంలో బ్రిటన్ విపరీతంగా, బలహీనపడ్డం వల్ల అమెరికన్ సామ్రాజ్యవాదులకు అనేకవిషయాలలో తలఒగ్గినట్లే ఈ విషయంలో కూడా తనదోపిడీలో అమెరికాకు భాగం ఇవ్వడానికి అంగీకరించక తప్పలేదు.

క్రమంగా తన పెట్టుబడులను అనేక పేర్లతో ఎగుమతిచేస్తూ, అమెరికా సామ్రాజ్యవాదం దేశ ఆర్థిక విధానంపై విశేషప్రాభవాన్ని సంపాదించింది. సామ్రాజ్యవాదులకు ఊడిగం చేయనేర్చిన 'సంగ్రాం' ప్రభుత్వం, వెంటనే రంగుమార్చి, అమెరికా తొత్తుగా తయారైంది. అమెరికా యుద్ధోన్మాదులు, దేశాన్ని, ఆగ్నేయ ఆసియాలో ప్రధాన యుద్ధస్థావరంగా అభివృద్ధి చేస్తున్నారు. అమెరికా నిర్మించిన ఆగ్నేయ ఆసియా రక్షణ కూటమిలో తాయ్‌లాండ్ ప్రధానపాత్రను నిర్వహిస్తున్నది.

బ్రిటన్, తాయ్‌లాండు ప్రభుత్వంపై రాజకీయ పలుకుబడిని కొంతవరకు కోల్పోయినా, తన పెట్టుబడుల రక్షణకు విశ్వప్రయత్నం చేస్తున్నది.

తాయ్ ప్రభుత్వం ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల ఆజ్ఞల ప్రకారం మలయా విమోచనోద్యమాన్ని అణచడానికి విశేషంగా సాయపడుతున్నది. వియత్‌నామ్ విమోచనోద్యమాన్ని అణచడానికి కూడా సాయపడింది.

తాయ్‌లాండ్ ప్రజల జీవితం నానాటికి దుర్భరమై, తమ వర్గ సంఘాలద్వారా కనీసకోర్కెలకొరకు ఆందోళనచేస్తున్నారు. 1944లో ప్రప్రథమంగా ట్రేడ్‌యూనియన్ సంస్థ ఏర్పరచబడింది. 1948లో

"జనరల్ ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్‌యూనియన్స్" అనుపేర దీన్ని పునరుద్ధరించారు.

ఈ విధంగా తమ వర్గసంఘాలద్వారా కనీసకోర్కెలకోసం, విదేశ సామ్రాజ్యవాదుల బానిసత్వంనుండి విముక్తికి దేశస్వాతంత్ర్యం కోసం ఆందోళనచేస్తున్న ప్రజాసంఘాలపైన, వీటికి నాయకత్వం వహిస్తున్న కమ్యూనిస్టుపార్టీపైన తీవ్ర నిర్బంధవిధానం అమలు జరుప బడుతోంది. అందుచేత ప్రజా సంఘాల కార్యకర్తలు, నాయకులు రహస్యంగా పనిచేయవలసి వచ్చింది.

# ఇండోచైనా

వియత్‌నామ్, లావోస్, కంబోడియా – ఈ మూడు దేశాలను కలిపి ఇండోచైనా అంటారు. దీనికి ఉత్తరాన బర్మా, చైనా దేశాలు, తూర్పున, దక్షిణాన దక్షిణచైనా సముద్రం, పడమర తాయిలాండ్ దేశం సరిహద్దులుగా ఉన్నాయి.

ఇది ఫ్రెంచివారి వలసదేశంగా ఉండేది. విస్తీర్ణం 2,54,705 చదరపుమైళ్ళు. జనాభా రెండుకోట్లా యభై లక్షలు.

వియత్‌నామ్ వైశాల్యం 93 వేల చదరపుమైళ్ళు, జనాభా రెండుకోట్ల ఇరవైయేడు లక్షలు (1943 లో). 1954 జులైలో జరిగిన జనీవా ఒడంబడిక ప్రకారం, దేశం రెండు ప్రభుత్వాలకింద విభజించ బడింది. ఉత్తర వియత్‌నామ్‌కు హానోయ్ రాజధాని. దక్షిణ వియత్‌నామ్‌కు సైగాన్ రాజధాని.

లావోస్ వైశాల్యం 91 వేల చదరపుమైళ్ళు. జనాభా పదిహేను లక్షలు (1948 లో). "వియంటియనీ" రాజధాని.

కంబోడియా వైశాల్యం డెభైవేల చదరపుమైళ్ళు. జనాభా 37,50,000 (1948 లో). "ప్నోంపెన్" రాజధాని.

దేశ జనాభాలో నూటికి 78 మంది సముద్రతీర ప్రాంతాల లోను, ఎర్రనది డెల్టా ప్రాంతంలోను నివసిస్తున్నారు. మిగిలిన ప్రాంతమంతా, పీఠభూములు, పర్వతప్రాంతాలు కనుక ఇక్కడ జనసమ్మర్దం తక్కువ.

ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయం. వరి ప్రధానపంట. బియ్యం సాలుకు సగటున 70 లక్షల టన్నులు పండించబడుతుంది. ఇందులో సుమారు 15 లక్షల టన్నులు ఎగుమతి చేయబడతాయి. ఎగుమతి వ్యాపారమంతా ఫ్రెంచి, అమెరికా పెట్టుబడిదార్ల చేతుల్లో ఉండేది.

వరి పంటలో అత్యధిక భాగం, ఉత్తర వియత్‌నామ్‌లోని ఎర్ర నదీ డెల్టా ప్రాంతంలోను, దక్షిణ వియత్‌నామ్‌లోని మీకాంగ్‌నదీ డెల్టా ప్రాంతంలోనూ పండించబడుతున్నది.

మొక్కజొన్న, చెరకు, పత్తి, పొగాకు ఇత్యాదులు ముఖ్యమైన వ్యవసాయ పంటలు.

దేశంలోని అడవుల్లో మంచి టేకు లభిస్తుంది. అందుచేత టేకు విస్తారంగా ఎగుమతి చేయబడుతోంది.

తగరం, మాంగనీసు, బాక్సైటు, మేలురకపు రాక్షసిబొగ్గు, టంగ్‌స్టేన్, తుత్తునాగం (zinc) మొదలైన ఖనిజాలు ఈ దేశంలో లభిస్తాయి. ఈ ఖనిజ పరిశ్రమలో అత్యధిక భాగం ఫ్రెంచి పెట్టుబడి దార్ల చేతుల్లోను, అమెరికా పెట్టుబడిదార్ల చేతుల్లోను ఉంది. ఈ పరిశ్రమలను క్రమంగా అమెరికావారు తమ చేతిలోకి తీసుకొనేందుకు ప్రయత్నం చేస్తున్నారు. ఇప్పటికప్పుడే, తగరం, తుత్తునాగం, రాక్షసి బొగ్గు ఈఖనిజోత్పత్తిని, పూర్తిగా గుత్తకు తీసుకున్నారు. ఖనిజపుటు త్పత్తిలో అధిక భాగం అమెరికాకే ఎగుమతవుతున్నది.

సామ్రాజ్యవాదులు దేశీయ పరిశ్రమలను అభివృద్ధి కానీయ లేదు. ప్రస్తుతం దేశంలో ఉన్న పరిశ్రమల్లో సబ్బులు, పంచదార, సిమెంటు, అగ్గిపెట్టెలు ఫ్యాక్టరీలు మాత్రం!

బియ్యం, రబ్బరు, చేపలు, కలప, తగరం, తుత్తునాగం, రాక్షసిబొగ్గు, మాంగనీసు, టంగ్‌స్టేన్ ముఖ్య ఎగుమతులు.

యంత్రాలు, వాటి విడిభాగాలు, ఇనుము, ఉక్కు, వస్త్రాలు, ఇతర ప్రజావసర సరుకులు - ఇవి ముఖ్య దిగుమతులు.

మన దేశం, ఇండోచైనానుండి బియ్యం దిగుమతి చేసుకొని, ముడిపత్తి, జనపనార (పట్టా సంచులు), నల్లమందు ఎగుమతిచేస్తున్నది. సైగాన్, ఫాన్‌రంగ్‌లు ముఖ్య రేవుపట్టణాలు.

ఇండోచైనా దక్షిణ భాగంలో, విరివిగా ఎగుమతి చేయడానికి కావలసినంత తగరం, టంగ్‌స్టీన్, జింక్, మాంగనీసు, రాక్షసిబొగ్గు, లంబర్, బియ్యం లభ్యమవుతాయి. దక్షిణాన బియ్యం, రబ్బరు, తేయాకు, మిరియాలు, పశువులు, తోళ్లు లభ్యమవుతాయి. ఇండో-చైనా, బర్మా దేశాలు ఆగ్నేయ ఆసియాకు వరి ధాన్యాగారాలు... "ఈదేశం కమ్యూనిస్టు చైనా, బ్రిటిష్ మలయా దేశాలను కలిపే 800 మైళ్ళ పొడవున్న "వంతెన". పైగా బర్మా, తాయిలాండు దేశాలకు సరిహద్దున యిదివుంది. హైఫాంగ్ సైగాన్ రేవులు మంచి యుద్ధస్థావరాలు. కనుక యుద్ధవ్యూహరీత్యా చూస్తే, ఇది చాల ముఖ్యమైన కీలకప్రాంతం" అని అమెరికా సామ్రాజ్యవాదుల వాణి "న్యూయార్కు టైమ్సు" పత్రిక ఇండోచైనా ప్రాధాన్యతను వివరిస్తూ వ్రాసింది. ఇండోచైనా వలసదేశంగా చూసినా, యుద్ధస్థావరంగా చూసినా ఇంత ముఖ్యమైన దేశం కనుకే, సామ్రాజ్యవాదులు ఒకరి తర్వాత ఒకరు దానిపై దురాక్రమణ జరిపారు.

## వియత్‌నామ్

రెండవ ప్రపంచయుద్ధంలో జర్మనీకి లొంగిపోయిన ఫ్రాన్సుకు, తన కాలనీలను కాపాడుకోగలిగిన శక్తిలేదు. దీన్నవకాశంగా తీసుకొని 1941 లో ఇండోచైనాలో ప్రవేశించిన జపాను సామ్రాజ్యవాదులు 1945 నాటికి దేశం మొత్తం చేజిక్కించుకున్నారు. 1945 వ సంవత్సరం మార్చి నెలలో దేశానికి "స్వాతంత్ర్యం" యిచ్చి, తమ కీలుబొమ్మ ప్రభుత్వాల్ని (ఈ మూడు దేశాలలోను) ఏర్పాటుచేశారు.

ఈ సందర్భంలోనే కొచ్చిన్‌చైనా, టాంగ్‌కింగ్, అన్నామ్ రాష్ట్రాలను కలిపి, "వియత్‌నామ్" అని ఒక కొత్తదేశాన్ని ఏర్పాటు

చేశారు. ఈ "స్వతంత్ర" దేశానికి "బావోదై" అనే తన కీలుబొమ్మను పాలకునిగా నియమించారు.

జపాను సామ్రాజ్యవాదులు దేశంలో అడుగుపెట్టింది మొదలు దేశప్రజలు, "హోచిమిన్"చే స్థాపించబడిన వియత్ నామ్ స్వాతంత్ర్య సమితి (వియత్ మిన్ కమ్యూనిస్టుపార్టీ, తదితర ప్రజాస్వామిక జపాను వ్యతిరేక పక్షాలతో కూడిన ఐక్యసంస్థ) నాయకత్వాన సాయుధ పోరాటం సాగించారు. గెరిల్లా పోరాటం ప్రారంభించిన ప్రజలు 1944వ సంవత్సరానికి "వియత్ నామ్ విముక్తి సైన్యాన్ని" నిర్మించి, సామ్రాజ్యవాద దురాక్రమణదారులతో ప్రత్యక్ష యుద్ధానికే తలపడ గలిగారు. చివరకు 1945లో జపాను లొంగిపోయిన తర్వాత, వియత్ నామ్ స్వాతంత్ర్యసమితి దేశ రాజకీయాధికారాన్ని చేజిక్కించుకొని 1945వ సంవత్సరం, సెప్టెంబరు రెండవ తేదీన స్వాతంత్ర్యాన్ని ప్రకటించింది. హోచిమిన్ నాయకత్వాన ప్రజా ప్రభుత్వాన్ని ఏర్పరచింది. 1946వ సంవత్సరం జనవరి 6 వ తేదీకి వివిధ ప్రజాస్వామిక పార్టీలకు, గ్రూపులకు, వ్యక్తులకు, జాతులకు ప్రాతినిధ్యం వహించే రాజ్యాంగ సభనుకూడా ఏర్పాటుచేసింది (ఎన్నికల ద్వారా).

1946 వ సంవత్సరం మార్చి ఆరవ తేదీన, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు వియత్ నామ్ స్వాతంత్ర్యాన్ని, హోచిమిన్ ప్రభుత్వాన్ని గుర్తించారు. కాని, విశాలహృదయంతో మాత్రం కాదు. ప్రజలను మోసంచేయటానికి వేసిన ఎత్తుమాత్రం !

తమ సైన్యాల దింపి, దేశాన్ని తిరిగి తామాక్రమించడానికి ప్రజలు ఒప్పుకోరు కనుక, జపాను సేనలను నిరాయుధం చేయటానికనే నెపంతో సైన్యాలను దించారు. దేశ స్వాతంత్ర్యాన్ని గుర్తించిన ఫ్రాన్సు తిరిగి తమపై దాడి చేస్తుందని ప్రజలు, ప్రభుత్వం అనుమానించలేదు. కనుక, సైన్యాలను దిగనిచ్చారు. కాని, 1946వ సంవత్సరం డిసెంబరు 19 వ తేదీన ఫ్రెంచి సైన్యాలు, హానోయ్‌లోని ప్రజా ప్రభుత్వ కార్యాలయాలమీద దాడి చేశాయి. దానితో ప్రజా ప్రభుత్వం దేశ స్వాతంత్ర్య రక్షణకు యుద్ధానికి దిగక తప్పలేదు.

ఈ విధంగా ఫ్రెంచి సామ్రాజ్యవాదులు అమెరికా, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల సహకారంతో దేశంలో తిరిగి చిచ్చుపెట్టారు. యుద్ధం ప్రజ్వలించింది.

ఫ్రెంచిసేనల దాడికి తట్టుకోలేక ప్రజా సేనలు, ప్రభుత్వం ఉత్తర దేశానికి తరలిపోయాయి. అట్లని దక్షిణప్రాంతంలో ప్రజలు ప్రతిఘటన మానుకొన్నారని కాదు. ప్రజాసైన్యం, ప్రజలు అడవుల్లో స్థావరాలేర్పరచుకొని గెరిల్లా పోరాటం ప్రారంభించారు.

సామ్రాజ్యవాదులు పూర్వం జపాను కీలుబొమ్మగా వ్యవహరించిన "బావొదై"ని తెచ్చి, 1948 జూన్‌లో దక్షిణ వియత్నామ్‌కు రాజుగా చేశారు.

మూడు సంవత్సరాలు గడిచిపోయాయి. ఫ్రెంచి సామ్రాజ్యవాదులు లక్షలమంది సైనికుల్ని, అమెరికా సప్లయిచేసిన విమానాలను, టాంకులను, ఇతర మారణాయుధాలను ఉపయోగించినా, ప్రజా ప్రభుత్వమున్న ఉత్తర వియత్నామ్‌ను వశంచేసుకోలేకపోయారు. దక్షిణాన జరుగుతున్న ప్రజల గెరిల్లా పోరాటాన్ని కూడా అణచలేకపోయింది.

రెండవ ప్రపంచయుద్ధాంతానికి అమెరికా సామ్రాజ్యవాదుల సహకారం లేకుండా, అటు దేశీయ వ్యవహారాలను, ఇటు వలస దేశాల్లో యుద్ధాన్ని నిర్వహించలేని స్థితికి ఫ్రాన్సు దిగజారిపోయింది. ఈ స్థితిలో తానే ప్రత్యక్షంగా యుద్ధాన్ని నిర్వహించి, వియత్నామ్‌తోపాటు లావోస్, కంబోడియాలు కూడా "కమ్యూనిస్టుల" చేతిలోకిపోకుండాచూడడం, దేశాన్ని తన వలసదేశంగా చేసుకోవడం అమెరికా తన ప్రధాన లక్ష్యంగా పెట్టుకొంది.

ఈ దృష్టితోనే 1951 డిసెంబరులో "బావొదై" ప్రభుత్వంతో ఒక ఒడంబడికను చేసుకుంది.

దీనితో, ఇంతవరకూ ఆయుధాలను మాత్రమే సప్లయి చేస్తున్న అమెరికా సామ్రాజ్యవాదులు, వాటి వినియోగంపై పర్యవేక్షణ పేరుతో, తామే ప్రత్యక్షంగా యుద్ధకాండ నిర్వహించటం

ప్రారంభించారు; బియ్యం, తగరం, టంగ్‌స్టీన్, మాంగనీసు ఇత్యాది ముడిపదార్థాలు దొరికే ప్రాంతాలపై అధికారం సంపాదించారు. తన పునాదులకే 'ఎసరు' పెడుతున్న వీరి ప్రయత్నాలను ఫ్రెంచి సామ్రాజ్యవాదులు నిరసించారు. అమెరికా సామ్రాజ్యవాదులు, "అడ్డంవస్తే డాలరు సాయాన్ని ఆపేస్తాం" అని బెదరించడంతో, ఫ్రెంచివారి కాళ్ళు చల్లబడి ఊరుకున్నారు.

అమెరికా ఫ్రెంచి సామ్రాజ్యవాదుల, వీరి తొత్తుల దాడిని తిరగగొట్టి, దేశవిముక్తిని త్వరితగతిని సాధించటంకోసం, 1951 లో ప్రజాతంత్ర ప్రభుత్వ నాయకులు వియత్నామ్ జాతీయ సంఘటనను మరింత విస్తృతం చేశారు. తద్వారా తమ పోరాట పటిమను మరింత పెంపొందించుకొన్నారు.

సామ్రాజ్యవాదులు ఎన్నికోట్ల ధనం వెచ్చించినా, ఎన్ని లక్షల సైన్యాలను, వేల విమానాలను, టాంకులను వినియోగించినా వియత్నామ్ ప్రజారిపబ్లిక్‌ను నాశనం చేయలేకపోయారు.

క్రమంగా ప్రజాసేనలు ఆత్మరక్షణ చేసుకొనే స్థితిని దాటి, తిరుగుదాడి చేసేస్థితికి వచ్చాయి. ఈ తిరుగుదాడుల్లో సామ్రాజ్యవాద సేనలను అనేకచోట్ల ఓడించాయి. అధునాతన ఆయుధాలతో, వేల విమానాలతో, లక్షకుమించిన సైన్యంతో నిర్మించిన "దిన్‌బిన్‌ఫూ" యుద్ధ స్థావరాన్ని, "చలి చీమలు" "బలవంతమయిన సర్పాన్ని" చంపినట్లు తుక్కు-తుక్కు-గా కొట్టాయి.

దీనితో, ఇంతవరకూ వియత్‌నామ్ ప్రజాప్రభుత్వం చేసిన అనేక రాజీ ప్రయత్నాలను వమ్ముచేసిన సామ్రాజ్యవాదుల తల భొప్పికట్టి, వియత్‌నామ్ ప్రజాతంత్ర రిపబ్లిక్‌ను నాశనంచేయటం దుస్సాధ్యమని తెలుసుకుని, ఒక తాత్కాలిక యుద్ధవిరమణ ఒడంబడికకు 1954 జులైలో ఒప్పుకున్నారు.

ఇదే జినీవా ఒడంబడిక. సోవియట్ యూనియన్, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, చైనా, వియత్నామ్ ప్రజాతంత్ర రిపబ్లిక్, దక్షిణ వియత్‌నామ్ బావోడై, లావోస్, కాంబోడియా – ఈ తొమ్మిది

దేశాల ప్రతినిధులు 1954 జూలైలో జినీవాలో సమావేశమయి తాత్కాలిక యుద్ధ విరమణ ఒడంబడికను చేసుకున్నారు. (వీనిమీద దక్షిణ వియత్నాం ప్రతినిధి సంతకంపెట్ట నిరాకరించాడు).

దీని ప్రకారం, 17 వ ఉత్తర అక్షాంశ రేఖకు ఉత్తరానవున్న ప్రాంతం అంతా వియత్‌నామ్ ప్రజాతంత్ర రిపబ్లిక్ కిందకు, దక్షిణాన ఉన్న ప్రాంతం "బావోదై" ప్రభుత్వం కిందకూ వస్తుంది. ఉభయ పార్టీలు, తమ తమ సైన్యాలను ఉపసంహరించుకోవాలి. రెండు ప్రభుత్వాలు సంపూర్ణ స్వాతంత్ర్యం అనుభవిస్తాయి. ఇవి ఏ దేశాల తోను యుద్ధఒడంబడికలు చేసుకోకూడదు; విదేశీసేనలను రానీయ కూడదు. సైనిక స్థావరాల నిర్మించనీయకూడదు. 1956 వ సంవత్సరం జూలై మాసంలోపల ఎన్నికలు జరపాలి. ఈ ఒడంబడికను అమలు జరపటానికి భారత ప్రతినిధి అధ్యక్షత క్రింద కెనడా, పోలెండు దేశాలతో "అంతర్జాతీయ పర్యవేక్షణ సంఘాన్ని" ఏర్పరచారు.

వియత్‌నామ్ ప్రజాతంత్ర రిపబ్లిక్ ఈ ఒడంబడికను తు. చ. తప్పకుండా అమలు జరుపుతున్నది. కాని, దక్షిణ వియత్‌నామ్ ప్రభుత్వంమాత్రం అనేక విషయాల్లో ఒడంబడికను ఉల్లంఘించింది. ఉదాహరణకు 1954వ సంవత్సరం సెప్టెంబరులో అమెరికా సామ్రాజ్య వాదులు ఏర్పాటుచేసిన ఆగ్నేయఆసియా యుద్ధకూటమి ప్రాంతంలో వియత్‌నామ్ (లావోస్, కంబోడియాలతోపాటు)కూడా చేర్చబడింది. భవిష్యత్తులో జరగబోయే ఎన్నికలలో, ఐక్య ప్రజా ప్రభుత్వం ఏర్పడ కుండా చేయటానికి "బావోదై"ప్రభుత్వం ప్రయత్నంచేస్తూ, అమెరికా తొత్తుగా వ్యవహరిస్తూ, దాని యుద్ధప్రయత్నాలకు తోడ్పడుతున్నది. అమెరికా సామ్రాజ్యవాదులు ఫ్రెంచివారిని పూర్తిగా తొలగదీసి, దేశ రాజకీయాధికారాన్ని తామే హస్తగతంచేసుకోవాలని ప్రయత్నించసాగారు.

దక్షణవియత్‌నామ్ ప్రభుత్వ ప్రధానయిన నాగో-దిన్-దీయమ్ (Nago-Dinh-Diem) యుద్ధకాలంలో (1945 లో) అమెరికానుండి దిగుమతి అయినాడు. నూటికి నూరుపాళ్లు అమెరికా కీలుబొమ్మ.

ఈయన్ను ఉపయోగించుకొని, ఫ్రెంచివారి అనుయాయుడైన బావోదై ముఠాను తొలగదోయాలని అమెరికా సామ్రాజ్యవాదులు ప్రయత్నించారు.

దిన్‌దీయం, సైన్యంలోని ఫ్రెంచి అనుకూల అధికారులను తొలగించటం ప్రారంభించడంతో, రెండు ముఠాలమధ్య ఘర్షణ ప్రారంభమైంది. చివరకు 1955 ఏప్రిల్ – మే మాసాలలో రెండు ముఠాలు సైగాన్ నగరంలో బాహాబాహీ యుద్ధాలుకూడా చేశాయి. అమెరికావారి మద్దతుతో "దీయం" బావోదైని పదవీచ్యుతుణ్ణి చేసి, తానే "సర్వాధికారి" అయినాడు. సైన్యంలోని ఫ్రెంచి అనుయాయులను పూర్తిగా ఏరివేసి, తన స్థానాన్ని స్థిరపరచుకొన్నాడు. అన్ని విషయాలలో అమెరికా దయాదాక్షిణ్యాలమీద ఆధారపడ్డ ఫ్రెంచి సామ్రాజ్యవాదులు ఎంత మొత్తుకొన్నా ఫలితం లేకపోయింది. చివరకు "దీయం" ప్రభుత్వాన్ని తాను గుర్తించక తప్పలేదు. దీనితో దక్షిణవియత్‌నామ్, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల చేయిజారిపోయింది.

"దీయం" ఇప్పుడు మరింత బాహాటంగా జినీవా ఒడంబడికను ఉల్లంఘించ సాగాడు. అమెరికా సామ్రాజ్యవాదులు దేశంలో మిలిటరీ కేంద్రాలను నిర్మిస్తున్నారు. "ఉత్తర వియత్‌నామ్‌ను కమ్యూనిస్టు బానిసత్వంనుండి విముక్తి చెయ్యడానికి" సైన్యాలను ఆయత్తం చేస్తున్నారు. యుద్ధపరికరాలన్నీ అమెరికానుండి దిగుమతి అవుతున్నాయి. అమెరికా మిలిటరీ నిపుణులు దిగుమతి అవుతున్నారు. ఆఖరికి "దీయం" ఆంతరంగిక కార్యదర్శి కూడ, డల్లెస్ మిత్రుడయిన అమెరికన్ !

వియత్‌నామ్ ఐక్యతను కోరే ప్రజలమీద, పార్టీల, పత్రికల మీద "దీయం" తీవ్ర నిర్బంధవిధానం ప్రయోగిస్తున్నాడు. చివరకు, తాను సంతకం చేయలేదు కనుక, జినీవా ఒడంబడికకు తాను కట్టుబడి ఉండవలసిన అవసరం లేదంటున్నాడు. అంతర్జాతీయ పర్యవేక్షణ సంఘం తన విధిని నిర్వర్తించకుండా అనేక ప్రతిబంధకాల కల్పిస్తున్నాడు. 1956 జులైలో ఎన్నికలు జరపాలని, దేశాన్ని ఐక్యపరచ

డానికి సహకరించమని ఉత్తర వియత్‌నామ్ చేస్తున్న విజ్ఞప్తుల బుట్ట దాఖలా చేస్తున్నాడు.

దేశ ఐక్యతను అడ్డడమే కాక, ఉత్తర వియత్‌నామ్ మీద దాడి చేయాలనే "దీయం" ప్రయత్నిస్తున్నాడు.

## కంబోడియా

కంబోడియా 1945 వ సంవత్సరం, మార్చిలో పూర్తిగా జపాను సామ్రాజ్యవాదులకు వశమైంది. వియత్‌నామ్, లావోస్‌లలో లాగే ఫాసిస్టు దాస్యంనుండి దేశాన్ని రక్షించుకొనేందుకు ప్రజలే సాయుధులై పోరాటం సాగించారు. 1945 ఆగస్టుకల్లా, దేశాన్ని పూర్తిగా విముక్తిచేసి, ప్రజాసేనలు అధికారాన్ని చేపట్టాయి.

కాని, 1945 అక్టోబరులో బ్రిటిష్ సేనల సాయంతో ఫ్రెంచి సామ్రాజ్యవాదులు తిరిగి కంబోడియాను ఆక్రమించారు. ప్రజల నణచడానికి పైశాచిక పద్ధతు లన్నింటినీ–ఉరికంబాలు, జైళ్లు ఇత్యాదులు–అమలుపరచారు. తమ హైకమిషనరును వేసి, పరిపాలన సాగించటం ప్రారంభించారు. కంబోడియా రాజు కీలుబొమ్మ ప్రభుత్వానికి అధిపతయ్యాడు. 1949 నవంబరులో కంబోడియాకు "అధినివేశ స్వాతంత్ర్యం" ఇచ్చారు. ఎన్నికల నాటకం జరిపి, ఒక "జాతీయ" ఎసెంబ్లీనికూడా ఏర్పాటుచేశాడు. కాని, 1953 జనవరిలో ఎసెంబ్లీలో "తిరుగుబాటుదార్లు" అధికమయినారని రాజు ఎసెంబ్లీనే రద్దుచేశాడు.

ప్రజలు సామ్రాజ్యవాదులకు తలవొగ్గక అడవుల్లో స్థావరాలేర్పరచుకొని, పోరాటం సాగిస్తూనే వచ్చారు. ఈ స్థావరాలు దేశవ్యాపితంగా విస్తరించాయి. 1950 వ సంవత్సరం జూన్ నెలకల్లా దేశంలో మూడవవంతు విస్తీర్ణం గెరిల్లాల చేతుల్లోకి వచ్చింది.

అమెరికన్ సామ్రాజ్యవాదులు, వియత్‌నామ్, లావోస్‌లలో లాగే, విముక్తి పోరాటాన్ని అణచడానికి ఫ్రెంచివారికి సాయపడుతూ కీలుబొమ్మ ప్రభుత్వంతో ఒడంబడికలు చేసుకుని, దేశంలో ముడి పదార్థాలు లభించే ప్రాంతాలన్నిటిపైన క్రమంగా అధికారం సంపాదించటం ప్రారంభించారు.

చివరకు 1954 జులైలో జినీవా ఒడంబడిక జరిగింది; వెంటనే ప్రజాసేనలు యుద్ధాన్ని విరమించాయి.

దీని ప్రకారం, దేశం స్వతంత్రదేశంగా పరిగణించబడింది. 1955 లో ఎన్నికలు జరిగాయి.

కంబోడియా ప్రభుత్వం జినీవా ఒడంబడికను తూ.చ తప్పకుండా అమలుపరిచింది. దేశ ఆర్థికవ్యవస్థను పునర్నిర్మించడానికి అమెరికా నుండి డాలర్ల సహాయాన్ని స్వీకరించింది. కాని వారి షరతులను మొదటినుండీ వ్యతిరేకించటం ప్రారంభించింది.

1955 లో ఎన్నికలు జరుపబడ్డాయి. సంగ్‌కామ్ పార్టీ నాయకుడు నరోదమ్ సింహనౌక్ ప్రధానిగా ప్రభుత్వం ఏర్పరచబడింది.

కంబోడియాను ఆగ్నేయ ఆసియా మిలిటరీ కూటమిలోకి లాగడానికి, దేశాన్ని తమయుద్ధ కేంద్రంగా నిర్మించుకోడానికి అమెరికా సామ్రాజ్యవాదులు విశ్వప్రయత్నాలు చేశారు. నరోదం సింహనౌక్ ప్రభుత్వం, వీరి వత్తిడికి లొంగలేదు. థాయ్‌లాండ్, దక్షిణ వియత్నామ్‌లద్వారా వత్తిడి తేవాలని డల్లెస్ ప్రయత్నించాడు. అదీ ఫలించలేదు. డల్లెస్ ఆగ్నేయ ఆసియా పర్యటనలో ఈవత్తిడి మరింత అధికమైంది. థాయ్‌లాండు, దక్షిణ వియత్‌నామ్‌లు కంబోడియాతో వర్తకాన్నికూడా ఆపివేశాయి. కంబోడియానుండి రాకపోకలు బంధించివేయబడ్డాయి. అయినా నరోదం ప్రభుత్వం లొంగలేదు.

పైగా చైనా, ఉత్తర వియత్‌నామ్, సోవియట్ యూనియన్, పోలెండు, భారతదేశాలతో స్నేహసంబంధాల పెంపొందించుకొంటున్నది. ఏ కూటమిలోను చేరక, తటస్థంగా ఉంటానని ప్రకటించింది. ఈ దేశాలతో వ్యాపారసంబంధాలు పెట్టుకొంది. నిస్వార్థ సహాయం ఏ దేశాలనుండి వచ్చినా స్వీకరిస్తామని ప్రకటించింది. చైనా, భారత దేశాలు కంబోడియాకు ఆర్థికసహాయం చేయడానికి అంగీకరించాయి.

సామ్రాజ్య వ్యతిరేకవిధానాన్ని అవలంబిస్తూన్న ప్రభుత్వాన్ని కంబోడియా కమ్యూనిస్టుపార్టీ బలపరుస్తున్నది.

కంబోడియాను కూడ దక్షిణ వియత్నాంవలె తమ యుద్ధ కేంద్రంగా చేయాలనుకున్న అమెరికా సామ్రాజ్యవాదుల కుట్రలను కంబోడియా ప్రజలు భగ్నంచేశారు.

## లా వో స్

1945 వ సంవత్సరం మార్చి తొమ్మిదవ తేదీన (రెండవ ప్రపంచ యుద్ధకాలంలో) లావోస్ పూర్తిగా జపాను వశమయింది. వెంటనే ఏప్రిల్ 15 వ తేదీన తమ తొత్తులతో "ఒక స్వతంత్ర" ప్రభుత్వాన్నేర్పరచారు.

జపాను ఆక్రమణ యెడల ఫ్రెంచి సామ్రాజ్యవాదుల ఉదాసీన వైఖరిని చూచి, తమ మాతృదేశాన్ని ఫాసిస్టు దాస్యం కిందకు పోకుండా ఉండటానికి ప్రజలు సాయుధపోరాటం ప్రారంభించారు. 1945 వ సంవత్సరం నాటికి, జపాను ప్రభుత్వం పట్టణాలలో మాత్రమే ఉంది. గ్రామీణ ప్రాంతమంతా గెరిల్లాల చేతుల్లోకి వచ్చింది. 1945 వ సంవత్సరం అక్టోబరు 12 న వివిధ ఫాసిస్టు వ్యతిరేక పార్టీలతో ఐక్యప్రజాసంఘటనను ఏర్పాటుచేశారు. దీనితో పాటు, అదేరోజు విముక్త ప్రాంతాల పరిపాలన చూడడానికి, సామ్రాజ్యవాదులను శాశ్వతంగా మాతృభూమినుండి తరిమివేయడానికి తాత్కాలిక ప్రభుత్వాన్నేర్పరచి, దేశస్వాతంత్ర్యాన్నే ప్రకటించారు. ఈ ప్రజా వెల్లువను చూచి, రాజు (సామ్రాజ్యవాదుల తొత్తు) దేశంవదలి పారిపోయాడు. దేశం పూర్తిగా ప్రజాసేనల వశమైంది.

జపాను ఓటమి తర్వాత, ఫ్రెంచిసేనలు "లావోస్"ను తిరిగి ఆక్రమించాయి. (1946 మార్చి-ఏప్రిల్). ప్రజాప్రభుత్వం తాత్కాలికంగా తలదాచుకునేందుకు తాయ్‌లాండుకు (అప్పటికి తాయిలాండు కొంత అభ్యుదయకర పద్ధతులనే అవలంబిస్తున్నది) తరలి పోయింది. సామ్రాజ్యవాదులు, ప్రజాస్వామిక శక్తులపై దారుణమైన హింసాకాండ అమలు జరిపారు. కొన్ని వేలమందిని కాల్చివేశారు. అయినా ప్రజలుమాత్రం ప్రతిఘటనను మానలేదు.

ఏప్రిల్ 20 వ తేదీన (1946) పారిపోయిన రాజును తెచ్చి సింహాసన మెక్కించారు. దేశానికి "స్వాతంత్ర్యం"కూడా ఇచ్చేశారు. ప్రజలను మోసం చేయడానికి, 1947 జనవరిలో ఎన్నికల తతంగం కూడా జరిపి రాజ్యాంగసభను, ఆగస్టులో ఎన్నికలు జరిపి జాతీయ అసెంబ్లీని ఏర్పాటు చేశారు.

సామ్రాజ్యవాదులు ఇంత తతంగం చేసినా, ప్రజలు మోస పోలేదు. సాయుధ పోరాటం కొనసాగిస్తూనే వచ్చారు. 1950 నాటికి దేశవైశాల్యంలో మూడవవంతు భూభాగం ప్రజాప్రభుత్వం కిందకు వచ్చింది.

1950 మార్చి నెలలో వియత్‌నామ్, కంబోడియా, లావోస్ దేశాల జాతీయ ఐక్య సంఘటనలతో, ఇండోచైనా అంతటికి ఒక జాతీయైక్య సంఘటనను ఏర్పాటుచేశారు. ఇది లావోస్ ప్రజల విముక్తి ఉద్యమం ఉరకలు వేయడానికి ఉపయోగించింది. లావోస్ గెరిల్లాలు, దేశ ఉత్తరభాగంలో కొంతమేర పూర్తిగా విముక్తి చేయ టమే కాక, ముఖ్య నగరాలలో ఒకటయిన 'లాంగ్ ప్రబాంగ్' నగ రానికే "ప్రమాదం" తెచ్చిపెట్టారు. 'లావోస్' ప్రజల ఈ జైత్ర యాత్రను, వియత్‌నామ్ ప్రజారిపబ్లిక్ సేనలు "లావోస్" మీద దురాక్రమణ జరుపుతున్నవని సామ్రాజ్యవాదులు దుష్ప్రచారం ప్రారంభించారు.

కాటిదగ్గర నక్కలా తన పనులు చూచుకొనే అమెరికా 'లావోస్' కీలుబొమ్మ ప్రభుత్వంతో ఒడంబడిక చేసుకుని, దేశంలో ముడిపదార్థాలు దొరికే ప్రాంతమంతటిపైన అధికారాన్ని సంపా దించింది. విముక్తి ఉద్యమాన్ని నాశనంచేయటానికి విశేషంగా ఫ్రెంచి సామ్రాజ్యవాదులకు తోడ్పడుతూ వచ్చింది.

అటు వియత్‌నామ్‌లో, ఇటు "లావోస్"లో ప్రజాసేనల జైత్ర యాత్రకు భయపడి, ఫ్రెంచి, అమెరికా సామ్రాజ్యవాదులు జినీవా ఒడంబడికకు (1954 జులై) ఒప్పుకున్నారు.

దీని ప్రకారం వెంటనే లావోస్‌లో యుద్ధం ఆపివేయబడాలి. వియత్‌నామ్ సైన్యాలు దేశం విడిచిపెట్టివెళ్ళిపోవాలి. ప్రస్తుతం, విముక్తిసేనల ఆక్రమణకిందఉన్న ప్రాంతాలు, ఉభయపక్షాలమధ్యా సంప్రదింపులు జయప్రదమయ్యేవరకూ వారికిందే ఉంటాయి. 1955లో ప్రజాస్వామికపద్ధతులపై ఎన్నికలు జరగాలి.

జినీవా ఒడంబడికమీద లావోస్ ప్రభుత్వం తరఫున రక్షణ శాఖామంత్రి కువోరావోంగ్ సంతకం చేశాడు. ఐక్యసంఘటన నాయకులతో సంప్రదింపులు జరిపి, జినీవా ఒడంబడికను అమలు బరచడానికి ప్రయత్నించ ప్రారంభించాడు. ఇది నచ్చని అమెరికా సామ్రాజ్యవాదులు ఆయనను హత్యచేయించారు. తమ తొత్తులతో మంత్రివర్గాన్ని పునర్నిర్మించడానికి ప్రయత్నించారు. ఫ్రెంచివారి పలుకుబడిని పూర్తిగా తుడిచిపెట్టాలని వీరి ప్రయత్నం. తమ తొత్తు "కాటే" ప్రధానమంత్రిగా మంత్రివర్గాన్ని పునర్నిర్మింపచేశారు.

జినీవా ఒడంబడిక ప్రకారం వియత్‌నామ్ సైన్యాలు దేశాన్ని విడిచిపోయాయి. లావోస్ ప్రభుత్వం, విముక్తిప్రాంత ప్రతినిధులతో సంప్రదింపులు జరపటానికి బదులు, అమెరికా సామ్రాజ్యవాదుల ప్రోత్సాహంతో దాడి ప్రారంభించింది. అమెరికా సామ్రాజ్యవాదులు ఈ దాడికి ప్రత్యక్షంగా సాయపడ్డారు. విముక్తిప్రాంతంలో కొంతభాగాన్ని లావోస్ ప్రభుత్వ సైన్యాలు ఆక్రమించాయి.

తర్వాత 1955 మార్చి మాసంలో తిరిగి సంప్రదింపులు జరిగాయి. తక్షణయుద్ధ విరమణకు ఉభయపక్షాలు అంగీకరించాయి. దానితో దేశంలో శాంతి నెలకొంటుందని ప్రజలాశించారు. కాని, ఒడంబడికమీద సంతకాలు జరిగిన ఆరురోజులకే, లావోస్ ప్రభుత్వం విముక్తిప్రాంతంమీద పెద్దయెత్తున దాడి ప్రారంభించింది. అమెరికా సామ్రాజ్యవాదులు లావోస్ ప్రభుత్వానికి విమానాలు, తదితర ఆయుధసామాగ్రిని సప్లయిచేశారు. కాని, విముక్తి సేనలు ఈ దాడిని తిప్పికొట్టాయి.

ఈ అమెరికాతొత్తు, అసలు జినీవా ఒడంబడికను అమలు జరపటానికే నిరాకరిస్తూ, అంతర్జాతీయ పర్యవేక్షణసంఘం దేశం వదలిపోవాలని ఆందోళన ప్రారంభించాడు. అమెరికా సామ్రాజ్య వాదులు దేశాన్ని ఆగ్నేయఆసియా యుద్ధకూటమిలోకి లాగటానికి ప్రయత్నిస్తున్నారు. దేశ ఆర్థికవ్యవస్థమీద తన పట్టును దృఢతరం చేసుకొంటూ, నెమ్మదిగా ఫ్రెంచివారి పలుకుబడిని తుడిచిపెట్టడానికి ప్రయత్నిస్తున్నది.

ప్రభుత్వం, ప్రజాస్వామిక శక్తులమీద తీవ్ర నిర్బంధవిధానం ప్రయోగిస్తున్నది. అయినా, విముక్తి ఉద్యమంమీద వారికున్న సానుభూతినిమాత్రం అణచలేకపోయింది. జినీవా ఒడంబడిక సక్రమంగా అమలుజరగాలని, ఏ యుద్ధకూటమిలోను చేరకుండాఉండే ప్రజాస్వామికప్రభుత్వం ఏర్పడాలని ప్రజలు కోరుతున్నారు.

# చైనా

ఆసియాఖండపు తూర్పుభాగాన ఉన్న పెద్దదేశమే చైనా. దీని వైశాల్యం 43 లక్షల చదరపుమైళ్ళు. విస్తీర్ణంలో ఆసియాఖండంలో నాల్గవవంతు ఉంటుంది. జనాభా 60 కోట్లు; ఆసియాలో నివసించే జనాభాలో సగానికి పైబడిన జనాభా ఈదేశంలోనే నివసిస్తున్నారు.

ఇంత పెద్దదేశంలో వాతావరణం అన్ని ప్రాంతాలలోను ఒకటిగా ఉండదు. దేశ ఉత్తరప్రాంతంలో చలి అధికం. దక్షిణప్రాంతంలో ఉష్ణమధికం. ఈ రెంటి మధ్యప్రాంతంలో వాతావరణం మధ్యస్తంగా ఉంటుంది. దేశ దక్షిణ, తూర్పు ప్రాంతాలలో వర్షం సమృద్ధిగా పడుతుంది. పశ్చిమ, ఉత్తర ప్రాంతాల్లో వర్షం తక్కువ.

యాంగ్‌టిసికియాంగ్, సికియాంగ్, హొయాంగ్‌హో, పేహో–ఇవి దేశంలోని నదులలో ముఖ్యమైనవి. యాంగ్‌టిసికియాంగ్ నదిలో

వెయ్యి మైళ్ళు నావికా యానానికి ఉపయోగపడుతున్నది. మధ్య చైనానుండి, తీరప్రాంతానికి సరుకులు రవాణా చేయడంలో ఈ నది బాగా ఉపయోగ పడుతున్నది. హొయాంగ్‌హో (దీన్నే పచ్చనది అనికూడా అంటారు) దేశంలోని పెద్దనదులలో రెండవది. దీని వరదల వల్ల దేశంలోని చాల ప్రాంతం విశేషనష్టానికి గురవుతున్నది. నూతన చైనా ప్రభుత్వం ముంపు నివారణ పథకాల నమలుజరిపి, దేశానికి నష్టం కలుగకుండా చేయడానికి ప్రయత్నిస్తున్నది. దీని పొడవు 2700 మైళ్ళున్నా, నౌకాయానానికి ఏమాత్రమూ ఉపయోగపడటంలేదు. సికియాంగ్ నదిలో చాలభాగం నౌకాయానానికి వినియోగపడుతున్నది.

ఇది వ్యావసాయికదేశం. విముక్తికి పూర్వం భూమి అంతా భూస్వాములు - (War lords) కింద ఉండేది. భూస్వామ్య దోపిడీకింద రైతు నలిగిపోతూ నికృష్టజీవితం గడుపుతుండేవాడు.

వరి, గోధుమ, మొక్కజొన్న సోమాచిక్కుళ్లు, పత్తి, పొగాకు, తేయాకు, చెరకు ముఖ్యవ్యావసాయికపంటలు. యాంగ్‌టిసీనదీలోయ ప్రాంతంలో మల్బరీచెట్లు విస్తారంగా పెరుగుతాయి. దాన్నాధారం చేసుకుని పట్టుపురుగుల పెంపకం విరివిగా సాగుతున్నది.

ఖనిజసంపద చైనాలో అపారంగా ఉంది. ప్రపంచంలోని దేశాలలో, రాక్షసిబొగ్గు నిధులు అపారంగా గలిగిన దేశాలలో చైనా రెండవది. ప్రథమస్థానం అమెరికాది (U. S. A.). ప్రపంచంలోని దేశాలలోకెల్ల టంగ్‌స్టీన్ ఇచ్చటే అధికంగా లభ్యమవుతుంది. ప్రపంచంలో దొరికే "ఆంటిమొనీ"లో దాదాపు అంతా ఈ దేశం నుండి వస్తుంది. ఇవికాక ముడిఇనుము, సీసము, తగరము, రాగి, బంగారం, అజ్‌బెస్టాస్, జిప్సం, గ్రాఫైట్ ఇత్యాది ఖనిజాలుకూడా లభిస్తాయి.

దేశం కొమింటాంగ్ పాలననుండి విముక్తిపొందేవరకూ ఈ ఈ నిధులన్నీ దాదాపు భూగర్భంలోనే ఉండిపోయాయి. నూతన చైనాప్రభుత్వం వీటిని దేశ పారిశ్రామికాభివృద్ధికి వినియోగించడానికి కృషిచేస్తున్నది.

1949 వరకూ, దేశంలో చెప్పదగిన పరిశ్రమ లేవీ అభివృద్ధి కాలేదు. 1953 వరకూ ఉన్న పరిశ్రమలలో చాలభాగం మంచూరియాలోను, షాంగ్‌హై, టీన్‌స్టిన్, ట్సింగ్‌టావో నగరాల్లో ఉండేవి. సిల్కు, నూలువస్త్రాల పరిశ్రమ, సిగరెట్లు, వనస్పతి, పింగాణి పరిశ్రమ ఇవిమాత్రమే ఉండేవి. భారీపరిశ్రమ లేవీ లేవు. నూతన చైనాప్రభుత్వం దేశాన్ని త్వరితగతిని పారిశ్రామికం చేయడానికి కృషిచేస్తున్నది.

టీన్‌స్టిన్, షాంగ్‌హై, హాంకో, కాంటన్, నాన్‌కింగ్, హాంగ్‌చో, ఫ్యూచో ఇవి ముఖ్య రేవుపట్టణాలు.

పీకింగు, దేశరాజధానీ నగరం.

చైనా నాగరికత చాల పురాతనమైనది. చైనా ప్రజలు ప్రజ్ఞావంతులేకాక కష్టించి పనిచేసేవారు. స్వాతంత్ర్యాభిలాషులు; శాంతి కాముకులు.

విదేశ దురాక్రమణకు, స్వదేశ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా వీరు అనేక విప్లవపోరాటాలు జరిపారు.

అటువంటి ప్రజలు నివసించే దేశం ఆర్థికంగా, రాజకీయంగా, వైజ్ఞానికంగా అభివృద్ధికాలేదు. మూడువేల సంవత్సరాల భూస్వామ్యవ్యవస్థ చైనాదేశ అభివృద్ధిని అరికట్టింది. అందుచేత, 18 వ శతాబ్దాంతానికే విదేశీసామ్రాజ్యవాదుల స్వార్థప్రయోజనాలకు ఎరఅయింది. కొన్ని ఓడరేవులను తెరచి వీరికి వ్యాపారం చేసుకునే వసతి కల్పించవలసి వచ్చింది.

బ్రిటన్ నల్లమందు తెచ్చి, దేశంలో అమ్మి విపరీత లాభాలను కొల్లగొట్టుకోవటం ప్రారంభించింది.

1839 లో మంచూ ప్రభుత్వం ఈ వ్యాపారాన్ని అరికట్టడానికి ప్రయత్నించింది. బ్రిటను ఆయుధాలను చూపి, వ్యాపారంచేసేహక్కు తనకుందని బెదరించుటతో, 1840 లో రెండు దేశాలమధ్య యుద్ధం వచ్చింది. దాన్నే మొదట "నల్లమందుయుద్ధం" (First opium war) అంటారు. భూస్వాముల్లో ఒకవర్గం బ్రిటిష్‌వారిని తరిమివేయాలన్నది.

ప్రజలు ఆయుధాలుపూని రంగంలోకి దిగారు. ఈ ప్రజాశక్తిని చూచి, భయబడిన మంచూ ప్రభుత్వం, బ్రిటన్‌తో అవమానకరమైన, స్వాతంత్ర్యానికి హానికరమయిన్న షరతులకు ఒప్పుకుని బ్రిటన్‌తో 1842 లో రాజీపడింది. ఇటువంటి హక్కులే తమకూ కావాలని అమెరికా, ఫ్రాన్సు ప్రభుత్వాలు మంచూ ప్రభుత్వాన్ని ఒత్తిడిచేసి సంపాదించాయి. దీనితో మరికొన్ని రేవులు విదేశీ వ్యాపారానికి తెరవబడ్డాయి. ఈ సంధులు దేశస్వాతంత్ర్యం త్వరగా హరించిపోవడానికి కారణమయినాయి; చైనా అర్ధవలస దేశమయింది.

నల్లమందు యుద్ధానికి పూర్వమే, చైనాలో భూమంతా భూస్వాములచేతుల్లో ఉండేది. వీరు రైతులను పీల్చిపిప్పిచేసేవారు; రైతులలో అసంతృప్తి జ్వాలలు అంటుకున్నాయి. నల్లమందు యుద్ధకాలంలో యుద్ధభారాన్ని రైతాంగమే భరించవలసిరావటంతో ఈ అసంతృప్తి తీవ్రతరమైంది. 1840 తర్వాత రైతులు అనేక తిరుగుబాట్లు చేశారు. ఈ తిరుగుబాట్ల ఉన్నతదశే 1851 లో క్వాంగ్సీరాష్ట్రంలో వచ్చిన తైపింగు తిరుగుబాటు. హంగ్‌హ్స్యూ-చూఅన్ నాయకత్వాన ఈ తిరుగుబాటు జరిగింది. "శాంతిస్వర్గ సామ్రాజ్యాన్ని" (The celestial kingdom of peace) ఈ రాష్ట్రంలో ఏర్పరచి, రైతుసైన్యాలతో చు అన్ య్యాంగ్‌ట్సీలోయ వైపు పురోగమించాడు. ప్రజలు ఈ సైన్యాలకు ఉత్సాహంతో స్వాగతం ఇచ్చారు. 1853 లో నాన్‌కింగ్ "శాంతిస్వర్గసామ్రాజ్యా"నికి రాజధాని అయింది. విప్లవవ్యాప్తికి రైతుసైన్యం దాడులు ప్రారంభించింది. ఈ విప్లవఘాటికి మంచూ ప్రభుత్వపునాదులు కదలిపోయాయి.

బ్రిటన్ నాయకత్వాన అమెరికా, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు, దేశంలోని అభివృద్ధినిరోధకులు ఈ విప్లవాన్ని అణచడానికి మంచూ ప్రభుత్వానికి తోడ్పడ్డారు. 14 సంవత్సరాలు హోరాహోరీ పోరాడిన ఈ "శాంతిస్వర్గ సామ్రాజ్యం" 1864 లో క్రూరంగా అణచివేయబడింది. వేలమంది రైతులు ప్రాణత్యాగంచేశారు. సామ్రాజ్యవాదులు

పోరాటాన్ని అణచగలవారేగానీ, ప్రజలలోని విప్లవజ్యోతిని ఆర్పలేక పోయారని తర్వాత విప్లవ పోరాటాలు ఋజువుచేస్తాయి.

తైపింగ్ విప్లవం అణచబడినతర్వాత, సామ్రాజ్యవాదుల దురాక్రమణ మరింత హెచ్చింది. 1894 లో చైనాపై జపానుదాడి చేసి ఓడించింది. ఫార్మోజాను, పింఘూద్వీపాన్ని ఆక్రమించుకుంది. తరువాత ఐదు సంవత్సరాల్లో పెట్టుబడిదారీ దేశాలు, చైనామీద రాబందుల్లా ఎగబడి, అందినంతా కబళించాయి.

18 వ శతాబ్దం ఉత్తరార్ధభాగంలో కొందరు చైనా వ్యాపారస్తులు, భూస్వాములు, మంచూ ప్రభుత్వోద్యోగులు పరిశ్రమలలో పెట్టుబడులుపెట్టి నడపసాగారు. దీనితో బూర్జువావర్గం రూపొందనారంభించింది. చైనా జపాను యుద్ధానంతరం (1894-'95) బూర్జువా వర్గం కొన్ని సంస్కరణలను కోరటం మొదలుపెట్టింది. "సంస్కరణలే జాతివిముక్తికి మార్గ"మంటూ ఒక రాజకీయఉద్యమాన్ని లేవదీసింది. రాజు ఆధీనములో ఉండే చట్టసభను, పరిశ్రమలను వ్యవసాయాన్ని, వ్యాపారాన్ని అభివృద్ధిచెయ్యడమే వీరు కోరిన సంస్కరణలు. భూస్వామ్య వ్యవస్థను నాశనంచేయకుండానే, పెట్టుబడిదారీ విధానాన్ని అభివృద్ధిచేయాలని వీరి ఆశయం. కొందరు మంచూ ప్రభుత్వోద్యోగులుకూడా ఈ ఉద్యమాన్ని బలపరిచారు.

ఆనాటి పరిస్థితుల్లో యీ ఉద్యమం అభ్యుదయకరమైనదే. కాని, రాణీకి, పాలకవర్గంలోని మరికొందరికీ యిది నచ్చలేదు. అందుచేత దీన్ని 1898 లో అణచివేశారు. ఉద్యమ నాయకులు కొందరు పారిపోయారు; దొరికినవారిని ప్రభుత్వం ఉరిదీసింది.

ఈ సంస్కరణోద్యమం జరుగుతూ ఉండగానే, "బాక్సారు పోరాటమ"ని, సామ్రాజ్యవాద వ్యతిరేక రైతుపోరాటం ఒకటి వచ్చింది. "యు హో తు అన్" (బాక్సారులు) అనేది రైతుల రహస్య విప్లవసంస్థ. విదేశీ సామ్రాజ్యవాదుల దోపిడీకి వ్యతిరేకంగా ప్రజలలో విపరీత వైషమ్యం పెరిగిపోయింది. వీరిని కూడగట్టి, సామ్రాజ్య వాదులకు వ్యతిరేకంగా సాయుధపోరాటం చేయటానికి యీ విప్లవ

సంస్థ కృషిచేసింది. 1899 - 1900 లో యీ పోరాటం షాంటుంగ్ రాష్ట్రంనుండి హోపైకి, అచ్చటినుండి షాన్సీ రాష్ట్రానికి కార్చిచ్చులా వ్యాపించింది. దేశ ఆగ్నేయ, నైరుతీ దిక్కులకుకూడా ఉద్యమం వ్యాపించింది. ఈ పోరాటం తైపింగు తిరుగుబాటుకంటెకూడా పెద్దది. బాక్సారులు సామ్రాజ్యవాదులమీద గట్టిదెబ్బలు తీశారు. కాని, సామ్రాజ్యవాదులు (బ్రిటన్, అమెరికా, జపాన్, రష్యా, జర్మనీ, ఫ్రాన్సు, ఆస్ట్రియా, ఇటలీ) మంచూ ప్రభుత్వమూ కలిసి 1900 లో పోరాటాన్ని రక్తపుటేరుల్లో ముంచారు. విదేశీ సామ్రాజ్యవాదులు పగసాధించే పేరుతో ఎన్నో అకృత్యాలు చేశారు. వేలసంఖ్యలో రైతుల్ని చంపారు.

ఈ పోరాట అనుభవాన్ని రుచిమూచిన తర్వాత, సామ్రాజ్యవాదులు ప్రత్యక్ష దురాక్రమణకు దిగకుండా, మంచూప్రభుత్వాన్ని చాటుచేసుకుని వ్యవహరించసాగారు. ఈ పోరాటానంతరం మంచూ ప్రభుత్వాన్ని పూర్తిగా లొంగదీసి, తమ కీలుబొమ్మగా చేసుకున్నారు. 20 వ శతాబ్దం ప్రారంభానికి చైనాలో పెట్టుబడిదారీ విధానం రూపొందింది. దీన్ని ఆధారంగా చేసుకుని, డాక్టరు సన్‌యెట్‌సేన్ బూర్జువా విప్లవ ముతానొకదాన్ని తయారుచేశాడు. సంస్కరణోద్యమం, బాక్సారు పోరాటాల అనంతరం, మంచూ ప్రభుత్వ వ్యతిరేకోద్యమానికి ఇది కేంద్రమయింది.

1905 లో డాక్టరు సన్‌యెట్‌సేన్ నాయకత్వాన "చైనా విప్లవ సమితి" ఏర్పాటయింది. (1911 లో ఈ సంస్థే "కొమింటాంగ్"గా మారింది). 1905 లో మొదటి రష్యావిప్లవం కలిగించిన ఉత్తేజంకూడా ఈ సంస్థ నిర్మాణానికి కొంతకారణమైంది. ఇది ఒక దేశవ్యాపిత జాతీయసంస్థగా అభివృద్ధియింది. మితవాద బూర్జువా వర్గం, పెటీ బూర్జువావర్గ ప్రతినిధులుకూడా దీన్ని బలపరచారు.

మంచూ ప్రభుత్వాన్ని కూలదోసి, చైనాను "బూర్జువా ప్రజాతంత్ర రిపబ్లిక్"గా చేయటమే ఈసంస్థయొక్క ఆశయం. ఈ ఆశయ సాధనకు అనేక విప్లవపోరాటాలను నడిపింది.

1911 లో చైనా విప్లవసమితి, హూపై రాష్ట్రంలో తిరుగుబాటుచేసిన ప్రభుత్వ సైన్యాలు కలిసి హూపై రాష్ట్రంలో స్వాతంత్ర్యాన్ని ప్రకటించాయి. క్రమంగా అన్ని రాష్ట్రాలు ఇదే దారిని అనుసరించాయి. 1912 లో రాజును పదవీచ్యుతుణ్ణిచేసి, సన్ యెట్ సేన్ అధ్యక్షుడుగా చైనా రిపబ్లిక్ అవతరించింది. ఇదే చైనా చరిత్రలో ప్రసిద్ధిచెందిన 1911 విప్లవం.

చైనా విప్లవసమితిని (ఇకనుండి కొమింటాంగ్) బూర్జువా, పెటీబూర్జువా మేధావివర్గం నాయకత్వం వహించి నడుపుతున్నది. వీరి ఉద్యమాన్ని ప్రజలు బలపరచినా, వీరు ప్రజలను సమీకరించి, ప్రభుత్వాన్ని కూలదోయటానికి బదులు, మిలిటరీ తిరుగుబాట్లు (Military Adevntures), వ్యక్తిగత హింసాపద్ధతుల నవలంబించారు. రిపబ్లిక్ స్థాపనానంతరంకూడా వీరు విదేశ సామ్రాజ్యవాదులను, దేశీయ భూస్వామ్యవర్గాలను సంతృప్తిపరచడానికి ప్రయత్నించారు.

రాజు నాయకుడుగా శాసనసభ పరిపాలన కావాలన్న వర్గంలోని భూస్వాములు, మంచూ ప్రభుత్వంలోని ఆఫీసర్లు, విదేశీ సామ్రాజ్యవాదుల ఏజంట్లుగా వ్యవహరించే పెట్టుబడిదార్లు (Compradors), యుద్ధప్రభువులు (War lords) నెమ్మదిగా కొమింటాంగ్ లోకి దూరగలిగారు. వీరికి యు ఆన్ షీ-కీ నాయకుడు. ఉత్తర చైనా వీరి అధీనంలోనే వుంది. రిపబ్లిక్ ప్రభుత్వం దక్షిణాన మాత్రమే వుంది. యు ఆన్ షీ-కీ 1912 లో సన్‌ను బలవంతంగా అధికారం నుంచి దించేసి, తానే రిపబ్లిక్ అధ్యక్షుడయినాడు. విదేశీ సామ్రాజ్యవాదుల, దేశీయ భూస్వామ్యవర్గాల మద్దతుతో పార్లమెంటును, కొమింటాంగు పార్టీని రద్దుచేశాడు. తానే రాజుకావాలనికూడా ప్రయత్నించాడు.

తిరిగి సన్ యెట్ సేన్ దక్షిణ చైనాలో రిపబ్లిక్ ప్రభుత్వానికి అధ్యక్షుడయినాడు. దేశంలో రెండు ప్రభుత్వాలేర్పడ్డాయి. 1916 లో యు ఆన్ షీ-కీ చనిపోయిన, తర్వాత ఉత్తర ప్రాంతంలో మిలిటరీ

నాయకులు అధికారం చెలాయించ సాగారు. అధికారంకొరకు వీరిలో వీరు కుమ్ములాడుకోవడమేకాక, రెండు ప్రభుత్వాల మధ్య కూడా అనేక యుద్ధాలు జరిగాయి. దేశంలో శాంతి నశించింది. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో జపాను సులభంగా దేశాన్ని ఆక్రమించటానికి అవకాశం గలిగింది.

1911 విప్లవం తర్వాత కూడా, ప్రజాస్వామ్య రిపబ్లిక్ అవతరించలేదు. ఇంతవరకు విదేశీ సామ్రాజ్యవాదులకు, వారి ఏజంట్లుగా వ్యవహరించే దేశీయ పెట్టుబడిదార్లకు అధికారం దక్కింది.

మొదటి ప్రపంచయుద్ధంలో చిక్కుకున్న సామ్రాజ్యవాదులు, చైనా వ్యవహారాల్లో ప్రత్యేకశ్రద్ధతో వ్యవహరించే అవకాశం లేకపోయింది. ఈ కాలంలోనే చైనా జాతీయ పరిశ్రమలుకూడా కొంత అభివృద్ధయినాయి. దానితో ఫ్యాక్టరీ కార్మికుల సంఖ్యకూడా పెరిగింది.

1917 నవంబరు విప్లవంలో రష్యా కార్మికవర్గం అధికారం హస్తగతంచేసుకుని సోషలిస్టురాజ్యం స్థాపించింది.

జాతీయ విప్లవాన్ని విజయవంతంగా నడపడానికి మార్గమేమిటా అని ఆలోచిస్తున్న చైనా కార్మికవర్గానికి నవంబరు విప్లవం దారిచూపింది. ఇంతకుమించిన ఉత్తమమార్గం లేదని నిర్ణయించుకుంది; కార్యాచరణకు పూనుకుంది. 1919 లో వచ్చిన సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక విప్లవోద్యమంలో (దీన్నే "మే ఫోర్తు" ఉద్యమం అంటారు) చైనా కార్మికవర్గం పాల్గొన్నది. తమ శక్తి ఎంతటిదో నిరూపించింది.

1921 లో కార్మికవర్గపార్టీ - కమ్యూనిస్టుపార్టీ స్థాపించబడింది. దీనితో చైనా విప్లవోద్యమం మరొక మట్టంలో ప్రవేశించింది. 1922లో సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక కార్యక్రమాన్ని ప్రప్రథమంగా చైనా ప్రజల ముందుంచింది. 1923 లో ఐక్య విప్లవ సంఘటనను నిర్మించ నిశ్చయించింది. కొమింటాంగ్ పార్టీని పునర్నిర్మించడానికి సన్ యెట్ సేన్‌కు సాయపడటానికి నిశ్చయించారు.

సన్ యెట్ సేన్ యీసహాయాన్ని స్వీకరించి, 1924లో తనపార్టీని పునర్నిర్మించ ప్రయత్నించాడు. త్రిసూత్ర సిద్ధాంతాన్ని ప్రకటించాడు. సోవియట్‌తో స్నేహం, కమ్యూనిస్టులతో సన్నిహిత సహకారం, రైతుల - కార్మికుల జీవన ప్రమాణాభివృద్ధి, సామ్రాజ్యవాదుల్ని దేశంనుండి తరిమేయడం, దున్నే రైతుకు భూమిని సంక్రమింపచేయడం యీ సూత్రాలతో ఐక్య కార్యాచరణ కార్యక్రమం ప్రకటించాడు. కమ్యూనిస్టులనుకూడా తన పార్టీలో సభ్యులుగా చేరనిచ్చాడు. విప్లవోద్యమం పుంజుకుని త్వరితగతిని అభివృద్ధి కాసాగింది.

దురదృష్టవశాత్తు డాక్టరు సేన్ 1925 మార్చిలో చనిపోయాడు. అయినా విప్లవోద్యమ పురోగతిమాత్రం ఆగలేదు. కమ్యూనిస్టుపార్టీ, కొమింటాంగ్‌పార్టీ ఒక విప్లవ సైన్యాన్ని నిర్మించాయి. ఈ సైన్యం క్వాంటంగ్ రాష్ట్రంలోని విప్లవ వ్యతిరేకశక్తులను (భూస్వాములు, యుద్ధప్రభువులు) నాశనంచేశాయి. 1926 లో విప్లవసేనలు ఉత్తరప్రాంతపు యుద్ధప్రభువులమీద దాడిచేసి, ప్రజల సహకారంతో వీరి సైనికశక్తిని తుత్తునియలు చేశాయి. యాంగ్జిసీ, యెల్లో నదీ లోయలలో చాలభాగం ఆక్రమించాయి. ట్రేడ్‌యూనియన్, రైతు-కూలీ ఉద్యమాలు దేశమంతటా వ్యాపించాయి. ఈ విప్లవోద్యమ ధాటికి యుద్ధప్రభువుల ప్రభుత్వం కూలిపోయే "ప్రమాదం" ఏర్పడింది. సామ్రాజ్యవాదులు గజగజలాడారు.

ఈ "ప్రమాదాన్నుండి" తప్పుకొనేందుకు మార్గ మాలోచించారు. విప్లవోద్యమంలోనుంచే కీలుబొమ్మలను తయారు చేసుకుని, వారిద్వారా విప్లవ ప్రతీఘాతక చర్యలు చేయించడానికి నిశ్చయించారు. "చైనా జాతీయ విప్లవసైన్యం" సేనానిగా పనిచేస్తున్న (కొమింటాంగ్‌పార్టీ అనుయాయుడు) జంగ్‌కైషేక్‌మీద వీరిదృష్టి ప్రసరించింది. ఈయన విప్లవోద్యమ ముసుగు వేసుకుని, అనేక విప్లవప్రతీఘాతక చర్యలు జరిపాడు. ఇటువంటి విప్లవ విద్రోహి సామ్రాజ్యవాదుల దృష్టిని ఆకర్షించటంలో ఆశ్చర్యమేముంది? ప్రజావుద్యమ

ఉధృతాన్ని చూచి భయపడ్డ భూస్వామ్యవర్గం వీరికి మద్దత్తు నిచ్చింది. 1927 లో చైనా విప్లవం విజయం సాధించనున్న సమయంలో ఈ ఈ విప్లవవిద్రోహి, సామ్రాజ్యవాదుల ఏజంటు ప్రజా విప్లవోద్యమం మీద దాడి ప్రారంభించాడు. విప్లవానికి వెన్నెముకయిన కమ్యూనిస్టు పార్టీమీద దాడి ప్రారంభించాడు. వేలసంఖ్యలో రైతుల్నీ, కార్మికుల్నీ, కమ్యూనిస్టుపార్టీ నాయకుల్నీ, సభ్యుల్నీ చంపించాడు.

"నాన్‌కింగ్" రాజధానిగా మరొక యుద్ధప్రభువుల ప్రభుత్వాన్ని ఏర్పరచాడు. విప్లవ ప్రతిఘాతక శక్తులన్నిటినీ కూడగట్టి, విప్లవ శక్తులమీద దాడి సాగించాడు.

దీనితో చైనా విప్లవం అంతర్యుద్ధం మొదటిదశ గడచి, రెండవదశలో ప్రవేశించింది.

దక్షిణ ప్రాంతంలో కమ్యూనిస్టుపార్టీ స్థావర మేర్పరచుకొని, రైతుల, కార్మికులతో ఎర్ర సైన్యాన్ని నిర్మించింది. (తర్వాత ఇదే ప్రజావిముక్తి సైన్యమవుతుంది). విప్లవ వ్యతిరేకుల దాడిని ప్రతిఘటిస్తూ, భూసంస్కరణల నమలుజరిపింది. క్రమంగా ఈ స్థావరాలు 2,50,000 చదరపుమైళ్ళ మేరకు విస్తరించాయి.

జంగ్ కై షేక్ అంతర్యుద్ధంలో మునిగి వుండడం చూచి, 1931 లో జపాన్ చైనా ఆగ్నేయ భూభాగాన్ని ముట్టడించింది. కమ్యూనిస్టుపార్టీ అంతర్యుద్ధంమాని, జపాన్‌కు వ్యతిరేకంగా ఇద్దరం కలిసి ప్రతిఘటన సాగిద్దామని జంగ్-కై-షేక్‌కు సూచించింది. కాని, వీటిని పెడచెవిని బెట్టడమేకాక, జంగ్-కై-షేక్ కమ్యూనిస్టులమీద దాడిని తీవ్రతరం చేశాడు. వీరి ముఖ్యస్థావరమైన కియాంగ్సీని చుట్టుముట్టి నాశనంచేయ ప్రయత్నించాడు.

1934 జులైలో, ఉత్తరప్రాంతానికి తరలిపోయి జపాన్‌ను ఎదిరించాలని ఎర్రసైన్యం నిశ్చయించింది. తరువాత మూడునెలలకు తరలి నడక ప్రారంభించింది. మార్గమధ్యంలో - 1935 జనవరిలో కమ్యూనిస్టుపార్టీ పొలిట్‌బ్యూరో విస్తృతసమావేశం జరిగింది. దానిలో పార్టీలోని అతివాద అవకాశవాదుల నాయకత్వాన్ని తొల

గించి, మావో-సే-టుంగ్‌ను పార్టీ నాయకునిగా ఎన్నుకుంది. ఇది చైనా కమ్యూనిస్టుపార్టీ చరిత్రలో, చైనా విప్లవోద్యమ చరిత్రలో ఒక మహత్తర సంఘటన.

ఎర్రసైన్యాన్ని దారికాచికొట్టినాశనంచేయాలని జంగ్-కై-షేక్ తీవ్రంగా ప్రయత్నించాడు. కాని, ఎర్రసైన్యం అనేక త్యాగాలుచేస్తూ యీ దాడులన్నిటినీ అసమానత్యాగాలతో తిప్పికొడుతూ, శత్రు వలయాలను ఛేదించుకొంటూ, 8000 మైళ్ళు ప్రయాణంచేసి చివరకు తన గమ్యాన్ని - షెన్సీ - కాన్సూ - నింగ్సియా సరిహద్దుప్రాంతాన్ని చేరింది. యూనాన్‌ను కేంద్రంగా చేసుకుని కమ్యూనిస్టుపార్టీ, జపాన్ దురాక్రమణను ఎదిరించడానికి జాతీయ ఐక్యసంఘటనను నిర్మించింది.

జపాన్ దురాక్రమణను ప్రతిఘటించడానికి జంగ్-కై-షేక్ గట్టిగా ప్రయత్నించకపోవడం ప్రజలలో తీవ్ర అసంతృప్తిని కలిగించింది. ఆఖరికి జాతీయ బూర్జువావర్గం, మిలిటరీ నాయకులలో కొందరుకూడా అసంతృప్తు లయినారు.

1936 డిసెంబరులో కమ్యూనిస్టులతో కలసి జపాన్‌దాడిని ప్రతిఘటించాలనే కొమింటాంగ్ సేనానాయకు లిద్దరు చాంగ్ హ్స్యూ-లియాంగ్, యాంగ్ హు-చెంగ్ - జంగ్-కై-షేక్‌ను సియాన్‌లో బందీ చేశారు. కమ్యూనిస్టుపార్టీ జంగ్‌తో సంప్రదింపులు చేసింది. చివరకు, ఐక్యంగా జపాన్ దురాక్రమణను ఎదిరించడానికి జంగ్ అంగీకరించాడు. ఈయన్ను చంపకుండా కమ్యూనిస్టుపార్టీ వదిలి పెట్టింది.

1937 జులై 7 వ తేదీన జపాన్ "లుకౌఖియో" మీద దాడి చేసింది. ఈ దాడిని ఐక్యంగా ఎదుర్కొన్నారు. ఐక్య ప్రతిఘటన కిది నాందీ ప్రస్తావన. ఈ సంఘటన ఫలితాన్ని చూచిన ప్రజలు, సర్వత్రా జపాన్‌ను ఎదిరించాలనీ, జంగ్ లాలూచీ పోరాటాన్ని ఆపి, కమ్యూనిస్టుపార్టీతో కలిసి జపాన్‌ను ప్రతిఘటించాలని కోరజొచ్చారు. ప్రజాభిప్రాయానికి జంగ్ తాత్కాలికంగా తలవొగ్గాడు. తరువాత కొంత కాలానికి "ముందు కమ్యూనిస్టులను ప్రతిఘటించండి; తర్వాత జపాన్

మీద ప్రతిఘటన" అనే నినాదంతో తిరిగి కమ్యూనిస్టులమీద దాడి ప్రారంభించాడు. కమ్యూనిస్టు స్థావరాలను జంగ్ సైన్యాలు చుట్టుముట్టాయి.

కమ్యూనిస్టు పార్టీ అటు జపాన్ దాడిని ప్రతిఘటించడమే కాక, యిటు జంగ్ దాడినికూడా ఎదుర్కోవలసి వచ్చింది. 1945 నాటికి, చైనామీద దాడిచేసిన జపాన్ సైన్యంలో నూటికి 69 వంతులు సైన్యాన్నీ, జపాన్ పక్షాన చేరి పోరాడుతున్న చైనా కీలుబొమ్మ సైన్యంలో నూటికి 95 వంతుల సైన్యాన్నీ ప్రజావిముక్తి సైన్యం ఎదుర్కొని పోరాడుతోంది. అనేకకష్టాలకోర్చి, అసమానత్యాగాలు చేసి చాలభాగాన్ని జపాన్ దురాక్రమణ దారులనుండి విముక్తి చేసింది. 1945 ఆగస్టులో సోవియట్ సైన్యాలు ఉత్తర చైనాలో ప్రవేశించి, జపాన్ సైన్యాన్ని తరిమేశాయి. జపాన్ ఫాసిస్టు దురాక్రమణ నుండి చైనా విముక్తి పొందింది.

ఈ కాలంలో చైనా కమ్యూనిస్టుపార్టీ పలుకుబడి పెరిగింది. జంగ్-కై-షేక్ ముఠా అప్రతిష్ఠపాలైంది. ప్రజలంతా కొమింటాంగ్ పాలన అంతరించాలనీ, ప్రజాస్వామ్య ఐక్యప్రజాతంత్ర ప్రభుత్వం నిర్మించబడాలనీ, ప్రజాస్వామ్య సంస్కరణలు కావాలనీ కోర జొచ్చారు. చైనాను తమ వలస దేశంగా చేసుకోవాలని అమెరికా జంగ్‌ను బలపరచింది. ఈ మద్దతుతో జంగ్ తిరిగి 1946 జూలైలో విముక్తి ప్రాంతాలమీద దాడి ప్రారంభించాడు. దానితో చైనా వ్లవోద్యమం మూడవ ఘట్టంలో ప్రవేశించింది.

1946 నాటికి చైనా ప్రజలు అనేక పోరాటాల్లో కాకలు తీరారు. చైనా విముక్తి సైన్యం సంఖ్యలోను, నిపుణతలోను పెరిగింది. విముక్త ప్రాంతం విస్తృతమయింది. ప్రజా విముక్తి సైన్యం దాడులు చేసే దశనుండి రక్షణ చేసుకునేందుకు పోరాటం ప్రారంభించింది. 1947 జూలై కే దాడినుంచి తప్పుకొనే దశనుండి తిరుగు దాడిచేసేస్థితికి వచ్చింది. జంగ్ సైన్యాలను తరుముతూ నల్లేరుమీద బండిలా నడిచింది. 1949 ఏప్రిల్‌లో జంగ్ రాజధానియైన నాన్‌కింగ్‌ను

పట్టుకుంది. విద్రోహముఠా ప్రభుత్వం అంతరించింది. జంగ్-కై-షేక్ ముఠా పారిపోయి అమెరికా సామ్రాజ్యవాదుల రక్షణక్రింద తైవాన్‌లో తలదాచుకుంది.

1949 అక్టోబరు ఒకటవ తేదీన మావోసేటుంగ్ చైనా ప్రజా రిపబ్లిక్ ను ప్రకటించాడు. చైనా ప్రజల భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవం జయించింది. నూరు సంవత్సరాల పోరాటం విజయవంతంగా ముగిసింది. తిరిగి చాలా కాలానికి దేశాన్ని ఐక్యంచేసి, శాంతి నెలకొల్పగలిగిన ప్రభుత్వం ఏర్పడింది.

నూతన ప్రజాతంత్ర ప్రభుత్వం అధికారం స్వీకరించగానే విప్లవ ప్రతీఘాతశక్తుల నణచివేసి, దేశాన్ని సమైక్యం చేసింది. దీర్ఘకాల అంతర్యుద్ధంలో ఛిద్రమైపోయిన దేశీయ ఆర్థికవ్యవస్థను పునరుద్ధరించ ప్రయత్నించింది. నూతన రాజ్యాంగచట్టంతోపాటు అనేక ప్రజాస్వామిక సంస్కరణలను ప్రవేశపెట్టింది. ప్రజాజీవితాన్ని బాగు చేయడానికి కృషి ప్రారంభించింది.

1949-'52 సంవత్సరాల మధ్యకాలంలో, దేశ పరిశ్రమల పునర్నిర్మించింది. ఈ నిర్మాణకృషిలో సోవియట్‌యూనియన్ విశేషంగా తోడ్పడింది. యంత్రాలను సప్లయి చేయడమే కాక, తమ సాంకేతిక నిపుణులను పంపి సాయపడింది. ఈ కాలంలో పారిశ్రామికోత్పత్తి సంవత్సరానికి నూటికి 36.9 పాళ్ళ చొప్పున పెరిగింది. 1954 కు పారిశ్రామికోత్పత్తి 1949 ఉత్పత్తికంటె 4.2 రెట్లు పెరిగింది. 1954 వ సంవత్సర పారిశ్రామిక, వ్యవసాయ గ్రామీణ పరిశ్రమల మొత్తం ఉత్పత్తి విలువ 1949 వ సంవత్సరం ఉత్పత్తికి 2.2 రెట్లు ఉంటుంది.

1954 వ సంవత్సరపు కొన్ని పారిశ్రామికోత్పత్తులు, 1949 తో పోల్చితే యీ విధంగా పెరిగాయి: విద్యుత్ 2.5 రెట్లు, రాక్షసి బొగ్గు 12.4 రెట్లు, ఉక్కు 13.7 రెట్లు, యంత్రపరికరాలు 8.5 రెట్లు, సిమెంటు 7.2 రెట్లు, నూలు 2.6 రెట్లు, కాగితం (పారిశ్రామికోత్పత్తి) 4.5 రెట్లు, ప్రజావసర వస్తువులు (Consumer goods) 3.1 రెట్లు.

కో-ఆపరేటివులు, ప్రభుత్వం నడిపే పరిశ్రమల సంఖ్య అధికమవుతూ వచ్చింది. వ్యక్తులు నడుపుతున్న పరిశ్రమలు క్రమంగా ప్రభుత్వంతో భాగస్వాములుగా చేరుతున్నాయి.

1949 లో, మొత్తం పరిశ్రమలలో నూటికి 37 పరిశ్రమలు ప్రభుత్వము - వ్యక్తుల సమిష్టి యాజమాన్యాన నడుపబడుతూ వుండేవి. 1954 కల్లా వీటి శాతం 71 కి పెరిగింది. సోషలిస్టు గమ్యం చేరడానికి ప్రాథమికావసరమయిన పారిశ్రామికాభివృద్ధివైపుకు నూతన చైనా పురోగమిస్తున్నదని యీ మార్పు తెలియచేస్తున్నది.

1948 లో విముక్తిప్రాంతాల్లో ప్రారంభించిన భూసంస్కరణోద్యమం, నూతన ప్రజాతంత్ర ప్రభుత్వం ఏర్పడినతర్వాత అంచెలు అంచెలుగా దేశమంతటా అమలుజరుపబడ్డాయి. ఇంతకాలం రైతును పీక్కు-తింటున్న భూస్వామ్యవ్యవస్థ రద్దయి, దున్నే రైతుకు భూమి లభించింది. రైతులకు ప్రభుత్వం అప్పులు యిచ్చింది. వ్యవసాయ పరికరాలు, ఎరువులు సప్లయిచేసింది. వీరంతా ద్విగుణీకృతోత్సాహంతో వ్యవసాయోత్పత్తి పెంచడానికి కృషిచేశారు.

సోషలిస్టు వ్యవసాయానికి ప్రాతిపదికగా, కో-ఆపరేటివు వ్యవసాయాన్ని ప్రభుత్వం ప్రోత్సహించసాగింది. ఎటువంటి నిర్బంధమూ లేకుండా రైతులు తమ యిష్టమైతేనే వీటిలో చేరవచ్చు. రైతులు ఉత్సాహంగా కో-ఆపరేటివులలో చేరుతున్నారు. 1954 ఆగస్టుకు యివి లక్షకు పెరిగాయి. రైతాంగంలో నూటికి 50 మంది కోఆపరేటివులలో చేరేట్లు కృషిచేయాలని ప్రథమ పంచవర్ష ప్రణాళికలో చెప్పబడింది. కాని, యిప్పటికే (1955, జూన్) నూటికి 56 వంతులమంది రైతులు కో-ఆపరేటివులలోచేరారు. 1955 అక్టోబరులో కో-ఆపరేటివులలో చేరవలసిందిగా మావో విజ్ఞప్తిచేసిన తర్వాత, రెండునెల్లలో 5,50,000 కో-ఆపరేటివులు కొత్తగా ఏర్పడ్డాయి. కో-ఆపరేటివు వ్యవసాయం యెడల రైతుల ఆసక్తికి యిది నిదర్శనం.

1949 ఉత్పత్తితో పోల్చితే, 1953 లో ధాన్యపు ఉత్పత్తి నూటికి 47 పాళ్లు, పత్తి 165 పాళ్ళు, పశు సంపద 66.8 పాళ్ళు పెరిగింది.

ముంపు నివారణకు, మిడతల దండుల నాశనం చేయడంలో ప్రభుత్వం రైతులకు విశేషంగా తోడ్పడుతున్నది. హువాయ్‌నదీ ప్రాజెక్టు నిర్మాణం విదేశ సాంకేతిక నిపుణులను ఆశ్చర్యచకితుల చేసింది. కొత్తగా ప్రాజెక్టులకట్టి భూములకు నీటిపారుదల సౌకర్యాలు కలిగిస్తున్నది.

చేతి పరిశ్రమలనుకూడా నూతన ప్రభుత్వం ఆదరిస్తున్నది. 1953 కు 3 లక్షల మంది చేతిపనివారు 4,800 కో-ఆపరేటివులలో చేరారు. చేతి పరిశ్రమలు దేశ ఆర్థిక వ్యవస్థలో ముఖ్యమైన శాఖగానే చైనా ప్రభుత్వం భావిస్తున్నది.

దేశ ఆర్థికవ్యవస్థ బాగుపడటంతో స్వదేశ, విదేశ వ్యాపారం అభివృద్ధి అయింది. దేశీయ వ్యాపారం 1950 లో జరిగిన దానికంటె 1953 కు 1.8 రెట్లు పెరిగింది. విదేశ వ్యాపారంకూడా 1.8 రెట్లు పెరిగింది.

వ్యాపారం కూడా క్రమంగా కో-ఆపరేటివుల క్రిందకు, ప్రభుత్వం చేతిలోకి పోతున్నది.

ఆర్థిక పరిస్థితి మారినకొలదీ, ప్రభుత్వ ఆదాయ వ్యయాలలో కూడా మార్పులొస్తున్నాయి. బడ్జెట్ అంచనాల ప్రకారం 1950లో ప్రభుత్వానికి వచ్చిన ఆదాయం కంటె, 1954 లో 3.6 రెట్లు అధికంగా వచ్చింది. ఆదాయం వచ్చే (Sources) ఉపాధులు కూడా మారిపోతున్నాయి. 1950-54 సంవత్సరాల మధ్య కాలంలో రైతులు చెల్లించే పన్నుల ద్వారా వచ్చే ఆదాయం మొత్తం ఆదాయంలో నూటికి 29.6 నుండి 13.4 కు తగ్గిపోయింది. (అంటే, రైతులమీద పన్నుభారం తగ్గిపోతున్నదన్నమాట). వ్యవసాయ కో-ఆపరేటివులు, కో-ఆపరేటివులచేత, ప్రభుత్వంచేత నిర్వహించబడుతున్న పరిశ్రమలు, వ్యాపార సంస్థల ద్వారా వచ్చే ఆదాయం 34.1 పాళ్ళ నుండి, 66.1 పాళ్ళకు పెరిగింది.

ప్రభుత్వ యంత్రనిర్వహణకు, సైన్యానికిపెట్టే ఖర్చును క్రమంగా తగ్గిస్తున్నది.

1950 లో వీటికి మొత్తం బడ్జెట్ ఆదాయంలో నూటికి 60.8 పాళ్ళు ఖర్చు చేసేవారు. 1954 లో ఈ ఖర్చు 30.7 వంతులకు తగ్గించబడింది.

ఈ ఖర్చును తగ్గిస్తూ, ప్రజా శ్రేయస్సుకు ఎక్కువ మొత్తాలను ఖర్చు చేస్తున్నది. 1954 బడ్జెట్ అంచనాల ప్రకారం 1950 లో విద్య, విజ్ఞాన, వైద్య, సాంఘిక సంక్షేమానికి ఖర్చుచేసేదానికి ఐదురెట్లు, 1954 లో ప్రభుత్వం ఖర్చుపెట్టింది.

ప్రజాజీవితం మెరుగుపడింది. నిరుద్యోగ సమస్య చాలవరకు పరిష్కరించబడింది. కార్మికుల జీతాలు 1950 జీతాలకంటే, 1953 లో నూటికి 80 వంతులు పెరిగాయి. ఇంకా ఇన్సూరెన్సు, విద్య, వైద్య, విశ్రాంతి, వసతిసౌకర్యాలు కల్పించబడ్డాయి.

రైతుల జీవితం చాల మెరుగయింది. ఇంతవరకు తిండికి, బట్టకు కూడా గడవని రైతు, ఇవాళ మంచి తిండి తినగలుగుతున్నాడు. మంచి బట్టలు వాడగలుగుతున్నాడు. 1950 తో పోల్చితే, వారి కొనుగోలుశక్తి 1953 కు నూటికి 73 పాళ్లు వృద్ధి అయింది.

వైద్యసౌకర్యాలు అభివృద్ధయినాయి. అమెరికా సామ్రాజ్యవాదులు సాగించిన క్రిమియుద్ధంలో విజయం సాధించారు. అనేక అంటురోగాలను నిర్మూలించగలిగారు. వైద్యశాలల నిర్మాణం చురుకుగా సాగుతున్నది. విముక్తికి పూర్వం వైద్యశాలలలోవున్న మంచాలకంటె నేడు నాలుగురెట్లు అధికంగా ఉన్నాయి.

సోవియట్ విద్యావిధానాన్ని ఆదర్శప్రాయంగా తీసుకుని, విద్యావిధానం రూపొందించబడింది. 1953 కు 181 ఉన్నత విద్యాలయాల్లో 2,16,700 మంది విద్యార్థులు చదువుతున్నారు. విముక్తికి పూర్వంకంటె వీరిసంఖ్య 1953 లో నూటికి 40 పాళ్ళు అధికం. ఈ విద్యార్థులలో 80,000 మంది ఇంజనీరింగు విద్యార్థులు. విముక్తికి పూర్వపు సంఖ్యతో పోల్చితే వీరిసంఖ్య నూటికి 191 పాళ్లు అధికం.

1953 వ సంవత్సరాంతానికి 4,426 సెకండరీ విద్యాలయాలలో 29,30,000 మంది చదువుతున్నారు. విముక్తి పూర్వపు సంఖ్యతో పోల్చితే వీరిసంఖ్య నూటికి 96 పాళ్లు అధికం.

1953 లో 5 లక్షలకు మించి ప్రాథమిక విద్యాలయాలున్నాయి. వీటిలో 5 కోట్లమంది విద్యార్థులు చదువుకొంటున్నారు. విముక్తికి పూర్వపు సంఖ్యతో పోల్చితే, విద్యార్థుల సంఖ్య రెట్టింపు, విద్యాలయాల సంఖ్య నూటికి 76 పాళ్ళు అధికం.

ఇదికాక రైతుల, కార్మికుల విద్యాస్థాయిని, సాంకేతిక నిపుణతను పెంచడానికి ప్రత్యేక విద్యాలయాలు నడుపబడుతున్నాయి. నిరక్షరాస్యతను నిర్మూలించడానికి గ్రామీణ ప్రాంతంలోను, పట్టణ ప్రాంతంలోను వయోజన విద్యా కేంద్రాలు నడుపబడుతున్నాయి. 1953 కు 2,30,00,000 మంది వయోజన విద్యా కేంద్రాలలో చదువు నేర్చుకుంటున్నారు.

నూతన చైనా ప్రజల విజ్ఞానతృష్ణకు ఇవి చక్కని ఉదాహరణలు.

విజ్ఞానశాస్త్ర అభివృద్ధికి, లలితకళల పోషణకు ప్రభుత్వం అత్యంత శ్రద్ధాసక్తుల ప్రదర్శిస్తున్నది. మైనారిటీ జాతులకు రక్షణలిచ్చి, వారి అభివృద్ధికి కృషిచేస్తున్నది.

జాతీయ ఆర్థికవ్యవస్థను పునర్నిర్మించిన తర్వాత, ప్లాను ప్రకారం జాతీయ ఆర్థికవ్యవస్థను అభివృద్ధిచేయడానికి కృషి ప్రారంభించింది. దీనికి 1953–'57 సంవత్సరాలలో అమలుజరపడానికి ప్రథమ పంచవర్ష ప్రణాళికలు తయారుచేసింది. దేశంలో భారీయంత్ర పరిశ్రమల నభివృద్ధిచేయటం, అధునాతన పద్ధతుల్లో దేశరక్షణను ఏర్పరచటం, వ్యవసాయం, రహదారీ సౌకర్యాల నభివృద్ధి పరచటం, వ్యవసాయ, చేతిపరిశ్రమల కో-ఆపరేటివ్వుల సంఖ్య పెంచడం, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థను విస్తృతం చేయటం, ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచటం యీ ప్రణాళిక ముఖ్యలక్ష్యాలు.

1957 కు మొత్తం పారిశ్రామికోత్పత్తులు నూటికి 98.3 వంతులు పెరుగుతాయి. ఉక్కు ఉత్పత్తి 3.1 రెట్లు, విద్యుత్ రెండు రెట్లు, రాక్షసి బొగ్గు 1.8 రెట్లు, సిమెంటు 2.1 రెట్లు, వస్త్రాలు 1.5 రెట్లు పంచదార 2.8 రెట్లు పెరుగుతాయి. ముఖ్యంగా భారీ యంత్ర పరిశ్రమలు ప్రత్యేక శ్రద్ధతో అభివృద్ధి చేయబడతాయి.

వ్యవసాయ రంగంలో ధాన్యపుటుత్పత్తి నూటికి 17.6 వంతులు, పత్తి 25.4, జనపనార గోగునార ఉత్పత్తి 19.7 వంతులు, పొగాకు (శుద్ధిచేసినది) 76.6 వంతులు, చెరకు 85.1 వంతులు, నూనె గింజలు 37.8 వంతులు అధికం చేయబడతాయి.

విద్యా, విజ్ఞానరంగాలలో యీ అభివృద్ధిని సాధించాలని నిర్ణయించబడింది. ఉన్నత విద్యాలయాలలో చదివే విద్యార్థులసంఖ్య నూటికి 127 వంతులు, సీనియర్ మిడిల్ స్కూళ్ళలో చదివేవారి సంఖ్య నూటికి 178 వంతులు, జూనియరు మిడిల్ స్కూళ్ళలో చదివే వారి సంఖ్య 78.6 వంతులు, ప్రాథమిక విద్యాలయాలలో చదివేవారి సంఖ్య నూటికి 18 వంతులు అధికం చేయబడుతుంది. దేశంలోని బాలబాలికలలో ప్రాథమిక విద్యాలయాలలో విద్య నభ్యసించదగిన వయఃసున్న బాలబాలికలలో నూటికి 70 మంది ప్రణాళికాంతానికి ప్రాథమిక విద్యాలయాలలో చేర్చబడాలి.

వివిధ వైద్యాలయాలలో ఉన్న మంచాలసంఖ్య నూటికి 77 వంతులు పెరుగుతుంది; డాక్టర్ల సంఖ్య నూటికి 74 వంతులు పెరుగుతుంది.

23 కొత్త విజ్ఞానశాస్త్ర పరిశోధనా కేంద్రాలు ఏర్పరచబడతాయి. పరిశోధకుల సంఖ్య 3,400 పెరుగుతుంది. సినిమా, సారస్వతం, కళలు, యితరత్ర విజ్ఞాన కార్యకలాపాల అభివృద్ధికి కృషి జరుగుతుంది.

ప్రజల జీవన ప్రమాణం పెరుగుతుంది. కార్మికుల జీతాలు నూటికి 3 వంతులు పెరుగుతుంది. గ్రామీణ ప్రజల కొనుగోలుశక్తి రెట్టింపుకు అభివృద్ధి చేయబడుతుంది.

ఈ ప్రణాళిక జయప్రదంగాముగిస్తే, చైనా ఆర్థిక వ్యవస్థ సోషలిస్టు గమ్యాన్ని చేరడానికి మార్గం యేర్పడుతుంది.

చైనా ప్రభుత్వం ఆశించినదానికంటె సోషలిస్టు సమాజ గమ్యం చేరడానికి అత్యుత్సాహాన్ని ప్రదర్శిస్తున్నారు. 1956 వ సంవత్సరం జనవరికి, పీకింగ్, షాంగ్‌హై, టీన్‌స్టిన్, సియాన్, షెన్‌యంగ్, చుంకింగ్ నగరాలలోని పారిశ్రామిక వ్యాపార సంస్థలన్నీ ప్రభుత్వముతో భాగం కలిశాయి.

లియోనింగ్ రాష్ట్రంలోని రైతులంతా వ్యవసాయ కో-ఆపరేటివులలో చేరారు. హోపే రాష్ట్రంలోని 24 కౌంటీలలో సోషలిస్టు వ్యవసాయ క్షేత్రాలు ఏర్పడ్డాయి. హోఆన్, చెంకింగ్, షాంటంగ్, షాన్సీ, క్వాంటంగ్ రాష్ట్రాలలో సోషలిస్టుతరహా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు ఏర్పడుతున్నాయి. పెకింగు నగర ప్రాంతంలోని వ్యవసాయ కో-ఆపరేటివులు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలుగా మారిపోయాయి.

ఈ విధంగా చైనా ప్రజలు సోషలిస్టు సమాజ గమ్యానికి ఉరకలువేస్తూ పయనిస్తున్నారు. వేసుకున్న అంచనాలకుమించి విజయం సాధిస్తున్నాయి.

చైనా ప్రజారిపబ్లిక్‌గా ప్రకటించబడిననాడే సోవియట్ యూనియన్ నూతన ప్రభుత్వాన్ని గుర్తించి, దౌత్యసంబంధాల నేర్పరచుకొంది. క్రమంగా తూర్పుయూరపు ప్రజాతంత్ర రిపబ్లిక్‌లే కాక ఇతర దేశాలు కూడా దౌత్య సంబంధాల నేర్పరుచు కొన్నాయి. నాల్గునెల్లు ఆలోచనలుచేసి, స్వార్థ ప్రయోజనాలదృష్ట్యా బ్రిటన్ నూతన చైనా ప్రభుత్వాన్ని 1950 జనవరి 5 వ తేదీన గుర్తించింది.

చైనాలో ప్రజాస్వామిక ప్రభుత్వం యేర్పడటం, ప్రపంచ ప్రజలకు – ముఖ్యంగా ఆసియా ప్రజలకు – ఆనందదాయకమయితే, అమెరికా సామ్రాజ్యవాదులకు ఉక్రోషకారణ మైంది. చేజారిపోయిన చైనాను తిరిగి ఆక్రమించేందుకు ప్రయత్నాలు ప్రారంభించింది. కీలుబొమ్మ జంగ్–కై–షేక్‌తో చైనామీద దాడిచేయించడానికై

ప్రయత్నించసాగింది. కాని, చైనా ప్రజాశక్తిముందు జంగ్ ఆటలు సాగలేదు.

టిబెట్‌ను తమ కుట్రలకు కేంద్రంగా చేసుకుని, చైనామీద దాడిచేయడానికి ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రయత్నించారు. కాని, నూతన చైనా ప్రభుత్వం యీ కుట్రను భగ్నం చేయ గలిగింది. 1951 మేలో టిబెట్‌ను శాంతియుతంగా విముక్తిచేసింది. మే 23 న ఒడంబడికపై సంతకాలు జరిగాయి. దానిప్రకారం టిబెట్‌కు "రీజియనల్ అటానమీ యివ్వబడుతుంది." దలైలామా, పంచన్ లామా అధికారాలు యిప్పటివలె ఉంటాయి. ప్రజల ఆచార వ్యవహారాలలో చైనా ప్రభుత్వం ఎటువంటి జోక్యం కలిగించుకోదు. టిబెట్ విదేశాంగ వ్యవహారాలనుమాత్రం నూతన చైనా ప్రభుత్వం నిర్వహిస్తుంది.

1950 జూన్‌లో ఉత్తరకొరియా మీదకు తన తొత్తయిన సింగ్మన్‌రీ సైన్యాలను ఉసికొల్పింది. దీన్ని అవకాశంగా తీసుకుని, చైనామీద దురాక్రమణ సాగించాలని అమెరికా సామ్రాజ్యవాదులు ఆశించారు. అమెరికా సామ్రాజ్యవాదుల సేనలు, కీలుబొమ్మ "రీ" సేనలు ఉత్తరకొరియా నాక్రమిస్తూ చైనా సరిహద్దుల వరకూ వచ్చాయి. సోదర దేశప్రజల స్వాతంత్ర్య రక్షణకు, మాతృదేశ రక్షణకు చైనా ప్రజలు వేలాది వలంటీర్లుగా వచ్చి, దురాక్రమణ సేనలనడ్డాయి.

ఈ ధాటికి తట్టుకోలేక అమెరికా సామ్రాజ్యవాదుల సేనలు పిక్కబలం చూపాయి. ప్రగల్భాలు పలుకుతున్న అమెరికా సామ్రాజ్యవాదుల సేనల అసమర్థతను ప్రపంచానికి నిరూపించాయి. అమెరికా సామ్రాజ్యవాదం "కాగితం పులి" అని నిరూపించాయి.

వీరు ప్రయోగించిన అస్త్రం దురాక్రమణ ఒక్కటేకాదు. చైనాకు యెటువంటి సహాయం అందనివ్వకుండా ఉండాలని, చైనాతో వ్యాపారం చేయవద్దని తమ అనుచర దేశాలను ఆజ్ఞాపించారు. దీనివల్ల, చైనాకంటే తమ అనుచర దేశాలే యెక్కువగా నష్ట

పోయాయి. చైనామాత్రం సోవియట్‌యూనియన్, తూర్పు యూరపు నూతన ప్రజాతంత్ర దేశాల సన్నిహిత సహకారంతో యీ దిగ్బంధనాన్ని అధిగమించగలిగింది.

జాతీయ ఆర్థికవ్యవస్థ క్రమంగా అభివృద్ధి కాసాగింది. నూతన ప్రభుత్వం ప్రజల హృదయాలలో స్థాన మేర్పరచుకొన్నది.

ఆసియాలో నూతన చైనా పలుకుబడి, ప్రభావం పెరగసాగాయి. కొన్ని ఆసియా దేశాలు తమ పూర్వపు విధానాలు మార్చుకొని, సామ్రాజ్యవాదుల యుద్ధకూటమిలో చేరకుండా, తటస్థ విధానాన్ని అవలంబించసాగాయి. చైనాతో సౌహార్ద సంబంధాల నేర్పర్చుకోవటం ప్రారంభించాయి. భద్రతాసమితిలో జంగ్ ముతాస్థానే, నూతన చైనాకు ప్రాతినిధ్యమివ్వాలని, సోవియట్ యూనియన్‌తోపాటు ఈ దేశాలు కోరసాగాయి.

నూతన చైనాప్రభుత్వం సామ్రాజ్యవాదుల యుద్ధకూటమి నిర్మాణాన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తూ, ప్రపంచ శాంతిరక్షణకు కృషి చేస్తున్నది. కొరియా, ఇండోచైనాలలో శాంతి ఏర్పరచడానికి చైనా ఎనలేని కృషిచేసింది.

ఈ దృష్టితోనే తమదేశానికి, తోటిదేశాలకు మధ్యనున్న వివాదగ్రస్త విషయాలను సౌహార్దభావంతో పరిష్కరించుకోడానికి యత్నిస్తున్నది. 1955 ఏప్రిల్‌లో ఇండోనేషియాతో జాతి సమస్య మీద చేసుకున్న ఒడంబడిక యిందుకు ఉదాహరణ. జపాన్‌తోకూడా స్నేహసంబంధాల నేర్పరచుకోడానికి చైనా సంసిద్ధతను ప్రకటించింది. తిరిగి రెండుదేశాల మధ్య వ్యాపారాన్ని పెంపొందించుకోడానికి కృషి చేస్తున్నది.

1954 అక్టోబరులో చైనా ప్రధాని చౌ-ఎన్-లై భారతదేశం సందర్శించారు. ఈ సందర్భంలో పంచశీలాల ప్రాతిపదికమీద భారత - చైనా దేశాల మైత్రి పెంపొందాలని ప్రకటించారు. నాటి నుండి "పంచశీలాలు" శాంతికి పర్యాయపదమైంది. శాంతినికోరే దేశాలమధ్య నేడు జరిగిన మిత్రత్వసంధులన్నీ యీ పంచశీలాల

ప్రాతిపదికమీదే జరుగుతున్నాయి. 1955 ఏప్రిల్‌లో బాండుంగులో జరిగిన ఆసియా, ఆఫ్రికా దేశాల సమావేశం పంచశీలాల ప్రాతిపదిక మీద ప్రపంచ దేశాలమధ్య మిత్రత్వం పెంపొందాలని కోరింది. ఈ సమావేశంలో చైనా పాల్గొన్నది.

జంగ్‌ను రక్షిస్తున్న అమెరికా నౌకాదళాన్ని వెంటనే ఉపసంహరించాలని కోరుతున్నది. సాధ్యమయినంతవరకు తైయువాన్‌ను శాంతియుతంగానే విముక్తి చేయాలని కృషిచేస్తున్నది.

ఐక్యరాజ్య సమితిలో జంగ్ ముఠా ప్రతినిధుల తొలగించి, తమ ప్రతినిధులకు స్థానమివ్వాలని చైనా ప్రజలు కోరుతున్నారు.

అంతర్జాతీయ స్నేహ, సౌహార్దాలను పెంచడానికి చైనా కృషి చేస్తున్నది. ఈ దృష్టితోనే ఒక్క సోవియట్ యూనియన్, తూర్పు యూరపు దేశాలతోనేకాక, శాంతినికోరే ప్రతి దేశముతోను మిత్రత్వాన్ని నెరపటానికి చైనా సంసిద్ధంగా ఉంది. ఇప్పటికపుడే అనేక దేశాలతో మిత్రత్వ, వ్యాపార ఒడంబడికలు చేసుకొన్నది.

# మంగోలియా పీపుల్స్ రిపబ్లిక్

సోవియట్ సైబీరియాకు దక్షిణాన యిది ఉంది. దీన్నే పూర్వం "ఔటరు మంగోలియా"అనేవారు. దీని వైశాల్యం 6,84,000 చదరపు మైళ్ళు; జనాభా సుమారు 21 లక్షలు.

1924 కు పూర్వం ఈ దేశం చాల వెనుకబడి వుండేది. పశువుల పెంపకం ప్రజల ముఖ్యావృత్తి. ఎడారి ప్రాంతం కావటంచేత పంటలు పండవు. పశువుల కాపరులు ఋతువులనుబట్టి దేశమంతటా మందలతో తిరుగుతుండేవారు.

పశు సంతతి అంతా భూస్వాములు, మతాధిపతులు, విదేశీ పెట్టుబడిదారులదే! రైతులు వీరి దోపిడీ కింద నలిగిపోతుండేవారు. ఉన్న "ఆస్తి" కంటే అప్పే ఎక్కువ వుండేది.

ఈ దేశాన్ని తమ వలసదేశం చేసుకోవాలని జపాను, అమెరికా సామ్రాజ్యవాదులు చాల ప్రయత్నాలుచేశారు. 1919-20 లో హ్స్యూషు-చెంగ్ అనే యుద్ధప్రభువు (War-lord) సైన్యాలూ, రష్యా రాజరిక పాలనను నిలబెట్టడానికి కృషిచేసిన వైట్‌గార్డు దళాలూ కలిసి దేశాన్ని ఆక్రమించాయి. వీరికి జపాన్ మద్దత్తు ఉంది. దాన్ని స్థావరంగా ఏర్పరచుకొని, వైట్‌గార్డు దళాలు 1919-20 లో సోవియట్ మీద దాడిచేశాయి.

రష్యా సోషలిస్టు విప్లవంతో ఉత్తేజితులయిన ప్రజలు తామూ రాజ్యాధికారాన్ని హస్తగతంచేసుకోడానికి కృషిచేశారు.

1920 జూన్‌లో ఉర్గాప్రాంతంలో రహస్యంగా రెండు విప్లవ సంస్థలు – సుఖే బాతార్, చోయిబల్సాన్‌లు పనిచేస్తుండేవి. ఇవి రెండూ కలిసి మంగోలియా ప్రజా విప్లవపార్టీగా ఏర్పడ్డాయి. ఈ పార్టీ జాతీయ స్వాతంత్ర్యంకొరకు గెరిల్లాదళాల నేర్పరచి పోరాటం సాగించింది. గెరిల్లాదళాలు క్రమంగా రెగ్యులర్ సైన్యంగా పెంపొంది, ఒకటి తర్వాత ఒకటి విజయం సాధించాయి. క్యాఖ్తాప్రాంతం వశపరచుకుని, అచ్చట 1921 మార్చి 3 న ప్రజావిప్లవ ప్రభుత్వాన్ని ఏర్పరచింది.

అభివృద్ధినిరోధకుల, విదేశీ సామ్రాజ్యవాదుల జోక్యం అధికం కావటంచేత, విప్లవప్రభుత్వం సోవియట్ సాయాన్ని కోరింది. సోవియట్ సైనికసాయంతో 1921 జూలైలో రాజధాని ఉర్గాను పట్టుకుంది. జూలై 11 నుండి ప్రజాతంత్ర ప్రభుత్వం పనిచేయ మొదలుపెట్టింది.

1924 లో ప్రజాతంత్ర రిపబ్లిక్ ప్రకటించబడింది. అధికారం ప్రజల దని ప్రకటించబడింది. 1924 నవంబరులో ప్రజాస్వామిక రాజ్యాంగ చట్టం అమల్లోకి వచ్చింది. దేశంమీద భూస్వాముల, మతాధిపతుల, విదేశ సామ్రాజ్యవాదుల పెత్తనం అంతరించింది.

1936 లో జపాన్ ఈ దేశంమీద దాడిచేసింది. సోవియట్ సాయంతో ప్రజా ప్రభుత్వం ఈ దాడిని తిప్పికొట్టింది. సోవియట్ సాయంతోనే దేశ ఆర్థిక వ్యవస్థను నిర్మించుకొన్నది.

ప్రజా ప్రభుత్వం భూస్వామ్య వ్యవస్థను రద్దుచేయడానికి సంస్కరణల నమలుజరిపింది. పశువులు, భూములు ప్రజల సొత్తు అయినాయి.

ఇపుడు పశువుల పెంపకం అధునాతన పద్ధతులపై జరుగు తున్నది. ఇదివరకు పశువైద్యాన్ని యెరుగని దేశంలో 30 వ వార్షి కోత్సవం నాటికి 771 పశువైద్య కేంద్రాలు యేర్పడ్డాయి. పశుసంపద మూడు రెట్లు పెరిగింది.

ప్రభుత్వం పెద్ద పెద్ద ప్రభుత్వ క్షేత్రాలను నడుపుతూ సోషలిస్టు వ్యవసాయాన్ని ప్రోత్సహిస్తున్నది. ప్రస్తుతం వ్యవసాయం కో-ఆప రేటివ్ పద్ధతులపై జరుగుతున్నది.

అనేక పరిశ్రమలు దేశంలో వెలిశాయి. అవి క్రమంగా అభి వృద్ధవుతున్నాయి.

పూర్వం నూటికి 99 మంది నిరక్షరాస్యులు. ఇపుడు నిరక్ష రాశ్యత పూర్తిగా నిర్మూలించబడింది. ఒక యూనివర్సిటీ, అనేక విద్యాలయాలు యిపుడున్నాయి. నిర్బంధ ప్రాథమికవిద్య అమలులోకి వచ్చింది.

అనేక వైజ్ఞానిక కేంద్రాలు, సంస్థలు ఇంతవరకూ ఈ దేశ చరిత్రలో లేనివి స్థాపించబడ్డాయి. 30 వ వార్షికోత్సవం నాటికి 27 వార్తా పత్రికలు, 16 ఇతర పత్రికలు వెలువడుతున్నాయి. ప్రజల విజ్ఞానాభివృద్ధికి ఇది నిదర్శనం.

దేశ వ్యాపితంగా వివిధ రకాల వైద్యాలయాలు ఏర్పరచ బడ్డాయి. ఇవి క్రమంగా అధికమవుతున్నాయి.

ప్రజల జీవిత ప్రమాణం, వైజ్ఞానిక స్థాయి క్రమంగా పెరుగు తూనే వున్నది. ప్రభుత్వం పంచవర్ష ప్రణాళికల నమలుజరుపుతూ దేశాన్ని సోషలిస్టు సమాజంవైపు నడిపిస్తున్నది.

# కొరియా

కొరియా, 34—41 ఉత్తర అక్షాంశరేఖలకు, 125—130 ఉత్తర తూర్పు తులాంశరేఖలకు మధ్య ఆసియా ఖండపు తూర్పు దిక్కున ఉంది. ఉత్తరాన సోవియట్ యూనియన్, చైనాలు, తూర్పు పడమరలు జపాన్, పసుపు సముద్రాలు, దక్షిణాన జపాన్ దేశం సరిహద్దులుగా ఉన్నాయి. దేశ వైశాల్యం 85226 చదరపు మైళ్ళు. జనసంఖ్య మూడు కోట్లు.

ఆసియా ఖండాన్ని, జపాను దీవులను కలిపి "వంతెన" లా యీ దేశం ఉంది. ఈ "వంతెన" మీదుగానే జపాను సామ్రాజ్యవాదులు అనేకసార్లు సోవియట్ యూనియన్ చైనాలపై దురాక్రమణ జరిపారు. యుద్ధ వ్యూహరీత్యా యిది ఇంత కీలకప్రదేశం కనుకనే, అమెరికా సామ్రాజ్యవాదులు కొరియా నంతటినీ తమ చేతికిందకు తీసుకోవాలని విశ్వప్రయత్నాలు చేస్తున్నారు.

ఉత్తర కొరియా స్వతంత్ర దేశం. దక్షిణ కొరియా ఇపుడు అమెరికా కాలనీగా వుంది.

ఉత్తర కొరియా వైశాల్యం 48,000 చదరపు మైళ్ళు; జనాభా ఒక కోటి. రాజధాని ఫాంగ్యాంగ్. దక్షిణ కొరియా వైశాల్యం 37,000 చదరపు మైళ్ళు; జనాభా సుమారు రెండు కోట్లు. రాజధాని సెయోల్.

ఉత్తరకొరియా అంతా పర్వత ప్రదేశం. దక్షిణ కొరియాలో పర్వతాలు చాల తక్కువ. మైదాన ప్రాంతం ఉత్తర కొరియాకంటె అధికం. ఇక్కడ పంటలు బాగా పండుతాయి. అందుచేత జన సమ్మర్థం అధికం.

దేశ వైశాల్యంలో నూటికి 75 వంతులు అరణ్యాలకిందే ఉంది. ఉత్తర కొరియాలో శ్రేష్టమయిన కలప దొరుకుతుంది.

దేశంలో సాగుకు క్రిందవున్న భూమి అంతా జనాభాలో నూటికి 20 మందిగాఉన్న జమీందార్లు, భూస్వాముల చేతుల్లోనే ఉండేది.

1945 లో ఉత్తర కొరియాలో ప్రజా ప్రభుత్వం యేర్పడిన తర్వాత, భూమంతా రైతులకు, వ్యవసాయ కూలీలకు పంచబడింది. ప్రజా ప్రభుత్వం యేర్పడకపూర్వం ఆహార పదార్థాల కొరత విశేషంగా ఉండేది. ఇపుడు దేశం స్వయంసమృద్ధిని సాధించింది. దక్షిణ కొరియా రైతు నేటికీ భూస్వామ్య దోపిడీకి గురవుతూనే ఉన్నాడు.

వరి ముఖ్యమైన వ్యవసాయపు పంట. దక్షిణాన ఉన్న మైదాన ప్రాంతాలలో ఇది యెక్కువగా పండించబడుతున్నది.

దేశంలో ఇనుము, బొగ్గు, గ్రాఫైట్ మొదలైన ఖనిజాలు దొరుకుతాయి. వీటిలో అత్యధికభాగం ఉత్తర కొరియాలోనే ఉన్నాయి.

జపాను సామ్రాజ్యవాదులు 1930 ప్రాంతంలో ఏవో కొన్ని పరిశ్రమలను స్థాపించారు. కాని, అవన్నీ దేశంలోని ముడిసరుకులను దోచుకపోవటానికి ఉపయోగపడేవే! దేశంనుండి అనేకరకాల ముడి పదార్థాలను (ముఖ్యంగా ఖనిజాలను) తమదేశానికి దోచుకపోయి వస్త్రాలు, యితర ప్రజావసర సరుకులు దిగుమతి చేస్తుండేవారు.

ప్రజా ప్రభుత్వం ఏర్పడిన తర్వాత, ఉత్తర కొరియా అనేక రకాల భారీ పరిశ్రమలను, చైనా, సోవియట్ యిత్యాది మిత్ర రాజ్యాల సహకారంతో ఇనుము, ఉక్కు, బట్టలు, రసాయన, విద్యుదుత్పత్తి, సిమెంటు, పెట్రోలు యిత్యాది పరిశ్రమలను స్థాపించి పారిశ్రామికాభివృద్ధికి పాటుబడుతున్నది.

దక్షిణకొరియాలో అమెరికను సామ్రాజ్యవాదులు ఉన్న పరిశ్రమలలో నాశనంచేసి, తమ సరుకుల దిగుమతిచేసి అమ్ముకొంటున్నారు.

ఈ విధంగా దేశంలోని రెండుభాగాలులో విభిన్న ఆర్థిక వ్యవస్థలున్నాయి.

1905 వ సంవత్సరంలో రష్యా-జపాను యుద్ధం, జరిగింది. ఈ కాలంలోనే, జపాను ఆక్రమించ ప్రయత్నిస్తున్న ఫిలిప్పైను దీవు

లను అమెరికా ఆక్రమించి దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకున్నట్లు కొరియా ఆక్రమణకు జపానును ఉసిగొలిపించి ఈ విధంగా ఫిలిప్పైన్సు దీవుల విషయంలో తనకు జపాను పోటీరాకుండా చేసుకుంది. చివరకు, 1910 వ సంవత్సరంలో, అమెరికా, బ్రిటన్ సామ్రాజ్యవాదుల మద్దత్తుతో కొరియాను తన కాలనీగా జపాను చేసుకోగలిగింది. అప్పటినుండే జపాను సామ్రాజ్యవాదం చైనామీద దాడిచేయడానికి కొరియాను ఒక మెట్టుగా ఉపయోగించుకొంటూ వచ్చింది.

స్వాతంత్ర్య కాముకులయిన కొరియా ప్రజలు సామ్రాజ్య వాదులను ఎదిరించుతూనేవచ్చారు. ఈ పోరాటాలనుండి, 1925 వ సంవత్సరంలో కమ్యూనిస్టుపార్టీ ఉద్భవించింది; అది విముక్తి ఉద్యమానికి నాయకత్వం వహించి నడుపనారంభించింది.

దేశ విముక్తికొరకు, కొరియా దేశభక్తులు జరిపిన అనేక పోరాటాలను నిర్దాక్షిణ్యంగా అణుస్తూ (1919 సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రదర్శనాలు జరిపిన దేశభక్తులచెవులు కోసేశారు. సోవియట్‌ను అభిమానించే వ్యక్తులకు ఉరిశిక్షలు వేశారు) 1945 వరకూ కొరియాను తమ వలసదేశంగా అట్టిపెట్టుకోగలిగారు.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో జపాను సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా కొరియాప్రజలు సాయుధ ప్రతిఘటనకు పూనుకున్నారు. ఇందులో కమ్యూనిస్టుపార్టీ ప్రధానపాత్ర నిర్వహించింది.

1945 వ సంవత్సరం జులై మాసంలో సోవియట్ యూనియన్, అమెరికా, బ్రిటనులు పోట్సుడాంలో సమావేశమైనపుడు, ఆసియాలోని జపాన్ ఆక్రమిత దేశాల విముక్తిసమస్య చర్చకువచ్చింది. సోవియట్ సైన్యం అడుగిడినచోట సామ్రాజ్యవాదానికి నిలువనీడ వుండదని ఎరిగిన ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు, సోవియట్ సైన్యాలు 38 వ ఉత్తర అక్షాంశ రేఖనుదాటి దక్షిణానికి రాకూడదని, దక్షిణ ప్రాంతాన్ని అమెరికా, బ్రిటన్‌ల సైన్యాలు ఆక్రమించాలని, దేశంలో శాంతి ఏర్పడిన తర్వాత ఐక్యకొరియాను నిర్మించాలని తీర్మానం తెచ్చారు. జపాను ఫాసిస్టు దాస్యంనుండి ప్రజలను త్వరగా

విముక్తి చేయటమే ప్రధాన ఆశయంగా గల సోవియట్ యూనియన్ ఇందుకు అంగీకరించింది.

ఎర్రసైన్యం 1945 వ సంవత్సరం ఆగస్టు తొమ్మిదవ తేదీన దాడి ప్రారంభించింది. వారంరోజుల్లో 38 వ ఉత్తర అక్షాంశ రేఖ వరకూ కొరియాను విముక్తిచేసింది. సోవియట్ సేనాని మార్షల్ జుకోవ్, దేశంలో ప్రజాస్వామిక ప్రభుత్వ స్థాపనకు సోవియట్ సైన్యం తోడ్పడుతుందని ప్రకటించాడు. వివిధ ప్రజాస్వామికపార్టీలకు, వ్యక్తులకు ప్రాతినిధ్యం వహించే ప్రజాప్రభుత్వ నిర్మాణానికి ప్రయత్నాలు ప్రారంభమైనాయి.

దక్షిణ కొరియాను అమెరికా సైన్యాలు ఆక్రమించాయి. మెకార్థరు మిలిటరీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశాడు. ఇందులో అన్ని కీలకపదవులకు అమెరికా ఆఫీసర్లనే నియమించాడు.

సోవియట్ యూనియన్ ఐక్య కొరియా నిర్మాణానికి, దేశమంతా ఒకే ప్రజాస్వామ్య ప్రభుత్వం కిందికి రావటానికి రాజీ ప్రయత్నాలు అనేకంచేసింది. కొరియాను యుద్ధకేంద్రంగా నిర్మించి, తమ వలసదేశంగా అట్టి పెట్టుకోదలచిన అమెరికా సామ్రాజ్యవాదులు వీటన్నిటిని వమ్ముచేశారు. ఈ విధంగా సామ్రాజ్యవాదుల కుటిలనీతి వల్ల, దేశం రెండు ఖండాలయింది. ఒకేజాతి రెండుగా విభజించబడింది.

ఉత్తర కొరియా, సోవియట్ యూనియన్ సహాయంతో స్వాతంత్ర్య మార్గం చేపట్టింది. ప్రజాస్వామిక రాజ్యాంగ చట్టం ప్రకారం, వివిధ ప్రజాస్వామిక పార్టీలు, గ్రూపులు, వ్యక్తుల సహకారంతో కిమ్-ఇల్-సూంగ్ నాయకత్వాన, కొరియా ప్రజలందరూ బలపరచే ప్రజాస్వామిక ప్రభుత్వం స్థాపించబడింది.

భూస్వామ్య విధానం రద్దుచేయబడింది. భూస్వాముల భూములన్నీ దున్నే రైతుకు పంచబడ్డాయి. ఆహారం విషయంలో స్వయం సమృద్ధిని కొద్దికాలంలోనే సాధించగలిగింది.

సామ్రాజ్యవాదులు దేశ పరిశ్రమలను అభివృద్ధి కానీయలేదు. ఉన్న చిన్న పరిశ్రమలు కూడా యుద్ధంలో నాశనమై పోయాయి. సోవియట్ యూనియన్ సహకారంతో వాటిని పునరుద్ధరించడమే కాక, భారీ పరిశ్రమ లనేకం స్థాపించబడ్డాయి. సామ్రాజ్య వాదులు పాతాళానికి తొక్క ప్రయత్నించిన జాతీయ సంస్కృతిని ప్రభుత్వం ఉద్ధరించింది.

దక్షిణ కొరియాలో లీ-సుంగ్-మాన్ నాయకత్వాన ఒక కీలుబొమ్మ ప్రభుత్వాన్ని అమెరికా సామ్రాజ్యవాదులు ఏర్పరచారు. యుద్ధ వ్యవహారరీత్యా యిది మంచి కీలకప్రాంతమనీ, తమ సరుకులకు మార్కెట్టుగా ఉపయోగపడుతుందనీ, ఆశతో కొరియాను తాము చేజిక్కించుకోవాలని తాపత్రయపడుతున్న సామ్రాజ్యవాదులు దేశాన్ని సర్వనాశనం చేశారు. దేశంలో అప్పటికి మిగిలిన కొద్ది పరిశ్రమలుకూడా మూలపడ్డాయి. వ్యవసాయం క్షీణించిపోయి, దేశంలో తిండి కరువు ఏర్పడింది.

లీ-సుంగ్-మాన్ కీలుబొమ్మ ప్రభుత్వం అనేక ప్రజాస్వామిక సంస్థలను నిషేధించింది. నాలుగేండ్లలో (1945-50) లక్షన్నరమంది దేశభక్తుల్ని ఉరితీసింది; ఐదులక్షల మందిని జైళ్లలో పెట్టింది.

ఈ విధంగా, దేశంలో పైశాచిక పాలనను ప్రవేశపెట్టి, సైన్యాన్ని పెంచి, తమ విమానాలు, టాంకులు, ఇతర మందుగుండు సామగ్రి దింపి ఉత్తర కొరియాను "కమ్యూనిస్టు నియంతృత్వ బానిసత్వంనుండి విముక్తి" చేయడానికి, దక్షిణ కొరియాను ఆయత్తం చేసింది.

1950 వ సంవత్సరం జూన్ 25 వ తేదీన దక్షిణ కొరియా సైన్యాలు ఉత్తర కొరియామీద ఎట్టి హెచ్చరిక లేకుండానే దాడి చేశాయి.

ఈ దాడిని ఉత్తరకొరియా సైన్యాలు తప్పికొట్టటమేకాక 'రీ' సైన్యాలను దక్షణకొరియానుండి సముద్రంలోకి తరిమేసేట్లు తిరుగు దాడి ప్రారంభించాయి. తృటిలో ఉత్తరకొరియాను జయించగలనను

కొన్న అమెరికాకు ఇది "షాక్"లా తగిలింది. తక్షణం భద్రతా సమితితో, ఉత్తరకొరియాను "దురాక్రమణ దారుగా" ముద్ర వేయించి, ప్రపంచంలో "శాంతిని కాపాడడానికి" ఐక్యసమితి సభ్యులంతా వెంటనే సైనిక చర్యలకు పూనుకోవాలని – సోవియట్ యూనియన్ ఈ సమావేశంలో పాల్గొనకుండానే తీర్మానించింది.

దీనితో అమెరికా నాయత్వాన 15 రాజ్యాలు కొరియాపై దురాక్రమణకు పూనుకున్నాయి. భారతప్రభుత్వం దక్షిణకొరియాకు తనవాటాగా ఒక వైద్యదళాన్ని పంపి, సమితి తీర్మానాన్ని "గౌరవించింది".

సామ్రాజ్యవాదుల సైన్యాలు, సింగ్మన్ రీ సైన్యాలు తిరుగుదాడి ప్రారంభించి, ప్రజలపై చెప్పరాని అత్యాచారాలు, హత్యలు చేస్తూ, ఉత్తర కొరియా రాజధాని ఫాంగ్‌యాంగ్‌ను ఆక్రమించుకొన్నాయి. ఈ దురాక్రమణ కొరియాలో ఆగదని, తన భూభాగానికి కూడా విస్తరించే ప్రమాదం ఉన్నదని గుర్తించిన చైనా ప్రజలు వేలసంఖ్యలో వలంటీర్లుగా వచ్చి, కొరియా స్వాతంత్ర్య రక్షణకు పూనుకున్నారు. దీనితో కొరియా ప్రజాసేనలు తిరుగుదాడి ప్రారంభించాయి.

సామ్రాజ్యవాద సేనలు పిక్కబలం చూపెట్టాయి. పరిస్థితులు తలక్రిందు లవడం చూచి, భారతప్రభుత్వం తన పూర్వవైఖరిని మార్చుకుంది. కొరియాలో శాంతిని నెలకొల్పడానికి ప్రయత్నాలు ప్రారంభించింది.

పారిపోతూ, దురాక్రమణదారులు, కొరియా గ్రామాలను భస్మీపటలం చేశారు; అనేక వేలమంది ప్రజలను బలవంతంగా తమతో లాక్కెళ్ళారు. అనేక వేలమంది ఖైదీలనుచంపారు. విచక్షణారహితంగా విమాన దాడులుచేసి దేశాన్ని సర్వనాశనం చేశారు.

రెండు సంవత్సరాల దురాక్రమణ యుద్ధంలో ఉత్తర కొరియా ఆక్రమణ దుస్సాధ్యమని సామ్రాజ్యవాదులు గుర్తించారు. శాంతి కాముకులయిన చైనా, ఉత్తర కొరియా ప్రభుత్వాలు, యుద్ధ విరమ

ణకు అనేక సూచనలుచేస్తూ వచ్చారు. ఐక్యరాజ్య సమితిలో సోవియట్ ప్రతినిధులు వీరి వాణిని వినిపించి, తక్షణమే యుద్ధవిరమణ జరిగేట్లు ఐక్యరాజ్యసమితి చూడాలని కోరారు. స్టాలిన్, యుద్ధ విరమణకు ఒప్పుకోకపోతే, దురాక్రమణదారులు సర్వనాశనం అవుతారని హెచ్చరించాడు. ప్రపంచ ప్రజలముందు అమెరికా దురాక్రమణదారుగా తేలిపోయింది. ప్రపంచ ప్రజలు యుద్ధవిరమణను కోరటం ప్రారంభించారు.

చివరకు 1953 వ సంవత్సరం, జులై 27 వ తేదీన యుద్ధ విరమణకు ఒక తాత్కాలికసంధి జరిగింది. యుద్ధఖైదీల మార్పిడి ప్రారంభమైంది.

కాని యుద్ధవిరమణను మనసారాకోరని సామ్రాజ్యవాదులు, ఒడంబడికను ఉల్లంఘించి దాడులు చేయటమేకాక, తమ అధీనంలో ఉన్న ఖైదీలను ఉత్తర కొరియాకు అప్పగించక ఏగవేయటం ప్రారంభించారు. వీరిలో కొన్ని వేలమందిని, తైవాన్‌కు బలవంతంగా పంపారు. ఇందుకు నిరాకరించిన ఖైదీలను అమానుషంగా చంపారు.

చైనా, ఉత్తరకొరియాలు అనేకసార్లు ఈ విషయాన్ని భద్రతా సమితికి తెలియచేశారు. చివరకు 1956 వ సంవత్సరం సెప్టెంబరు 9 వ తేదీన ఖైదీల మార్పిడిని అజమాయిషీ చేయడానికి, ఒక మధ్యవర్తి సంఘం (**Neutral Nations Repatriation Commission**) ఏర్పాటు చేయబడింది. దీనికి భారతదేశ ప్రతినిధి అధ్యక్షుడు.

ఒడంబడిక షరతులనుబట్టి, రెండుపక్షాలవారి అధీనంలో ఉన్న యుద్ధఖైదీలను మధ్యవర్తిసంఘం తమ అధీనంలోకి తీసికోవాలి. ఖైదీలు తతమత మాతృదేశాలకు వెళ్ళటానికి ఇష్టపడుతున్నారో లేదో విచారించి, ఇష్టపడిన వారిని పంపివేయాలి. సంఘం నియమించబడిన 150 రోజులలోపున ఈ సమస్య పరిష్కారం చేయాలి. ఈ కాలపరిమితిలో మార్పిడి జరగక మిగిలిపోయే ఖైదీలను ఆయా పక్షాలకు తిరిగి అప్పగించాలి.

పై కాలపరిమితిలో ఖైదీల మార్పిడి జరగకుండా ఉంటానికి అమెరికా చేయవలసిందంతా చేసింది.

కొరియా సమస్యను పరిష్కరించడానికి చైనా, ఉత్తర కొరియాలు 1953 నవంబరు 30 వ తేదీన దిగువ సూచనలు చేశాయి.

(1) కొరియా సమస్యా పరిష్కారానికి ఏర్పాటు చేయబడే సమావేశానికి యుద్ధంలో పాల్గొన్న దేశాలన్నిటిని పిలవాలి.

(2) మధ్యవర్తులుగా భారతదేశం, పాకిస్తాను, బర్మా, ఇండొనేషియా, సోవియట్ యూనియన్‌లను పిలవాలి. వీరికి ఓటింగు హక్కు ఉండదు.

(3) ఈ సమావేశం ఢిల్లీలో జరపాలి.

దీన్ని అమెరికా సామ్రాజ్యవాదులు తోసేశారు. ఇలాగే అనేకసార్లు చైనా, ఉత్తర కొరియాలు చేసిన రాజీ సూచనలనుకూడా తోసివేస్తూ వచ్చారు.

150 రోజుల గడువూ పూర్తి అయింది. ఉత్తర కొరియా, తమవద్దనున్న ఖైదీలందరిని ఇచ్చివేసింది. కాని అమెరికా తన వద్ద ఉన్న ఖైదీలలో అత్యధిక సంఖ్యాకుల్ని మధ్యవర్తి సంఘం ముందుకే తీసుకురాలేదు.

మధ్యవర్తి కమిషన్ తన నివేదికలో, యుద్ధఖైదీల మార్పిడి విషయమై అమెరికాపక్షం పెట్టిన అడ్డంకులన్నిటినీ బహిర్గతం చేసింది. దక్షిణకొరియాలో యుద్ధఖైదీల శిబిరాలు అమెరికన్ అధికారుల పలుకుబడిక్రింద ఉండడంవల్ల ఖైదీలు స్వేచ్ఛగా తమ అభిప్రాయాలను చెప్పలేకపోయారని స్పష్టపరచింది. ఒడంబడిక షరతుల ప్రకారం ఖైదీలకు నచ్చచెప్పే కార్యక్రమం 90 రోజుల్లో పూర్తికావలసియుండగా, అమెరికన్ అధికారులు అనేక అడ్డంకులు పెట్టటంవల్ల ఆ కార్యక్రమం అమలుజరగలేదని చెప్పింది. "ఎవరి ప్రాంతానికి వారు వెళ్ళిపోవడానికి యుద్ధఖైదీలకు గల హక్కును అమలుజరపమని కోరిన వారిపై దౌర్జన్యచర్యలు జరిగాయి; అనేక హత్యలు గావింపబడ్డాయి" అని మధ్యవర్తికమిషన్ వెల్లడిచేసింది. అంతేకాదు. "కొరియా

ప్రభుత్వం (సింగ్మన్‌రీముఠా) తటస్థరాజ్యాల కమిషన్‌పైనే అనేక బెదరింపులు, ఒత్తిడి తీసుకొచ్చింది" అని తెలియజేసింది.

ఈ విధంగా భారతప్రతినిధి అధ్యక్షుడుగావున్న తటస్థరాజ్యాల కమిషన్ తన విధులను సక్రమంగా నెరవేర్చలేని పరిస్థితి ఏర్పడింది. ఒడంబడిక షరతులను బాహాటంగా ఉల్లంఘించిన అమెరికా ప్రపంచ ప్రజల ముందు నేరస్తరాజ్యంగా నిలబడింది. ఇట్టిపరిస్థితుల్లో కమిషన్ అధ్యక్షుడు జనరల్ తిమ్మయ్య, 150 రోజుల గడువు పూర్తికావడం వల్ల, ఎవరి అధీనం క్రిందవున్న ఖైదీలను వారికి వప్పగించి, తటస్థ రాజ్యాల కమిషన్‌ను రద్దుచేశాడు. పోలెండ్, జెకోస్లోవేకియాల ప్రతినిధులిందుకు సమ్మతించలేదు. అమెరికా అనుసరించిన పై పద్ధతుల వల్ల సుమారు 50 వేల మంది ఉత్తర కొరియా ఖైదీలు అమెరికా చేతిలో చిక్కుకున్నారు.

1954 ఫిబ్రవరి 18 న బెర్లిన్‌లో జరుగుతున్న అగ్రరాజ్యాల సమావేశంలో సోవియట్ యూనియన్ కొరియాసమస్యను చర్చించాలని కోరింది. తత్ఫలితంగా, ఈ సమస్య జనీవాలో (1954 ఏప్రిల్‌లో) జరగబోయే సమావేశంలో చర్చించబడాలని నిర్ణయించబడింది.

1954 వ సంవత్సరం, ఏప్రిల్ 24 న జరిగిన ఈ సమావేశానికి నాలుగు అగ్రరాజ్యాలు, కొరియా యుద్ధంలో పాల్గొన్న వివిధ రాజ్యాలు హాజరయినాయి. చైనా ప్రతినిధులు పరిశీలకులుగా ఆహ్వానింపబడ్డారు.

చైనా-ఉత్తరకొరియా ప్రతినిధులు కొరియానుంచి విదేశ సేనలన్నీ ఉపసంహరింపబడాలనీ, మధ్యవర్తి సంఘ పర్యవేక్షణ క్రింద ఉత్తర, దక్షిణ కొరియాలలో ఎన్నికలు జరగాలని ప్రతిపాదించారు. కాని అమెరికా యిందు కంగీకరించలేదు. తన పలుకుబడి క్రింద ఉండే ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యాన ఎన్నికలు జరగాలని అమెరికా ప్రతినిధి పట్టుపట్టాడు. దక్షిణకొరియానుంచి తమ సేనలను ఉపసంహరించుకోడానికి వీల్లేదన్నాడు. అందుచేత జనీవా సమావేశంలో కొరియా సమస్యపై ఎట్టి నిర్ణయం జరగలేదు.

భారత ప్రభుత్వం మధ్యవర్తిసంఘ పర్యవేక్షణ క్రింద కొరియాలో ఎన్నికలు జరగాలనే సూచనను బలపరచింది. ఈ సమస్యను శాంతియుతంగా, సంప్రతింపుల ద్వారా పరిష్కరించాలని భారత ప్రభుత్వం పదేపదే చేసిన సూచనను అమెరికా నిరాకరిస్తూవచ్చింది. కొరియాలో యుద్ధవిరమణ జరగడానికి, నిష్పాక్షిక ఎన్నికల ద్వారా ఉత్తర, దక్షిణకొరియాలను ఏకం చేయడానికి భారత ప్రభుత్వంచేసిన కృషి శాంతికాముకుల మన్ననలు పొందింది. కొరియా, ఏకీకరణ సమస్య అమెరికన్ యుద్ధోన్మాదుల మొండిపట్టుదల ఫలితంగా ఇప్పటికి అపరిష్కృతంగానే వుంది.

ఉత్తరకొరియా, సోవియట్ యూనియన్, చైనా, ఇతర తూర్పుయూరపు ప్రజారిపబ్లిక్‌ల సహకారంతో త్వరితగతిని, పునర్నిర్మాణం సాగిస్తూ, యుద్ధకాలంలో ఛిన్నాభిన్నమయిపోయిన ప్రజా జీవితాన్ని చక్కదిద్దుతోంటే, అమెరికా సామ్రాజ్యవాదులు దక్షిణ కొరియాను యుద్ధకేంద్రంగా నిర్మిస్తున్నారు. తాత్కాలిక యుద్ధ విరమణ ఒడంబడిక జరిగిన నెలరోజులకే (1953 వ సంవత్సరం ఆగస్టు 8 వ తేదీన) అమెరికా, దక్షిణకొరియాలు ఒక యుద్ధ ఒడంబడిక చేసుకున్నాయి.

ఇప్పటికీ, సైన్యాల పంపకం, విమానాలు, యుద్ధనావలు, పలురకాల మందుగుండుసామాన్లు అమెరికా ఇక్కడికి దిగుమతి చేస్తూనే ఉంది. భవిష్యద్దురాక్రమణకు దక్షిణకొరియాను యుద్ధ కేంద్రంగా వృద్ధిచేస్తున్నది.

# జపాన్

కొరియాకు తూర్పుదిశన, పసిఫిక్ మహాసముద్రంలో జపాను ఉంది. హొక్కైడూ, హొన్సు, షికొకు, క్యూషూ దీవులు కలిసి, జపాను దేశం అయింది. బ్రిటన్‌కంటె వైశాల్యంలో పెద్దదే! క్యూషూదీవినుండి ఫార్మోజావైపుకు వ్యాపించి ఉన్న చిన్న దీవుల గొలుసుకూడ జపానుకు చెందినదే. దీని వైశాల్యం 1,42,275 చదరపుమైళ్ళు, జనాభా (1950లో) 8,31,99,637.

రెండవ ప్రపంచ యుద్ధానికిపూర్వం పెద్దసామ్రాజ్యం ఉండేది. కాని అది "కాలగర్భంలో" కలిసి పోయింది.

దేశమంతా అగ్నిపర్వతాలమయం. వీటివల్ల, భూకంపాలు వచ్చి, దేశానికి విపరీత నష్టాన్ని కలుగజేస్తుంటాయి.

చలకాలంలో చలి అధికం. ఉత్తరప్రాంతంలో పశ్చిమ తీరాన మంచుపడుతుంది. వేసవిలో వేడికూడా అధికమే. (మనకంటేకాదు) 80° డిగ్రీల వరకూ (ఫారన్‌హీట్) వేడి ఉంటుంది.

ఈ ఉత్తర తీరంలో వర్షాలు చలికాలంలో పడతాయి; దక్షిణ ప్రాంతంలో వేసవిలో పడతాయి.

తీర ప్రాంతం చీలి ఉండటంవల్ల మంచి రేవుపట్టణాలు ఏర్పడడానికి అవకాశం కలిగింది. నౌకాయానానికి చాల అనువుగా ఉంది.

ఈ వైశాల్యంలో ఆరవవంతు మాత్రమే వ్యవసాయానికి అనువయిన ప్రదేశం. మిగిలింది పర్వతాలు, అడవులమయం కావడంచేత ఇందుకు ఉపకరించదు. ముఖ్యపంట వరి. ఇక్కడ ఒక ప్రత్యేక పద్ధతిలో వరి పండిస్తారు. దీనివల్ల ఎక్కువ పంట పండుతుంది. (ఈ పద్ధతినే ప్రభుత్వం మనదేశంలో ప్రోత్సహిస్తున్నది.) గోధుమ, తేయాకు, బార్లీ, మొక్కజొన్న, పప్పుదినుసులు – ఇవి ఇతర పంటలు. ఈ ఆహారధాన్యాల ఉత్పత్తి దేశావసరాలకు చాలదు. విదేశాలనుండి ప్రస్తుతం అమెరికానుండి వీటెని దిగుమతి చేసుకొంటున్నది.

అటవీ సంపదలో జపానును కెనడా, నార్వే, స్వీడన్ దేశాలతో పోల్చవచ్చు. దీని వైశాల్యంలో నూటికి 55 వంతులు అడవులతో నిండివుంది. వీటిలో కలప, వంటచెరకు విరివిగా దొరుకుతుంది. ఇచ్చట దొరికే కర్రతో బొగ్గు, కాగితం గుజ్జు తయారుచేస్తారు.

చేపలుపట్టడం చాల పెద్దపరిశ్రమ. ప్రపంచంలో ఇంత పెద్ద పరిశ్రమ మరేదేశంలోనూ లేదు. ప్రపంచంలోని వివిధదేశాలు పట్టే చేపల్లో నూటికి 20 వంతులు ఒక్క జపానే పడుతున్నది.

ఖనిజసంపద చాల తక్కువ. ఒక్క రాక్షసిబొగ్గు, బంగారం, రాగి, గంధకం తప్ప మిగిలినవి నామమాత్రంగా లభ్యమవుతాయి. సామ్రాజ్యం ఉన్నపుడు, వలసదేశాలనుండి (కొరియా, మంచూరియాలు) దిగుమతిచేసుకొనేది. ప్రస్తుతం, ప్రధానంగా అమెరికానుండి దిగుమతి చేసుకొంటున్నది.

ఖనిజసంపద లోపించటంవల్ల, భారీపరిశ్రమలేవీ అభివృద్ధి కాలేదు. బాగాఅభివృద్ధియైన పరిశ్రమ-దేశఆర్థికవ్యవస్థకు వెన్నెముక-బట్టలపరిశ్రమ. నూలు, పట్టువస్త్రాలు విరివిగా తయారవుతాయి.

అగ్గిపుల్లలు, గొడుగులు, ఆటవస్తువులు, పింగాణీ సామాన్లవంటి చిన్న పరిశ్రమలు అనేకం అభివృద్ధయినాయి.

ఈ దేశంలో కార్మికులకు వేతనాలు తక్కువ. అందుచేత, తమ సరుకులను చౌకగా అమ్మి, విదేశీమార్కెట్లలో పోటీకి నిల్వగలుగుతున్నారు.

రెండవ ప్రపంచయుద్ధ కాలానికి జపాను పెద్ద విదేశీ వ్యాపారం చేస్తుండేది. "విదేశీ వ్యాపారం జపానుకు ప్రాణం" అని అంటారు. అటువంటిది యుద్ధంలో ఓడిపోయిన తర్వాత అంతరించింది. ఇందుకు ముఖ్య కారణాలు రెండు. ఒకటి : కాలనీలు అవతరించటం; రెండు : సోవియట్, చైనాలతో వ్యాపారాన్ని చేయవద్దని అమెరికా కట్టడి చేయటం.

ఇపుడు వ్యాపారంలో అధికభాగం అమెరికాతోనే జరుగుతున్నది. కాని సంవత్సరానికి 200 కోట్ల డాలర్ల వరకూ లోటు వస్తు

న్నది (deficit). ఇపుడిపుడే జపాను ఆగ్నేయ ఆసియా వ్యాపార రంగంలో ప్రవేశిస్తున్నది.

టోకియో దీని రాజధానీ నగరం. ప్రపంచంలోని పెద్ద నగరాల్లో యిది మూడవది. ఒసాకా పెద్ద పారిశ్రామిక, వ్యాపార కేంద్రం; రేవుపట్టణంకూడా. కోచ్, నగోయ పెద్ద ఓడరేవులు.

పన్నెండవ శతాబ్దాంతానికి రాజును నామమాత్రావశిష్టునిగా చేసి, షోగన్ తెగ (మనచరిత్రలో క్షత్రియులలాంటివారు) పరిపాలన సాగిస్తూండేది. వీరికీ, రాజుకు మధ్య అనేకసార్లు ఘర్షణలు జరిగాయి. కాని షోగన్‌లే గెలిచారు. అప్పటినుండి 1869 వరకూ వీరి పరిపాలన అంతరాయం లేకుండానే సాగింది.

ఈ కాలంలో భూస్వామ్య ఆర్థికవ్యవస్థ ఉండేది. అనేక తెగలకు చెందిన భూస్వాములు, తమలోతాము కలహించుకొంటూ ఉండేవారు. రైతులను దోచుకోవటంలో మాత్రం వీరికి ఎట్టి అభిప్రాయ భేదములేదు. ఈ దోపిడీని భరించలేక అనేకసార్లు రైతులు తిరుగుబాట్లు చేశారు. వాటినన్నిటిని భూస్వాములు అణచివేశారు.

1552 లో పోర్చుగీసు దేశస్తులు వ్యాపారం నిమిత్తం జపాను వచ్చారు. వీరు తుపాకులు తెచ్చారు. జపానువారు తుపాకులను చూడ్డం ఇదే ప్రథమం. వీరి తర్వాత క్రమంగా స్పెయిన్, ఇంగ్లీషు, ఫ్రెంచి వ్యాపారస్తులు వచ్చారు. వీరితోపాటు క్రైస్తవమత ప్రచారకులుకూడా వచ్చారు. సామ్రాజ్యవాదం ఈ బురఖాతో వచ్చిందని భయపడి మతప్రచారకుల్ని విదేశ వ్యాపారస్తుల్ని 1636 లో దేశం నుండి వెళ్ళగొట్టారు. స్వదేశస్తు లెవ్వరూ విదేశాలకు వెళ్ళకూడదని కట్టడిచేశారు. తరువాత 213 సంవత్సరాలకాలం జపాను విదేశాలతో సంబంధం లేకుండా తలుపులు మూసుకు కూర్చుంది.

1853 లో అమెరికా ఒక నౌకాదళాన్ని పంపింది (ఆవిరితో నడుపబడే ఓడలను జపాను ఇదే ప్రథమంగా చూడ్డం). దీనితో వ్యాపారానికి సదుపాయాలు చేయవలసిందిగా జపానును కోరుతూ అమెరికా అధ్యక్షుడు లేఖపంపాడు. వీరిని వారించడానికి తనకు పెద్ద

ఓడలు లేవు, మందుగుండు సామాన్లు లేవు. అందుచేత చైనాగతి తనకూ పడుతుందని భయపడి షోగనులు విదేశీవ్యాపారానికి రెండు ఓడరేవులను తెరిచారు. ఇదివిని, వీరివెనకే బ్రిటిష్, డచ్, రష్యన్లు వచ్చారు. ఈ విధంగా, 218 సంవత్సరాల ఏకాంత వాసానంతరం జపాను విదేశస్తులకు కవాటాలు తెరిచింది. వీరు ఒకహక్కు తర్వాత మరొక హక్కును లాక్కుంటూ, జపాను స్వాతంత్ర్యానికే ఎసరుపెట్ట ప్రారంభించారు.

దీనితో ప్రజలలో విదేశస్తులమీద, వారితో అనేక అవమానకరమైన ఒడంబడికలు చేసుకున్న షోగన్లమీద ద్వేషం ప్రబలింది. ఈ అసంతృప్తికి తట్టుకోలేక షోగన్ 1867 లో రాజీనామా చేశాడు. అధికారం రాజుగారి హస్తగతమైంది. ముత్సుహిటో చక్రవర్తి అయినాడు. ఈయన తన పరిపాలనను 'మైజీ' పరిపాలన అని చెప్పుకొన్నాడు. ('మైజీ' అంటే వికాసమని అర్థం.)

ఈ కాలంలో జపాను, యూరపియన్ పద్ధతులమీద తనపరిశ్రమలను, సైన్యాన్ని అభివృద్ధి పరచుకొంది. పోస్టు టెలిగ్రాఫ్ లైన్లు, రైల్వేలు, నౌకానిర్మాణం ప్రారంభించారు. కొద్దికాలంలోనే 1899 కి జపాను శక్తివంతమైన పారిశ్రామిక దేశంగా అభివృద్ధి అయింది. ఈ కాలంలోనే ఫాసిస్టు జాతివిద్వేషం, "దైవాంశ సంభూతుడయిన" రాజుగారిపూజ ప్రోత్సహించ బడింది.

జపాను క్రమంగా విదేశీ సామ్రాజ్యవాదుల కిచ్చిన రక్షణలను రద్దుచేసింది. అమెరికా అంతర్యుద్ధంలో మునిగి ఉంది; అందుచేత జపానులో తన "హక్కు"లను రక్షించుకోలేకపోయింది. రష్యా క్రిమియా యుద్ధంలో మునిగి జోక్యం కలిగించుకోలేకపోయింది. ఇదే కాలంలో యూరపులో జరుగుతున్న జాతీయైక్య పోరాటాల్లో (ఇటలీ, జర్మనీ) చిక్కుకుని ఫ్రాన్సు ఏమీ చేయలేని స్థితిలో ఉంది. 1850–64 సంవత్సరాల కాలంలో చైనాలో తైపింగు తిరుగుబాటు నణచటంలో ఇంగ్లండు, ఫ్రాన్సులు తమ శక్తిని కేంద్రీకరించాయి. ఈ విధంగా సామ్రాజ్యవాద దేశంలో ఇతర వ్యవహారాల్లో మునిగి ఉంటంవల్ల,

జపాను తన స్వాతంత్ర్యాన్ని సులభంగా రక్షించుకోగలిగింది; చైనా వలె విదేశీ సామ్రాజ్యవాద రాబందుల కెరగాకుండా తప్పుకుంది. చివరకు, తానే రాబందై, ప్రక్క రాజ్యాలను కబళించ పూనుకుంది.

జపాను తన సరుకులను అమ్ముకోవడానికి, పరిశ్రమలకు ముడి సరుకులను సప్లయి చేయడానికి వలసదేశాలు అవసరమయినాయి. చైనా, కొరియాల మీదకు దృష్టి సారించింది.

1872 లో చైనాకు సంబంధించిన లూచూ దీవుల్ని ఆక్రమించుకొన్నది. 1879 లో కొరియామీద దాడిచేసి, కొంత ధనాన్ని తీసుకుంది; కొన్ని కొరియా రేవుల్ని తన వ్యాపారానికి తెరిపించింది. చివరకు 1910 లో ఆ దేశాన్ని పూర్తిగా వశపరచుకుంది.

1894-95 సంవత్సరంలో చైనామీద యుద్ధంచేసి మంచూరియాలోని లియోటంగ్ దీపకల్పాన్ని (ఆర్థరు రేవుపట్టణమున్న ప్రాంతం) ఫార్మోజా, పెస్కడోరు ద్వీపాల్ని తీసుకుంది. రష్యా, జర్మనీ, ఫ్రాన్సులు కన్నెర్ర చేయటంవల్ల లియోటంగ్ ద్వీపకల్పాన్ని వదలివేసింది.

1904-1905 లో రష్యామీద యుద్ధంచేసి, ఆ దేశాన్ని చిత్తుగా ఓడించి, ప్రపంచం దిగ్భ్రాంతిచెందేట్లు చేసింది. దీనివల్ల, లియోటంగ్ ద్వీపకల్పం (ఆర్థర్ రేవుతో), సఖాలిన్‌ద్వీపంలో దక్షిణభాగం, తనకు సంక్రమించాయి. మంచూరియాలో రష్యా నిర్మించిన రైల్వేలైనులో చాలభాగం తన అధీనంలోకి తీసుకుంది. ఈ రెండు యుద్ధాలవల్ల జపాన్ సామ్రాజ్యవాదం మరింత బలపడింది. పరిశ్రమలుకూడ మరింత అభివృద్ధయినాయి.

ప్రథమ ప్రపంచ యుద్ధంలో మిత్రమండలి పక్షానచేరి జర్మనీ మీద యుద్ధం ప్రకటించి చైనామీద దాడి చేసింది. షాంటుంగ్ రాష్ట్రంలోని "కియాచు"ను ఆక్రమించి, చైనా భూభాగంమీదనే దురాక్రమణ ప్రారంభించింది. చైనా ఇందుకు అసమ్మతి తెలియచేస్తే, కన్నెర్రచేసి, "21 డిమాండ్ల"తో ఒక అధికార లేఖను చైనా కంద

జేసింది. వీటికి అంగీకరించటమంటే, చైనా జపానుక్రింద వలసదేశం కావటమే !

ఇంతలో రష్యాలో సోషలిస్టు విప్లవం వచ్చింది. బోల్షివిక్‌లు అధికారం స్వీకరించారు. కొంపమునిగి పోయిందని, బ్రిటన్, అమెరికాలతో జపాను సైబీరియామీద దాడిచేసింది. చివరకు ఎర్ర సైన్యాల తాపులకు తట్టుకోలేక తిరుగముఖం పట్టవలసి వచ్చింది.

యుద్ధానంతరం బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా దేశాలు సమావేశమయి, షాంటుంగ్ రాష్ట్రాన్ని తిరిగి చైనా కిప్పించారు. బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా, జపానుదేశాలు తాము ఒండొరుల వలస దేశాలమీద దురాక్రమణ చేయరాదని తీర్మానించుకున్నారు. అమెరికా, బెల్జియం, బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ, జపాను, పోర్చుగల్, చైనా దేశాలు సమావేశమయి, చైనా స్వాతంత్ర్యాన్ని గౌరవించ డానికి అంగీకరించుటలో ఒక ఒడంబడిక చేసుకున్నారు. తరువాత కొద్ది సంవత్సరాలకే జపాను ఈ ఒడంబడికను ఉల్లంఘించి చైనా మీద దురాక్రమణ సాగించటం ముందు చూస్తాం.

ఈ యుద్ధకాలంలో (1914 - 1919) జపాను పరిశ్రమలు రెట్టింపయినాయి. కార్మికుల సంఖ్య కూడా రెట్టింపయింది.

దేశంలో రైతులు, కార్మికులు, భూస్వాములు, పెట్టుబడిదారుల దోపిడీక్రింద నలిగిపోతుండేవారు. కనీసకోర్కెలకొరకు వీధు అనేక సార్లు సమ్మెలు, తిరుగుబాట్లు నడిపారు.

జపానులో మొట్టమొదటి కార్మికసమ్మె 1893 లో జరిగింది. తరువాత ప్రతి సంవత్సరం సమ్మెలు జరుగుతూనే వచ్చాయి. వీటిని అణచడానికి ప్రభుత్వం "శాంతిరక్షణ" పేరుతో 1900 లో ఒక నిరంకుశ చట్టాన్ని చేసింది. దానిప్రకారం ప్రభుత్వ వ్యతిరేక చర్యలలోను, ప్రజాసంస్థల కార్యకలాపాలలోను పాల్గొన్నవారికి కఠినశిక్షలు విధించే అధికారం ప్రభుత్వానికి లభించింది.

ప్రభుత్వం నిర్బంధ విధానం ప్రారంభించింది. అయినా 1901లో సోషల్ డెమాక్రటిక్ పార్టీ (మొట్టమొదటి సోషలిస్టు సంస్థ) స్థాపించ

బడింది. ఇదే సంవత్సరంలో సామ్రాజ్యవాదుల బంటుగా ఫాసిస్టు సంస్థ ఒకటి (Black Dragon Society) స్థాపించబడింది. సోషలిస్టు శక్తులు రహస్యంగా పనిచేయవలసి వచ్చింది. 1907 లో ఒక రాగి గనిలో వచ్చిన సమ్మెను ప్రభుత్వం తన సైన్యాన్ని పంపి అణచివేసింది. 1910 లో 24గురు ట్రేడ్ యూనియన్ నాయకులమీద రాజహత్యా నేర మారోపించి 12 మందిని ఉరిదీసింది. మిగిలినవారికి దీర్ఘకాలపు శిక్షల విధించింది. ఇది జపాను సామ్రాజ్యవాదుల ఫాసిస్టు హింసాకాండకు నాందీప్రస్థావన. ఈ దెబ్బకు తట్టుకోలేక కార్మికోద్యమం కొంత నీరసించిపోయింది.

మొదటి ప్రపంచయుద్ధానంతరం తిరిగి ట్రేడ్ యూనియన్ ఉద్యమం తలయెత్త గలిగింది. ఈకాలంలో పరిశమలు పెరగడంతో కార్మికవర్గంకూడా పెరిగింది (54 లక్షలు). క్రమంగా సమ్మెల సంఖ్య కూడా పెరిగింది.

1917 లో 85, 1920 లో 408, 1923 లో 2000 రైతు తిరుగు బాట్లు జరిగాయి.

1919 లో సోషలిస్టు "కతయామా" (Katayama) కమ్యూని‌స్టు గ్రూపును ఆర్గనైజ్ చేశాడు. 1922 లో కమ్యూనిస్టుపార్టీ స్థాపించ బడింది. ప్రభుత్వం దాన్ని వెంటనే అణచివేసింది.

1927 లో ప్రపంచ పెట్టుబడిదారీ దేశాలతోపాటు, జపాను కూడా ఆర్థిక సంక్షోభంలో చిక్కుకుంది. జపాను షాంటుంగ్ మీద దాడిచేసినందుకు నిరసనగా చైనా, జపాను వస్తువులను బహిష్కరించింది. దీనితో నూటికి 60 వంతుల పారిశ్రామిక సరుకులు ఎగుమతికాక నిలచిపోయాయి.

దేశంలో నిరుద్యోగం, పన్నులభారం హెచ్చింది. అసంతృప్తి చెందిన కార్మికవర్గం ఇంకా పెద్ద సమ్మెపోరాటాలకు పూనుకుంది. అనేక కార్మికవర్గ, రాజకీయ పార్టీలు (సంస్కరణవాద, విప్లవ పార్టీలు అవతరించాయి. చైనావిప్లవోద్యమం యెడల ప్రజలలో అభిమానం హెచ్చింది.

ఈ ప్రజా ఉద్యమ వ్యాప్తినిచూచి ప్రభుత్వం కంపించి పోయి మరొక తీవ్రమైన దాడి ప్రారంభించింది. వేల సంఖ్యలో కార్మికుల్ని, మేధావుల్ని జైళ్ళలో పెట్టింది. "రాజకీయ నేరాలకు మరణదండన" అనే శాసనాన్ని చేసి దానిని అమలు జరిపించి ప్రభుత్వ మనుసరించిన ఫాసిస్టు హింసాకాండ ముందుకాలంలో రాబోయే హిట్లరు పాలనలో మాత్రమే సాగింది. 1932 తర్వాత "మేడే" ఉత్సవాలను కూడా ప్రభుత్వం జరుపనీయలేదు. జపాను కార్మికోద్యమం మరొక గట్టి దెబ్బతిన్నది. ఈ దెబ్బనుంచి కోలుకోడానికి చాలకాలం పట్టింది. ఈ అవకాశాన్ని వినియోగించుకుని పెట్టుబడిదార్లు పనిగంటలను పొడిగించారు. జీతాలు నూటికి 40 పాళ్లు కోశారు. 1933 నుండే ఫాసిస్టు పాలన ప్రారంభమైంది.

ఈ ఆర్థిక సంక్షోభంలోంచి బయటపడడానికి జపాను తిరిగి చైనామీద దురాక్రమణకు పూనుకుంది. 1931 లో మంచురియా మీద దాడిచేసి, తొమ్మిదిరాజ్యాల ఒడంబడికను ఉల్లంఘించింది. బ్రిటిష్‌వారి మద్దతుతోనే జపాను ఈ దురాక్రమణకు పూనుకుంది. 1932 లో షాంగ్‌హై నగరం మీద దాడిచేసింది.

విదేశీయులు నివశిస్తున్న ప్రాంతం వదలి,మిగిలిన ప్రాంతం మీద బాంబులు వేసింది; ఫిరంగులతో కాల్చింది. వేలమంది చైనా ప్రజలను హత్యచేసింది. నిర్వాసితుల్ని చేసింది. జంగ్-కై-షేక్ తటపటాయిస్తూంటే, కమ్యూనిస్టు సేన (నైన్త్ రూట్ ఆర్మీ - ఇది భవిష్యత్‌లో చైనా విముక్తి సైన్యంగా అయింది.) రంగంలోంచి జపాను దాడిని తిరుగగొట్టింది. ఈ సంఘటన ప్రపంచాన్ని ఆశ్చర్యపరచింది. ఇక్కడ లాభంలేదని ఉత్తరప్రాంతంమీద కేంద్రీకరించి 1931 లో మంచూరియాను ఆక్రమించుకుంది.

1933 లో తిరిగి జపాను చైనామీద దాడిచేసింది. నానాజాతి సమితిలోని కొన్ని చిన్నరాజ్యాల వత్తిడివల్ల, సమితి జపాను దురాక్రమణను ఖండించింది. (ఈ రంగంలో సోవియట్‌మీద దాడి చేయగల శక్తిగా ఫాసిస్టు జపాను అభివృద్ధి కావటం ఆంగ్లో - అమెరికన్

సామ్రాజ్యవాదులకు ఇష్టం. అందుచేతే, దురాక్రమణను ఆపటానికి వీరేటువంటి చర్యలూ తీసుకోలేదు) చివరకు జపానే సమితిని బహిష్కరించింది. చంగ్-కై-షేక్ కొమింటాంగ్ ప్రభుత్వం ఈ దురాక్రమణను ఆపలేకపోయింది. జపాను సైన్యాలు చివరకు పెకింగ్ పరిసరాల్లోకి వచ్చాయి. చంగ్-కై-షేక్ జపానుకు లొంగి, సంధి చేసుకున్నాడు. దీనివల్ల ఉత్తర చైనా అంతా జపాను ధారాదత్తమయింది.

ఆసియాలోని తమ వలస దేశాలమీద జపాను కన్ను వేసిందని గమనించిన బ్రిటన్, అమెరికా, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు దాని దృష్టిని సోవియట్, సైబీరియా, చైనాలవైపుకు మళ్ళించ ప్రయత్నించారు. తమ సహాయంతో సోవియట్‌ను జపాను నాశనం చేయగలదనే వీరి విశ్వాసం. జపానే ఓడిపోతే, మరీమంచిది. ఇది వీరి ఎత్తు.

జపాను ఈ సామ్రాజ్యవాదులమధ్య, వీరికి ఫాసిస్టు హిట్లరుకు మధ్య ఉన్న స్వార్థపరత్వాన్ని వినియోగించుకుని తన దురాక్రమణకు అంతరాయం లేకుండా చేసుకుంది. 1937 లో చైనామీద తిరిగి దురాక్రమణకు దిగింది. అమెరికా, బ్రిటన్, డచ్చి సామ్రాజ్య వాదులు విశేషంగా ఆయుధాలను సప్లయిచేసి జపానుకు తోడ్పడ్డారు.

ఈసారి దురాక్రమణ వెనుకటివలె సాగలేదు. చైనా గెరిల్లాల ప్రతిఘటనవల్ల, తాను చైనాను అనుకున్నట్లు ఆక్రమించ వీలులేకపోయింది. దీర్ఘకాల యుద్ధంలో చిక్కుకుంది. సముద్రతీర ప్రాంతాలను ఆక్రమించుకున్నది. 1938 లో ఫుకియన్ తీరాన్ని, కాంటన్ నగరాన్ని ఆక్రమించుకొంది. హంకాంగ్‌కు, ఇండోచైనాకు మధ్య ఉన్న హైనాన్ ద్వీపాన్ని పట్టుకున్నది.

తనమిత్రుడు హిట్లరు సోవియట్‌తో నిరాక్రమణసంధి చేసుకున్నాడని విని సోవియట్‌మీద యుద్ధం ప్రారంభం కానందుకు జపాన్ విచారించింది. 1940 లో హిట్లరు కూటమిలో చేరిపోయింది. హిట్లరు యూరపునుకబళిస్తుంది. జర్మన్ తాను ఆసియా దేశాలను కబళించపూనుకున్నది. 1940 లో ఉత్తర ఇండోచైనాను ఆక్రమించుకొన్నది. 5½ గంటలు యుద్ధంచేసి ఇండోచైనా నంతటినీ 1941 లో వశపరచు

కొంది. (1941 డిశంబరులో మిత్రమండలి జపానుపైన యుద్ధాన్ని ప్రకటించింది.) 1942 లో మలయా, డచ్ తూర్పుఇండియా దీవులు (ఇప్పటి ఇండొనేషియా), ఫిలిప్పైన్సు, బర్మాదేశాలను మెరపు వేగంతో ఆక్రమించుకుంది.

ఇక దేశంలో ఫాసిస్టు పాలనచూద్దాం. 1939 లో ప్రభుత్వం కనిష్టవేతనాలను నిర్ణయించి, కార్మికులు ఇంతకుమించి వేతనాలు కోరరాదన్నది. తరువాత కార్మికులు ఒకచోటినుండి మరొక చోటికి ప్రభుత్వ అనుమతి లేనిదే పోరాదన్నారు. పారిపోవ ప్రయత్నించిన కార్మికుల్ని కాల్చిచంపారు. 1941-42 లో స్త్రీలను, పిల్లలను, యుద్ధ ఖైదీలను ఫ్యాక్టరీలలో పనిచేయించ ప్రారంభించారు. ఇంతకు పూర్వం స్త్రీలు బట్టలమిల్లులు, ఇతర చిన్న పరిశ్రమల్లో మాత్రమే పనిచేస్తుండే వారు. ఇపుడు మొత్తం కార్మికుల్లో స్త్రీలసంఖ్య నూటికి 51 కి, పిల్లల సంఖ్య నూటికి 20-25 కు పెరిగింది. దానికితోడు 1942 మార్చిలో ప్రజలను బలవంతంగా పనిచేయించటం ప్రారంభించింది. దానితో జపాను కార్మికులస్థితి బానిసల స్థితికంటె అన్యాయంగా తయారైంది. (ఇంతకు పూర్వమే బలవంతంగా ప్రజలను సైన్యంలోకి తీసికెళ్ళటానికి అధికారమిచ్చే చట్టాన్ని అమలుజరిపారు) పనిగంటలను 16 కు పెంచారు. నామమాత్రపు రేషన్లతో నిత్యోపవాసాలు చేయవలసి వచ్చింది.

ఈ నికృష్ట పరిస్థితులు కార్మికుల్లో తీవ్ర అసంతృప్తిని కలుగ చేశాయి. ఫాసిస్టు హింసాకాండను ప్రతిఘటిస్తూ అనేక సమ్మె పోరాటాలను కార్మికవర్గం నడిపింది. 1941 ఏప్రిల్ కోచ్ నగరంలో వచ్చిన సమ్మెలో లక్షమంది కార్మికులు పాల్గొన్నారు. వీరు కోరిందల్లా తగినంత రేషన్లు సప్లయి చేయమనే. కార్మికులు ఫ్యాక్టరీలలో బైఠాయించారు. చివరకు వాటిని ధ్వంసం చేయ్యటం (sabotage) మొదలు పెట్టారు. పోలీసులు ఈ సమ్మెను అణచలేక పోయారు. పైగ సమ్మె ఇతర ప్రాంతాలకు ప్రాకే సూచనలు కనిపించాయి. వెంటనే ప్రభుత్వం సైనికుల సహాయంతో సమ్మెను అణచివేసింది.

20 వేలమందిని అరెస్టు చేసింది. చివరకు సమ్మెకు కారకులని ఆరోపించి నలుగుర్ని కాల్చి చంపింది.

సమ్మె పోరాటాలు దీనితో అణగిపోలేదు. యుద్ధాంతంవరకూ జరుగుతూనే ఉన్నాయి.

గ్రామసీమలలో రైతులు పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని సాగించారు. దీన్నణచటంలో ప్రభుత్వం కొంత నిర్బంధ విధానం అమలుపరచినా, యుద్ధంవల్ల వ్యవసాయ సరుకుల ధరలు పెరుగుతాయని చెప్పి వారిని ఉపశమింపచేశారు.

ప్రజలంతా అటుసైన్యంలోకో, ఇటు పరిశ్రమల్లోకో బలవంతంగా కొనిపోబడ్డారు.

యుద్ధంలో చాలమంది చనిపోయారు. ఫ్యాక్టరీలలో నిద్రాహారాలు లేకుండా పనిచేసి కార్మికులు జీవచ్ఛవాలయినారు. ప్రజాజీవితమే విచ్ఛిన్న మయిపోయింది. పిల్లలకు స్కూళ్ళులేవు, ఆడపిల్లలు వ్యభిచార వృత్తిని స్వీకరించవలసి వచ్చింది. కాని ఈ యుద్ధానికి అంతం మాత్రం కనిపించటం లేదు. ఈ నికృష్ట పరిస్థితుల వల్ల ప్రజలలో తీవ్ర అసంతృప్తి రేగింది. ఓరిమి నశించింది. ఆఖరుకి ఫాసిస్టులుకూడా యీ విషయాన్ని గుర్తించారు. కాని ఫాసిస్టు ప్రభుత్వాన్ని కూలద్రోయగలిగిన శక్తిగా కార్మికోద్యమం అభివృద్ధి కాలేదు.

చైనాలోవున్న జపాన్ దేశభక్తులు, యుద్ధ ఖైదీలు "ప్రజా విముక్తి సంఘా"న్ని యేర్పరచి, ఫాసిస్టు దాస్యవిముక్తికి కృషిచేయ ప్రారంభించారు. జపాను విప్లవకారులలో ఒకరయిన "కాజ్", 1922 లో కమ్యూనిస్టుపార్టీ స్థాపకుల్లో ఒకరయిన "ఒకానో" దానిలో పనిచేస్తుండేవారు.

యూరపులో హిట్లరు పతనానంతరం మిత్రమండలి సైన్యాలు పసిఫిక్ రంగంలో జపాన్‌మీద యుద్ధం సాగించాయి. సోవియట్ సైన్యాలు జపాన్ యుద్ధయంత్రాన్ని తుత్తునియలుచేసి మంచూరియా, కొరియానుండి జపాన్‌సేనల నెట్టివేశాయి. యుద్ధారంభంలో అధిక

భాగం సోవియట్ మీద పడింది. చివరకు 1945 లో జపాన్ లొంగి పోయేదశకు వచ్చింది. అమెరికన్ సామ్రాజ్యవాదులు తమ ఆటం బాంబుల శక్తిని ప్రదర్శించి, ప్రపంచాన్ని - ముఖ్యంగా సోవియట్‌ను- భయపెట్టాలని 1945 ఆగస్టులో హిరోషిమా, నాగసాకి నగరాల మీద ఆటంబాంబులను వేసి, సర్వనాశనం చేశారు. జపాను లొంగి పోయింది. మిత్రమండలి తరఫున అమెరికా సైన్యాలు దేశాన్ని ఆక్రమించాయి. తమ ప్రతినిధిగా పరిపాలననుచూస్తూ శాంతిసంధి షరతులను అమలుపరచడానికి ఫాసిస్టు మెకార్థరును నియమించారు. క్రమంగా అధికారమంతా తానే కైవశం చేసుకుని, సోవియట్ వ్యతిరేక సైనిక కేంద్రంగా జపాన్‌ను అభివృద్ధి చేస్తున్నది.

అమెరికా సామ్రాజ్యవాదులు దేశానికి కొత్తరాజ్యాంగాన్ని తయారుచేయించి అమలుజరిపారు. దానివల్ల రాజు నామమాత్రపు అధిపతిగా ఉంటాడు. పెట్టుబడిదారీ, భూస్వాముల ప్రాబల్యంక్రింద వున్న డయట్‌కు (పార్లమెంటుకు) రాజకీయాధికారం సంక్రమిస్తుంది. 1947 మేలో యీ రాజ్యాంగం అమల్లోకి వచ్చింది.

ఇదేవిధంగా భూసంస్కరణచట్టాన్ని అమలుజరిపారు. దానివల్ల ప్రజల కళ్ళనీళ్ళు తుడవటంతప్ప రైతుకు జరిగిన మేలేమీ లేదు.

ఈకాలంలో త్వరితగతిని ప్రజాసంఘాలు అభివృద్ధి కాసాగాయి. అతివాదశక్తులు పుంజుకున్నాయి. కమ్యూనిస్టుపార్టీ 1950 ఎన్నికల్లో మొత్తం పోలయిన ఓట్లలో 9.6% సంపాదించగలిగింది. అతివాదశక్తుల బలం పెరగటం ప్రమాదమని గుర్తించిన ఫాసిస్టు మెకార్థరు వీటిమీద దాడి ప్రారంభించాడు. ఎన్నికలయిన కొద్దిరోజులకే, (1950 జూన్) కమ్యూనిస్టుపార్టీని నిషేధించాడు.

యాల్టా, పోట్సుడం నిర్ణయాలప్రకారం శాంతినికోరే దేశంగా జపాన్‌ను నిర్మించటం ఐక్యరాజ్య కంట్రోలు కమిషన్ ఆశయం. కాని, అమెరికా సామ్రాజ్యవాదులు దాన్ని ధిక్కరించి 1951 లో జపాన్‌తో తానొక్కటే శాంతిసంధి చేసుకుంది. అమెరికా ప్రతి పాదించిన షరతులను జపాన్ యథాతథంగా అంగీకరించింది. వెంటనే

మరొక సైనిక సంధినికూడా చేసుకుంది. దాని తర్వాత మరొక "భద్రతాసంధి"ని, 1952 లో మిత్రత్వ వ్యాపారసంధిని చేసుకుంది. వీటన్నిటితో జపాను ఆర్థికవ్యవస్థమీద అమెరికా పెత్తనం సంపాదించింది; దేశాన్ని సోవియట్ వ్యతిరేక యుద్ధకేంద్రంగా తయారు చేసింది.

దేశంలో యుద్ధ పరిశ్రమలను ప్రోత్సహించింది. అమెరికా ఆర్డర్లకు సరుకులను సప్లయిచేసే ఏజన్సీగా ఈ పరిశ్రమ తయారైంది. కొరియా యుద్ధకాలంలో ఈ పరిశ్రమ మరింత అభివృద్ధయింది. యుద్ధానికిపూర్వం యుద్ధ పరిశ్రమల ఉత్పత్తులు మొత్తం పారిశ్రామికోత్పత్తుల్లో నూటికి 38 పాళ్లుండేవి. 1951 కి 45 పాళ్ళకు పెరిగాయి. ప్రజావసర వస్తువులను ఉత్పత్తిచేసే పరిశ్రమలలో ఉత్పత్తులు తగ్గిపోయాయి. దేశ ఆర్థిక వ్యవస్థకు వెన్నెముకయిన వస్త్ర పరిశ్రమ 1934-36 సంవత్సరాల ఉత్పత్తిలో నూటికి 76.3 పాళ్ళు మాత్రమే 1953 లో ఉత్పత్తి చేసింది. పారిశ్రామిక వ్యవస్థనంతా యుద్ధపట్టాల మీదకు ఎక్కించారు.

జపాన్ పాలకులు పోలీసుదళాల పేరిట మిలిటరీని తయారు చేస్తున్నారు. యుద్ధ నేరస్తులను వదలివేసి, వారి నందరినీ తిరిగి సైన్యంలో ప్రవేశపెడుతున్నారు.

దేశమంతటా వేల ఎకరాలను తీసుకుని యుద్ధ స్థావరాలను నిర్మిస్తున్నారు. ఇవి ఇప్పటికి 800-1000 వరకూ ఉంటాయి.

గుత్తవ్యాపారసంస్థల పోటీకి తట్టుకోలేక మధ్యతరగతి, చిన్న పరిశ్రమలు దివాలాతీస్తున్నాయి. 1954 లో 649 వస్త్ర పారిశ్రామిక సంస్థలు దివాలాతీశాయి. 1953 లో దివాలాతీసిన సంస్థలకు ఇవి రెట్టింపు.

మిలిటరీ బడ్జెట్ క్రమంగా పెరిగిపోతూనే ఉంది. ముఖ్యంగా అమెరికా ఆక్రమణసేనల ఖర్చు పెరిగిపోతూంది. ప్రజలమీద అధిక పన్నులు వేసి, ప్రభుత్వం ధనం కూర్చుతూవుంది (1934-'36 సంవత్సరాల్లో మొత్తం జాతీయాదాయంలో పన్నులద్వారా వచ్చేది నూటికి

13.8 పాళ్ళు; ఇది 1953 లో 21.6 కు పెరిగింది). దేశంలో నోట్ల ముమ్మరం పెరిగిపోయింది. వస్తువుల ధరలు పెరిగిపోయాయి. ప్రజల కొనుగోలుశక్తి నీరసించి పోతూంది. 1934-'36 లో ప్రతి ఒక్కరు సంవత్సరానికి 6 పౌన్ల వస్త్రాలు కొనేవారు. కాని 1952 లో 3. 5 పౌన్లు మాత్రమే కొన్నారు. పారిశ్రామిక సరుకులన్నీ అమ్మక నిల్వ ఉండిపోతున్నాయి.

కొరియాయుద్ధం తర్వాత అమెరికా యుద్ధోత్పత్తులను కొనటం మానేశింది. దానితో ఈ సరుకులు నిలవవుండిపోయాయి. పరిశ్రమల యజమానులు జీతాలను కోతకోశారు. ఉద్యోగులను తగ్గించారు. దేశంలో నిరుద్యోగం అధికమవుతోంది. అనధికార అంచనాల ప్రకారం 1,20,00,000 మంది నిరుద్యోగులు జపాన్‌లో ఉన్నట్లు తెలుస్తున్నది.

దేశంలో అమలుజరుపబడ్డ వ్యవసాయసంస్కరణలు రైతుకు భూమిని సంక్రమింపచేయలేదు. భూస్వాముల దోపిడీకింద రైతాంగం నలిగిపోతున్నది. వ్యవసాయ ఉత్పత్తులు క్రమంగా తగ్గిపోతున్నాయి. ఆహారపదార్థాలను దిగుమతి చేసుకోవలసివస్తున్నది. మొత్తం ఈ దిగుమతుల్లో నూటికి 33 వంతులు ఆహారపదార్థాలే. తమ పాత నిల్వలను ఇక్కడికి ఎగుమతిచేసి, అమెరికా పెట్టుబడిదార్లు విపరీత లాభాలు గడిస్తున్నారు.

జపాను ఆర్థిక వ్యవస్థకు వ్యాపారం ప్రాణం. కాని, అమెరికా ఆక్రమణకింద వ్యాపారం పూర్తిగా దెబ్బతిన్నది. సోవియట్, చైనా లతో వ్యాపారం చేయరాదని అమెరికా పాలకులు కట్టడిచేశారు. దానితో తన పాత మార్కెట్లు పోయాయి. అన్నిసరుకుల్నీ అమెరికా నుండి అధిక ధరలకు దిగుమతి చేసుకోవలసి వస్తున్నది. తన సరుకు లను ఎగుమతిచేయడానికి మార్కెట్లులేవు. అందుచేత వ్యాపారాలలో లోటు క్రమంగా పెరిగిపోయాయి. 1951-'54 సంవత్సరాలలో మొత్తం 326,54,00,000 డాలర్లు లోటు వచ్చింది. ఈ లోటు సంవత్సరానికి 50 కోట్ల డాలర్లుంటాయని లండన్ టైమ్సు అంచనా (1954).

అందుచేత దేశీయ పెట్టుబడిదారుల్లో ఒకవర్గం చైనా, సోవియట్లతో వ్యాపారం చేయనివ్వాలని కోరుతున్నది.

యుద్ధానంతరం అమెరికా సామ్రాజ్యవాదులు జాతీయ ఆర్థిక వ్యవస్థమీద పెత్తనం సంపాదించారు.

1951-'53 సంవత్సరాలమధ్య జపాను వ్యాపారసంస్థల్లో 920 కోట్ల యెన్నుల విలువగలిగిన 11 కోట్ల షేర్లను అమెరికా వ్యాపారస్తులుకొన్నారు. "సహాయం" పేరుతో అమెరికా ఇప్పటికి 200 కోట్లడాలర్లు అప్పు పెట్టింది. ఈ విధంగా జపాను ఆర్థిక వ్యవస్థను తమ చేతిలోకి తీసుకోవటం జపాను పెట్టుబడిదార్లకు కన్నెర్రగానే ఉంది.

జపాను తిరిగి వ్యాపారరంగంలో ప్రవేశించటం అమెరికాకు యిష్టంలేదు. కాని, ప్రస్తుత ఆర్థిక పరిస్థితుల్లో జపాను ఆసియాదేశాలతో వ్యాపారం చేయకపోతే దేశ ఆర్థికవ్యవస్థే తలక్రిందులయ్యే ప్రమాదం ఏర్పడింది. అందుచేత ఆగ్నేయ ఆసియా మార్కెట్లకు వెళ్ళటానికి అమెరికా ప్రోత్సహిస్తున్నది.

జపాను యిపుడు ఆగ్నేయ ఆసియా మార్కెట్లలో బ్రిటన్‌కు పోటీ వచ్చింది. అందుచేత వారికి కన్నెర్రయింది. 1953 నుండి క్రమంగా జపాను మార్కెట్లు విస్తృతం అవుతున్నాయి. ఎగుమతులు కూడ అధికం అవుతున్నాయి.

దేశ ఆర్థికవ్యవస్థమీద అమెరికా పట్టు విడిపించుకోవాలని జపాను గుత్తవ్యాపారస్తులు ప్రయత్నిస్తున్నారు. జపాను వ్యాపారం అభివృద్ధయినకొలదీ అమెరికా దిగుమతులు తగ్గిపోవటం అమెరికా గుత్తవ్యాపారస్తులకు ఆందోళన కలిగిస్తున్నది. రెండుదేశాలమధ్య వైరుధ్యం క్రమంగా పెరుగుతున్నది.

అమెరికా ఆక్రమణకు, జపాను పునరాయుధీకరణకు వ్యతిరేకత పెరిగిపోతున్నది. హైడ్రోజన్‌బాంబు ప్రయోగాలకు వ్యతిరేకంగా ప్రజావుద్యమం పెరుగుతోంది. శాంతికాముకులయిన జపాను ప్రజలు దేశస్వాతంత్ర్యానికి, అమెరికా ఆక్రమణకు వ్యతిరేకంగా ఆందోళన చేస్తున్నారు.

# ఆఫ్ గనిస్తాన్

ఆఫ్గనిస్తాన్‌కు ఉత్తరాన సోవియట్ యూనియన్, తూర్పు దక్షిణదిశల్లో కాశ్మీర్, పశ్చిమపాకిస్తానులు, పడమట ఇరాన్ దేశం సరిహద్దులుగా ఉన్నాయి. దేశవైశాల్యం 2,50,000 చదరపుమైళ్ళు. జనాభా సుమారు 1,20,00,000.

దేశం సముద్రమట్టానికి చాలా ఎత్తున ఉండటంవల్ల సంవత్సరం పొడుగునా చలి అధికం. దేశమంతా పర్వతమయం. వర్షపాతం చాల తక్కువ. వ్యవసాయం నదీలోయల్లో మాత్రమే జరుగుతున్నది. ముఖ్యపంట గోధుమ, వివిధరకాల పండ్లు.

గొర్రెల పెంపకం ప్రజల ముఖ్యవృత్తి. వీటినుండి తీసిన ఉన్ని పెద్ద ఎత్తున ఎగుమతి చేయబడుతున్నది.

దేశంలో ముడి ఇనుము, రాక్షసిబొగ్గు, రాగి, సీసము, నూనె, వున్నాయని శాస్త్రజ్ఞుల అంచనా. కాని, ఏ ఒక్క ఖనిజమూ తవ్వ బడటంలేదు. ప్రస్తుతం అమెరికా పెట్టుబడిదార్ల కంపెనీలు పరిశోధ నలుచేసి, ఖనిజాలను తవ్వకానికి ప్రయత్నించారు. పారిశ్రామికంగా దేశం చాల వెనుకబడిఉంది.

దేశంలో రైలు మార్గాలులేవు. ఎగుమతులలో నూటికి 80 వంతులు పాకిస్తానుగుండా బయటికెళ్తాయి. క్రమంగా, ఆఫ్గన్ ప్రభుత్వాన్ని కొన్ని సందర్భాల్లో లొంగదీయటానికి బ్రిటన్ పాకిస్తానుచే ఈ దారినికాస్తా మూసివేయిస్తూ ఉంటుంది. 1949 వ సంవత్సరంలో ఒకసారి, 1955 లో మరొకసారి పాకిస్తాను - ఆఫ్గను తగాదా సందర్భంలో ఒకసారి అలాగేచేసింది.

దేశ ఎగుమతుల్లో ముఖ్యమైనవి గోధుమలు, పండ్లు, ఉన్ని, కంబళ్లు. ముఖ్య దిగుమతులు నూలు వస్త్రాలు, వివిధ లోహాలు, ఆయుధ సామగ్రి (బ్రిటను సప్లయి చేస్తుంది).

ఎగుమతి, దిగుమతి వ్యాపారం, బ్రిటన్, అమెరికా, ఇరాన్, భారత దేశాలతో జరుగుతున్నది. యుద్ధానికిపూర్వం విదేశీ వ్యాపారంలో ఎక్కువభాగం బ్రిటన్‌తో జరుగుతూఉండేది. కాని రెండవ ప్రపంచ యుద్ధానంతరం అమెరికా ప్రథమ స్థానాన్ని ఆక్రమించ సాగింది.

దీని రాజధానీనగరం కాబూలు.

దేశం "జహీర్ షా" రాజుచేత పరిపాలించబడుతోంది. మొట్ట మొదటిసారి 1937-38 వ సంవత్సరంలో రాజు కేంద్ర అధిపతిగా పార్లమెంటరీ ప్రభుత్వం ఏర్పాటు చేయబడింది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం వరకూ రాజు బ్రిటన్ చెప్పుచేతల్లో ఉండేవాడు. బ్రిటన్ దేశ ఆర్థిక, మిలిటరీ వ్యవహారాలలో విశేషప్రాబల్యం కలిగి ఉండేది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం అమెరికా సామ్రాజ్యవాదం "ఆర్థిక, సాంకేతికసహాయం" పేరుతో దేశంలో ప్రవేశించి, బ్రిటనును క్రమంగా ప్రక్కకు నెట్టి తాను ప్రభుత్వంమీద, దేశ ఆర్థిక సంపద మీద పలుకుబడి సంపాదించి సోవియట్ సరిహద్దుల్లో యుద్ధస్థావరాలను నిర్మించడానికి ప్రయత్నిస్తూ వచ్చింది. నెమ్మదిగా బ్రిటను పలుకుబడికి స్వస్తిచెప్పి తానే ఆ స్థాన మాక్రమించాలని ప్రయత్నించింది.

పాకిస్తానులోని పఠాను ప్రజలు తాము నివసించే ప్రాంతం స్వతంత్ర దేశంగా నిర్మించాలని కోరుతున్నారు. పాకిస్తాను ప్రభుత్వం యీ స్వాతంత్రోద్యమాన్ని క్రమంగా అణచుతూవుంది. తమ జాతి ప్రజల కోరికలయెడల ఆఫ్గనిస్తాన్ సానుభూతిచూపడం పాకిస్తానుకు గిట్టలేదు.

ఆఫ్గనిస్తాను యెగుమతులు, దిగుమతులు అన్నీ పాకిస్తాను గుండానే రవాణా కావలసి ఉంది. జాతీయ జీవనానికి ముఖ్యమైన యీ రవాణా సౌకర్యాల్ని రద్దుచేస్తూ, రెండు దేశాల మధ్యనున్న సరిహద్దులను 1955 మేలో పాకిస్తాను మూసివేసింది. దీనితో ఆఫ్గన్ వ్యాపారం పూర్తిగా స్థంభించిపోయింది.

ఈ సరిహద్దుల మూతకు మరొక కారణంకూడా ఉంది. బాగ్దాద్ మిలిటరీ కూటమిలో ఆఫ్గనిస్తాను చేర నిరాకరించింది. ఎలాగయినా దాన్ని లొంగదీయాలని సామ్రాజ్యవాదుల ప్రోత్సాహంతో పాకిస్తాను యీ చర్యకు దిగింది.

ఆఫ్గనిస్తాను యీ బెదరింపులకు, ఒత్తిడికి లొంగలేదు. వెంటనే జూన్ 28 న సోవియట్‌తో ఒప్పందం చేసుకుంది. దీనివల్ల దేశ ఎగుమతుల, దిగుమతుల రవాణా సోవియట్ దేశంగుండా సాగింది.

సమరసభావంతో తగాదాను పరిష్కారం చేసుకుందామని ఆఫ్గనిస్తాను పాకిస్తానుకు అనేకసార్లు సూచించింది. పాకిస్తాను యిందుకు అంగీకరించకపోగా, మరింత శత్రుత్వవైఖరి నవలంబించసాగింది.

ఈ పరిస్థితులలో ఏ పద్ధతి నవలంబించాలో నిర్ణయించడానికి రాజు అసెంబ్లీని సమావేశపరిచాడు.

పాకిస్తానులోని పఠానుల జాతీయవాంఛను (స్వతంత్ర పఠాను రాజ్యం) బలపరచాలనీ, పాకిస్తాను బాగ్దాద్‌యుద్ధకూటమిలో చేరి, ఆఫ్గనిస్తాను దేశరక్షణకు ప్రమాదకారిగా తయారైంది కనుక దేశ రక్షణలను పదిలపరచుకోడానికి శ్రద్ధతీసుకోవాలని నిర్ణయించింది.

బాండుంగులో జరిగిన ఆసియా-ఆఫ్రికా దేశాల సమావేశంలో ఆఫ్గనిస్తాన్ పాల్గొన్నది. ఆ సమావేశ నిర్ణయాలను తు. చ. తప్పక అమలుపరుస్తున్నది. పంచశీలాల నంగీకరించింది.

1955 వ సంవత్సరాంతంలో సోవియట్ నాయకుల్ని - బుల్గానిన్, కృశ్చేవ్‌లను తమ దేశానికి ఆహ్వానించింది. ఈ సందర్భంలో 1931 లో రెండు దేశాలు చేసుకున్న నిరాక్రమణ మిత్రత్వసంధిని మరి

కొంత కాలంవరకూ పొడిగించుతూ ఒడంబడిక చేసుకున్నారు (ఈ సంధి 1921 లోనే రెండు దేశాలమధ్య జరిగింది. తర్వాత 1931 లో దీని జీవితం మరికొంతకాలం పొడిగించబడింది).

సోవియట్ యూనియన్, దేశ పారిశ్రామికాభివృద్ధికి విశేషంగా సాయపడుతున్నది. పరిశ్రమలకు సంబంధించిన యంత్ర సామగ్రిని విరివిగా సప్లయి చేస్తున్నది.

జాతీయ ఆర్థికాభివృద్ధికి పదికోట్ల డాలర్ల ఆర్థిక సహాయం ఇవ్వడానికి సోవియట్ అంగీకరించింది. దీర్ఘకాల వాయిదాలమీద ఆఫ్గనిస్తాన్ తిరిగి చెల్లించవచ్చు.

ఈ విధంగా ఆఫ్గనిస్తాన్ సామ్రాజ్యవాదుల ఒత్తిడికి లొంగకుండా, బాగ్దాద్ మిలిటరీ కూటమిలో చేరకుండా ఉంది. తోటి సోవియట్‌తో స్నేహాన్ని పెంపొందించుకుంటున్నది.

## ఇరాన్ (పర్షియా)

ఇరాన్ అనగానే పెట్రోలు గుర్తువస్తుంది. మధ్య ప్రాచ్యంలో పెట్రోలు విరివిగా లభించే దేశాల్లో ఇరాన్ ఒకటి. ఈ దేశాన్ని "పర్షియా" అనికూడా పిలుస్తారు.

ఉత్తరాన సోవియట్ యూనియన్, దక్షిణాన పర్షియా, ఓమెన్ సింధు శాఖలు, తూర్పున సోవియట్ యూనియన్, పాకిస్తాన్ దేశాలు, పడమర ఇరాక్ దేశం సరిహద్దులుగా ఉన్నాయి.

దేశ వైశాల్యం 6,28,000 చదరపు మైళ్ళు. జనాభా 1,97,98,000 (1952).

దేశ భూభాగమంతా పర్వత ప్రాంతం. తూర్పు, మధ్య, ప్రాంతాలు ఎడారి భూములు. ఉత్తర, ఆగ్నేయదిక్కుల ప్రాంత భూములు మాత్రం చాల సారవంతమైనవి. ఇక్కడ పండ్లతోటలు

పెంచబడుతున్నాయి. గోధుమ, వరి, పత్తి, పొగాకు పండించబడు తున్నది (నీటి పారుదల సాయంతో).

వాతావరణం దేశమంతా ఒకేరకంగా ఉండదు. పర్షియా సింధుశాఖ తీరంలో అత్యుష్ణ పరిస్థితి, ఉత్తరభాగంలో అతిశీతల పరిస్థితి ఉంటుంది. నీటివసరులున్న ప్రదేశాల్లో జనసమ్మర్దం అధికం.

వ్యవసాయం, పశువుల పెంపకం ప్రజల ముఖ్యవృత్తి.

వ్యవసాయరంగంలో భూస్వాముల దోపిడీ విపరీతం. రైతుల్లో నూటికి 60 మందికి స్వంతభూములే లేవు. నూటికి 32 మందికి మాత్రం సగటున 3 హెక్టార్లు ($7\frac{1}{2}$ యకరాలు) భూమి ఉంది. సాగవుతున్న భూమిలో నూటికి 56 వంతులు భూస్వాముల చేతుల్లోనే ఉంది.

ఇక్కడి భూస్వాముల్ని మీకెంత భూవసతి ఉందయ్యా అంటే, "400 ఎకరాలు, 500 ఎకరాలు" అనిగాదు చెప్పేది; 70 గ్రామాలు, 80 గ్రామాలు అని చెప్తారు. "జోల్ఫగ్రిస్" అనే భూస్వామ్య కుటుంబంక్రింద కొన్ని వందల గ్రామాలున్నాయి. వీరిది ఒక చిన్న ప్రభుత్వం అని చెప్పవచ్చు. వీరి ఎస్టేటులో స్వంత పోలీసు సిబ్బంది, జడ్జీలు, జైళ్ళు అన్నీ వుంటాయి. రైతులపై వీరి జబర్దస్తీ వర్ణించ తరంగానిది! ఒక భూస్వామి బావిలో వందలకొలది మనిషి పుర్రెలు బైటబడ్డాయట. దీన్నిబట్టి, అక్కడ భూస్వామ్య దోపిడీ ఎంత క్రూరంగా ఉందో అర్థం చేసుకోవచ్చు.

దేశ వైశాల్యంలో దాదాపు 12 వ వంతు భూమి సాగులో ఉంది. గోధుమ, బార్లీ, బియ్యం ముఖ్య వ్యవసాయ పంటలు.

కాస్పియన్ సముద్రతీర ప్రాంతంలో సిల్కు విరివిగా ఉత్పత్తి చేయబడుతుంది. ప్రపంచ సిల్కు ఉత్పత్తిలో ఇరాన్‌ది 12 వ స్థానం.

దేశంలో దొరికే ఖనిజాల్లో ముఖ్యమైనది నూనె (పెట్రోలు). ఇనుము, రాక్షసిబొగ్గు దొరికే అవకాశాలున్నాయి. కాని, ఈ ఖనిజాలు ఇంకా తవ్వబడటంలేదు.

దేశానికి నైరుతి దిక్కున 25 చదరపుమైళ్ల ప్రదేశంలో నూనె బావులున్నాయి. ఇచ్చట తీయబడిన పెట్రోలు గొట్టాల ద్వారా,

145 మైళ్ళ దూరంలో ఉన్న అబదాన్ నూనెశుద్ధి కర్మాగారానికి (ప్రపంచంలోకెల్ల పెద్దది) పంపబడుతుంది. ప్రపంచనూనె ఉత్పత్తిలో ఇరాన్‌ది నాల్గవ స్థానం.

దేశం పారిశ్రామికంగా చాల వెనుకబడివుంది. నూనె పరిశ్రమ తప్ప చెప్పుకోదగిన పరిశ్రమలేవీ లేవు. ఈ ఒక్క పరిశ్రమకూడా అమెరికా - బ్రిటిష్ గుత్తవ్యాపారస్తుల చేతుల్లో ఉంది.

పెట్రోలు, కంబళ్లు, ఉన్ని, సిల్కు, బియ్యం, ఎండబెట్టబడిన పండ్లు ముఖ్య ఎగుమతులు. ప్రత్తి, వస్త్రాలు, పంచదార, తేయాకు, వివిధయంత్రాలు, యంత్రభాగాలు ముఖ్య దిగుమతులు. కంబళ్ళు, సిల్కు, ఉన్ని, పెట్రోలు - వీటిని మనదేశం (ఇరాన్ నుండి) దిగుమతి చేసుకుంటున్నది. రాజధానీనగరం టెహరాన్. టాబ్రిజ్ ముఖ్య వ్యాపార కేంద్రం.

♦ ♦ ♦

ప్రపంచంలో పెట్రోలు ఉత్పత్తిచేసే దేశాలలో ఇరాన్ నాల్గవస్థాన మాక్రమిస్తుందని పైన చూశాం. 50 సంవత్సరాలుగా ఆంగ్లో - ఇరానియన్ ఆయిల్ కంపెనీ పేరుతో బ్రిటిష్ గుత్తవ్యాపారస్తులు పెట్రోలు ఉత్పత్తినంతా తమ గుప్పిటలో పెట్టుకుని కోట్ల నార్జిస్తూవచ్చారు.

వివిధ సామ్రాజ్యవాదుల క్రిందవున్న వలసదేశాల్లోని సహజ సంపదలో పాలుపంచుకొనేందుకు రెండవ ప్రపంచయుద్ధకాలంనుండి అమెరికా సామ్రాజ్యవాదులు ఎలా తయారయ్యారో వెనుక అధ్యాయాల్లో చూచాము. అలాగే, ఇరాన్ నూనె ఉత్పత్తిపై తమ పెత్తనం చలాయించటానికి అమెరికా బ్రిటన్‌కు పోటీగా తయారైంది. అనేక సహాయాల పేరుతో ఇరాన్ ప్రభుత్వానికి ఆశలుచూపుతూ, తమ "నిపుణుల"ను ప్రభుత్వయంత్రంలో ప్రవేశపెట్టటం ప్రారంభించింది. 1943 లో ఆర్థికశాఖ నిర్వహణాధికారిగా ప్రవేశించిన నిపుణు డొకడు పనిగట్టుకుని, దేశ ఆర్థికవ్యవస్థనే ఛిన్నాభిన్నం చేశాడు; దేశ రాజకీయ

వ్యవహారాల్లో జోక్యం కల్పించుకోవటం ప్రారంభించాడు. పాలక వర్గంలోనివారే అనేకులు యీ చర్యలను వ్యతిరేకించటంవల్ల, 1945 లో యీ నిపుణుణ్ణి ఇరాన్ ప్రభుత్వం తొలగించవలసివచ్చింది.

1946 లో మజ్లీసుకు (పార్లమెంటుకు) ఎన్నికలు జరిగాయి. ప్రభుత్వం ప్రజాస్వామిక పార్టీలపైన తీవ్ర నిర్బంధవిధానం ప్రయోగించింది. ఈ ఎన్నికలలో తమ అనుకూలురు యెన్నికయ్యేట్లు చూచుకోటానికి బ్రిటిష్, అమెరికా సామ్రాజ్యవాదులు పోటీపడి పని చేశారు. అమెరికా అనుకూలురే మెజారిటీ సంపాదించారు. అందుచేతనే, పాత మంత్రివర్గం సోవియట్ యూనియన్‌తో నూనె ఉత్పత్తి విషయంలో చేసుకున్న ఒడంబడికను యెన్నికల తర్వాత వచ్చిన మంత్రివర్గం రద్దుచేసింది.

క్రమంగా అమెరికన్ సామ్రాజ్యవాదుల ప్రాబల్యం అధికం కావటం ప్రారంభించింది. 1949 కల్లా అమెరికా నిపుణులచేతనే అన్ని ప్రభుత్వ శాఖలు నడుపబడుతున్నాయి. అమెరికా సామ్రాజ్యవాదులు, తమ సరుకులను దేశంలోకి విపరీతంగా దిగుమతిచేయటం వల్ల, ఆ పోటీకి తట్టుకోలేక దేశీయ పరిశ్రమలు మూతబడ్డాయి. దేశ ఆర్థికవిధానం పెద్ద సంక్షోభంలో మునిగిపోయింది.

దేశీయ నూనె పరిశ్రమను హస్తగతంచేసుకుని, దేశాన్ని కొల్లగొట్టటమేకాక, దేశ రాజకీయాలలో జోక్యం కల్పించుకుని, దేశీయ ఆర్థికవిధానాన్ని సంక్షోభంలో ముంచిన సామ్రాజ్యవాదులను వెంటనే దేశంనుండి వెళ్ళగొట్టాలని, నూనె పరిశ్రమను ప్రభుత్వం వశపరచుకోవాలని ప్రజలు, జాతీయ బూర్జువావర్గమూ ఆందోళన ప్రారంభించారు. ఈ ఉద్యమం క్రమంగా తీవ్రతరమయింది.

ఈ ఉద్యమానికి వెన్నెముక "టుడేపార్టీ" (కమ్యూనిస్టుపార్టీ) ప్రజలలో విశేషపలుకుబడి ఉన్న ప్రజాపార్టీ – మహత్తరమయిన సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తి. ఈ ఉద్యమంవల్ల తమ ఉనికికి ప్రమాదం తప్పదని తెలుసుకున్న సామ్రాజ్యవాదులు, దానికి

నాయకత్వం వహించి నడుపుతున్న ప్రజాస్వామికపార్టీలను, ముఖ్యంగా టుడేపార్టీని, ఇతర ప్రజాసంఘాలను అణచటానికి కుట్రపన్నారు.

1949 లో "షా" ను (రాజును) చంపటానికి కుట్ర జరిగినట్లు ఒక అబద్ధం సృష్టించి దాన్ని లోకానికి చూపి, ప్రజాస్వామిక శక్తులపై దాడి ప్రారంభించారు. టుడేపార్టీని (కమ్యూనిస్టుపార్టీని), మరికొన్ని ప్రజాస్వామిక సంస్థలను నిషేధించారు. వీటి నాయకులను, కార్యకర్తల ననేకవందలమందిని జైళ్ళలో పెట్టారు. ఈ విధంగా స్వాతంత్ర్యకాముకులయిన ఇరాన్ ప్రజల నోరు కట్టడానికి, టుడేపార్టీని అణచడానికి వీరు ప్రయత్నించారు.

అప్పటికి ప్రభుత్వ యంత్రాన్ని నడుపుతున్నది ముసాదిక్ మంత్రివర్గం. ఇది జాతీయ బూర్జువావర్గ ప్రతినిధి. వివిధ ప్రజాస్వామిక పక్షాలతోపాటు, జాతీయ బూర్జువావర్గంకూడా, నూనె పరిశ్రమను జాతీయం చేయాలని కోరుతోంది. ముసాదిక్ మంత్రివర్గం స్వతహా కమ్యూనిస్టు వ్యతిరేకే. కాని తన వర్గప్రయోజనానికి సామ్రాజ్యవాదులతో రాజీబేరాలుసాగించటానికి అవసరమయినపుడు మాత్రం టుడేపార్టీని, తదితర ప్రజా ఉద్యమాల బలాన్ని ఉపయోగించుకొనేది.

"నూనె పరిశ్రమను జాతీయంచేయాలి" అనే జాతీయవాంఛ వెనుక ఉన్న యీ ప్రజా వుద్యమ అండచూచుకుని, (బ్రిటిష్ గుత్త వ్యాపారస్తులతో రాజీబేరాలన్నీ విఫలమైన తర్వాత) 1951 వ సంవత్సరం ఏప్రిల్ నెలలో నూనె పరిశ్రమపై బ్రిటిష్ గుత్తవ్యాపారస్తుల అధికారాన్ని తక్షణం రద్దుచేస్తూ, నూనె పరిశ్రమను జాతీయం చేసింది. కాంట్రాక్టుకాలం పూర్తికాకమునుపే, ఇరాన్ ప్రభుత్వం తీసుకున్న యీ చర్యను నిరసిస్తూ అబదాన్ నూనెశుద్ధి కర్మాగారంలో పనిచేస్తున్న తమ టెక్నీషియన్లను ఉపసంహరించి, నూనె పరిశ్రమను మూతపడేట్లు చేశారు. ఇరాన్‌కు నూనె పరిశ్రమను నడపగలిగిన నిపుణులు లేరుగనుక కాళ్ళబేరానికి వస్తారని వీరి ధీమా.

ఈ విషమపరిస్థితుల నవకాశంగా తీసుకుని, అమెరికా సామ్రాజ్యవాదులు డాలర్లు, నిపుణుల నిస్తామని ముసాదిక్ ప్రభుత్వంతో రాజీ బేరాలు సాగించారు. ఇటు బ్రిటిష్ సామ్రాజ్యవాదులూ, తమకు రాజీ చేయమని చెప్పి వీరినే ఆశ్రయించారు. దీనితో, అమెరికా సామ్రాజ్యవాదులకు 'ఆడబోయిన తీర్థమే యెదురైంది!'

ఇద్దరూ చేరి, "షా" తో ముసాదిక్ మంత్రివర్గాన్ని రద్దు చేయించి (1952 జూలైలో) అమెరికా అనుకూలుడయిన ఘవాను ప్రధాన మంత్రిగా మంత్రివర్గాన్ని పునర్నిర్మింప చేశారు. ఈ మంత్రివర్గం అధికారానికి రావటంతోనే, ముసాదిక్ ప్రభుత్వం చేసిన నిర్ణయాన్ని ఉపసంహరించింది.

కొత్త మంత్రివర్గం తీసుకున్న యీ చర్య, స్వాతంత్ర్యకాముకులయిన ఇరాన్ ప్రజల్ని కోపోద్రిక్తులను చేసింది. 1952 జులై 21 వ తేదీన దేశవ్యాపిత సమ్మె జరిగింది. ప్రజలంతా వీధుల్లో ప్రదర్శనలు చేశారు. పార్టీని నిషేధించినా టుడేపార్టీ పలుకుబడి ప్రజలలో చావలేదని రుజువయింది.

సామ్రాజ్యవాద నిపుణుల సలహాతో పనిచేస్తున్న పోలీసు, సైనిక పటాలాలు ఈ ప్రజా వెల్లువను అణచలేకపోయాయి. దీనితో ఘవాను మంత్రివర్గం రాజీనామా చేయక తప్పలేదు. తిరిగి ముసాదిక్ కే ప్రభుత్వాన్ని "షా" అప్పగించాడు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఒక మెట్టుదిగి, కనీసం నష్టపరిహారమయినా ఇమ్మన్నారు. ఇందుకు ముసాదిక్ ప్రభుత్వం అంగీకరించలేదు. అమెరికా ఆర్థికసహాయాన్ని అంగీకరించి, వారికి నూనె అమ్మటానికి ముసాదిక్ ఒప్పుకున్నాడు. కాని, బ్రిటన్‌కు నష్టపరిహారం చెల్లించకపోతే తాము సహాయం చేయమని అమెరికా సామ్రాజ్యవాదులు ముసాదిక్‌ను బెదరించారు. ఏవిధంగా బెదరించినా ముసాదిక్ తన పట్టువిడవకపోవటంచేత, వీరిని పదవినుండి తొలగించటానికి మరొక కుట్ర లేవదీయించారు. ఇదే 1953 ఆగస్టు 15 వ తేదీన జనరల్

జహేదీ నాయకత్వాన జరిగిన సైనిక తిరుగుబాటు. తానే ప్రభుత్వాన్ని హస్తగతం చేసుకుని ముసాదిక్‌ను, ఈయనను బలపరచిన ఫతేమీ వంటి మంత్రులను, సైనికాధికారులను, వీరితోపాటు వివిధ ప్రజాసంస్థల నాయకులను జైళ్ళలో పెట్టించాడు. కమ్యూనిస్టుపార్టీ నాయకుల్ని, కార్యకర్తలనేకుల్ని ఉరితీయించాడు. టుడేపార్టీని హతమార్చాలని కక్షకట్టాడు. వివిధ ప్రజాసంస్థలపై తీవ్ర నిర్బంధవిధానం అమలు పరచాడు. పౌరసత్వ హక్కులను హరించి, ఫాసిస్టుపాలన నెలకొల్పాడు.

జహేదీ ప్రభుత్వం ఆంగ్లో - అమెరికన్ పెట్టుబడిదార్లు చెప్పినట్లు విని, 1954 సెప్టెంబరులో ఒక ఒడంబడిక చేసుకుంది. దీనిప్రకారం, "ఇంటర్‌నేషనల్ ఆయిలు కన్సార్టియం" అనే వ్యాపార సంస్థకు 25 సంవత్సరాలపాటు, ఇరాన్ నూనె పరిశ్రమను నడపడానికి అధికారం ఇవ్వబడింది; ఈ సంస్థ కోరేట్లయితే, మరి 15 సంవత్సరాలకాలం వరకూ ఈ కాల పరిమితిని పొడిగించాలి.

ఈ సంస్థలో అధికవాటాలు తమకు కావాలంటే, తమకు కావాలని ఆంగ్లో-అమెరికన్ పెట్టుబడిదార్లు కొంతకాలం పోట్లాడుకొని, చివరకు ఇద్దరూ సమాన వాటాలు తీసుకొనేందుకు ఒప్పుకున్నారు. దాని ప్రకారం 5 అమెరికా ఆయిలు కంపెనీలకు కలిపి, నూటికి 40 వంతుల వాటాలు, బ్రిటిష్ పెట్రోలియం కంపెనీకి (ఆంగ్లో - ఇరానియన్ ఆయిల్ కంపెనీగా 1954 డిశంబరు వరకూ చలామణీ అవుతూండేది) నూటికి 40 వంతుల వాటాలు వచ్చాయి. మరి రెండు డచ్చి కంపెనీలకు మిగిలిన 20 వంతులు వాటాలు ఇవ్వబడ్డాయి. వ్యాపార సూత్రాలరీత్యా అమెరికా - ఇంగ్లీషు పెట్టుబడిదారులకు సమాన వాటాలే ఉన్నా, కంపెనీమీద అధికారాన్ని చలాయించటానికి, బ్రిటిష్ పెట్టుబడిదారులను తన యిష్టం వచ్చినపుడు పరిశ్రమ నుండి తప్పించడానికి కావలసినశక్తి అమెరికా పెట్టుబడిదార్లకున్నది.

ఈ ఒడంబడిక, నూనె పరిశ్రమ జాతీయం చేయబడటాన్ని సూత్రప్రాయంగా అంగీకరించినా, ఆచరణలో, "అంతర్జాతీయ

వ్యాపార సంస్థ" అనే ముసుగులో ఉన్న అమెరికా, బ్రిటిష్ పెట్టుబడి దార్ల చేతుల్లో నూనె పరిశ్రమను పెట్టింది.

పర్షియా సింధుశాఖ నానుకొన్న ప్రాంతం (నూనెబావులు, నూనె సరఫరా గొట్టాలు, నూనె ఎగుమతి చేయబడే రేవులు ఇత్యాదివి ఉన్న ప్రాంతం) ఈ కంపెనీక్రింద ఉంటుంది. దీనిమీద సర్వాధి కారాలు కంపెనీవే! ఆదాయ పన్ను, పౌరహక్కుల విషయంలో ఈ కంపెనీ, ఇందులో పనిచేసే విదేశీయులు — వీరు ఇరాన్ రాజ్యాంగ చట్టానికి అతీతులు!

ఇరాన్ నూనె పరిశ్రమను అమెరికా, ఇంగ్లీషు పెట్టుబడిదార్లు తమగుప్పిటలో పెట్టుకోవడమే కాక, కీలక ప్రాంతమయిన పర్షియా సింధుశాఖా ప్రాంతాన్ని తమ వలస ప్రాంతంగా చేసుకోగలిగారు. ఈ ఒడంబడిక జాతీయ స్వాతంత్ర్యానికే ముప్పు తెచ్చింది.

తరువాత ఒక సంవత్సరం గడిచిందో లేదో 1955 అక్టోబరులో ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు సృష్టించిన బాగ్దాద్ కూటమిలో ఇరాన్ చేరింది. ప్రజాస్వామిక పక్షాలమాటను ఖాతరు చెయ్యలేదు.

మిలిటరీ వ్యూహరీత్యా చూస్తే, సోవియట్ యూనియన్‌మీద, కూటమిలోచేరని అరబ్ రాజ్యాలమీద దురాక్రమణకు ఇదొక మెట్టుగా ఉపయోగపడుతుంది. తన సరిహద్దు దేశమయిన ఇరాన్‌తో మిత్రత్వాన్ని పెంపొందించుకోడానికి సోవియట్ ప్రయత్నిస్తూనేఉంది. సౌహార్దసూచకంగా ఇరాన్ రాజును తమ దేశానికి అతిథిగా ఆహ్వా నించింది.

నానాటికి జాతీయ వ్యవహారాలలో, ఆధునిక విషయాలలో అమెరికా సామ్రాజ్యవాదుల జోక్యం అధికమవుతోంది. దేశ సహజ సంపదలపై అమెరికా గుత్తవ్యాపారస్తుల ప్రాబల్యం అధికమవు తున్నది. బడ్జెట్‌లోటు పెరిగిపోతున్నది; ప్రజల జీవితం మరింత నికృష్ట మవుతూంది.

# ఇరాక్

మధ్యప్రాచ్యంలో పెట్రోలు విరివిగా దొరికే దేశాల్లో ఇరాక్ ఒకటి. తూర్పున ఇరాన్, దక్షిణాన సౌదీఅరేబియా, పడమర జోర్డాన్, సిరియా దేశాలు, ఉత్తరాన టర్కీ— ఈ దేశానికి సరిహద్దులు.

దేశవైశాల్యం 1,17,000 చదరపు మైళ్లు. జనాభా 48 లక్షలు (1947). వీరిలో 32 లక్షలమంది అరబ్బీ ముస్లింలు, పదిలక్షలమంది క్రిస్టియన్లు.

టైగ్రిస్, యూఫ్రటిస్ నదులు మధ్యగా ప్రవహిస్తున్నాయి. ఈ నదుల డెల్టాలో మాత్రం నీటి పారుదలవల్ల వ్యవసాయం జరుగుతున్నది. దేశ ఉత్తర ప్రాంతమంతా ఎడారి. వ్యవసాయానికి తగిన ప్రదేశం లేదు. దేశ వైశాల్యంలో నూటికి 8 పాళ్ళ భూభాగంలో మాత్రమే పంటలు పండించబడుతున్నాయి. వ్యవసాయం, పశువుల పెంపకం ప్రజల ముఖ్యవృత్తి.

భూస్వామ్య విధానం రైతు కూలీల మూలుగల పీల్చేస్తున్నది. సాగుకింద భూమి అంతా భూస్వాముల ("షేకులు" అంటారు. వీరి దోపిడి, జబర్దస్తీలను హైదరాబాదు దేశముఖ్‌లు, జాగీర్దారుల దోపిడీకి పోల్చవచ్చు) చేతుల్లో వుంది. దున్నే రైతుకు భూమిలేదు. కౌలు రేటు అత్యధికం. మూడింట రెండు వంతులు కౌలు. మిగిలిన దానిలోంచి, భూస్వామి ఎడ్లు ఇచ్చినందుకు, నీటి పారుదల సదుపాయం కలుగచేసినందుకు, వ్యవసాయ పనిముట్లు యిచ్చినందుకు ఇవ్వాలి. ఇక మిగిలింది సాలుకు "దొరగారి"కి బహుమతులు కొనివ్వడానికి, పాతబాకీలు జమకట్టడానికి కూడా చాలదు. ఈ విధంగా కష్టించిన రైతు రెండుపూటలా తిండికే నోచుకోలేకపోతున్నాడు. ఈ దోపిడీకి తట్టుకోలేక రైతు వ్యవసాయం వదలి, పొట్ట చేతబట్టుకుని పని వెతుక్కుంటూ, బాగ్దాద్‌వంటి పట్నాలకు వలస పోతున్నాడు.

వ్యవసాయ పంటల్లో బార్లి, గోధుమ, ఖర్జూరం, పత్తి, పొగాకు ముఖ్యమైనవి. ప్రపంచ ఖర్జూర వ్యాపారంలో, నూటికి 80 పాళ్లు వ్యాపారాన్ని ఇరాక్ ఒక్కటే చేస్తున్నది.

తగిన నీటి పారుదల అవకాశాలు కలిగించి, అధునాతన పద్ధతులలో వ్యవసాయం చేయటానికి రైతుకు అవకాశం కలిగిస్తే, ఇరాక్ ఇప్పుడు పండించే పంటకు అనేక రెట్లు అధికంగా పండించ గలుగుతుంది. రైతు కూలీల రక్తం తాగనేర్చిన షేక్‌లకు వ్యవసాయాభివృద్ధిమీద శ్రద్ధలేదు. అందుచేత వ్యవసాయం పురాతన పద్ధతిలో జరుగుతోంది.

దేశంలో విరివిగా లభించే ఖనిజం పెట్రోలు ఒక్కటే. దేశంలో ఆగ్నేయ దిశగా వున్న "కిర్‌కుక్" ప్రాంతంలో ఈ ఖనిజం లభిస్తుంది. ఇరాకీ పెట్రోలియం కంపెనీ అనే బ్రిటిష్ గుత్త వ్యాపార సంస్థ ఈ నూనెను తవ్వి తీస్తున్నది. ఇచ్చట తీసిన నూనెను గొట్టాలద్వారా 1200 మైళ్ళ దూరంలో, మధ్యధరా సముద్రతీర రేవు 'ట్రిపోలీ'కి తీసుకొని పోబడి, దీనికి దక్షిణంగా వున్న "హైఫా" రేవు పట్టణంలో వున్న నూనె శుద్ధి కర్మాగారానికి పంపబడుతూంది. కిర్‌కుక్ నూనె బావుల్లో, 1952లో 185 లక్షల టన్నుల పెట్రోలు తీయబడింది (ఇదే సంవత్సరంలో మధ్యప్రాచ్య మంతటిలోను తీయబడిన పెట్రోలు 1040 లక్షల టన్నులు).

రెండవ ప్రపంచ యుద్ధ ప్రారంభం వరకూ, బ్రిటన్ ఒక్కటే ఇరాక్ నూనెను దోచుకపోతూ ఉండేది. కాని, ఈ యుద్ధానంతరం అమెరికా గుత్తవ్యాపారస్తుల పోటీ ఎక్కువయింది. ఇరాక్ పెట్రోలియం కంపెనీలో వీరూ కొంతభాగాన్ని సంపాదించారు.

1952 లో ఇరాక్ పెట్రోలియం కంపెనీకి సుమారు 25 కోట్ల డాలర్ల లాభం వచ్చివుంటుందని అంచనా వేయబడుతూంది. దాదాపు ప్రతి సంవత్సరం ఇంత పెద్ద లాభాల్ని విదేశీ గుత్తవ్యాపారస్తులు తమ దేశాలకు తరలించుకపోతున్నారన్నమాట.

దేశం పారిశ్రామికంగా చాల వెనుకబడివుంది. చిన్న బట్టల మిల్లులు, సబ్బు ఫ్యాక్టరీలు, నూనె మిల్లులు తప్ప వేరే పరిశ్రమలేవీ లేవు. ఖర్జూరం, బార్లీ, గోధుమ, పత్తి, ఉన్ని, గుర్రాలు ముఖ్య ఎగుమతులు. వస్త్రాలు, ఇనుము, ఉక్కు, యంత్రాలు, యంత్ర భాగాలు, టీ, పంచదార, ఇతర ప్రజల నిత్యజీవితావసర వస్తువులు ముఖ్య దిగుమతులు.

బాగ్దాద్, బస్రా ముఖ్య వ్యాపార కేంద్రాలు. బస్రా యూఫ్రటిస్ నదిమీద, పర్షియా సింధుశాఖనుండి 50 మైళ్ళ దూరంలో ఉంది. పెద్ద ఓడలు సరాసరి బస్రావరకు వెళ్ళవచ్చు. చిన్న పడవలు బాగ్దాద్‌వరకూ వెళ్తాయి. ఇది ఇరాన్, అరేబియా, పర్షియా సింధుశాఖకు అందుబాటులో ఉంటంవల్ల ముఖ్యవ్యాపార కేంద్రంగా అభివృద్ధి అయింది.

దేశ ముఖ్యపట్టణం "బాగ్దాద్."

♦ ♦ ♦

ప్రథమ ప్రపంచ యుద్ధకాలంవరకూ ఇరాక్, టర్కీ సామ్రాజ్యంలో ఒకభాగంగా ఉండేది. యుద్ధకాలంలో బ్రిటన్ దేశాన్ని ఆక్రమించుకుంది. ప్రజలు అభ్యంతరం తెలిపితే, యుద్ధానంతరం సంపూర్ణ స్వాతంత్ర్యం యిస్తానని వాగ్దానంచేసిన బ్రిటన్, తన తొత్తు (అమీర్ హుస్సేన్) నొకణ్ణి తెచ్చి, 1920 లో వాడికి పట్టంగట్టింది.

బ్రిటిష్ పరిపాలనకు వ్యతిరేకంగా సాతంత్ర్యోద్యమం త్వరిత గతిని పెరగడం ప్రారంభించింది. దానివల్ల వచ్చే ప్రమాదాన్ని గుర్తెరిగి, బ్రిటన్ స్వాతంత్ర్యప్రదానం చేయబోతున్నట్లు నాటక మాడటం ప్రారంభించింది. ఈ నాటకంలో భాగమే 1922, 1930 సంవత్సరాల్లో ఇరాక్‌తో చేసుకున్న ఒడంబడికలు. ఈ రెండు ఒడంబడికలు దేశ దాస్యశృంఖలాలను దృఢతరం చేసేవేకాని, సడలించేవికావు.

ఉదాహరణకు 1930 ఒడంబడికలోని విషయాలను చూద్దాం:

ఇరాక్ దేశంలోని రైలుమార్గాలు, ఓడరేవులు, జలమార్గాలు, విమానాశ్రయాలు - వీటిని వాడుకొనే హక్కు బ్రిటన్‌కు సంక్రమిస్తుంది. దేశంలో బ్రిటన్ సైన్యాల నుంచుతుంది. ఇరాక్ తనకు కావలసిన ఆయుధసామగ్రి యావత్తు బ్రిటన్‌దగ్గరే కొనాలి. బ్రిటిష్ మిలిటరీ ఆఫీసర్లే ఇరాక్ సైన్యాలకు శిక్షణ నిస్తారు. ఈ ఒడంబడిక 1957 వ సంవత్సరంవరకూ అమల్లో ఉంటుంది.

దేశంలోని నూనె గనులను తన గుప్పిటలో పెట్టుకుని, కోట్లు ఆర్జిస్తూ, ఇరాక్ దేశాన్ని తన వలసదేశంగా అట్టిపెట్టుకుని, దోపిడీ కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా కొనసాగిస్తూ వచ్చింది.

30 సంవత్సరాల విదేశీ సామ్రాజ్యవాదుల దోపిడీ, దీనికి తోడు దేశీయ భూస్వామ్యవర్గం (వీరిని "షేక్‌లు" అంటారు) దోపిడీ - ఈ రెండూ దేశంయొక్క మూలుగలనే పీల్చేశాయి.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఆసియా ఖండంలో ప్రజ్వలించిన విముక్తి ఉద్యమ ప్రభావంతో, ఈ దేశంలోకూడా విదేశీ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జాతీయ విమోచనోద్యమం అభివృద్ధికావటం ప్రారంభించింది. ఈ ఉద్యమంలో కమ్యూనిస్టుపార్టీ అత్యంత ప్రధానశక్తి!

ప్రజలను మరొక్కసారి మోసగించాలనే తలంపుతో, తమ తొత్తులయిన "నూరీ సయ్యద్"ను, అప్పటి ప్రధానమంత్రియైన "జబార్"ను లేబరు ప్రభుత్వం పోర్ట్స్‌మత్‌కు పిలిపించి, ఒక ఒడంబడిక మీద సంతకాలు చేయించింది. ఈ ఒడంబడికకూ 1930 ఒడంబడికకూ అక్షరాల్లో తేడాతప్పితే అర్థాల్లో తేడా లేదు.

దీనితో, ప్రజల కోపాగ్ని మిన్ను ముట్టింది. ఈ కోపాగ్ని జ్వాలలో మాడిపోతామని భయపడ్డ నూరీసయ్యద్ పారిపోయి టర్కీలో తల దాచుకొన్నాడు. "జబార్" అంతులేకుండా పారిపోయాడు. ఈ ప్రజా ఉద్యమ ప్రభావంతో పార్లమెంటుకూడా ఈ ఒడంబడికను అంగీకరించడానికి సాహసించలేదు.

దేశంలో ఉన్న ఈ "విపత్కర పరిస్థితుల్లో" బ్రిటన్ తన్నుక చస్తుంటే, పులిమీద పుట్రలా నూనెగనుల దోపిడీకి అమెరికా గుత్త వ్యాపారస్తులు పోటీవచ్చారు. దోపిడీలో ఇద్దరూ పోటీబడ్డా, సామ్రాజ్యవాద వ్యతిరేకోద్యమాన్ని అణచడానికిమాత్రం ఇద్దరూ కలసికట్టుగా పనిచేశారు. పర్యవసానంగా అనేకమంది జాతీయ విమోచనోద్యమ నాయకులు, కార్యకర్తలు - ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీ నాయకులు - జైళ్ళ పాలయినారు.

అరబ్ జాతుల సఖ్యతను విచ్ఛిన్నంచేసి, మధ్యప్రాచ్యంలో (పశ్చిమ ఆసియా అనికూడా ప్రస్తుతం వ్యవహరించబడుతోంది) తమ అధికారాన్ని అట్టిపెట్టుకోవాలనే తలంపుతో, సామ్రాజ్యవాదులు జాతి విద్వేషాన్ని రెచ్చగొట్టటం ప్రారంభించారు. దీని ఫలితమే పాలస్తీనాలో అరబ్ - యూదుల అంతర్యుద్ధం.

ఈ అంతర్యుద్ధంలో ఇతర అరబ్బురాజ్యాలతోపాటు అరబ్బులకు సహాయంగా ఇరాక్ సైన్యాలను పంపింది. దీనికి ధనాగారంలోని డబ్బు ఖర్చవటంవల్ల, దేశ ఆర్థికవిధానం చిక్కుల్లోబడింది. ఈ విషమపరిస్థితిని అవకాశంగా తీసుకుని, బ్రిటన్ తాను ఆర్థికసాయం చేస్తానని, అందుకు రెండు షరతులుబెట్టింది.

(1) ఉభయ దేశాల సభ్యులతో ఏర్పడే ఒక కమిటీ, (దీనిమీద ప్రభుత్వానికి ఎటువంటి అధికారమూ ఉండదు) దేశ ఆర్థికవిధానాన్ని అజమాయిషీ చేస్తుంది.

(2) 1930 ఒడంబడికను రద్దుచేయాలని ఇరాక్ కోరకూడదు.

డొంకతిరుగుడు పద్ధతిలో, "పోర్ట్సమత్" ఒడంబడికను అంగీకరించమని ఇరాక్‌ను బ్రిటన్ బలవంతంచేసింది. ప్రజలంతా యీ షరతులను నిరసించారు. ఆఖరుకు మంత్రివర్గంలో జాతీయ బూర్జువా క్షేమాన్ని కోరే మంత్రులు ఇద్దరు (ఆర్థికమంత్రి ఆలీ మంతాజ్, దేశరక్షణమంత్రి సాదిక్) బహిరంగంగా యీ షరతులను వ్యతిరేకించారు. పార్లమెంటులో ఉభయ పక్షాలమధ్య ముష్టియుద్ధం జరిగినంత పనైంది.

వెంటనే మంత్రివర్గంనుండి యీ వ్యతిరేకుల నేరి పారవేయవలసిందిగా బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ప్రధాన మంత్రిని ఆజ్ఞాపించారు. దీనితో, బ్రిటన్‌ను వ్యతిరేకించే మంత్రులను తొలగించి, బ్రిటిష్ అనుకూలురతో మంత్రివర్గం 1948 సంవత్సరం అక్టోబరులో పునర్నిర్మించబడింది.

ప్రభుత్వం తీసుకున్న యీ చర్యకు వ్యతిరేకంగా, దేశంలో బ్రహ్మాండమైన ప్రజా ప్రదర్శనాలు జరిగాయి. దేశవ్యాపిత సమ్మె వచ్చింది. "బ్రిటిష్ సామ్రాజ్యవాదులు దేశంవిడిచి వెళ్ళాలి" అనే నినాదంతో దేశం మార్మోగిపోయింది.

సామ్రాజ్యవాదులు యీ ఉద్యమాన్ని క్రూరంగా అణచివేయించారు. తిరిగి నూరీ సయ్యద్‌ను ప్రధాన మంత్రిగా నియమించారు. దేశంలో సైనికశాసనం అమలుపరచబడింది. నూరీ సయ్యద్ అతి క్రూరంగా విమోచనోద్యమాన్ని అణచడానికి పూనుకున్నాడు. "కమ్యూనిస్టు ప్రమాదం" పేరుతో అనేకమంది దేశభక్తులను హత్య చేయించాడు. వేలమందిని జైళ్ళలో వేయించాడు. ఈ ఉద్యమంలో పాల్గొన్న అనేకమంది విద్యార్థులను దేశంనుండి వెళ్ళగొట్టాడు. ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీని సమూలంగా నాశనంచేయాలని ప్రయత్నించాడు. సులేమాన్, షా బీబీ, జకీ, మహమద్ బస్సమ్, యూహుద్ ఇబ్రహీమ్‌లాంటి పార్టీ అగ్రనాయకులను ఉరితీయించాడు. ఈవిధంగా నూరీ సయ్యద్ ఫాసిస్టుపాలనను అమలుపరచి, సామ్రాజ్యవాదుల దోపిడీకి రక్షణకల్పించాడు. ఫాసిస్టు పాలనా రథాన్ని నల్లేరు మీద బండిలా నడపసాగాడు.

మారుతున్న పరిస్థితులనుబట్టి తన అధికార ప్రాబల్యాన్ని కాపాడుకోనేర్చిన సామ్రాజ్యవాదులు, 1930 ఒడంబడికను రద్దుచేస్తూ 1955 ఏప్రిల్‌లో ఇరాక్‌తో మరొక ఒడంబడికను చేసుకున్నారు. మాటల్లో తేడా తప్పితే, 1930 ఒడంబడికకు యిది ఏవిధంగానూ భిన్నంకాదు. ఈ సంధి జరిగినతర్వాతకూడా దేశం యింకా బ్రిటిష్ వారి పలుకుబడిక్రిందనే ఉండిపోతుంది.

ఈ ఒడంబడిక ప్రజాభీష్టానికి వ్యతిరేకమే! నూరీ సయ్యద్ ఫాసిస్టు పాలనలో ప్రజాస్వామికశక్తుల వాణి క్రూరంగా అణచబడు తున్నది కనుకే, 1948 లో జరిగినంతటి నిరసన సమ్మెలు, ప్రదర్శ నాలు జరగలేదు.

ఆరబ్ లీగ్ ఆశయాలను * కాలదన్ని, ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు టర్కీని అడ్డుపెట్టుకుని సృష్టించ ప్రయత్నిస్తున్న మధ్యప్రాచ్య యుద్ధకూటమి (బాగ్దాద్ కూటమి) లో చేరటానికి అంగీకరించింది. 1955 వ సంవత్సరం ఫిబ్రవరి నెలలో టర్కీతో సైనికసంధిచేసుకుంది (దీన్నే నేడు బాగ్దాద్ సంధిగావ్యవహరిస్తున్నారు). తరువాత రెండునెలలకు బ్రిటనుకూడా ఈ ఒడంబడికపై సంతకం చేసింది.

నూరీ సయ్యద్ దేశాన్ని యుద్ధకూటమిలోకి ఈడవటాన్ని ప్రజలు నిరసిస్తున్నారు. పార్లమెంటులోకూడా అనేకమంది సభ్యులు తీవ్రంగా విమర్శిస్తున్నారు.

దీనికి సమాధానంగా నూరీ సయ్యద్, సంధిని వ్యతిరేకించిన వారిని జైళ్ళలో కుక్కుతున్నాడు. వీరిపై తీవ్ర నిర్బంధవిధానం అమలుజరుపుతున్నాడు.

---

* 1945, మార్చి నెలలో ఇరాక్, సిరియా, ట్రాన్సుజోర్డాను, లెబానాన్, సౌదీ అరేబియా, యామెన్ దేశాలను అరబ్ దేశాలు అంటారు. అరబ్బులు నివసించే దేశాలుకనుక వీటిని అరబ్ దేశాలు అంటారు. ఈ దేశాలు 1945 వ సంవత్సరంలో ఒక ఒడంబడిక చేసుకున్నాయి. దీనిప్రకారం, ఏ ఒక్క దేశమూ, అరబ్బు రాజ్యాల స్వాతంత్ర్యానికి, శాంతి భద్రతలకు విరుద్ధంగా ప్రవర్తించకూడదు.

# జోర్డాన్

ఉత్తరాన యర్‌ముక్ నది, సిరియా దేశం, తూర్పున ఇరాక్, దక్షిణాన సౌదీ అరేబియా, పడమర ఇస్రాయెల్, జోర్డాన్‌నది - ఇవి జోర్డానుకు సరిహద్దులు.

1949 లో పాలెస్టైయినును విభజించి, యూదులు నివసించే ఇస్రాయెల్ దేశాన్ని ఏర్పరచినపుడు, అరబ్బులు నివసించే మిగతా ప్రాంతాన్ని 1950 లో జోర్డాన్‌లో కలిపివేశారు. (దీన్ని కలిపిన తర్వాత) దేశవైశాల్యం 34,750 చదరపుమైళ్ళు; జనాభా 12,50,000.

హెడ్‌జాజ్ రైల్వేలైనుకు తూర్పు భాగమంతా ఎడారిప్రాంతం. పడమర ప్రాంతం వ్యవసాయానికి అనువైన ప్రదేశం.

వ్యవసాయం, పశువులపెంపకం ప్రజల ప్రధానవృత్తి. గోధుమ, బార్లీ, మొక్కజొన్న, నువ్వులు ముఖ్య వ్యవసాయపంటలు, కొండ ప్రాంతంలో పండ్లతోటలు పెంచబడుతున్నాయి.

దేశంలో లభించే ఖనిజాలు అత్యల్పం. దేశం పారిశ్రామికంగా అభివృద్ధికాలేదు.

గోధుమ, బార్లీ, ఉన్ని ముఖ్య ఎగుమతులు.

'అమ్మాన్' రాజధానీ నగరం.

జోర్డాన్ బ్రిటిష్ డొమినియన్. 1946 మార్చిలో స్వాతంత్ర్యాన్ని పొందింది. కాని, అది నామమాత్రపు స్వాతంత్ర్యంగా మాత్రమే ఉంటూవచ్చింది.

1948 మార్చిలో 'స్వతంత్ర' జోర్డాన్ బ్రిటన్‌తో ఒక ఒడంబడిక చేసుకుంది. ఈ ఒడంబడిక 20 సంవత్సరాలు అమల్లో ఉండాలి. తర్వాత బ్రిటన్ కోరితే మరి 15 సంవత్సరాలు పొడిగించడానికి జోర్డాన్ అంగీకరించింది. దేశ ఆర్థిక వ్యవస్థమీద, మిలిటరీయంత్రం మీద బ్రిటన్‌కు వున్న పట్టును యిది మరింత గట్టి చేయడమేకాక,

దేశంలో యుద్ధస్థావరాలు నిర్మించుకొనే అధికారంకూడా యీ ఒడం బడిక బ్రిటన్‌కు యిచ్చింది.

ఈ ఒడంబడిక చేసుకున్న రాజు - అబ్దుల్లా - బ్రిటిష్ అను కూలుడు; అమెరికా సామ్రాజ్యవాదులు ఇతన్ని చంపించి, తమ తొత్తయిన ఇతని కుమారుణ్ణి రాజుగా చేశారు. కాని, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఇతనిని తొలగింపచేసి, తమ అనుకూలుడయిన హుస్సేన్‌ను రాజుగాచేసి తమ ప్రాబల్యాన్ని కాపాడుకొన్నారు.

జోర్డాన్ తన చెప్పుచేతల్లో ఉన్నదిగనుక బాగ్దాద్ కూటమిలో చేర్చడం సులభమని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఆశించారు.

1955 నవంబరులో టర్కీ అధ్యక్షుణ్ణి జోర్డానుకు పంపి బేర మాడించారు. జోర్డాను సమ్మతించలేదు. తర్వాత జనరల్ టెంప్లర్ ద్వారా రాయబారాలు సాగించారు. ఈ సంప్రదింపుల్లో యీయన చతురోపాయాలూ ప్రయోగించాడు. కాని, అవేవీ చెల్లలేదు. చివరకు అప్పుడు పదవిలోవున్న సయ్యద్ ఆల్‌మఫ్రీ మంత్రివర్గాన్ని బలవంతంగా రాజీనామా నిప్పించారు (1955, డిశంబరు 14). ఈ మంత్రివర్గంలో సభ్యుడు, సామ్రాజ్యవాదుల తొత్తు అయిన సయ్యద్ ఎల్ మజాలీ ప్రధానిగా తిరిగి కొత్త మంత్రివర్గాన్ని నిర్మింప చేశారు. ఈయన మంత్రివర్గం జోర్డాను బాగ్దాద్ కూటమిలో చేరడానికి అనుకూలమని ప్రజలకు స్పష్టమయిపోయింది. అందుకు నిరసనగా డిసెంబరు 16 వ తేదీన అమ్మాన్ నగరంలో ప్రజలు బ్రహ్మాండమైన ప్రదర్శనాలు జరిపారు. అనేకమంది పార్ల మెంటు సభ్యులు, మేధావులుకూడా యీ ప్రదర్శనాలలో పాల్గొ న్నారు. "మజాలీ మంత్రివర్గం రాజీనామా నివ్వాల"నే నినాదంతో దేశం మారుమోగిపోయింది.

మజాలీ మంత్రివర్గం సైన్యాలనుపంపి, ప్రజలమీద మరతుపా కులు కాల్పించాడు. విచక్షతలేకుండా అరెస్టులు జరిగాయి.

అయినా ప్రజాశక్తిని ప్రభుత్వం తుపాకులతో అణచలేక పోయింది. డిసెంబరు 17 న మరింత పెద్దయెత్తున ప్రజాశక్తి ప్రదర్శించ

బడింది. కార్మికులు సమ్మెలు చేశారు. చివరకది దేశవ్యాపిత సర్వ జనీన సమ్మెగా మారిపోయింది. బెథల్‌హామ్‌లో ప్రదర్శకులు అమెరికావారి చతుస్సూత్ర ప్రణాళికా సహాయ కార్యాలయాన్ని తగులబెట్టారు. జెరూసలెంలో టర్కీ రాయబార కార్యాలయాన్ని తగులబెట్టారు. అమెరికా రాయబారి కార్యాలయ జండాను తగుల బెట్టారు. మహోద్ధృతంగా ఈసారి మిలిటరీ సంధియెడల ప్రజలు తమ కోపాగ్నిని ప్రదర్శించారు. ఈ వెల్లువను మజాలీ ప్రభుత్వం అణచ లేకపోయింది.

చివరకు 1955 డిసెంబరు 19 న రాజీనామా నిచ్చింది. రాజు పార్లమెంటును రద్దు చేశాడు. ఎన్నికలు జరిపించడానికి ఆపత్కాల ప్రభుత్వాన్ని హాషిమ్ నిర్మించాడు. ఈ వాతావరణంలో ఎన్నికలు జరిపితే ప్రజాస్వామిక శక్తులు ప్రభుత్వాధికారాన్ని సంపాదిస్తా యేమోనని భయపడి రాజు పార్లమెంటును రద్దుచేసే ఆర్డరును ఉపసంహరించుకొని, పాత పార్లమెంటునే పునరుద్ధరించాడు. ఈ నిరంకుశ చర్యకు నిరసనసూచకంగా 1956 జనవరి 7 వ తేదీన అమ్మన్ నగరంలో కార్మికులు తిరిగి సార్వజనీన సమ్మె చేశారు.

జనవరి 9 వ తేదీన సామీ ఎల్ రఫీ కొత్త మంత్రివర్గాన్ని నిర్మించాడు. పదవీ స్వీకారానంతరం తన ప్రభుత్వం దేశాన్ని బాగ్దాద్ కూటమిలో చేర్చదని అతడు స్పష్టంగా ప్రకటించాడు. ఇంత వరకూ సర్వసేనానిగా ఉన్న గ్లబ్ పాషాను (బ్రిటిష్ కమాండరు) బర్తరఫ్ చేశాడు. బ్రిటన్ దానికి నిరసనగా మార్చిలో మిగిలిన 15 మంది బ్రిటిష్ ఆఫీసర్లను వెనుకకు రప్పించుకొంది. బ్రిటిష్ ఆఫీసర్ల సహాయంలేకపోతే జోర్డాన్ దేశరక్షణ చేసుకోలేదని వీరి ధీమా !

తర్వాత జోర్డాన్ మార్చి 24 న సిరియాతో పరస్పరరక్షణ సంధినొకదాన్ని చేసుకున్నది. రెండు దేశాల సైన్యాలకు ఒకే సేనాని నియమించబడ్డాడు (సిరియా యిదివరకే ఈజిప్ట్, సౌదీ అరేబియాలతో యిటువంటి రక్షణ ఒడంబడికే చేసుకున్నది).

# సౌదీ అరేబియా

ఇది ఎర్రసముద్రం, అరేబియా సముద్రం, పర్షియా సింధు శాఖల మధ్యనున్న పెద్ద ద్వీపకల్పం. ముస్లిముల పుణ్యక్షేత్రాలయిన మక్కా, మదీనాలు ఈ ద్వీపకల్పంలోనే ఉన్నాయి.

దీని వైశాల్యం 5,97,000 చదరపుమైళ్ళు. జనాభా సుమారు 60 లక్షలు.

దేశమంతా పెద్ద ఎడారి. వర్షపాతం చాలతక్కువ.

ప్రజల ముఖ్యవృత్తి పశువుల పెంపకం.

దేశంలో దొరికే ముఖ్య ఖనిజం పెట్రోలు. మధ్యప్రాచ్యంలో దొరికే పెట్రోలులో నూటికి 40 వంతులు ఇక్కడ లభిస్తుంది. అమెరికా - కెనడా కంపెనీలు మక్కా - మదీనాల మధ్యప్రదేశం లోని బంగారు గనుల తవ్వకం సాగిస్తూవచ్చాయి.

ముఖ్య ఎగుమతుల్లో పెట్రోలు ప్రధానమైనది. తర్వాత చెప్పదగినవి గుర్రాలు. అరబ్బు గుర్రాలు ప్రపంచంలో పేరుపొందిన జాతి.

♦ ♦ ♦

మధ్యప్రాచ్యంలో అమెరికా దురాక్రమణ మొట్టమొదట అరేబియాలో ప్రారంభమైంది.

దేశంలో ఖనిజాలు దొరికేప్రాంతాలను - ముఖ్యంగా పెట్రోలు దొరికే ప్రాంతాలను 60 సంవత్సరాలవరకు అమెరికా గుత్త వ్యాపారస్తులకు 1933 లో రాజు కౌలుకిచ్చాడు. వీరు అరేబియన్ - అమెరికన్ ఆయిలుకంపెనీ ("ఆర్మకో") అనే గుత్తవ్యాపారసంస్థనొక దాన్ని ఏర్పాటుచేసి దేశంలోని నూనెను తోడుకపోయి కోట్లు గడించడమేకాక, దేశాన్ని అమెరికా వలసదేశంగా మార్చివేశారు. అమెరికా సామ్రాజ్యవాదులు అనేకచోట్ల యుద్ధస్థావరాలను నిర్మించి దేశాన్ని యుద్ధకేంద్రంగా అభివృద్ధిచేయడమే వారి ఆశయం.

1955 తర్వాత సౌదీ అరేబియా తటస్థవిధానాన్ని అవలంబించడం ప్రారంభించింది.

ఆంగ్లో – అమెరికన్ సామ్రాజ్యవాదులు నిర్మించిన బాగ్దాద్ యుద్ధకూటమిలో చేరడానికి నిరాకరించింది.

1955 డిసెంబరులో సౌదీ అరేబియా రాజు భారతదేశం వచ్చాడు. శాంతియుత సహజీవనాన్ని తనదేశం కోరుతున్నదని ప్రకటించాడు. పంచశీలాల ప్రాతిపదికమీద భారతప్రధాని నెహ్రూతో కలిసి ఒక ప్రకటన చేశాడు.

అమెరికా సామ్రాజ్యవాదులు నిర్మించిన యుద్ధకూటమినుండి దేశాన్ని రక్షించుకోడానికి 1955 డిసెంబరు 26 న ఈజిప్టుతో ఒక మిలిటరీ ఒడంబడికను చేసుకున్నది. దాని ప్రకారం రెండు దేశాల సైన్యాలకు ఒకే సేనానిని నియమించారు.

తరువాత 1956 మార్చిలో సౌదీ అరేబియా, ఈజిప్ట్, సిరియా దేశాల ప్రతినిధులు కైరోలో సమావేశమై, తాము బాండుంగ్ సమావేశ నిర్ణయాలకు కట్టుబడి ఉంటామని ప్రకటించారు. ఈ దేశాల రక్షణకు పథకాలు తయారు చేశారు. ఈజిప్టు, యెమెన్‌లతో కలసి 1956 ఏప్రిల్‌లో ఒక రక్షణ ఒడంబడికను చేసుకున్నది. దీని ప్రకారం, ఈ మూడు దేశాలలో ఏ దేశంపై దురాక్రమణ జరిగినా, మూడు దేశాలూ కలిసి రక్షణకు పూనుకుంటాయి.

ఈ విధంగా సౌదీ అరేబియా అమెరికా యుద్ధోన్మాదుల చర్యలకు వ్యతిరేకంగా అరబ్ రాజ్యాల స్వాతంత్ర్య రక్షణకు కృషి చేస్తున్నది.

# లెబనాన్

పడమర మధ్యధరా సముద్రం, ఉత్తరాన, తూర్పు దిక్కున సిరియా దేశం, దక్షిణాన ఇస్రాయెల్, లెబనాన్ దేశానికి సరిహద్దులు. దేశ వైశాల్యం 3,400 చదరపు మైళ్ళు; జనాభా (1951 లో) 13,03,941.

సాగవుతున్న భూమిలో నూటికి 90 పాళ్లు భూస్వాముల చేతుల్లో ఉంది. అందుచేత భూస్వామ్య విధానం రద్దు దేశ తక్షణ సమస్యగా పరిణమించింది.

దేశంలో పండేపంట దేశావసరాలకు చాలకపోవటంచేత, యేటా ఆహారధాన్యాలు దిగుమతి చేయబడుతున్నాయి. గోధుమలు, ద్రాక్ష, నిమ్మ తదితర పండ్లు ముఖ్య వ్యవసాయ పంటలు. పత్తి, పొగాకు కొద్దిగా పండుతాయి.

దేశ పరిశ్రమల్లోని పెట్టుబడులలో నూటికి 90 పాళ్ళు బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా సామ్రాజ్యవాదులవే. ఈ పరిశ్రమలలో 50,000 మంది కార్మికులు పనిచేస్తున్నారు. నూనె, పంచదార, జౌళి మిల్లులు, సిమెంటు ఫ్యాక్టరీలు ఉన్నాయి.

ద్రాక్షపండ్లు, ద్రాక్షసారాయి ముఖ్య ఎగుమతులు.

బీరుట్ రాజధానీనగరం; ముఖ్య రేవుపట్టణంకూడా ఇదే. ట్రిపోలీ, సయద్‌లు యితర ముఖ్య రేవుపట్టణాలు.

1943 వ సంవత్సరానికి పూర్వం లెబనాన్ ఫ్రెంచి మాండేటరీ స్టేట్. రెండవ ప్రపంచయుద్ధంలో ఫ్రాన్సు ఓడిపోయినతర్వాత (1940) లెబనాన్‌ను తన అధీనంలో ఉంచుకోలేకపోయింది.

1943 వ సంవత్సరంలో లెబనాన్ స్వతంత్ర ప్రభుత్వం ఏర్పాటు చేసుకునేందుకు బ్రిటన్ సాయపడింది.

"స్వతంత్ర" ప్రభుత్వాన్ని తన చెప్పుచేతల్లో ఉంచుకోవచ్చుననే స్వార్థబుద్ధితోనే యిందుకు పూనుకుంది. 1945 లో ఫ్రాన్సు లెబనాన్ స్వాతంత్ర్యాన్ని గుర్తించింది.

బ్రిటిష్, అమెరికా సామ్రాజ్యవాదులు ఈ దేశంపై పెత్తనం చెలాయించటానికి కుస్తీలు పడుతూవచ్చారు. ఇందుకు ముఖ్య కారణాలు మూడు:

(1) బ్రిటిషు, అమెరికన్ కంపెనీలుకూడా ఇరాక్ నుండి పెట్రోలు ఈ దేశ రేవులయిన ట్రిపోలీ, సయద్‌లకు పంపులద్వారా పంపి అక్కడనుండి ఎగుమతి చేస్తున్నాయి. ఈ నూనె సరఫరా క్షేమంగా జరుగుతూ ఉండాలంటే, తమ కనుకూలమయిన ప్రభుత్వాన్ని ఏర్పరచుకోవాలి.

(2) మధ్యధరా సముద్రతీరంలో యిది ఉండటంవల్ల మంచి యుద్ధ కేంద్రంగా అభివృద్ధికావటానికి వీలున్నది.

(3) ముఖ్య రేవుపట్టణమయిన "బీరుట్" మధ్యధరా సముద్రంలోకెల్ల ముఖ్య వ్యాపార కేంద్రం; నౌకా కేంద్రం.

ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల కుమ్ములాట, దేశంలో తమ అనుకూల ప్రభుత్వాన్ని నెలకొల్పటానికి, అవసరమయితే రాజకీయ తిరుగుబాట్లను లేవదీసి ప్రభుత్వాలనే మార్చేస్థితికి వెళ్ళింది (ఈ ఒక్క దేశంలోనేకాదు. మధ్యప్రాచ్యంలోని దేశాలన్నింటిలోను ఇదేస్థితి). ఈ ప్రాంతంలో బ్రిటన్ చాలకాలంగా పెత్తందారుగా ఉన్నదికనుక, తన ఏజంట్లను ఆయా దేశాలలోపెట్టి, తన స్థితిని కాపాడుకోగలుగుతూ వచ్చింది. రెండవ ప్రపంచ యుద్ధానంతరమే వచ్చిన అమెరికా, డాలర్లను గుప్పించి తన తొత్తులను తయారు చేసుకోవటం ప్రారంభించింది.

1952 వ సంవత్సరానికల్లా, అమెరికా సామ్రాజ్యవాదులు, దేశ అధ్యక్షుడయిన "బిషాలా - ఎల్ - ఖారీ"ని తమవాణ్ణిగా చేసుకోగలిగారు.

"ఖారీ" పదిసంవత్సరాల కాలంలో ప్రజాహితకార్యాల వేటినీ చేయలేకపోయాడని ప్రజలలో అసంతృప్తి రేగింది. అందుచేత, ఖారీ ప్రభుత్వం రాజీనామాచేయక తప్పలేదు.

దీన్నవకాశంగా తీసుకుని, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, తమ కనుకూలుడయిన "షమాన్"ను అధ్యక్షుణ్ణిచేసి, కొత్త ఎన్నికలు

జరిపించి, పార్లమెంటులో తమ అనుకూలవర్గానికి మెజారిటీ వచ్చేట్లు చేసుకున్నారు.

అమెరికా సామ్రాజ్యవాదులు, "షమాన్" అనుచరవర్గంలో తగాదాబెట్టి, ఒక ముఠాను చీల్చగలగటంవల్ల, పార్లమెంటుపని కుంటుబడుతూ వచ్చింది. దీనితో 1953 వ సంవత్సరం ఏప్రిల్‌లో షమాన్, అమెరికా అనుకూలుడయిన "సాహెబ్ సలామ్"ను మంత్రి వర్గం నిర్మించమని ఆహ్వానించాడు.

ఈవిధంగా అమెరికా, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు స్వార్థ ప్రయోజనాలకొరకు ప్రభుత్వాలనే మార్చుతున్నారు.

ఇంతవరకు ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు నిర్మించిన మధ్యప్రాచ్య యుద్ధకూటమిలో (బాగ్దాద్‌కూటమి) లెబనాన్ చేరలేదు. అలా చేర్చేందుకు అమెరికా సామ్రాజ్యవాదులు ప్రయత్నాలు చేస్తూనేవున్నారు.

## సిరియా

ఉత్తరాన టర్కీ, పడమట లెబనాన్ మధ్యధరా సముద్రాలు, దక్షిణాన జోర్డాన్, ఆగ్నేయ దిశలో ఇరాక్ దేశాలు సిరియాకు సరిహద్దులుగా ఉన్నాయి. దేశ వైశాలం 72,234, జనాభా 32,52,687 (1950). ప్రజలలో అత్యధికభాగం అరబ్బుజాతి ముస్లింలు.

ఇరాక్ పశ్చిమ సరిహద్దు, ఉత్తర సరిహద్దు నానుకొని ఉన్న ప్రాంతం, పడమర అలెప్పోనుండి డెమాస్కస్ వరకూ ఉన్న భాగం - గుర్రపు నాడావలె ఉన్న ఈ ప్రాంతంతప్ప, మిగతా భూభాగమంతా ఎడారి ప్రదేశం.

దేశంలోని పలుప్రాంతాల్లో పలువిధాలయిన శీతోష్ణస్థితి ఉంది. మధ్యధరా సముద్రతీర ప్రాంతంలోమాత్రం సాలుకు సగటున 40 అంగుళాలవరకూ వర్షం పడుతుంది. తూర్పు భాగాన పోను పోను వర్షం చాలా తగ్గిపోతుంది. అందుచేత దేశ వైశాల్యంలో మూడవ వంతు ఎడారిప్రాంతం.

పశువుల పెంపకం, వ్యవసాయం ప్రజల ప్రధానవృత్తి. మధ్యధరా శీతోష్ణస్థితివున్న ప్రదేశంలోమాత్రం ద్రాక్ష, నారింజ యిత్యాది పండ్లతోటలు పెంచబడుతున్నాయి. గోధుమ, బార్లీ ముఖ్యపంటలు.

మధ్య, తూర్పు ప్రాంతాల్లో పశువుల పెంపకం జరుగుతుంది.

ఖనిజాలు అరుదు. పారిశ్రామికంగా యీ దేశం చాల వెనుక బడివుంది. దేశంగుండా రెండు నూనె పైప్‌లైన్లు మధ్యధరా తీరానికి వెళ్తున్నాయి.

మొదటిది: ఇరాక్ పెట్రోలియం (బ్రిటిష్ గుత్తవ్యాపార సంస్థ) కంపెనీకి సంబంధించింది; "కిర్‌కుక్" నూనె బావులనుండి పెట్రోలు మధ్యధరాతీర రేవు ట్రిపోలీకి తీసుకపోతుంది.

రెండవది ట్రాన్సు - అరేబియన్ పైప్‌లైను. ఇది అమెరికా గుత్తవ్యాపారసంస్థ (ఆరమ్కో) కు సంబంధించింది. ఇది అరేబియాలో తీసిన నూనెను మధ్యధరా తీరానికి తీసుకెళ్తుంది.

వస్త్రాలు, లోహాలు, వీటి యంత్రాలు, ఆహారపదార్థాలు, ముఖ్య దిగుమతులు. గోధుమ, బార్లీ, పశువులు, మాంసం ముఖ్య ఎగుమతులు.

ఎగుమతి దిగుమతి వ్యాపారంలో అత్యధికభాగం అమెరికా, బ్రిటన్‌లతో జరుగుతోంది.

డమాస్కస్ దేశ ముఖ్యపట్టణం.

మొదటి ప్రపంచయుద్ధ కాలంవరకూ సిరియాదేశం టర్కీ సామ్రాజ్యంలో భాగంగా వుండేది. 1920 నుండి 1941 వరకూ ఫ్రెంచి సామ్రాజ్యవాదుల "మాండేటరీ" స్టేటు. రెండవ ప్రపంచ

యుద్ధంలో ఫ్రాన్సు జర్మనీకి లొంగిపోయి బాగా నీరసించిపోయింది. దీన్ని అవకాశంగాతీసుకుని 1943 లో సిరియా స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకుంది. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తాముకూడా సిరియా స్వాతంత్ర్యాన్నే కోరుతున్నట్లు నాటకమాడి క్రమంగా దేశంలో పలుకుబడి సంపాదించారు.

యుద్ధానంతరం ఫ్రాన్సు తిరిగి సిరియాపై పెత్తనాన్ని సంపాదించాలని ప్రయత్నం చేసింది. 1930 లో ఇరాక్ - బ్రిటన్లు చేసుకున్న సంధిలాంటిది (దేశ ఆర్థికవిధానంపైన, సైన్యంమీద అధికారం ఇచ్చేది.) సిరియా తనతో చేసుకోవాలని బెదిరించింది. ఈ బెదిరింపులకు లొంగలేదని ఫ్రాన్సు 1945 లో మిలిటరీ దురాక్రమణకే పూనుకుంది. సిరియా వాదాన్నంగీకరించి, భద్రతాసమితి, ఫ్రెంచి సైన్యాలు తక్షణం దేశంనుంచి వెళ్లిపోవాలని తీర్పు నిచ్చింది. దీనితో 1946 ఏప్రియల్‌లో ఫ్రెంచి సామ్రాజ్యవాదులు తమ సైన్యాల నుపసంహరించుకొన్నారు.

సిరియాలో కూడా విరివిగా పెట్రోలు దొరికే అవకాశాలున్నాయి. ప్రభుత్వంలో తాము సంపాదించిన పలుకుబడి నాధారంగా చేసుకుని, బ్రిటిష్ గుత్తవ్యాపారస్తులు డమాస్కస్ - బాగ్దాద్ రోడ్డుకు ఉత్తరాన ఉన్న ప్రాంతంలో నూనె గనుల పరిశోధనకు అనుమతి సంపాదించారు.

ఇక్కడ కూడా అమెరికా గుత్త వ్యాపారస్తులు బ్రిటనుకు పోటీగా "దాపురించారు". వీరు డమాస్కస్ - బాగ్దాద్ రోడ్డుకు దక్షిణాన ఉన్న ప్రాంతంలో నూనెబావుల పరిశోధనకు అనుమతి సంపాదించారు.

సిరియాలో పెట్రోలు గనులు ఉండడమే కాదు. ఇరాన్, ఇరాక్, సౌదీ అరేబియాల్లో తీయబడుతున్న పెట్రోలును మధ్యధరా సముద్రతీర రేవుపట్టణాలకు చేరవేసే పైప్‌లైనును సిరియా గుండానే వేయాలి. ఇందువల్ల పెట్రోలు రవాణాఖర్చు చాలా తగ్గుతుంది.

అమెరికా గుత్తవ్యాపారస్తులు సౌదీ అరేబియాలో తీసే పెట్రోలు, బ్రిటిష్ టాంకర్ల ద్వారామాత్రమే మధ్యధరాతీర ప్రాంతానికి ఎగుమతి చేయబడాలి. దీనివల్ల రవాణాఖర్చు అధికం కావటమేకాక, బ్రిటిష్ వ్యాపారస్తుల దయాదాక్షిణ్యాలమీద ఆధార పడాలి. కనుక వీరు, సిరియాగుండా "పైపులైను" వేసి, పెట్రోలును మధ్యధరా తీరానికి తీసికెళ్లగలిగితే, పెట్రోలును బ్రిటనుకంటేకూడా చౌకగా అమ్మటానికి, తద్వారా పెట్రోలు మార్కెట్టులో బ్రిటన్‌ను దెబ్బతీయటానికి వీలవుతుంది. కనుక వీరు సిరియాగుండా పైపులైను వెయ్యాలని ప్రయత్నించారు. దీనివల్ల తన వ్యాపారానికి రానున్న ముప్పును బ్రిటన్ గ్రహించింది. సిరియా ప్రభుత్వం ఇందుకు అంగీక రించకుండా ఉండేట్లు చేయాలని బ్రిటిష్ సామ్రాజ్య వాదులు ప్రయ త్నించారు. దీనితో, సిరియా ప్రభుత్వాన్ని తమ కనుకూలంగా ఉంచు కోవడానికి వీరిద్దరిమధ్య (ఆంగ్లో - అమెరికను సామ్రాజ్యవాదుల మధ్య) కుమ్ములాట ప్రారంభమైంది.

అమెరికా అనుకూల మంత్రివర్గం ప్రభుత్వానికి రాగానే, బ్రిటిషు సామ్రాజ్యవాదులు తమ కీలుబొమ్మలచేత తిరుగుబాటు లేవ దీయించి ప్రభుత్వాన్ని వారు హస్తగతం చేసుకొనేట్లు చేయడం, అమెరికాకూడ ఈ విధంగానే తమ అనుకూల మంత్రివర్గాన్ని ప్రభు త్వానికి తీసుకరావటానికి పనిచేయడం ప్రారంభమైంది. ఈ విధంగా ఒక్క 1949 లోనే తొమ్మిదిమాసాల్లో మూడు ప్రభుత్వాలు మారా యంటే, ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల కుమ్ములాట ఏస్థాయిలో ఉండేదో అర్థమవుతుంది.

ఎలాగయితేనేమి ఇక్కడకూడా బ్రిటన్ ప్రాబల్యాన్ని అమెరికా చాలవరకు అరికట్ట గలిగింది; ప్రభుత్వంలో విశేష పలుకుబడిని సంపాదించ గలిగింది.

ఈ ఘట్టం ఈ విధంగా ముగిసింది. అంట్లాంటిక్ యుద్ధకూటమికి అనుబంధశాఖగా, తాము మధ్యప్రాచ్యంలో నిర్మించ దలచుకున్న యుద్ధకూటమిలో (టర్కీ - ఇరాక్ సంధి) సిరియానుకూడా చేర్పిం

చాలని ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రయత్నించడంతో సిరియా చరిత్రలో మరొక ఘట్టం ప్రారంభమైంది.

దేశ పరిపాలనా యంత్రంలో ఉన్న అనేకమంది నాయకులు, తమదేశం ఈ యుద్ధకూటమిలో చేరాలనే కోరుతున్నా, దేశంలో అభివృద్ధి చెందిన సామ్రాజ్యవాద వ్యతిరేకోద్యమ శక్తినిచూచి, వారు అందుకు సాహసించలేక పోతున్నారు.

1954 లో జరిగిన పార్లమెంటరీ ఎన్నికల్లో యుద్ధ కూటాలల్లో దేశాన్ని చేర్చాలని ప్రయత్నించే అనేకులు చిత్తయినారు. చేసిన వాగ్దానాల్ని తన్నివేసి, దేశాన్ని యుద్ధకూటమిలో చేర్చ ప్రయత్నించిన "ఖోరీ" (Khoury) మంత్రివర్గం పదవి స్వీకరించిన మూడవ నెలలోనే రాజీనామా చేయవలసి వచ్చింది. టర్కీ - ఇరాక్ సంధిని సిరియా పార్లమెంటు సభ్యులనేకులు దుయ్యబట్టారు. టర్కీ ప్రధాన మంత్రి సిరియా రాజధానీ నగరంలో దిగినపుడు, యుద్ధ వ్యతిరేక నినాదాలు చేస్తూ, ప్రజలు పెద్ద యెత్తున ప్రదర్శనాలు చేశారు. ఇవన్నీ కూడా సిరియాలో సామ్రాజ్యవాద వ్యతిరేకోద్యమ శక్తికి, సిరియా ప్రజల శాంతికాముకత్వానికి నిదర్శనాలు.

దాన్నిచూచి, సిరియా పాలకవర్గం భయపడుతూంటే, ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు చతురోపాయాలను ప్రయోగించి సిరియాను లొంగదీయ ప్రయత్నం చేశారు. టర్కీ శిఖండి సాయంతో ఈ ప్రయత్నం జరిగింది. టర్కీ, సిరియా సరిహద్దుల్లో తన సైన్యాలను కేంద్రీకరించి, సిరియాను భయపెట్ట చూస్తున్నది. ఇదీ చాలదన్నట్లు 1955 డిశంబరులో ఇజ్రాయేల్ సేనలను దేశంపైకి ఉసిగొల్పారు సామ్రాజ్యవాదులు. ఈ సంధిని వ్యతిరేకించే ప్రముఖ నాయకుల్ని హత్య చేయించటానికి కూడా ప్రయత్నించారు.

కాని సిరియా ఈ బెదరింపులకు లొంగలేదు. తాను బాగ్దాద్ కూటమిలో చేరనని ప్రకటించింది. సౌదీ అరేబియా, ఈజిప్ట్, సిరియా దేశాల ప్రతినిధులు కైయిరోలో సమావేశమై (1956 - మార్చి) బాండుంగ్‌సభ నిర్ణయాలకు తాము కట్టుబడి ఉంటామని ప్రకటిం

చారు. ఈజిప్ట్‌తో ఒక రక్షణ ఒడంబడికనుకూడా సిరియా చేసు కొన్నది.

## ఇ జ్రా యె ల్

పాలస్టైయిన్ విభజనవల్ల 1948 లో ఇజ్రాయెల్ రాజ్యం ఏర్పాటయింది. తూర్పున సిరియా, జోర్డాన్ దేశాలు, పడమర ఈజిప్ట్, మధ్యధరా సముద్రం, ఉత్తరాన లెబనాన్ ఈ దేశానికి సరిహద్దులుగా ఉన్నాయి.

దేశవైశాల్యం 8,000 చదరపుమైళ్ళు - జనసంఖ్య 15,35,000 (1952). వీరిలో 13,64,000 మంది యూదులు. అరబ్బులు 35 వేల మంది ఉంటారు. దేశజనాభాలో నూటికి 50 మంది జెరూసలెం, హైఫా, టెలవీవ్ నగరాల్లోనే ఉంటున్నారు.

మైదానాలు, కొండలోయల్లో నిమ్మ, ద్రాక్షతోటలు విరివిగా పెంచబడుతున్నాయి. పండ్లతోటలు పెంచడమే ప్రజల ప్రధాన వృత్తి. దేశానికి కావలసిన తిండిగింజల్లో నూటికి 80 వంతులు దిగుమతి చేసుకొంటారు.

పొటాష్, బ్రోమైన్ ఖనిజాలు విరివిగా లభిస్తాయి.

దేశం పారిశ్రామికంగా చాల వెనుకబడివుంది. హైఫాలోఉన్న ఆంగ్లో - అమెరికన్ నూనెశుద్ధి కర్మాగారాలు తప్పితే దేశంలో చెప్పదగిన పరిశ్రమ లేవీలేవు.

నిమ్మ, ద్రాక్షపండ్లు, ద్రాక్ష సారాయి, పొటాష్, బ్రోమైన్ రసాయన పదార్థాలు, పింగాణీతో చేసిన పళ్ళు (Porcelain teeth) ముఖ్య ఎగుమతులు.

జరూసలెం రాజధానీ నగరం. జాఫ్నా, హైఫా, టెలవీల్ ముఖ్యవ్యాపార కేంద్రాలు.

♦ ♦ ♦

1948 లో పాలెస్టైయిన్ విభజన జరిగింది. ఇందులో యూదులు (జ్యూస్) అత్యధిక సంఖ్యాకులుగా ఉన్న ప్రాంతాన్ని (సుమారు 8,000 చదరపు మైళ్ళ ప్రదేశాన్ని) పాలెస్టయినునుండి విడిదీసి 'ఇజ్రాయెల్' అనే పేరుతో ఐక్యరాజ్య సమితి యూదు రాజ్యాన్ని ఏర్పరచింది.

1919 వ సంవత్సరం వరకూ "పాలెస్టయిన్" టర్కీ సామ్రాజ్యంలో భాగంగా వుంటూ వుండేది. 1919 నుండి 1948 వరకూ (దేశవిభజన కాలంవరకూ) బ్రిటిష్ "మాండేట్"గా వుంది.

యూదులకు స్వంత దేశ మొకటీ లేదు. 1917 బెల్‌ఫోర్డు ప్రకటన ప్రకారం జాతి విద్వేషానికి బలిఅయ్యే యూదులకు పాలస్టయిన్‌లో వసతి చూపుటకు బ్రిటన్ అంగీకరించింది. దీనితో పాలెస్టయినుకు యూదుల వలస ప్రారంభమైంది.

జర్మనీలో హిట్లరు అధికారానికి వచ్చినప్పటినుండి యూదుల మీాద దాడి ప్రారంభించాడు. దానితో పాలెస్టయిన్‌కు వలస వచ్చిన యూదుల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. 1919 లో సుమారు పదివేల మందిగా ఉండే యూదుల సంఖ్య 1948 నాటికి అచ్చట నివసించే అరబ్బుల జనసంఖ్యకు సమంగా పెరిగింది.

యూదులు అత్యధిక సంఖ్యాకులుగా ఉండే ప్రాంతాన్ని విభజించి, ప్రత్యేక యూదురాజ్యాన్ని ఏర్పాటుచేయాలని, యూదులు ఆందోళన ప్రారంభించారు. రెండవ ప్రపంచ యుద్ధంతర్వాత ఈ ఉద్యమం మరింత ఉన్నతస్థాయికి వెళ్ళింది.

పాలెస్టయిను యుద్ధవ్యూహరీత్యా మంచి కీలకస్థానంలో ఉంది. దీనికితోడు, మధ్యప్రాచ్యంలో లభించే నూనెను మధ్యధరా తీరానికి చేరవేసే పైపులైను ఈదేశంగుండానే పోతుంది. నూనె ఈదేశపు రేవు పట్టణమైన "హైఫా"కు చేరవేయ బడుతుంది. కనుక బ్రిటిషు సామ్రాజ్యవాదులు ఈ ప్రాంతంపై తమ పెత్తనాన్ని రెండవ ప్రపంచ యుద్ధకాలంవరకూ జాగ్రత్తగా కాపాడుకొంటూ వచ్చారు.

కాని రెండవ ప్రపంచయుద్ధం తర్వాత, అమెరికా సామ్రాజ్యవాదులు ఇక్కడకూడా బ్రిటనుకు పోటీగా వచ్చారు. సౌదీ అరేబియాలో తమకు లభించేనూనె మధ్యధరా తీరానికి రవాణాచేయడానికి బ్రిటిషు వారి దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉండేకంటే, తామే "హైఫా"కు ఒక "పైపులైను" వేయడం మంచిదని అనుకున్నారు. దీనికితోడు కీలకప్రదేశమైన ఈప్రాంతాన్ని నెమ్మదిగా తమ చేతిలోకి లాక్కోవాలని ప్రయత్నాలు ప్రారంభించారు. ఈ ఆశయసిద్ధికే వీరు యూదులను వెనకవేసుకుని పాలెస్టయినును విభజించి యూదు రాజ్యాన్ని ఏర్పాటు చేయాలని కోరనారంభించారు. దేశంమీద తమ పెత్తనం పోతుందని భయపడి దేశవిభజనను వ్యతిరేకిస్తున్న అరబ్బులను వెనకేసుకుని 'విభజన జరగటానికివీల్లేదంటూ బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు తయారయ్యారు. ఈ విధంగా దేశంమీద పెత్తనం సంపాదించటంకోసం ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు కుమ్ములాటకు తలపడ్డారు. అరబ్బు-యూదు జాతివైషమ్యాలను రెచ్చగొట్టి రక్తపాతానికి కారకులైనారు (అరబ్బురాజ్యాలన్నీ దేశవిభజనకు వ్యతిరేకంగా పోరాడాయి).

చివరకు అమెరికా సామ్రాజ్యవాదులు ఈ సమస్యను ఐక్యరాజ్య సమితికి తీసికెళ్ళారు.

దేశాన్ని విభజించాలనీ, యూదురాజ్యాన్ని ఏర్పరచాలనీ సమితి 1948 లో తీర్మానం చేసింది.

దీనితో పాలెస్టయిన్‌పై తనకున్న మాండేటరీ అధికారాన్ని బ్రిటను వదులుకోవలసి వచ్చింది. 1948 వ సంవత్సరం మే 14 వ తేదీన యూదుల రాజ్యమైన "ఇజ్రాయెల్" ఉద్భవించింది. అరబులు నివసించే మిగతా భాగాన్ని జోర్డాన్‌లో కలిపేశారు.

ఇజ్రాయెల్‌పైన అమెరికా పలుకుబడి అనేక రంగాల్లో అధికమవుతూ వచ్చింది. 1951 లో అమెరికాతో చేసుకున్న వ్యాపార ఒడంబడిక, దేశ ఆర్థిక వ్యవస్థను అమెరికా సామ్రాజ్యవాదుల చేతుల్లో పెట్టింది. అమెరికా సామ్రాజ్యవాదులు యుద్ధ స్థావరాల నిర్మిస్తూ, దేశాన్ని యుద్ధ కేంద్రంగా అభివృద్ధి చేస్తున్నారు.

తాము నిర్మించిన యుద్ధకూటమిలో (టర్కీ - ఇరాక్ యుద్ధ సంధి) చేరనందుకు అరబ్ రాజ్యాలమీద అవసరమైతే ఆత్మరక్షణ పేరుతో దురాక్రమణ జరిపించడానికి, అరబ్బు రాజ్యాలే దురాక్రమణ జరపబోతున్నాయనేసాకుతో, అమెరికా ఆయుధాలతో తమ సైన్యాలను ఆయత్తం చేసుకొనేందుకు అమెరికా సామ్రాజ్యవాదులు సన్నాహం చేస్తున్నారు. 1955 ఫిబ్రవరిలో ఈజిప్టులోని గాజా ప్రాంతంమీద ఇజ్రాయెల్ సేనలు దాడిచేశాయి. ఇదే సంవత్సరం డిసెంబరులో ఇజ్రాయెల్ సైన్యాలు సిరియా సరిహద్దుల నతిక్రమించి 56 గురు సిరియనులను చంపివేశాయి.

ఈ విధంగా మధ్యప్రాచ్యంలో ఇజ్రాయెల్ అమెరికాకు బంటుగా వ్యవహరిస్తున్నది.

# యమెన్

యమెన్, అరేబియా ద్వీపకల్పంలో నైరుతి దిశగా ఎర్ర సముద్ర తీరంలోఉంది. మధ్యధరా సముద్రం మీదుగా, సూయజ్ కాలువనుదాటి, అరేబియా సముద్రంలో ప్రవేశించే ఓడలన్నీ ఈ "సింహద్వారం" గుండానే రావాలి. కనుక దీనికి వ్యాపారరీత్యాను, యుద్ధవ్యూహరీత్యాను చాల ప్రాముఖ్యత ఉంది.

దీని వైశాల్యం 40,000 చదరపుమైళ్లు. జనాభా సుమారు 40 లక్షలు.

ఇది వ్యవసాయ దేశం. ముఖ్యపంట కాఫీ. పశువుల పెంపకం ప్రజల రెండవ ముఖ్యవృత్తి.

కాఫీ, తోళ్లు దేశ ముఖ్య ఎగుమతులు.

"సన్" రాజధానీ నగరం.

ఇది స్వతంత్ర రాజ్యం - పరిపాలకుడు రాజు. రజకుటుంబీకులు సింహాసనం కొరకు పోట్లాడుకోవటం తరచు జరిగేది.

యుద్ధ వ్యూహరీత్యా ప్రాధాన్యత వహించే ఈ ప్రాంతంపై తాము ప్రాబల్యం సంపాదించాలని ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్య వాదులు ఈ కుమ్ములాటల్లో వేలు పెడుతూ వచ్చారు. ఎవరి అనుకూలురను వారు సింహాసనం ఎక్కించాలని చూచేవారు.

1949 లో దేశాన్ని తమ "ప్రొటెక్టరేటు"గా (అధినివేశ రాజ్యం) చేసుకోనేందుకు, బ్రిటను ఒక సంధిని ప్రతిపాదించింది. దీన్ని యమెన్ తిరస్కరించటంతో, బ్రిటన్ గత నాలుగు - ఐదు సంవత్సరాలుగా దురాక్రమణ జరుపుతూ వచ్చింది. దేశం దక్షిణ భాగంలో కొంత భూభాగాన్ని తన "ఏడెన్ ప్రొటెక్టరేటు"లో కలుపు కుందికూడా. ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు యమెన్‌ను మధ్య ప్రాచ్య యుద్ధ కూటమిలో, (బాగ్దాద్ కూటమి) చేర్చటానికి అనేక పద్ధతుల్లో వత్తిడిచేసినా, అందులో యమెన్ చేర నిరాకరించింది. అరబ్ రాజ్యాల స్వాతంత్ర్యానికి ఈ యుద్ధకూటమి ప్రమాదకరమని బహిరంగంగా ప్రకటించింది.

1955 అక్టోబరులో సోవియట్ యూనియన్‌తో మిత్రత్వ సంధి మరొకదాన్ని చేసుకుంది.

## ఏడెన్

ఇది బ్రిటిషు ప్రొటెక్టరేటు (ఆచరణలో వలసదేశమే). యమెన్‌కు తూర్పున అరేబియా ద్వీపకల్పానికి దక్షిణంగా అరేబియా సముద్రతీరంలో ఉంది. సూయజ్ కాలువ దాటి వచ్చే ఓడలన్నీ దీని రాజధానీ నగరమైన "ఏడెన్" మీదుగానే అరేబియా సముద్రంలో ప్రవేశించాలి. కనుక దాని ఉనికి చాలప్రధానమైనది.

దేశ వైశాల్యం 1,12,000 చదరపుమైళ్ళు. జనాభా సుమారు 7 లక్షలు.

ఏడెన్ నగరం పెద్ద నావికా, వైమానిక కేంద్రం.

♦ ♦ ♦

మస్కాట్, ఓమన్, కువైట్, బహరిన్ క్వాటార్ - ఇవి అరేబియా ద్వీపకల్పంలోని ఇతర చిన్న చిన్న రాజ్యాలు. ఇవన్నీ భూస్వామ్యవర్గ రాజరికవాదుల (సుల్తానుల్లు) చేత పరిపాలించబడుతున్నాయి.

# టర్కీ

తూర్పున సోవియట్ యూనియన్, ఇరాన్ దేశాలు, దక్షిణాన సిరియా, ఇరాక్ దేశాలు, మధ్యధరా సముద్రం, పడమర ఏజియన్ సముద్రం (Aegean sea), ఉత్తరాన నల్లసముద్రం టర్కీ సరిహద్దులుగా ఉన్నాయి. దేశం మూడుఖండాలమధ్య (ఆఫ్రికా, ఆసియా, ఐరోపా) ఉంటంవల్ల యుద్ధవ్యూహరీత్యా మంచి కీలక ప్రదేశంగా పరిగణించ బడుతున్నది.

దీని భూభాగం కొంత ఆసియాలోను (2,85,246 చదరపు మైళ్ళు) కొంత ఐరోపా ఖండంలోను (9,256 చదరపుమైళ్ళు ఉంది. మొత్తం దేశపు వైశాల్యం 2,94,502 చదరపుమైళ్లు. జనాభా 2,09,02,628 (1950). ఇందులో ఐరోపాఖండంలో ఉన్న ప్రాంతంలో నివసించే జనాభా 14,96,612 (1945).

సముద్రతీర భూములుతప్ప మిగతా ప్రదేశమంతా పీఠభూమి. వర్షం చాల తక్కువ. వాతావరణం వ్యవసాయానికి అనువుగాలేదు. ఇచ్చట నివసించే ప్రజల ముఖ్యవృత్తి పశువుల పెంపకం. ప్రపంచ ప్రఖ్యాతిగన్న "అంగోరా" గొర్రెలు ఈ పీఠభూముల్లోనే పెంచబడుతున్నాయి. అక్కడక్కడా నీటిపారుదలవల్ల వ్యవసాయం చేయబడుతున్నది.

సముద్రతీరప్రాంతం చాల సారవంతమయిన భూమి. ఈ ప్రాంతంలో ద్రాక్ష, ఆలివ్, అత్తి (fig) పండ్లతోటలు పెంచబడుతున్నాయి. గోధుమ, బార్లీ పంటలు పండించబడుతున్నవి.

రాక్షసిబొగ్గు, సీసము, రాగి, క్రోమియమ్ మొదలైన ఖని జాలు లభిస్తాయి. ఒక్క క్రోమియమ్ తప్ప మిగతా ఖనిజాలేవీ పెద్ద ఎత్తున తీయబడటంలేదు. ప్రపంచంలో లభించే క్రోమియమ్‌లో ఆరవ వంతు ఇచ్చటే లభిస్తున్నది.

దేశంలో చెప్పదగిన పరిశ్రమలేవీ అభివృద్ధికాలేదు. అంకారా రాజధానీ నగరం. ఇస్మిల్, అడన, కొన్యా, బర్సా ఇతర ముఖ్య నగరాలు.

♦ ♦ ♦

1800 సంవత్సరానికి టర్కీకి పెద్ద సామ్రాజ్యం ఉండేది. యూరపు ఖండంలోని ఇప్పటి రొమేనియా, బల్గేరియా, యుగోస్లావియా, గ్రీసు దేశాలు, సోవియట్‌లో నల్ల సముద్రం ప్రక్కనే ఉన్న ప్రాంతం కొంత ఈ సామ్రాజ్యంలో ఉండేవి. దీన్నే ఒట్టోమన్ సామ్రాజ్యం అని కూడా పిలిచేవారు.

1800 తర్వాత, కాలక్రమేణా ఈ సామ్రాజ్యం హరించిపో సాగింది. చివరకు, మొదటి ప్రపంచ యుద్ధాంతానికి, టర్కీకి యూరపులో నామమాత్రపు భూభాగం మాత్రమే మిగిలిపోయింది. అఖరుకు దేశ స్వాతంత్ర్యానికే ముప్పు వచ్చింది.

1914 మొదటి ప్రపంచ యుద్ధంలో టర్కీ, జర్మనీ పక్షాన మిత్రమండలికి వ్యతిరేకంగా పోరాడింది. యుద్ధంలో గట్టి దెబ్బలు తిని బాగా బలహీనపడిపోయింది. దీని వునికి యుద్ధ వ్యూహ రీత్యా చాల ప్రధానమైనది. కనుక ఆంగ్లో - ఫ్రెంచి సామ్రాజ్యవాదులు టర్కీని తమ వలస దేశంగా చేసుకోవాలని ప్రయత్నించారు. టర్కీ సుల్తాన్ బ్రిటిష్ వారి తొత్తు కనుక, అతడు సామ్రాజ్యవాదుల ప్రయత్నా లను విఫలం చేయడానికి ప్రయత్నించలేదు.

కాని కొందరు జాతీయవాదులు కమాల్‌పాషా నాయకత్వాన దేశ స్వాతంత్ర్య రక్షణకు రహస్యంగా పనిచేయటం ప్రారంభించారు.

కమాల్‌పాషావల్ల తనవునికికికూడా భంగం కలుగుతుందని భయపడ్డ సుల్తాన్, అతనికి ఒక సైనికోద్యోగమిచ్చి, దూరంగాఉన్న

అనటోలియాకు పంపాడు. ఈ సదవకాశాన్ని కమాల్ వినియోగించుకొన్నాడు. యూరపునుండి ఆయుధాలను దిగుమతిచేసి, ప్రతిఘటనకు తయారుకాసాగాడు.

1919 మేనెలలో బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల ప్రోత్సాహంతో గ్రీసు, టర్కీమీద దాడిచేసి, దురాక్రమణకు పూనుకున్నది. అంతవరకూ కమాల్ పాషాతో చేరకుండా ఉన్న మిలిటరీ ఆఫీసర్లకు యీ దాడి కనువిప్పు కలిగించింది. వెంటనే చాలమంది కమాల్‌తో చేరి దేశరక్షణకు పూనుకున్నారు. సామ్రాజ్యవాదుల తొత్తుగా వ్యవహరిస్తున్న సుల్తాన్, కమాల్ పాషాను అరెస్టుచేయవలసిందిగా ఆర్డర్లు జారీచేశాడు.

జాతీయవాదులు 1919 సెప్టెంబరులో అనటోలియాలోని "సిరాస్"లో సమావేశమై ప్రతిఘటన నడపడానికి ఒక కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు. దానికి కమాల్ అధ్యక్షుడు. సంధి షరతులను తయారుచేసి మిత్రమండలికి పంపించారు. దీనిలో తమ దేశ స్వాతంత్ర్యానికి ఎటువంటిహాని జరగరాదని కోరారు. దీన్నే 'జాతీయ సంధి" (National pact) అంటారు.

ఈ పరిణామాలు సుల్తానును భయపెట్టాయి. చొరవ జాతీయవాదుల చేతుల్లోకి పోయిందని భయపడి తానే పార్లమెంటుకు ఎన్నికలు జరిపాడు. ఈ ఎన్నికల్లో కమాల్ పక్షపు జాతీయ వాదులకు పెద్ద మెజారిటీ వచ్చింది. కమాల్‌కూడా ఎన్నికయినాడు. సుల్తాను పార్లమెంటును ఇస్తాన్‌బుల్‌లో సమావేశపరిచాడు. దానికి వెళితే ప్రమాదం తప్పదని, జాతీయవాదులు ఎవరూ వెళ్ళకూడదని కమాల్ సూచించాడు. అయినా వినకుండా 40 మంది జాతీయ వాదులు రవూఫ్‌బేగ్ నాయకత్వాన వెళ్ళారు. వెంటనే బ్రిటిషు సామ్రాజ్యవాదుల సేనాని నగరాన్ని ఆక్రమించుకొని, జాతీయవాదుల నందరను అరెస్టుచేసి మాల్టాపంపాడు.

"జాతీయ సంధిని" తాము అంగీకరించటంలేదు అని సూచించడానికి ఈ పని చేశారట! దానితో దేశంలో తీవ్రసంచలనం బయలు

చేరింది. చాలమంది జాతీయవాదులు తప్పించుకెళ్లి, అంగోరా (ఇపుడు "అంకారా" అని పిలుస్తున్నారు) చేరారు. వీరు ఇక్కడ స్వతంత్ర పార్లమెంటును సమావేశపరచి, ఇదే దేశానికి చట్టబద్ధమయిన జాతీయసభ అని ప్రకటించారు. తామే టర్కీ స్వతంత్ర ప్రభుత్వమని, సుల్తానును రాజుగా తాము అంగీకరించటంలేదని ప్రకటించారు.

సుల్తాను జాతీయవాదుల నణచటానికి తీవ్ర చర్యలు తీసుకున్నాడు. కమాల్‌ను చంపినవానికి ఒక పెద్ద బహుమాన మిస్తానని ప్రకటించాడు. వీరు మతానికి వ్యతిరేకులని చెప్పి మత దురహంకారులను వీరి మీదకు ఉసికొల్పాడు. దీనితో దేశంలో అంతర్యుద్ధం ప్రారంభమైంది. పట్టణానికి పట్టణానికి, పల్లెకు పల్లెకు, ఆఖరుకు సోదరునకు సోదరునకు మధ్య పోరాటం ప్రారంభమైంది.

ఈ స్థితిలో ఎటువంటి ప్రతిఘటన లేకపోవడంచేత గ్రీకు సైన్యాల దురాక్రమణ నిరాఘాటంగా సాగింది. జాతీయవాదులు పట్టుదలతో, అనేక త్యాగాలు చేస్తూ, ప్రతిఘటన సాగిస్తూనే వచ్చారు. చివరకు టర్కీ స్వాతంత్ర్యం హరించుకపోయే విపత్కర పరిస్థితి ఏర్పడింది. వెంటనే సోవియట్ యూనియన్ జాతీయ వాదులకు ఆయుధాలు, డబ్బు యిచ్చి సాయపడింది. దీనితో జాతీయవాదుల స్థితి కొంత మెరుగయింది. చివరకు దీర్ఘకాల యుద్ధంలో నిలువ లేక గ్రీకు సైన్యాలు 1922 ఆగస్టులో తిరోగమించాయి. జాతీయ సేనలు గ్రీకుసైన్యాన్ని తరిమేశారు. గ్రీకుసేనాని బందీగా పట్టుబడ్డాడు.

ఫ్రెంచి సామ్రాజ్యవాదులు 1922 లో టర్కీ స్వాతంత్ర్యాన్ని గుర్తిస్తూ ఒక సంధి చేసుకున్నారు. అటు సోవియట్‌కూడా స్వతంత్ర టర్కీతో సంధిచేసుకుంది. దానితో బ్రిటిషు సామ్రాజ్యవాదులు గత్యంతరంలేక రాయబారాలు ప్రారంభించారు. సంవత్సరకాలం సాగిన ఈ సంప్రదింపులు 1923 జులైలో ముగిశాయి. జాతీయవాదులు 1919 లో ప్రతిపాదించిన "జాతీయసంస్థ"ను కొద్ది మినహాయింపులతో

సామ్రాజ్యవాదులు అంగీకరించారు. చివరకు టర్కీపై రాజకీయాధికారం కమాల్ నాయకత్వాన జాతీయవాదులకు చిక్కింది.

కమాల్‌పాషా టర్కీ సాంఘిక, రాజకీయ పరిస్థితులనే పూర్తిగా మార్చటానికి ప్రయత్నించాడు. ముందు సుల్తాను పదవిని, మతాధికారి (కాలిఫ్ అంటారు) పదవుల్ని రద్దుచేయాలని సంకల్పించాడు.

బ్రిటిషు సామ్రాజ్యవాదులు సుల్తానును ఉపయోగించుకొని, తాము ఎంతో రక్తం ధారపోసి సంపాదించుకున్న స్వాతంత్ర్యాన్ని హరించ ప్రయత్నిస్తున్నారనీ, అందుచేత సుల్తాను రాజరిక అధికారాన్ని తొలగించాలనే భావాన్ని కమాల్ ప్రజలలో కలుగజేశాడు. 1922 నవంబరులో రాజరిక అధికారాన్ని తొలగించుతూ పార్లమెంటులో తీర్మానం చేయించాడు.

1923 లో కమాల్ అధ్యక్షుడుగా టర్కీ రిపబ్లిక్ అవతరించింది.

ఆగాఖాన్, ఇండియా మాజీ జడ్జి అమీరాలీలు కమాల్‌కు ఒక నిరసన లేఖ వ్రాశారు. దానిలో వారు, కమాల్ ముస్లింలమీద అమలు జరుపుతున్న నిర్బంధాన్ని నిరసించారు. దాన్ని కమాల్ ప్రజలకుచూపి, బ్రిటిషు సామ్రాజ్యవాదులు "కాలీఫ్"ను కూడగట్టుకుని, టర్కీ స్వాతంత్ర్యాన్ని హరించడానికి ప్రయత్నిస్తున్నారని ఉద్యమం లేవదీశాడు. చివరకు 1924 మార్చిలో, కాలిఫ్ పదవిని తొలగిస్తూ, పార్లమెంటులో తీర్మానం చేయించాడు.

తనపదవి స్థిరపడిన తరువాత కమాల్‌పాషా దేశాన్ని ఉద్ధరించడానికి కొన్ని మంచి పనులు చేసినా నియంతగా ప్రవర్తించాడు. జాతీయవాదులలో తనను వ్యతిరేకించేవారిని సహించలేకపోయాడు. కుర్దూ ప్రజల స్వతంత్రవాంఛను * క్రూరంగా అణచాడు.

---

* టర్కీ దక్షిణ ప్రాంతాన, ఇరాన్, ఇరాక్ సరిహద్దు ప్రాంతంలో "కుర్దూ" జాతి ప్రజలు నివసిస్తున్నారు. వీరిది ప్రత్యేకజాతి. వీరు తాము నివసించే ప్రాంతాన్ని స్వతంత్ర దేశంగా గుర్తించమని ఉద్యమం లేవదీశారు. 1925 లో పెద్ద తిరుగుబాటుకూడా నడిపారు.

మతానికి ప్రభుత్వానికి, మతానికి విద్యకు సంబంధం లేకుండా చేశాడు. యూరపియన్ నాగరికతను ప్రోత్సహించాడు. జాతీయ పరిశ్రమలను ప్రోత్సహించాడు. విదేశీ పెట్టుబడుల దిగుమతిని ప్రోత్సహించలేదు. సోవియట్‌తో స్నేహ సంబంధాలను పెంపొందించాడు.

సాంఘిక సంస్కరణలలో ముఖ్యమైనది స్త్రీ జనోద్ధరణ. బహుభార్యాత్వాన్ని నిషేధించాడు. ఘోషా పద్ధతిని తొలగించాడు. స్త్రీ విద్యను ప్రోత్సహించాడు. కమాల్ సంస్కరణలు జాతీయ ఆర్థిక విధానంలో విశేష మార్పులు తేలేదు. సాంఘికంగా మాత్రం కొన్ని మార్పులు తేగలిగాడు.

కమాల్‌పాషా 1938 లో చనిపోయిన తర్వాత, ఆయన అనుచరుడు ఇస్మత్ పాషా రిపబ్లికు అధ్యక్షుడయినాడు.

టర్కీ రెండవ ప్రపంచ యుద్ధంలో ఎవరితోనూ చేరనంటూనే ఫాసిస్టు జర్మనీకి తోడ్పడుతూ వచ్చింది. జర్మనీ ఓటమి నిశ్చయం అని తేలిన తర్వాత (1945 ఫిబ్రవరిలో, జర్మనీమీద యుద్ధం ప్రకటించింది.

రెండవ ప్రపంచయుద్ధం ముగిసిన తర్వాత దేశంలో అమెరికా ప్రాబల్యం పెరగ నారంభించింది. అమెరికా డాలరు "సాయం"తో దేశ ఆర్థిక వ్యవస్థను చేజిక్కించుకున్నది. "సోవియట్ దురాక్రమణ" నుండి టర్కీని రక్షించడానికని ఆయుధాలను సప్లయి చేయటం, సైన్యాలకు తరిఫీదు నివ్వటం ప్రారంభించింది. 1952 లో టర్కీని అట్లాంటిక్ యుద్ధకూటమిలో చేర్చింది. దేశంలో అనేక యుద్ధస్థావరాలను నిర్మించడమేకాక, మధ్యప్రాచ్యంలో బాగ్దాద్ యుద్ధకూటమి నిర్మాణానికి టర్కీని కీలుబొమ్మగా ఉపయోగించు కొంటున్నది.

1954 మొదటిలో ఇరాక్‌తో బాగ్దాద్ యుద్ధ ఒడంబడిక చేసుకొన్నది. ఇదే నేటి బాగ్దాద్ యుద్ధకూటమికి నాంది; తర్వాత 1954 ఏప్రిల్‌లో టర్కీతో మరొక యుద్ధపు టొడంబడిక చేసుకున్నది. దీనితో బాగ్దాద్ కూటమి విస్తరించ ప్రారంభించింది.

సంవత్సరానికి సంవత్సరం యుద్ధ బడ్జెట్ పెరిగిపోతున్నది. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ప్రతి సంవత్సరం యుద్ధావసరాలకు ఖర్చుచేసేదానికి రెండుకోట్లు 1954 లో టర్కీ ఖర్చు చేసింది. బడ్జెట్ లోటు పెరిగిపోతున్నది.

ధనసేకరణ కొరకు పన్నులు అధికం చేయబడ్డాయి. నోట్ల ముమ్మరం అధికమై పోతున్నది. జాతీయ పరిశ్రమలు మూతబడు తున్నాయి. 1954 ఒక్క సంవత్సరంలోనే 14 రబ్బరు ఫ్యాక్టరీలు, 11 బట్టల మిల్లులు, 5 లోహ పరిశ్రమలు మూతబడ్డాయి. 21 బట్టల మిల్లులు ఉత్పత్తిని బాగా తగ్గించివేశాయి. ఎగుమతులు కూడా తగ్గిపోతున్నాయి.

కార్మికుల్లో నిరుద్యోగం ప్రబలిపోతున్నది. కార్మికులు రోజుకు 12-16 గంటలు పనిచేయవలసి వస్తున్నది. ట్రేడ్‌యూనియన్ హక్కులను రక్షించే చట్టాలు ఏవీ అమల్లోలేవు. కార్మికుల జీవనప్రమాణం చాల పడిపోయి నికృష్టజీవితం గడుపుతున్నారు,

జాతీయ ఆర్థిక వ్యవస్థ నీరసించినకొలదీ, టర్కీ అమెరికా మీద ఎక్కువగా ఆధారపడవలసి వస్తున్నది. నేడు డాలర్ల సాయం బిగిసిపోతే, టర్కీ మెడ ఉరిత్రాడుకూడా బిగిసిపోతుంది. అందుచేత ముక్కుతాడు బోసిన ఆబోతును ఆడించినట్లు నేడు టర్కీని తమ కీలు బొమ్మగా ఉపయోగించుకో గలుగుతున్నారు.

తమ కనీస కోర్కెలకొరకు ఆందోళనచేసిన రైతుల కూలీల మీద, అమెరికా అనుకూల విధానాలను నిరసిస్తున్న ప్రజాస్వామిక వాదులమీద దారుణ హింసాకాండను ప్రభుత్వం ప్రయోగిస్తున్నది. దేశంలో ఫాసిస్టు పాలన అమలు జరగుతోంది.

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 34 | 20 | బీచ్ | పీచ్ |
| 34 | 20 | మాపిల్ | ఆపిల్ |
| 41 | 7 | ఉత్తర ప్రదేశ్ | ఉత్తర ప్రదేశ్, బెంగాల్ |
| 83 | 8 | ప్రాంతాన్ని అంటే | ప్రాంతాన్ని అంతా |
| 99 | 7 | మరింత శత్రుత్వాన్ని | శత్రుత్వాన్ని |
| 131 | 13 | 5 పాళ్ళు | 55 పాళ్ళు |
| 147 | 21 | తుత్తుసాగం | తుత్తునాగం |
| 147 | 25 | ఉన్న పరిశ్రమల్లో | ఉన్న పరిశ్రమలల్లా |
| 161 | 27 | మొదట | మొదటి |
| 163 | 1 | అణచగలవారేగాని | అణచగలిగారేగాని |
| 169 | 20–21 | వదలి పెట్టింది. | వదలి పెట్టించింది. |
| 177 | 4 | చేరడానికి | చేరడానికి ప్రజలు |
| 183 | 2 | ఉత్తర తూర్పు | తూర్పు |
| 183 | 7 | కలిపి | కలిపే |
| 187 | 10 | పడుతుందనీ | పడుతుందనే |
| 188 | 3 | ఐక్య సమితి | ఐక్యరాజ్య సమితి |
| 189 | 17 | 1956 | 1953 |
| 189 | 23 | త[illegible] | తమ తమ |
| 192 | 18 | పంపకం | పెంపకం |
| 194 | 24 | అవతరించటం | అంతరించటం |
| 196 | 4 | 218 | 213 |
| 196 | 28 | సామ్రాజ్యవాజ దేశంలో | సామ్రాజ్యవాద దేశాలు |
| 198 | 13 | అంగీకరించుటలో ఒక | అంగీకరించుతూ ఒక |
| 198 | 18 | భూస్వాములు, | భూస్వాముల, |
| 200 | 4 | జరిపించి | జరిపింది. |
| 201 | 26 | కబళిస్తుంది. జర్మన్ | కబళిస్తుంటే, |
| 205 | 7 | సప్లయి చేసి | సప్లయి చేసే |
| 221 | 4 | ఇత్యాదివి | ఇత్యాదులు |
| 230 | 26 | కాల్పించాడు. | కాల్పించింది. |
| 252 | 3 | రెండుకోట్లు | రెండు రెట్లు |



హనాయ్
ఇండోచైనా
తాయ్‌లండ్
బాంకాక్
కాంబోడియా
సైగాన్
మనిలా
తాయ్‌పింగ్
మలయా
కౌలాలంపూర్
సింగపూర్
సుమత్రా
పాడంగ్
సారవాక్
బోర్నియో
సెలిబిస్
ఇండోనేషియా
జకార్తా
బాండుంగ్
జావా

